What is called gāndharva has been put on boards by gandharvas; it has an ancient tradition Gāna is that composed by vāggēyakāras (music composers) Any composition of meaningful words suitable to music can be called a padam. It came into existence as a prop to svaras and tāla. Musicians and singers call the meaningful words of song (or libretto) 'mātu'; the musical element sung with the notes sa, ri, ga, ma, etc, is called 'dhātu'.

Gāna composed with dhātu is nibaddha gāna or bound music. Compositions meant for this bound music are prabandhas These have six components and 'padam' is one such It is clear a padam is a word or words expressive of a certain meaning. Nṛtta, by definition comprises tāla and laya; nṛtya interpretation of a padam through dance; nātya is imitative delineation of emotion of all the three worlds Padābhinaya has long been there in nrtya This is evidence enough to show that a padam is a song, called 'pāṭa' in Telugu or 'pāṭṭu' in Tamil A precaution is necessary here There is a technical term 'pāta' in music We should not confuse that pāṭa with this. That 'pāṭa' is one of the six components of a prabandha Sound syallables produced by hand on instruments called avanaddha vādyās or membranophones like mrdañgam are called 'pāṭa' (ex dhigi-dhigi) .Again, prakarana-gītas enumerated in the chapter on Tāla are of three kinds namely(1)niryukta (2) pada niryukta and (3) aniryukta (S R.5-57,58) Among these, padaniryukta is a composition consisting of only devotional text and devoid of upōhana and pratyupōhana (meaningless or nonsensical words) This is stutipadam or Sankīrtanapadam Thus padam is devotional song set to music Padam, kirtan and sankīrtan mean one and the same thing Prabandha, vastu and rūpaka are the names given to a nibaddha padam in treatises on music. These are synonyms Interchange of prabandha and padam is also seen. What has been designated as dhruvāprabandha in technical treatises seems to have become 'dhruvāpadam' and is presently called 'dhrupad sangīt' in North India Interchangeability between kīrtan and padam has also been in existence. A kīrtan is called 'pad' in the kīrtankār sampradāya of Mahārāstra. In Karnātaka, kīrtans in dāsasampradāya are called padams For example it is well known that kīrtans of Purandaradāsa are called Purandaradāsapadas There are kīrtans in the vaisnavite tradition of Bengal and these are also called 'padāvalī' In Orissa there is a school of dance called 'padāvalīkīrtan' tradition Similar is the case in Telugu also Padams of Ramadas and Peddidas are also called Ramadāsukīrtanalu and Peddidāsu kīrtanalu A kirtan is generally in praise of Visnu in the form of Krshna etc In the South, Rukmini and Kṛṣna are worshipped In the North, Radha and Krsna are popular When erotic sentiment, nāyikā-nāyaka bhāva

పెద్దిదానుల పదాలను రామదాసు కీర్తనలు, పెద్దిదాను కీర్తనలు అనటం ఉన్నదే. కీర్తన ప్రాయికంగా విష్ణుపరమై ఇటు దక్షిణ దేశంలో రుక్మిణీ కృష్ణపరము, అటు ఉత్తరదేశంలో రాధాకృష్ణ పరమూ కావటం వల్ల కీర్తన/సంకీర్తనల్లో శృంగారానికీ నాయికా నాయక భావానికి మధుర భక్తికీ ప్రాముఖ్యం వచ్చినపుడు 'పద'మనే మాటకు శృంగార ప్రధానమై గానాభినయ యోగ్యమైన రచన అనే అర్థం ఏర్పడింది. తమిళదేశంలో పదమంటే ఈ పరిమితార్థమే గోచరిస్తుంది. తెనుగులో కూడా శృంగార ప్రధానాలై అభినయానికి తరచుగా వాడుకోబడే క్షేత్రయ్య పదాలు, సారంగ పాణిపదాలు ఇలాంటివే. వీటిని కీర్తనలనటం వాడుకలో లేదని మనకు తెలుసు. అలాగే ఎందుచేతనోకాని త్యాగరాజు, శ్యామాశాస్త్రి, దీక్షితర్ ల కృతులను కృతులనీ కీర్తనలనీ అంటామే కాని పదాలనటం వాడుకలో ఉన్నట్లు కన్పించదు.

and sriṅgāra became important in this worship padam acquired a delimited sense of indicating a musical composition full of erotic sentiment and fit for using in a dance performance for interpretation. One finds this connotation of padam in Tamil Nādu. In Telugu also Kṣētrayya Padams and Sārangapāṇi padams are such. They are used more for the purpose of dancing than for mere singing. We know these are not called kīrtans. Similarly, one cannot say why, the compositions of Tyāgarāja, Śyāma Śāstry and Dīkṣitar are called kṛtis or kīrtans only; it does not seem to have been in vogue to call them padams at any time.

వ.॥ మఱియుఁ దత్సంకీర్తనంబు లెట్టివనిన

కం.॥ పావనములు హరిభక్తి వి
భావనములు సర్వమంత్ర పరమరహస్యో
ద్భావనములు గాయకవిత
రావనములు తాళ్లపాకయన్నయపదముల్ 3

కం.॥ రంజనములు దుర్గుణగణ
భంజనములు విమలకమలభవజనక గుణా
సంజనములు సుజ్ఞాన ధ
నాంజనములు తాళ్లపాకయన్నయపదముల్ 4

కం.॥ సారంబులు హరికరుణా
సారంబులు విబుధనికర సంపూర్ణసుధా
హారంబులు బహుదేశ వి
హారంబులు తాళ్లపాక యన్నయపదముల్ 5

కం.॥ వేదంబులు పౌరాణిక
వాదంబులు వరకవిత్వవాణీ వీణా
నాదంబులు కృతసుజనా
హ్లాదంబులు తాళ్లపాక యన్నయపదముల్ 6

తా॥ తాళ్లపాక అన్నమాచార్యులు వేంకటాచలపతి మీద పచరించి చెప్పిన సంకీర్తన పదాలు ఎలాంటివంటే అవి-

పాపాన్ని కడిగివేస్తాయి. విష్ణు భక్తిని విశేషంగా ఊహకు తెస్తాయి. మంత్రాల న్నింటిలోను ఉండే ప్రభావశక్తుల్ని పుట్టించి చూపిస్తాయి. పాడేవారిని కాపాడుతాయి. (గాయకులకు తృప్తినిస్తాయి). (3)

మనసుకు రంగుగా ఉంటాయి. చెడు గుణాలకదుపుల్ని విఱిచి వేస్తాయి. బ్రహ్మను గన్న విష్ణువు చొక్కపు గుణాలతో విక్కవిరిసి ఉంటాయి. శోభనకరమైన జ్ఞానధనమనే నిధులను చూపించటానికి పలురకాలైన అంజనాల లాగ పనిచేస్తాయి. (4)

చేవగలవి; శ్రీహరికృపను జడివానగా కురిపిస్తాయి. దేవతాగణాలందరికీ కొదవలేని అమృతాహారాలూ అవుతాయి. పలుదేశాల్లో వేడుకగా తిరుగుతున్నట్లుంటాయి. (5)

అవి వేదాలే. పురాణజ్ఞులు చెప్పే తగవులే. మేలైన కవితా సరస్వతి వీణానాదాలే. సజ్జనులు ఆహ్లాదపడినట్టివి. (6)

Verses 3-6:

Tr. Tallapaka Annaya's sankīrtanams (devotional hymns) on Srī Vēnkaṭācalapati may be delineated thus:

They cleanse our sins; help configurate devotion to Hari; generate all the miraculous effects of all mantras; protect those that sing them (afford satisfaction to the singer-musicians). (3)

They are colourful to the mind; break the groups of bad qualities; are fastened on to the pure qualities of Hari,the progenitor of Brahma; act like miraculous collyria (añjanams) in spotting the treasures of wisdom.(4)

They are essences; bring the grace of Hari like an unrelenting shower of rain; become ambrosia for all the Gods; act like pleasure trips to many countries. (5)

They are verily the Vēdas; enunciations of scholars in Purāṇas musical notes of poesy from the vīna of Vāṇi; those that have pleased the good people.(6)

వ్యా. అన్నమయ్య పదాలు పాడి హరిసంకీర్తనం చేసేవారికి మంత్రోపాసనలతో పని లేదు; వాటికి మంత్రాలతో సమానమైన ప్రభావం ఉందని అభిప్రాయం. (సాళువ నరసింగరాయుడు తన మీద పదమల్లి చెప్పలేదని అన్నమయ్యకు సంకెళ్లు వేయిస్తే ఆయన 'సంకెలలిడువేళ' అనే పదం వేంకటేశ్వరుణ్ణి ఉద్దేశించి పాడేడట. వెంటనే సంకెళ్లూడిపడ్డవట. ఈ అంశం అన్నమాచార్య చరిత్రలో అభిలిఖింపబడింది). గుప్తంగా ఉండే నిధి నిక్షేపాల గుర్తు తెలుసుకోవటానికి పలు రకాల అంజనలు ఎట్లా సులభోపాయాలో అట్లాగే జ్ఞానధనాన్ని గుర్తెఱగటానికి ఇవి సులభోపాయాలు. వేంకటేశ్వర సంకీర్తనం స్వామిదయను జడివానగా కురిపించటమే కాదు దేవతలందఱిని కొలిచిన ఫలమిస్తుంది. ఒకరిని కీర్తిస్తే అందఱిసీ కొల్చిననఫలమిచ్చే దైవం పరతత్వం కద! వేంకటేశ్వరుడు సర్వదేవతామూర్తి. అన్నమయ్యపదాలు ఇష్టసిద్ధికీ అనిష్టపరిహారానికీ ఉపాయాన్ని ప్రభు సమ్మితంగా చెప్పే వేదాలకు, మిత్ర సమ్మితంగా చెప్పే పురాణాలకూ, కాంతాసమ్మితంగా చెప్పే కావ్యాలకు ఏమాత్రం తీసిపోవు. వాటి సారస్వత సిద్ధి ఇలాంటిది అనటం.

1. 'కౄత్ సంశబ్దనే' అనే ధాతువునుండి 'కీర్తన' అనే పదంపుట్టింది. పరమేశ్వర గుణాలను పాడటమే కీర్తన. అది తఱచుగా విష్ణుపరం. 'కీర్తనం మునిభిః ప్రోక్తం హరేర్లీలా ప్రగాయనం' అని పూర్వుల మాట. 'సంకీర్తనం భగవతో గుణకర్మ నామ్నాం' అని శ్రీమద్భాగవతం. భగవంతుని పేర్లను, గుణాలను, లీలలను గానం చెయ్యటం సంకీర్తనం. ఇది భక్తిలో భాగమని చెప్పనవసరం లేదు. నవవిధ భక్తిలో చెప్పబడే శ్రవణ, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనలు (సం)కీర్తనలోనే అంతర్భవిస్తాయని చెప్పవచ్చు. క్రీ.శ. 7శతాబ్ది నుండి క్రీ.శ. 17శతాబ్ది చివరిదాక భారతదేశంలో భక్తి ఉద్యమప్రభావం నడిచిందనే చెప్పాలి. దక్షిణభారతంలో మహారాష్ట్ర దేశం క్రీ. శ. 10 శతాబ్దినాటికే పరదేశీయుల దాడులకులోనైంది. స్వధర్మ రక్షణాదులకు నాథసంప్రదాయం దోహదానికి వచ్చింది. (కర్ణాటకంలో బసవన వీరశైవోద్యమం వచ్చింది). మహారాష్ట్రలో కీర్తనకార సంప్రదాయానికి దారి యేర్పడింది. నామ్‌దేవ్, తుకారామ్ వంటి భక్తవర్గం దీనివిపాకానికి కారణం. ఈ కీర్తనకార సంప్రదాయంలో నారదీయ సంప్రదాయమని, వార్కరీ సంప్రదాయమని రెండు సంప్రదాయాలున్నాయి. వీటిలో నారదీయ సంప్రదాయం కీర్తన/సంకీర్తన పద్ధతికి సన్నిహితం అనవచ్చు. వార్కరీ సంప్రదాయం భజనపద్ధతిని జోడించుకుంటుంది. ఈ 'కీర్తన'ను 'పదము' అని 'హరికథ' అని అనటం కద్దు. స్వరతాళాలకు అనుభావకమైంది పదమని భరతుడు చెప్పాడు. కేవలంస్తుతి మాత్ర పదయుక్తమైన గీతం 'పదనిర్యుక్త'మని సంగీతరత్నాకరం (5-58, 59) చెప్తున్నది. కీర్తన, పదం సమానాలే అని స్పష్టం. కన్నడ భాషలోని పురందరదాసుల 'దేవరనామా'లను కీర్తనలనీ, పదాలనీ అనటం ఉంది. ద్వారక కారణంగా మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాల్లో

Com: Those who sing the Lord by singing the padams of Annamayya need no other mantrōpāsana-s.(vide verse 23) It is suggested that they have the miraculous effect of mantras. (Saluva Narasingarāya, patron of Annamayya for sometime, put him in fetters for his refusal to compose a padam on him Annamayya is said to have addressed a song beginning with 'sankelalıduvēla' to Lord Vēnkatēswara when miraculously the fetters fell down unlocking themselves This incident is recorded in A C by Tāllapāka Cinnanna, a brother of the author of S.L. These sankīrtans are the easiest means to spot the treasure of wisdom like collyria in spotting the buried treasures of wealth. Singing Lord Vēnkaṭēswara does not merely bring the Grace of the Lord like an unrelenting shower of rain but also gives the result of worshipping all the Gods It is only the Absolute that can give the results of various other Gods. Vēnkatēswara comprises all Gods Annamayya's padams are in no way inferior to the Vēdas, Purānas and Kāvyas which teach us the way to get fulfilment of our desired objectives and avoidance of the undesired by their commandments, friendly advice and affectionate suggestions respectively This is their literary and scriptural value

1 The word Kīrtan is from the verbal root' 'kṝt saṁśabdanē' Singing the auspicious qualities of the Lord is kīrtan This singing pertains to Viṣnu, often Ancients have spoken about the singing of Lord Visnu 'Kīrtanam munibhih prōktam, hareh līlā pragāyanam. Srīmad Bhāgavata says' sankīrtanam bhagavatō guna karma nāmnām' -meaning singing the names, qualities and miraculous deeds of the Lord is sankīrtana No need to say that this is part of devotion to God (bhakti) Among the nine types of bhakti all others like śravana, smaraṇa , pādasēvana , arcana, vandana, dāsya, sakhya and ātmanivēdana get covered in sankīrtana India went through the bhakti movement from 7c A D to the end of 17c A D In South India, Mahārāstra was subjected to foreign invasions even by 10c A D It had to protect its own religion and social structure. Nāthasaṁpradāya seems to have helped in this direction (In Karnātaka Vīraśaiva movement of Basavana came up later) Kīrtankār sampradāya came into existance in Mahārāstra Devotees like Nāmdēv, Tukāram gave a fillip to this There are two schools, namely Nāradīya and Vārkarī in this saṃpradāya. Naradīya school may be said to be much closer to the kīrtan /sankīrtan method Vārkarī school imbibes more of bhajan paddhati with the audience joining the kīrtankār This kīrtan is also called Harikatha Bharata has defined padam as being evocative of svara and tāla S R calls a devotional panegyric padaniryukta (5-58,59). It is clear that kīrtan and padam are synonymous Purandaradāsa's 'dēvaranāmagalu' in Kannada

కృష్ణభక్తి ఎక్కువ. మహారాష్ట్ర కర్ణాటాంధ్రాది దక్షిణ ప్రాంతాల్లో రుక్మిణీ కృష్ణుల కథ, గుజరాత్ మొదలుకొని ఉత్తరభారతం పూర్తిగా రాధాకృష్ణుల కథ భక్తికి ఆలంబనమైంది. బెంగాల్‌లోని వైష్ణవ సంప్రదాయంలో ఈ భక్తిపాటల్ని 'పదావళి' అని 'కీర్తనలని' కూడా అంటారు. సంధి వచనంలోని 'సంకీర్తన శబ్దము,' పద్యాల్లోని 'పదము' సమానార్థకాలన్నది పరమార్థం. ఈ 'పదము, ప్రబంధము' సమానార్థకాలనేది 14 పద్యంలోని రెండు శబ్దాల ప్రయోగాన్నిబట్టి నిర్ధారితం అవుతుంది.

2. 'మననాత్ త్రాయత ఇతి మంత్రః' (మననము చేయుటవలన సాధకుణ్ణి కాపాడేది కనుక మంత్రము) అని వ్యుత్పత్తి. మంత్ర శాస్త్రం 'గుప్త విద్యల్లో' ఒకటి. మంత్రం ఎప్పుడూ రహస్యమే. గురువు పేరుకూడా చెప్పరాదు. జపంలోకూడా మౌనజపం శ్రేష్ఠం. తనకు మాత్రం వినబడేట్లు ఉపాంశువుగా జపించడం మధ్యమం. ఇతరులకు వినబడేట ట్లుగా జపించటం అధమం. మంత్రశక్తి కూడా కార్యాన్ని ( effect) బట్టి అనుమానింపద గిందే (inferable)కాని అది పనిచేసే తీరు మనకు స్పష్టంగా ఉండదు. అన్నమయ్యగారి సంకీర్తనలకు మంత్రత్వం చెప్పటం ఇక్కడ విశేషం. అంతేకాదు. సంకీర్తనలు గొంతెత్తి పాడవలసినవి. మంత్ర జప పద్ధతికి విరుద్ధంగా అట్లా పాడినా మంత్రం ప్రదర్శించే రహస్య శక్తుల్ని ఇవీ ప్రదర్శిస్తాయనటం మరింత గొప్ప విశేషం.

3. నిధి నిక్షేపాలకోసం వెదకేవారు పలురకాలైన అంజనలతో అవి ఉండే స్థలాలను గుర్తు తెలుసుకుంటారు.కాటుకలాగు కంటికి రాచుకొని చూచే అంజనము,(తమలపాకు) మీద రాచి చూచే అంజనము, చేతి బొటనవ్రేలి గోటిమీద రాచి చూచే అంజనము వగైరాలు వినికిడిక అందినవే. నిక్షిప్తధనం గుప్తం. దాన్ని తెలుసుకోటానికి 'అంజనము' సులభోపాయం. వేద శాస్త్రాల్లోను, పురాణాల్లోను, కావ్యాల్లోను క్లేశసాధ్యంగా గర్భీకరింప బడి ఉన్న జ్ఞానధనాన్ని కండ్లకు కట్టినట్లుగా చూపించేవి ఈ పదాలనటం విశేషం. ఈ కారణంచేతనే ఇవి వేదాలకు, పురాణాలకు, కావ్యాలకు తీసిపోయేవికావని తర్వాతి పద్యం చెప్తున్నది.

4. సర్వ ప్రాణులు కోరేది సుఖం. అది ఇష్టసిద్ధి రూపమేకాక అనిష్ట పరిహార రూపం కూడా. ఈ ప్రయోజనానికి అలౌకికమైన ఉపాయాన్ని బోధించేది వేదం అని సాయణాచార్యుల నిర్వచనం. వేదాలు అపౌరుషేయాలు, అంటే లౌకికులైన మనుష్యులు కూర్చినవికావనీ, అవి ఋషులకు తాముగా దర్శనానికి వచ్చిన 'శ్రుతుల' నీ విశ్వాసం. సంగీత శాస్త్రంలోను 'గాంధర్వ'మనబడే సంగీతానికి ఉండే అనాది సంప్రదాయం వల్ల అది అపౌరుషేయగా చెప్పబడింది. 'గాన'మనేది పౌరుషేయమే అని కూడా చెప్పబడింది. అన్నమాచార్యుల సంకీర్తనలు 'గానం'. అవి పౌరుషేయాలు- అనగా అన్నమాచార్యులనే లౌకిక పురుషుడు కూర్చినవి. వీటిని వేదాలనటంలో వీటికీ అపౌరుషేయత చెప్పినట్ల యింది. అప్పుడు అన్నమయ్య, వేద మంత్రాలకు ఋషుల్లాగ, ద్రష్ట అవుతాడు. అన్నమయ్య సంకీర్తనలు భవ్యావేశంలో దర్శనానికి వచ్చినవని ఆయన ఋషి కల్పుడని అభిప్రాయం.

are called kirtans as well as padams. Krishna is a popular Deity in Maharāstra and Gujarat perhaps due to the proximity of Dwāraka Rukmiṇi and Krsna are worshipped in Mahārāṣtra, Karṇātaka and Āndhra, Gujarat and North India have taken up Rādhā-Krsṇa cult The devotional songs in the Vaisṇavite traditions of Bengal are called padāvalī and kīrtans. The point is that sankīrtan and padam are synonymous That this padam and the classical term prabandha are also synonymous is confirmed by the author's use of both the words in verse14

2. ' Mananāt trāyata iti mantraḥ'-'that which protects the practitioner because of meditation', is the etymology of the word 'mantra' Mantraśāstra is one of the esoteric disciplines A mantra is to be kept a secret always Even the name of the preceptor is not to be revealed. In japa silent repetition is said to be the best, repetition of mantra being audible to the practitioner is mediocre (it is called upāṁśu); repetition of mantra audible to others is the worst method. Also the power of the mantra is to be inferred only by its effect (kārya), the mode of its working will not be clear to us The significant point is that the powers of mantras are attributed to the sankīrtans of Annamayya Not merely this Sankīrtans are to be sung full-throated This is against the japa method More significant is the point that these sankīrtans give the miraculous effects like mantras despite the fact that they are sung in a full-throated fashion

3 Treasure-hunters are said to use various kinds of collyria to find the spots where treasures are buried Ointments applied to the eyes, a betal-leaf or over the surface of a thumb-nail are within our hear-say Treasure buried is concealed An añjanam is a miraculous easy means to spot it out Similarly are useful the padams in visualising the wisdom treasure concealed in Vēdas, Purānas and Kāvyas That is exactly why the next verse says the padams are verily Vēdas etc.

4 All living beings desire happiness It is of two forms fulfilment of the desired and eradication of the undesired. That is Vēda which teaches (us) a supra-mundane method to this end This is how Sāyanācārya has defined Vēda Vēdas are apauruṣēya, not composed by men in mundane fashion, they are said to have appeared before the sages who were seers and heard by them This is the traditional belief In sangītaśāstra also apauruseyata is attributed to 'gāndharva' because of its hoary tradition (anādisaṁpradāya ) etc (S R 4-2) Indigenous tradition called 'gāna' is said to be pauruṣēya on account of its dependence on the composer or vāggēyakāra Annāmacārya's sankīrtans are obviously 'gāna' and hence human creation or pauruṣēya When these are called Vēdas it is tantamount to attributing apauruṣēyata to them This makes Annamayya a draṣṭa or seer like those of Vēdamantras The suggestion is that Annamayya's compositions are inspired ones and that he is as good as a ṛṣi

5. అన్నమయ్య పదాలు 'బహుదేశ విహారంబులు' అనడంలో అందలి కాకు విశేషాలు సూచింపబడుతున్నవి. కాకువులు ప్రధానంగా (1) స్వరకాకువు (2) రాగకాకువు (3) అన్యరాగ కాకువు (4) దేశకాకువు (5) క్షేత్రకాకువు (6) యంత్ర కాకువు అని ఆరు రకాలు. కాకువు అంటే ధ్వని వికారం. ఒక స్వరంలో మరొక స్వరచ్ఛాయ స్వరకాకువు. ఇది రాగంలో ఏర్పడుతుంది. ఏది రాగానికి ముఖ్యచ్ఛాయో అది రాగకాకువు. ఒక రాగంలో వేరొక రాగచ్ఛాయ విన్పిస్తే అది అన్యరాగకాకువు. దేశస్వభావాన్నిబట్టి ఆయా దేశాల్లో కనబడే ఛాయ దేశకాకువు. మనుష్యుల దేహమొక ఛాయా విశేషం గనుక అట్టిది క్షేత్రకాకువు. వీణ, పిల్లనగ్రోవి మొదలైన యంత్రాల్లో ప్రతీతికి వచ్చే రాగచ్ఛాయ యంత్రకాకువు. ఈచోట దేశకాకు విశేషాలు ఉద్దేశింపబడినవి అనవచ్చును.

6. అన్నమాచార్యుల సంకీర్తన సంప్రదాయం ఆంధ్రదేశానికి క్రొత్తది కాదు. క్రీ.శ. 14 శతాబ్దికి చెందిన సింహగిరికృష్ణమాచార్యులు భజనసంప్రదాయానికి ఆద్యుడు. ఆయన సంకీర్తన పద కవితా పితామహుడు. ఆయన రచనలను 'వచనాల'నీ 'విన్నపా'లనీ అంటారు. ఈయన రచించిన 'సింహగిరి నరహరి వచనాలు' 4లక్షలకు మించినవని అంచనా. ఈయన కాలంలో పాతకమూరి భాగవతులు ప్రసిద్ధులు. కృష్ణమాచార్యులు ఈ పాతకమూరి భాగవతుల సన్నిధిని తన వచన సంకీర్తనాలనుగానం చేసినట్లు తెలుస్తున్నది.

5. Annamayya's padams are called excursions into various countries or regions. This description is meant for drawing our attention to the intonational peculiarities (kākus ) of the sankırtans. These 'kākus are mainly six types· (1) svara kāku (2) rāga kāku (3) anyarāga kāku (4) dēśa kāku (5) ksētra kāku and (6) yantra kāku. Kāku is modification of sound. A shade of one musical note in another is svarakāku. This occurs in a melody called rāga The main shade of a melody or rāga is rāga kāku. A shade of a melody in another is anya-rāga kāku. Shade of intonation found in different regions or countries as being natural to them is dēśa-kāku. Kṣētra kāku pertains to an individual human being as his body is also considered a particular shade. Shade of melody that is heard on vīṇa or flute is called yantra kāku. Here, one may say, dēaa-kākus are intended.

6. Sankīrtana sampradāya of Annamācārya was not new to the Telugu country. Kṛṣṇamācārya of 13/14c. AD. is the first one we know of in the bhajan sampradāya. He is the grandsire of Sankīrtana Padakavita. His compositions called 'vacanam -s' are estimated to be more than 4 lakhs. During his time Potakamūri-bhāgavata-s were well known. It is learnt Krsnamācārya recited his vacana sankīrtanams in the presence of these Potakamūri-bhāgavata-s

కం.॥ లక్షణములు పదకవితా
రక్షణములు వివిధ కుకవిరాజీ మదన
మ్మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళ్లపాక విభుసత్కవితల్ 7

తా॥ తాళ్లపాక అన్నమాచార్యుల సత్కవితలు పదకవిత్వానికి లక్షణాలు చెప్పేవీ పదకవిత్వాన్ని కాపాడేవి, పలు విధాలైన కుకవి సమూహాల పొగరు వదిలించేవి, సాక్షాత్తు వేంకటాచలపతి చూపులే అయినట్టివి.

వ్యా॥ సత్కవిత అనగానే అసత్కవిత కూడా గుర్తుకువస్తుంది. సత్కావ్యం, అసత్కావ్యం అన్న వాడుక కూడా మనకు తెలును. సత్త్వశుద్ధి గలిగి సత్త్వశుద్ధికి సహాయపడే కవిత, కావ్యం, సత్కవిత, సత్కావ్యం అవుతాయి. సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ప్రాణుల స్వభావాన్ని నడుపుతున్నాయి. రజోగుణతమోగుణాల స్పర్శ లేని మనస్సే సత్త్వమనీ సత్త్వోద్రేకమే భోగరూపమైన ఆనందం అని ఆలంకారికుల వివరణ. అన్నమాచార్యుల సత్కవితలైన పదాలు ఆనందం చిన్నెలని ఒక అభిప్రాయం. పదరచన ఎలా ఉండాలో గుర్తుగా చూపి చెప్పేవని మరొక అభిప్రాయం. పద కవిత అసమర్థుల చేతిలో పడి నిందలపాలు కాకుండా కాపాడేవని పదకవితా రక్షణములన్నదాని అభిప్రాయం. అన్నమయ్యకు సమకాలీనుడే అయిన శ్రీనాథుడు 'ముది విటులు విధ వలంబిలు, పదకవితలు' ఇత్యాదిగా ఈసడించిన చాటు పద్యం ప్రసిద్ధమే. సత్కవులు కానివారు కుకవులు. సత్కవిత కుకవులకు సాధ్యం కాదు. సత్కవిత్వరచనకు చాలని వారై కుకవులు పొగరు విడుస్తారు. అన్నమయ్య కవితలు కుకవుల పొగరుదించేవి. ఇంత మాత్రమే కాదు. అవి సాక్షాత్తు వేంకటపతి చూపులన్నప్పుడు మిక్కిలిగా పునీతం చేసేవి, ఆనంద ప్రదాలు అని అభిప్రాయం. 'యతేర్దృష్టిః కవేర్వచః' అని పెద్దలమాట. యతీశ్వరుని చూపు, కవి వాక్కు-మనల్ని పునీతం చేస్తాయని భావం. 'వర్ణనా నిపుణః కవిః' అన్నపుడు నిపుణ శబ్దానికి నేర్పరి అని మాత్రం కాక 'మిక్కిలి పవిత్రీకరించువాడు' (నితరాంపునాతీతి నిపుణః) అని కూడా అర్థం. వేంకటేశ్వరుడు ఈశ్వరుడన్నా కృష్ణుడన్నా యోగేశ్వరుడే అవుతున్నాడు. అన్నమయ్య పదాలు మంత్రాలని చెప్పబడిందిగనుక ఆ మంత్ర జన్యమైన కిరణరూపాన అవే స్వామిచూపులూ అవుతున్నవి. మంత్రమే దేవత. మంత్రోచ్చారణ వల్ల మంత్రరూప దేవత ప్రకాశిస్తుంది. ఆ వెలుగు విశిష్టం. మంత్ర శాస్త్రంలో కిరణ శబ్దం దాదాపు పారిభాషికంలాంటిది. తేజోరూపాన దేవతనుచెప్తుంది. ఇక్కడి గొప్ప అభిప్రాయం ఇది.

Verse 7.

Tr: The 'satkavita-s (excellent poetic compositions ) of Tallapaka Annamācārya are exemplars and protectors of padakavita; they make bad poets shed their pride; they are verily the graceful glances of Vēnkatācalapati.

com: Satkavita brings to the mind asatkavita too. We are aware of the usage of the words 'satkāvya' and 'asatkāvya' also. Composed with and helpful to the purity of spirit (satva) poetry or a poem becomes sat-kavita or sat-kāvya. The three guna-s called satva, rajas and tamas condition and monitor the nature and conduct of all living beings. Ālaṃkārikās explain that the mind untouched by rajas (principle of activity) and tamas (principle of inertia) is itself satva (principle of self-abidance ) and its excitment is enjoyment and bliss. One suggestion is that Annamācārya's padams, excellent compositions as they are, are signs of bliss Another suggestion is that they exemplify the best way of composing padams. Protectors of padakavita only means that they protect this genre of compositions from their name getting sullied in the hands of incapable composers. It is wellknown that Srīnātha, a major poet in Telugu and contemporary to Annamācārya deprecated padakavita in one of his cātu verses by equating it with old and saggy fornicators and widowed-whores. Those who are not satkavi-s are called kukavi-s (poetasters). They are incapable of writing satkavita. Such poets shed their pride on seeing these compositons. Such are the compositions of Annamayya. (It is a characteristic feature of Telugu literature to praise satkavis and deprecate kukavi-s). Not merely that . When they are said to be verily the graceful glances of Lord Vēnkatapati it means they are purifiers and donors of bliss. 'Yatēr dṛṣṭih kavēr vacaḥ' (the glance of a yati or recluse and the word of a poet ) is the adage of the ancients. The glance of the recluse and the word of a poet are said to cleanse and purify us. A poet is also described as 'varṇanā nipunah' - one who is skilled in describing. The sanskṛt word 'nipuṇah' means not merely the skillful but carries the etymological meaning 'a thorough cleanser' (nitarām punāti iti nipuṇah). Whether we take Him as Iswara (Siva) or Kṛṣṇa, Vēnkaṭēswara is the master of Yōga (yōgēswara). The padams of Annamayya have been described earlier as mantras. In mantra-śāstra, mantra itself is the deity and when it is uttered, the deity shines as effulgent light. Such a light is generally referred to as kiraṇa (ray) in a technical sense So Annamayya's padams, mantras as they are called, represent the Lord Himself as Light and become his glances, sui-generis. This is the great idea here.

1. లక్షణమన్నపుడు ఛందోవ్యాకరణాది శాస్త్రమని అర్థం. ఇక్కడ పద రచనకు ఉండవలసిన గుర్తుల్నీ గుణాల్నీ నియమాల్నీ చూపి చెప్పేవని (అన్నమయ్య రచనల పరంగా) గ్రహించాలి.

2. సంగీతంలో ఉన్నట్లుగానే దేశ భాషా సాహిత్యాల్లోను మార్గ- దేశి సంప్రదాయాలున్నాయి. తెనుగులో ఈ మార్గదేశి భేదం తొలిసారిగా దేవటిపండని శాసనం (క్రీ. శ. 1145)లోను అటు మీద పాలకురికి సోమనాథుని రచనల్లో, నన్నిచోడుని కుమార సంభవంలోను కనబడుతుంది. అయినా ఈ దేశి సంప్రదాయం క్రీ. శ. 9శతాబ్ది నుండి దొరికే శాసనాల్లోకూడా కనబడుతుంది. అంతకు మునుపు శాసనాలకెక్కకుండా కొంతకాలం ఉండిందని కూడా మనం విశ్వసించవచ్చు.

దేశి సంప్రదాయం పద్యకవిత పదకవిత అని రెండు రకాలు. తెనుగులో పద్యకవితకు వచ్చిన గుర్తింపు పదకవితకు రాలేదనే చెప్పాలి. శాసనాల్లో దేశిచ్ఛందస్సుల్లో వ్రాసిన పద్యాలు కనపడతాయి. క్రీ.శ. 848 నాటి పండరంగని అద్దంకి శాసనంలో 'తరువోజ,' క్రీ.శ. 848-892 ప్రాంతపు గుణగ విజయాదిత్యుని కందుకూరి శాసనంలోను, క్రీ.శ. 892-929 ప్రాంతపు చాళుక్యభీముని ధర్మవర శాసనంలోను 'సీస' పద్యం, క్రీ.శ. 927-934 ప్రాంతపు యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో 'మధ్యాక్కరలు' కనబడతాయి. దేశిలో పద్యకవిత ఉండగా పద కవిత లేదనుకొనటానికి వీల్లేదు. తెనుగు భాషకు క్రీ.శ.10 శతాబ్దినాటికే ఛందోగ్రంథమున్నట్లు తెలుస్తున్నది. 'యాప్పెరుంగల క్కారికై' అనే 10 శతాబ్దినాటి తమిళ గ్రంథంలో 'వాంచియార్ సెయ్ద వడుగచ్ఛందము' (వాంచియార్ చేసి తెలుగు ఛందస్సు) పేర్కొనబడింది. క్రీ.శ. 1000 ప్రాంతపు విరియాల కామసాని గూడూరు శాసనంలో తొలిసారిగా చంపకమాల ఉత్పలమాల అనే సంస్కృత వృత్తాలు కనబడుతున్నాయి. దీన్నిబట్టి అంతకు మునుపు దేశిచ్ఛందమే వ్యాప్తిలో ఉండేదని తలంచవచ్చు.

దేశి సంప్రదాయానికిచెందిన పదకవిత్వం 13శతాబ్ది చివర వెలసిన పాల్కురికి సోమన 'పండితారాధ్య చరిత్ర'లో పేర్కోబడింది. మల్లికార్జున పండితారాధ్యుడు 12 శతాబ్దివాడు. తెనుగుదేశంలో ఆరాధ్యశైవ సంప్రదాయానికి ప్రవర్తకుడు. ఆయన బౌద్ధుల్ని వాదంలో గెలువబోయేటప్పుడు 'తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నంజవర్ణన, గణవర్ణన పదములు' పాడుచు సద్భక్తులు వెంటవచ్చిరని సోమనవర్ణన. (పండితారాధ్య చరిత్ర. 513 పుట.)

1 'Laksaṇa generally means and indicates a śāstra like chandas (prosody) or vyākarana (Grammar ). Here we have to understand that Annamayya's poetic compositions (padams) exemplify the best ways of composing padams

2.Like in music we have mārga and dēśi traditions in indigenous languages too In Telugu this mārga-dēśi bifurcation appears for the first time in an inscription of Dēsati Panḍa (1145 A.D) and later on in the writtings of Pālakurki Sōmanātha and in Kumārasaṁbhava of Nannecōda. But the existence of dēśi tradition can be seen as early as 9c. A D from the extant inscriptions We can also guess that it could have been prevalent earlier to 9c. A.D. also before it got recorded in inscriptions.

Dēśi tradition is of two streams: Padyakavita (poetic composition in indigenous verses) and pada-kavita, (indigenous music compositions). It must be stated that pada-kavita in Telugu has not acquired the same recognition as padya-kavita. Verses composed in indigenous metres of prosody are seen in inscriptions. Addanki inscription of Panḍaranga (848 A D.) contains a 'taruvōja' verse; sīsa verses can be seen in Kandukūru inscription of Gunaga Vijayaditya (848-892 A.D) and Dharmavaram inscription of Cālukya Bhīma (892-929 A D.); 'madhyākkaras' are recorded in the Bezawada inscription of Yuddhamalla (927-934 A.D). The existence of versification in the indigenous (dēśi) stream precludes the absence of padakavita and suggests the coexistence of both. Telugu is known to have had a work on prosody as early as 10th century. The Tamil work 'Yāpperungala-K-Karikai' (10c) speaks of a prosodical work in Telugu by one Vanciyar (vanciyar seyda vadugaccandamum). It is only in the Gudur inscription of Viriyāla Kāmasāni (1000 A.D) that one finds the verses of caṁpakamāla and utpalamāla marking the entry of Sanskṛt metres into Telugu. This suggests the prevalence of indigenous metrics alone earlier in the Telugu country.

Pada kavita of dēśi tradition is mentioned in Panditārādhya caritramu of Pālakurki Sōmanātha who flourished at the end of the 13 century. Mallikārjuna Panditārādhya belonged to the 12th century, he was the founder-leader of ārādhya-śaiva-śaṁpradāya in Andhra. Pālakurki Sōmanātha in his work on Panditārādhya describes that devotees of Siva accompanied Panditārādhya on his journey to defeat Buddhists in argument, singing tummeda padamulu, prabhāta padamulu, ānanda padamulu, śankara padamulu, sanja varṇana and ganavarnana padamulu. (Tummeda means a honey-bee. The word occurs as a refrain in the songs of that name The bee represents jiva according to Bhuvanēswarī saṁhita Parvata means Srīśaila, the abode of Lord Mallikārjuna -a saivite pilgrim centre of great importance, situated in Kurnool district of Āndhra Pradēsh Parvata Padamulu are the songs sung by devotees while climbing up the hill Sanja varnana means description of the evening; gana varṇana means the description of the pramatha-gaṇas-both important to Siva as He dances in the evening and pramathas are His attendants. The rest of the names are clear enough).

ప్రాచీనాంధ్ర లాక్షణికులుచాల కాలము, తెనుగును కూడా ఒక ప్రాకృతముగా పరిగ ణిస్తూ వచ్చినా దేశిచ్ఛందస్సుల కొన్నింటిని పేర్కొంటూ వచ్చినా పద కవితను సమగ్రంగా చెప్పినవారు కారు. క్రీ.శ. 1402- 1407 నాటి విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి' దేశి సంప్రదాయంలో రగడ, మంజరి, ఉదాహరణాలను పేర్కొంటుంది; కాని యక్షగానాన్నిచెప్పదు. ఛందస్సుల్లో కంద, సీస, గీతి, అక్కర భేదాలను త్రిపది, చౌపది, షట్పదులను తరుహోజను చెప్తుంది. క్రీ.శ. 1453 నాటి అనంతుని 'ఛందోద ర్పణం'లో పదకవితకు ఆశ్రయభూతమైన నవ విధరగడలు చెప్పబడినై. క్రీ.శ. 1550 ప్రాంతపు చిత్రకవి పెద్దన 'లక్షణ సారసంగ్రహం'లో రగడ భేదాలను యక్షగానంలో విత్రిపుటాది తాళాలకు ఎట్లావాడుకోవచ్చునో చెప్పబడింది. క్రీ.శ. 1600 ప్రాంతపు వెల్లటూరి లింగనమంత్రి 'సరసాంధ్రవృత్త రత్నాకరము'లో ( కర్ణాట చౌపది లక్షణమే) 5 మాత్రలగణములైన 3స్మరగణాల మీద ఒక సూర్యగణమనుచు, ఆద్యంత ప్రాసలతో, 2గణాలమీద యతితో 'పదలక్షణ'మని చెప్పబడింది. స్మరగణాలనేవి సంగీత శాస్త్రంలో 3అక్షరాల గణాలకు వాడే పరిభాష. క్రీ.శ. 1656 నాటి అప్పకవి తన 'అప్పకవీ యము'లో చిత్రకవి పెద్దన చెప్పిన రగడ, యక్షగానలక్షణాలను అనువదించటంతోపాటు లాలిపాటి, పెండ్లిపాట, ధవళము, సువ్వాల, అర్ధ చంద్రికలు అనే విశేష రచనలు చెప్పి నాడు. పదలక్షణాన్ని యక్షగానలక్షణాన్ని చెప్తూ పద కవితా భేదాల్ని మధురకవితా శాఖ క్రింద సంగ్రహించింది క్రీ.శ. 1656 తర్వాతి వార్తా కవి రఘునాధయ్య 'లక్షణ దీపిక'. అందిట్లున్నది: 'యక్షగానంబునన్ వెలయు పదంబులు, దరువులు, నేలలు, ధవళం బులు, మంగళహారతులు, శోభనంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పద, అష్టపదులు నివి యాదిగా గల్గునన్నియు లయప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల ప్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబులు'. క్రీ.శ. 17 శతాబ్ది చివరివాడైన పొత్తపి వేంకటరమణకవి తన 'లక్షణ శిరోమణి'లో సంగీత రత్నాకరాన్ని అర్జున భరతాన్ని స్మరించి ఏలలే పదాలని, మాత్రాసమకనిబద్ధాలైన 'ప'గణాలతో వానిని కూర్చాలని అవి సూళాదు లకు అనుగుణంగా ఉండాలని చెప్పి అవి రాగతాళాలతో సంగీత రీతిని తేటపడి ఉంటాయి గనుక సాహిత్య మార్గాన లక్షణంలో రావని చెప్పాడు. (లక్ష. శిరో. 3-425, 426, 427).

Ancient Telugu prosodists, though they went on treating Telugu as one of the Prākrts, have been mentioning at least some of the indigenous metres. Yet they cannot be said to have treated Padakavita in a comprehensive way. Kavyālankāra Cūdāmani of Vinnakōta Peddana (1402-1407 A D) mentions ragaḍa manjari and Udāharana but not Yakṣagāna in the dēśi stream Verses like kanda, sīsa, gīti, and different types of akkaras, tripadi, caupadi, and satpadi are treated as also taruvōja. Chandōdarpana of Ananta (1435 A D) treats the 9 types of ragaḍas which lend support to a lot of padakavita Laksanasāra Sangraha' of Citrakavi Peddana (1550 A D ) teaches how the different kinds of ragaḍas can be used suitably for talas like 'triputa' etc. in Yakṣagāna. 'Sarasāndhra Vṛttaratnākara' of Vellaturi Linganamantri (c 1600 A.D) gives padalakṣaṇa as 3 kāmaganas of 5 mātras each plus 1 sūrya gaṇa of 3 mātras, with prasa both at the beginning and ending of the lines, with caesura after 2 gaṇas in each line Metrically speaking ( 5x3+3=18matras), this is Karnāta Caupadi only but for the nomenclature of gaṇas as smara gaṇas as found in music treatises like S.R. 'Appakavīyamu' of Appakavi (1656 A.D ) repeats what Citrakavi Peddana has said about ragaḍa and Yakṣagāna but also adds lālipāta (lullaby), penḍlipāṭa, dhavaḷam, suvvāla (pounding song), 'ardhacandrikalu'. It was Lakṣaṇa Dīpika of Vārtākavi Raghunāthaiah (after 1656 A.D) which not only mentioned pada lakṣaṇa and Yaksagāna lakṣaṇa but also brought different types of songs under one head as 'madhura kavita'; Padams, daruvus, ēlās, dhavalas, mangalahāratis, śobhanas, uyyālajōlalu, jakkularēku padamulu, candamāma suddulu, aṣtakas, ēkapadas, dvipadas, tripadas, catuspadas, astapadas are the songs covered undear this head Laksaṇa Sirōmani of Pottapi Vēnkataramana Kavi (17c A D) makes a mention of S R. and Arjuna Bharatam and categorically states that ēlā-s are padams and that they should be in accordance with 'sulādi-s' of music. As they are tied up with rāga, tāla etc he relegates them to music , severing their connection with literature (L.S. 3-425,426,427).

కం.॥ విన్నంతఁబాప సంఘము
లన్నియు నడపంగఁబూఁటయగుఁదాళులపా
కన్నయ పదములు పాడిన
యన్నయకోవిదుల వేంకటాధిపుఁడేలున్ 8

కం. ॥ సంకీర్ణ వివిధ పాప వి
శంకట చిత్తులకునైన సర్వేశ్వరుపై
సంకీర్తనములు పాడిన
శంకాతంకములు వదలు శమనుని వలనన్ 9

కం. ॥ మదిఁదాళ్లపాక యన్నయ
పదములపై భక్తిగలిగి పాడిన విభవా
స్పదములగు వివిధ సంపత్
ప్రదములు శ్రీవేంకటేశుపదములు దెలియున్ 10

కం. ॥ నక్తంచరారి తనకును
భక్తుండైనట్టి తాళపాకన్నయ చా
టూక్తి పదబంధ కవితా
రక్తుండై యితర వాగ్విరక్తుండయ్యెన్ 11

మ. ॥ శ్రుతులై, శాస్త్రములై, పురాణ కథలై, సుజ్ఞాన సారంబులై ।
యతిలో కాగమవీథులై, వివిధ మంత్రార్థంబులై, నీతులై।
కృతులై వేంకటశైల వల్లభ రతి క్రీడారహస్యంబులై
నుతులై తాళుల పాకయన్నయ వచోమూర్తుల్ క్రియల్ చెన్నగున్ 12

తా॥ విన్నంత మాత్రానికే పాపాల కదుపులనన్నింటినీ అణచటానికి హామీ యిచ్చే తాళ్లపా కన్నయగారి పదాలు నోరార పాడేటటువంటి లాభమెఱిగిన చదువర్ల ( నీతిమంతులైన విద్వాంసుల)ను వేంకటాచలపతి చేపడతాడు (8).

కలగాపులగంగా కలిసి పాకిన పాపాల విరివితోడి మనసుగల వారికి కూడా సర్వేశ్వరుని మీద (ఈ)సంకీర్తనలు పాడితే యమునివల్ల కలిగే భయ విచారాలు లేదా ఆధి వ్యాధులు విడిచిపోతాయి. (9)

తాళ్లపాకన్నయ పదాలమీద మనసులో భక్తిగలిగి పాడినట్లయితే (ఆ పాడినవారికి) వైభవ స్థానాలైన పలువిధాల సంపదలిచ్చే శ్రీవేంకటేశ్వరుని పాదాలు ( అనుభవపూర్వకంగా) తెలిసి వస్తాయి. (10)

Verses 8-12.

Tr. Tāḻḻápāka Annaya's padam-s are a surety for the eradication of all sins. The judicious who know the benefits and sing them get the protective care of Vēnkaṭācalapati.(8)

If (these) Sankīrtan-s on Sarvēswara (Vēnkaṭēswara, the God Almighty ) are sung even those whose minds are burdened with an amalgam of various sins will be free from the fear and sadness caused by the God of Death . (9).

If Tāḻḻapāka Annaya's padams are sung with devotion the Feet of Srī Vēnkaṭēsa, bestowers of various riches productive of pomp and luxury, will be realised (10).

రాక్షసుల్ని మర్దించే శ్రీ మహావిష్ణువు తనకు భక్తుడైన తాళ్లపాకన్నయ ప్రియం గొలిపే పద బంధాల కవితలో తగులుకొన్నవాడై యితరుల మాటలనొల్లని వాడైనాడు. (11)

తాళ్లపాకన్నయ మాటల క్రొత్త కూర్పులు లేదా విచ్చిత్తి విశేషాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణ కథలు, జ్ఞానసారాలు, ఆగమాల వరుసలు, వలు మంత్రాల అర్థాలు, నీతులు, కృతులు, వేంకటాచలపతి రతి క్రీడల రహస్యాలు, స్తోత్రాలు అవుతూ అందంగా ఉంటాయి. (12).

వ్యా. ॥ ఎనిమిదో పద్యంలో 'అన్నయకోవిదుల' అనేచోట చిన్న శ్లేష. అ+నయ కోవిదులని ఒక విరుపు- ఆ లాభమెఱిగిన చదువరులు /నీతి తెలిసినవిద్వాంసులని అర్థం. 'అన్నయ+కోవిదుల' అనేది రెండో విరుపు. ఈ చోట అన్నయను గూర్చి తెలిసిన చదువర్లు /విద్వాంసులు అని అర్థం. అన్నయ భక్తిని వ్యక్తిత్వాన్ని చదువుసాములను తెలిసి ఆయన సంకీర్తనలు పాడేవారిని వేంకటాచలపతి చేపడతాడని అభిప్రాయం. అన్నమయ్యను తెలిసి ఆయన పదాలు పాడటానికీ స్వామి చేపట్టడానికీ ఏమి సంబంధం? స్వామి భక్తపరతంత్రత. స్వామికి తన మీది భక్తికంటె తన భక్తుల మీద భక్తి ప్రియతరం అనటం. ఇది వైష్ణవ సంప్రదాయ భావం.

పదో పద్యంలోను 'తాళ్లపాక యన్నయ పదములపై' అన్నచోట కూడా చిన్న శ్లేష. తాళ్లపాకన్నయ పదములంటే సంకీర్తనలనేది ఒక అర్థం. పదములంటే పాదాలనేది రెండో అర్థం. అన్నయ పదాలమీద భక్తిగలిగి ఆయన పదాలు పాడితే వేంకటేశ్వరుని పాదాలు తెలుస్తాయనేది రెండోచోట అభిప్రాయం. ఆయన వైకుంఠవాసి అయి విష్ణు సాలోక్యాన్ని సారూప్యాన్ని పొందాడని గమ్యం. ఈ పద్యంలో ఆస్పదశబ్దానికి, సంపత్ పదములనే చోటి పద శబ్దానికి చోటు, స్థానం అని ఒకే అర్థమైనందున సంపత్ప్రదములని 1935 నాటి దేవస్థానంవారి అచ్చుప్రతి పాఠానికి భిన్నంగా సవరించబడింది.

పదకొండో పద్యంలో వేంకటాచలపతి అన్నమయ్య చాటూక్తి పదబంధ కవితారక్తుడు కావడం, ఇతర వాగ్విరక్తుడు కావటం చెప్పబడింది. అన్నమయ్య 'శృంగార మంజరి' చేసి శేషాద్రి శృంగవాసునికి అర్పించినపుడు స్వామి తాను వెనుకటి కృష్ణమాచార్యుల వినుతి చేత కొన్నాళ్లు విరక్తుడుగా నుంటినని, అన్నమయ్య శృంగార సంకీర్తనలకు లోబడి మంచి ప్రాయపువాడ నైనానని మెచ్చుకొని చెప్పి గౌరవించినట్లు 'అన్నమార్య చరిత్ర.' 42పుటలో అభిలిఖింపబడి ఉంది. సంకీర్తనలక్షణం అన్నమాచార్య చరిత్ర రచనకు కొంచెం తర్వాతి రచన కావచ్చు.

The Enemy of Demons, (Sri Vēnkaṭēsa ) having fallen for Tāḷḷapāka Annaya's poesy of pleasing phraseology became un-interested in the utterances of others (11)

Tāḷḷapāka Annaya's verbal innovations are beautiful. They become Vēdas (the infallible scriptures), śāstras (sciences), purāṇic stories, essence of wisdom, rows of āgamas the very contents of mystic formulae, ethics and morals, pieces of art, the very secrets of God's chamber-Pleasures.(12)

Com: There is a pun on 'annaya kovidula' in verse 8. Splitting it up as 'ā + nayakōvidulu' yields the contextual straight meaning of 'Those or such judicious scholars'. 'Annaya + kōvidulu' is another way of splitting the compound. It means those well-versed in the compositions/personality of Annaya. It means those who know the devotion, personality and scholarship of Annaya and sing his songs will get the protection from Vēnkaṭācalapati How are these two things connected? The Lord is devoted to His own devotees. He is more pleased with devotion to His devotees than to Himself. This is a concept well known in Vaiṣṇavism.

In Verse10 there is a pun on 'padamulapai' in 'tāllapākannaya padamulapai'. Padamulu means sankīrtans; it also means the (two) feet 'If one gets devoted to the feet of Annaya and sings his sankīrtans, the Feet of the Lord will be realised'-is another meaning. That Annaya after leaving his mortal coils, has reached Vaikuntha, the abode of Viṣnu (sālōkya) and assumed a form similar to His (sārūpya ) is to be understood. The text reading as 'sampat padamulu' is emended as 'sampatpradamulu' in view of the fact that the two words āspada and pada in the connected adjectival construction 'vibhāvāspadamulagu vividha sampatpadamulu' means the same thing and appear repetitive.

The 11th verse speaks about Lord Vēnkaṭēswara being captivated by Annamayya's poetry of pleasing phraseology and His non-interestedness in others's utterances. This is supported by A.C When Annamācārya composed Sṛṅgāramañjari and made it an offering to Lord Vēnkaṭēswara He is said to have remarked that with Kriṣṇamācārya's devotional praises in earlier days He felt like a recluse and that with Annamayya's erotic panegyric then He felt young and dashing (with a lust for life). (Anna. caritra page 42). It is probable Sankīrtana Lakṣanamu is slightly posterior to Annamācārya caritra.

1. పన్నెండో పద్యంలో అన్నమయ్య పదాలు/సంకీర్తనలు- 'కృతులై' అని విశేషింపబడినై. అనంతర కాలంలో త్యాగరాజాదుల రచనలకు కృతులన్న పేరు గట్టిగా నిలవటానికి కారణమిదేనేమో! 'కృత మస్యాస్తీతి కృతిః'. అని వ్యుత్పత్తి; సాహిత్యకృతి, సంగీతకృతి, ఆలేఖ్యకృతి, శిల్పకృతి - ఏదైనా కావచ్చు. ఈనాడు ఇంగ్లీషులోని a piece of art అనే పదబంధానికి మొరటు తర్జుమాగా తెనుగులో వాడబడుతొన్న 'కళాఖండం' అనే దానికంటే ఇది చాలా మెరుగైన మాట.

1 Verse12 qualifies the padams/sankīrtans of Annamayya as 'krti-s Etymologically, that which carries the skill is krti, a literary work, a musical composition, a painting, a sculpture etc. This particular usage may be the reason for this nomenclature sticking to the compositions of Tyagaraja and others later on. This is a much better word than the compound 'kalākhanḍamu' currently used in Telugu which is an uncouth translation of the English expression 'a piece of art '

కం॥ భరతాది గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకటభూమీ
ధర వర కీర్తన లక్ష్యము
లురు పదకవితా పితామహుం డేర్పఱచెన్ 13

ఆ॥వె॥ అట్టి యన్నయార్యుఁ డానతిచ్చిన పద
లక్ష్య లక్షణముల లాగుదెలిసి
పలుక నేర్చెనేని బాలుండు ప్రౌఢయౌ
దత్ప్రబంధ మమృతధారఁ బోలు. 14

మ॥ ధరలో దాళులపాకయన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మునుజేయఁ బూని తగనుత్పాదించెఁ దల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబునఁ గవీంద్రానంద సంధాయియై
పరిపూర్ణాఖిల శాస్త్రసమ్మతముగా భావజ్ఞలోనౌనన్ 15

ఆ॥వె॥ అలరుఁ దాళపాక యన్నయార్యసుతుండు
తిరుమలార్యుఁ డఖిల దేశికుండు
తత్సుతాగ్రజుండ ధరలోనఁ జినతిమ్మ
యాహ్వయుండఁ దండ్రి యనుమతమున 16

మ॥ పరమామ్నాయ సమానమై వెలయు మత్పైతామహ గ్రంథమున్
పరచాటూక్తి మదీయ పుణ్యజనక వ్యాఖ్యాతమున్ వేడ్కఁద
చ్చరణాంభోరుహముల్ మదిందలచి సచ్ఛాస్త్రజ్ఞులింపొందఁగా
పరుసం జెప్పెదఁ బద్యరూపమునఁ దద్వాక్యానుసారంబునన్ 17

తా॥ భరతం అనబడే నాట్యశాస్త్రం మొదలైన గ్రంథాల్లో విశేషంగా కూర్చబడిన శాస్త్రీయమైన నియమాలను వేంకటాచలపతి కీర్తనలనే లక్ష్యాలను గొప్పపదకవితా స్రష్ట (అయిన అన్నమాచార్యుడు) రూపుగట్టచేసినాడు. (13)

పదకవితాపితామహుడైన అన్నయార్యుడు చెప్పిన పదరచన లక్ష్యాల, లక్షణాల రీతి తెలుసుకొని తానూ చెప్పగలిగినట్లయితే ఆచెప్పినవాడు బాలుడైనాసరే అతని ప్రబంధం అమృతధారవలె ఉంటుంది. అతడు ప్రౌఢుడనిపించుకుంటాడు (14).

గురువుల్లో సిగబంతి అనదగిన తాళ్లపాకన్నయ లోకంలో సంకీర్తనను గరగరగా చేయ గోరినవాడై మునుపు తానద్దాని లక్షణాన్ని అపూర్వంగా సంస్కృతభాషలో కవులకు ముచ్చటగొల్పేటట్లుగాను, శాస్త్రగ్రంథాలన్నింటికి పూర్ణసమ్మతమౌనట్లుగాను, రసికులైనవారు తల ఊచి ఆమోదించునట్లుగాను గ్రంథరూపాన పుట్టించాడు (15).

Verse 13-17.

Tr. The great creator of the poesy of musical compostitions (Annāmācārya ) defined the signal characteristic regulations of padam extensively codified in works like Nāṭyaśāstra called Bharatam, etc. as also the model kirtans on Vēnkaṭācalapati. (13).

If one can understand the modality of the examples and regulations of padam as enunciated by such Annayārya as described above and compose, such a one, even if he be a green-horn (lad), will become a maestro, with his composition being comparable to a gush of ambrosia (amṛtadhāra) (14).

Tāllapāka Annaya, the top preceptor, intending to freshen up sankīrtana, brought forth its governing principles in Sanskṛt in such a way that it afforded pleasure to the best of poets, that it stood in complete agreement with śāstra and that it drew encomiums from connoisseurs (15).

తాళ్ళపాకన్నయకు తిరుమలార్యుడనే కొడుకున్నాడు. ఆయన అన్నింటికి గురుస్థానీయుడు. నేను అతని కొడుకుల్లో పెద్దవాడను. చినతిమ్మయ అనే పేరుగలవాడను. మాతండ్రి సమ్మతిమీద తొలివేదంతో సమానంగా ప్రకాశించే మాతాతగారి గ్రంథాన్ని, ఆహ్లాదకరమైన మాటలతో మానాన్నగారు వ్యాఖ్యానించిన దాన్ని, నేనుకూడ వాళ్ల శ్రీ చరణాల్ని స్మరించి ఆవారి వాక్యాలను అనుసరిస్తూ, శాస్త్రజ్ఞులు సంతోషించేటట్లు, వరుసగా (తెలుగులో) పద్యరూపంగా చెప్తాను. (16, 17).

వ్యా॥ పితామహుడంటే బ్రహ్మ. సృష్టికర్త. పదకవితా పితామహుడు అంటే పదకవిత్వాన్ని సృష్టించినవాడని అభిప్రాయం. బిరుదప్రాయమైన ఈమాట రచనలోని సృజన ధర్మాన్నిబట్టి రావచ్చు; రచించిన కవితల పరిమాణాన్నిబట్టి రావచ్చు. అన్నమాచార్యులకిది బిరుదమని చెప్పటానికి ఇచ్చిన వారెవరనే ప్రశ్న ఉంటుంది. అన్నమయ్యను కొంతకాలం ఆదరించి సేవించిన సాళువ నరసింగరాయలు కూడ 'పదకవితాపితామహు'డని బిరుదమిచ్చినట్లు సాక్ష్యంలేదు. 'కన్నవిన్నవిగావుగదర యీపదము లన్నయార్యునివి మోహనమూర్తులనుచూ' మెచ్చుకొని విన్నట్లు మాత్రమే 'అన్నమాచార్య చరిత్ర' చెప్తున్నది. చిన తిరుమలాచార్యునికి (1537) కృష్ణరాయల ఆస్థానంలో 'ఆంధ్రకవితా పితామహుడు' అల్లసాని పెద్దన (1509-1520) ఉండటం తెలుసు. ఆయన బిరుదులు విన్న చినతిరుమలాచార్యుడు తన తాతగారిని 'పదకవితా పితామహు'డని పిలిచి ఉండవచ్చు. బ్రహ్మదేవునికి నాల్గుమొగాలు; కవిత్వం ఆశు, విస్తర, చిత్ర, మధుర కవిత్వాలని నాల్గు రకాలు. ఈసామ్యంతోను, బ్రహ్మదేవుడు ప్రపంచాన్ని సృష్టంచినట్లు కవి కావ్యప్రపంచాన్ని సృష్టిస్తాడు గనుకను 'కావ్యకమలాసన' 'కవిబ్రహ్మ' 'కవితా పితామహ' ఇత్యాది బిరుదుల్లాంటి పదబంధాలు ఏర్పడినవని చెప్పవచ్చు. ఏమైనా అన్నమయ్యగారి విషయంలో 'పదకవితా పితామహత్వం' సార్ధకమనటంలో సందేహంలేదు. అన్నమాచార్యులు 32,000 సంకీర్తనలు, ద్విపదప్రబంధంగా తెనుగులో రామాయణం, శృంగారమంజరి, 12 శతకాలు, సంస్కృతంలో వేంకటాద్రి మాహాత్మ్యం, సకల భాషల్లో నానా ప్రబంధాలు (గీతప్రబంధాలు?) వ్రాశారు. అన్నమాచార్య చరిత్ర దీనికి సాక్ష్యం. ఇంక తెనుగు సాహిత్యంలో నందంపూడి శాసనంలో పేర్కొబడ్డ నారాయణభట్టు సంస్కృత, కార్ణాట, ప్రాకృత, పైశాచి,కాంధ్ర భాషల్లో కవిరాజశేఖరుడు (1053AD). బద్దెనకవి (C 1150) కావ్యకమలాసనుడు, కావ్యచతుర్ముఖుడు; శివదేవయ్య (12/13 C) ఆంధ్రకవితాపితామహుడు; తిక్కన కవిబ్రహ్మ అన్నది ప్రసిద్ధమే. శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు కూడ కవితాపితామహుడే. అల్లసాని పెద్దన 'ఆంధ్రకవితాపితామహుడు'. అన్నమయ్య 'పదకవితాపితామహుడు' అనబడ్డాడు.

Here flourishes Tāllapāka Annayārya's son, Tirumalārya who is the preceptor for all. I am the eldest of his sons, Cina Timmaya by name. With the permission of my father and bowing to his feet, I will enunciate, for the pleasure of scholars in the śāstra, the great scripture-like teaching of my grandfather commented upon by my father, in accordance with the original and its commentary and in the form of sequential Telugu verses. (16,17)

Com: The word 'pitāmaha' means Brahma, the Creator. The compound padakavitā-pitāmaha means the creator of pada-kavita or poesy of musical composition. This title-like compound may originate either because of the creativity of one's compositions or because of their sheer bulk or quantity. To say that it is a title of Annamācārya, the question as to who conferred the title on him has to be answered. There does not seem to be any evidence even to say that Sāḷuva Narasinga Rāya, who revered and patronized him quite for sometime, bestowed the title 'padakavitā- pitāmaha'on him. A.C merely states that Narasinga Rāya listened to the captivating padams praising them as 'unseen and unheard of' Cina Tirumalācārya (c.1537 A.D) knew about the presence of 'Āndhra Kavitā-pitāmaha' Allasāni Peddana, in the court of Śrī Kṛṣṇadēvarāya during the period 1509-1530 A.D Familiar with the title of Peddana, Cinna Tirumalācārya, perhaps, thought it fit to call his own grandfather ' Padakavitāpitāmaha'

Brahma, the creator is said to be four-faced; and poetry is classified into four streams, namely āśu (extempore, vistara (extensive), citra (the wonderful) and madhura (the sweet one). As Brahma, the Creator, creates the world, the poet creates the world of poetry. Such similitudes seem to have led to the formation of title-like compounds of 'kavibrahma', 'kāvyakamalāsana' 'kavitā-pitāmaha' etc. However there is no doubt that the title-like use of 'padakavitā-pitāmaha' is justified in the case of Annamācārya in every sense He has composed 32,000 sankīrtans, Rāmāyaṇa and Sṛṅgāra manjari in dvipada metre and 12 śatakas in Telugu, Vēnkaṭācalamāhātmyam in Sanskṛt and various prabandhas (gīta prabandhas?) in many languages. A.C. bears testimony to this In Telugu literature, Nārayāṇa Bhatta, mentioned in Nandampūdi inscription (1053 A.D) was 'kavirāja-śēkhara' in Sānskṛt, Kannaḍa, Prākṛt, Paiśāci and Āndhra languages. Baddena kavi (c. 1150 A.D ), called himself 'kāvyakamalāsana' and was referred to as 'kāvya caturmukha' 'Śivadēvayya (12/13 c.) held the title 'Āndhra kavitāpitāmaha' It is well known that Tikkana is called' kavibrahma' Kamalanābhāmatya, the grandfather of Srīnātha,was also a 'kavitāpitāmaha' Allasāni Peddanna held the title 'āndhrakavitāpitāmaha' Annamayya is referred to as 'padakavitāpitāmaha''

దీనితోపాటు అష్టభాషా పాండిత్యం తెనుగులో ప్రసిద్ధం. సంస్కృతం, ప్రాకృతం, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశం, ఆంధ్రం - ఇవి అష్టభాషలని అప్పకవి చెప్పినాడు. భాస్కర రామాయణ కర్తలలో ఒక్కడైన మల్లికార్జునభట్టు అష్టభాషాకవిమిత్రుడు. అష్టభాషాకవుల్లో సూర్యుని వంటివాడని అభిప్రాయం. వెంముకలదిన్నె శాసనాన్ని బట్టి నాచన సోమనాథుడు అష్టభాషల్లో విద్వాంసుడు. నిశ్శంకకొమ్మనకూడ 'అష్టభాషా కవితాప్రవీణుడు'. ఈసంకీర్తన లక్షణకర్త అయిన తాళ్లపాక చినతిరుమలాచార్యుడు కూడ అష్టభాషాదండకం చెప్పి (7-11-1537 నాడు) రాగిరేకులమీద చెక్కించినాడు. కాగా ఇతని తాతఅయిన అన్నమయ్యకు పలుభాషలు తెలిసి ఉండటం సంభావ్యమే. అది వాగ్గేయకారునికి ఉండవలసిన యోగ్యతకూడ.

పద్నాలుగో పద్యంలో 'పదలక్ష్యలక్షణములు తత్ప్రబంధము' అన్నపుడు పదము, ప్రబంధము అనేపదాలు సమానార్థకాలుగా వాడబడటం గమనించాలి.

పదునైదో పద్యంలో భావజ్ఞులను రసికులన్నపుడు అలంకారశాస్త్రమనే రసశాస్త్రం తెలిసినవారని గ్రహించాలి. భావం అంటే మనోవికారం; అది ఉద్రేకరూపంగా ఉంటుంది. శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనేవాటిని క్రమంగా చెవితోవినటం, చర్మంతో ముట్టుకొవటం, కంటితో చూడటం, నాల్కతో రుచిచూడటం, ముక్కుతో వాసన చూడటంవల్ల మనస్సుకు వికారం, ఉద్రేకం కలుగుతుంది. ఉద్రేకాన్ని వడబోసిన సారమే 'రసం' అనిపించుకుంటుంది. లౌకికానుభవంలోని ఇంద్రియజన్యమైన జ్ఞానప్రతీతిని పరవశింపజేసే రసానుభవంగా మార్చటమే లలితకళలన్నింటి ప్రమేయం. రసంలేని భావంలేదు. భావంలేని రసంలేదు. (నభావ హీనో స్తి రసః, నభావోరస వర్జితః) అని ఆలంకారికుల అభిప్రాయం.

పదునారోపద్యంలో కవి తన్ను 'చిన తిమ్మయ' గా చెప్పకొన్నాడు. చిన తిరుమలాచార్యునే చిన తిరుమలయ్య, చినతిమ్మయ్య, తిరుమలదీక్షిత, తిమ్మాదీక్షిత, చినతిమ్మ, చిన్న తిమ్మన్న, చిన్న తిరుమలయ్యంగార్, సిరుతిరుమలై అయ్యంగార్, తిరుమల - అనే పేర్లతో వ్యవహరించడం ఉంది.

పదునేడో పద్యంలో 'పరమామ్నాయసమానమై' అనేచోట పరమము అంటే ఆద్యం, ఉత్కృష్టం, ప్రధానం అని అర్థాలు; అలాగే ఆమ్నాయము అంటే వేదం, ఉపదేశం, సంప్రదాయం అని అర్థాలు. పరమామ్నాయమనే పదబంధానికి తొలువేదం, ఉత్కృష్టమైన ఉపదేశం, ముఖ్యసంప్రదాయం అనే మూడురకాల అభిప్రాయాలూ కుదురుతాయి, బాగుంటాయి. పాఠకులు తమకు నచ్చినట్లు గ్రహింపవచ్చు.

Along with this, 'aṣṭa bhāṣāpāndıtya' (beıng a scholar lınguıst in eight languages ) was well known ın Telugu Appakavı (1656 A.D) enumerates (1) Sānskrt (2) Prākrt (3) Śaurasēni (4) Māgadhi, (5) Paiśāci (6) Cūḷika (7) Apabhraṁśa and (8) Āndhram as the eight languages Mallıkārjuna Bhatta, author of a part of Bhāskara Ramāyana ın Telugu was 'aṣṭabhāṣākavımitra'. It means that he was lıke the Sun among the 'aṣtabhāsākavı-s'. Accordıng to the inscrıptıon of Pencukaladınne, Nācana Sōmanātha was a scholar ın aṣtabhāsā-s Nıśśanka Kommana also was 'aṣtabhāṣākavitā pravīṇa'. Tāḷḷapāka Cina Tırumalācārya, our author of Sankīrtana Laksaṇamu , has composed a daṇḍakam ın astabhāsā-s and had it engraved on copper plates on 7.11 1537 So it is probable his grandfather, Annamayya, knew many languages. It ıs also one of the qualifications of a vāggēyakāra. That in verse 14 the words 'padam' and 'prabandham µ' used in the compounds 'padalaksyalakṣaṇamulu' and 'tat prabandhamu' mean the samethıng and are synonymous, may be noted

In verse 15, when we understand bhāvajña-s as rasıkā-s the implıcatıon ıs that they are knowledgeable ın Alaṅkāraśāstra which may be called rasa- sāstra Modıficatıon of mınd ıs called bhāva. It is in the form of excitement. Thıs excıtement occurs as a result of audıtory, tactıle, ocular, gustatory and olfactory sensatıons and actıvıtıes. The dıstilled essence of thıs excıtement ıs called rasa. Fıne arts try to convert our awarness of mundane sensatıons into a bewıtchıng enjoyment of rasa. There ıs no emotıon sans rasa; no rasa sans emotıon. (na bhāva hīnōstı rasaḥ, na bhāvō rasavarjıtaḥ). This is the thinking of ālaṃkānka-s.

In verse 16, the author calls himself 'Cina Timmaya'. Cina Tırumalācārya was varıously called Cina Tirumalayya, Cinna Tımmayya, Tirumala Dīksıta, Timmā Dīksıta, Cına Timma, Cinna Timmanna, Cinna Tırumalayyangār, Ciru Tirumalaı Ayyangār and Tırumala.

In verse 17, there ıs the phrase, 'paramāmnayāsamānamaı' the component ' paramamu' carrıes the meanings, the fırst, the best, and the most important; similarly the component 'āmnāya' means the Revealed Scripture (Vēda), the Teachıng (upadēśa) and the tradıtıon (saṁprādāya handed down from teacher to dısciple) So the phrase can mean the Ancıent Veda, the best teachıng or the most important tradition. All the three meanings are correct and good. Readers may choose the one they lıke

1. భరతం అన్నపుడు నాట్యశాస్త్రం, ఆదిశబ్దంచేత దానితోపాటు మరికొన్ని నాట్య సంగీత శాస్త్రగ్రంథాలు అనిగ్రహించాలి. భరతుడు 'నాట్యశాస్త్ర' కర్త. దీని రచనాకాలం క్రీ.పూ. 100-క్రీ.శ. 300. మధ్యకాలం అని అంచనా. ఇది నాట్యానికి దానికి సంబంధించి సంగీతసాహిత్యాలకూ తొలిలక్షణ గ్రంథం. (భరతునికి పూర్వం శిలాలి, కృశాశ్వులనే నటసూత్రకర్తలున్నట్లు తెలుస్తున్నా వారి గ్రంథాలు దొరకలేదు.) భరతుడనే మాటకు భావ-రాగ-తాళాలతో పాడేవాడని, నటుడని అర్థం చెపుతూ నాట్యశాస్త్రం సంకలన గ్రంథమనీ భరతుడు కల్పితవ్యక్తి అని అనటానికి అవకాశంఉంది. కాని నాట్య శాస్త్రంలో పరస్పర విరుద్ధాంశాలు, స్వవచోవ్యాఘాతాలు కనబడవు; గొప్పపరిశీలనా శక్తి కనబడుతుంది. అందుచేత ఎవరో ఒక మహాపురుషుడు దీన్ని రచించినాడని నమ్మవచ్చు. తర్వాతివారు కోహల, దత్తిలులు. కోహలగ్రంథంకనరాదు. దత్తిల గ్రంథం సంగ్రహమొకటి 242 శ్లోకాలతో లభించింది. ఇది క్రీ.శ. 3-4 శ. నాటిదని భావిస్తారు. మతంగుని 'బృహద్దేశి' తర్వాతిది. దీన్ని క్రీ. శ. 5-9 శ. మధ్యవచ్చిందంటారు. కొందరు క్రీ.శ. 5 శతాబ్ది అనే నమ్ముతారు. తర్వాతిది చాళుక్య సోమేశ్వరుని అభిలషితార్థచింతామణి (11శ) అటుపిమ్మటిది జగదేక మల్లుని 'సంగీతచూడామణి'. జగదేకమల్లుడు చాళుక్యసో మేశ్వరుని కొడుకు. క్రీ.శ. 1134-43 మధ్యపాలించినరాజు. ఆపైది హరిపాలమహీపాలుని 'సంగీత సుధాకరం'. హరిపాలుడు సౌరాష్ట్రరాజు. క్రీ.శ. 1175 ప్రాంతమువాడు. ప్రసిద్ధమైన 'సంగీత రత్నాకరం' అటుతర్వాతిది. శార్ఙ్గదేవుడు కర్త. క్రీ.శ. 1230 ప్రాంతపు రచన. దీనికి సర్వజ్ఞసింగభూపాలుడు 'సుధాకర'మనే వ్యాఖ్యానాన్ని (క్రీ.శ. 1380 ప్రాం.), ఇమ్మడిదేవరాయల (క్రీ.శ. 1446-65) ఆస్థాన విద్వాంసుడైన కల్లి నాథుడు 'కలానిధి' అనే వ్యాఖ్యానాన్ని వ్రాశారు. పార్శ్వదేవుని 'సంగీతసమయసారం' మతంగుని, సోమేశ్వరుని, భోజుని పేర్కొంటుంది; సింగభూపాలుడీ గ్రంథాన్ని తొలిసారిగా పేర్కొన్నాడు గనుక దీన్ని 1140 -1380 క్రీ.శ. మధ్యకాలపు రచనగా భావిస్తారు. వీటిలో మనసంకీర్తనలక్షణకర్త సంగీతరత్నాకరాన్ని, సంగీతచంద్రికను, సంగీతచూడామణిని, సంగీతసుధాకరాన్ని 18 పద్యంలో కంఠోక్తిగా పేర్కొన్నాడు. కాని కర్తలపేర్లు చెప్పలేదు.

2. నిబద్ధమైన దేశిగానంలో 'ప్రబంధ'మనేది గానవిశేషం. నారదుని సంగీతమక రందంలోని గాయకలక్షణంలో 'ప్రబంధగాన నిష్ణాతః' (సంగీతాధ్యాయ 4పా-34 శ్లో) అనిప్రయోగం. సంగీతరత్నాకరంలో నిబద్ధగానానికి ప్రబంధం, వస్తువు, రూపకం అనే మూడున్నూ సంజ్ఞలని ఇలా చెప్పబడింది.

"సా చాస్మాభిః పురాప్రోక్తా నిబద్ధం త్వధునోచ్యతే

సంజ్ఞాత్రయం నిబద్ధస్య ప్రబంధో, వస్తు, రూపకమ్"

(సంగీ.రత్నా. 4-6)

1. In verse 13, Bharataṁ etcetera includes certain other treatises on drama, dance and music. Bharata is the author of N.S. The work is assigned approximately to the period 100 B C -300 A.D. This is the earliest available treatise on dance. Music and literature are also treated in this, in so far as they are relevant to dance. Though it is known that Śilāli and Kṛśāsva, the authors of Nata Sūtras existed prior to Bharata, their works are not extant The word 'bharata' is sometimes said to mean an actor, one who could sing with bhāva, rāga and tāla. This makes room for saying that Bharata is a fictitious person and that N S. is a compilation of the work of many writers. However considering the fact that N.S is remarkably free from inner contradictions and self contradictory statements as also its keen powers of observation, one can believe that it has been composed by some great man Next come Kōhala and Dattila. Kōhala's work is not extant. Dattila's work, in the form of a gist called 'Dattilam' in 242 ślōkas, is available. This is thought to belong to 3rd/4th century A.D Next comes 'Bṛhaddēśi' of Matanga This is assigned to the period bestween 5th and 9th centuries A D. Some think it to belong to 5th c. A.D. Next comes' Sangīta Cūḍāmaṇi' of Jagadēkamalla, son of Cālukya Sōmēśwara Jagadēkamalla was a reigning monarch between 1134 A D -1143 A.D 'Sangīta Sudhākara ' is the next work, composed by Haripāla Mahīpāla who ruled Saurāstra c 1175 A D. Next comes the famous S R. Its author is Śārṅgadēva. It is thought to have been composed around 1230 A D. Śarvajña 'Singabhūpāla (c.1380 A.D) has written a commentary called 'Sudhākara ' on this work Again Kallinātha employed in the court of Dēvarāya II (1446 A.D - 1465 A D) has written another excellent commentary called 'Kalānidhi ' on this S.S.S. of Pārśvadēva mentions Matanga, Bhoja and Somēswara; and it was Singabhūpala who quoted Pārśvadēva for the first time So the work is assigned to the period between 1140 A.D -1380 A.D. Among these, the author of S.L. expressly mentions S.R , S.Ca, S.C and S.S in verse 18 without mentioning the names of the authors.

2 'Prabandha' is a particular form of music (gāna visēṣa ) in bound indigenous music (nibaddha dēśi gānā). S.M. gives expertise in singing prabandha-s as a qualification of a singer (prabandhagāna niṣṇātah ) (S.M.Sang. Adhya .4-34 sl). S.R gives three names to the form of bound music namely prabandha, vastu and rūpaka;

'sa cāsmābhiḥ purāproktā nibaddhaṁtvadhunōcyatē'
saṁjnatrayam nibaddhasya prabandhō vastu rūpakam'

(S.R.4-6)

సంగీత సమయసారం (పార్శ్వదేవ)లోను

'ప్రబంధోరూపకంవస్తు నిబద్ధస్యాభిధాత్రయమ్' (అధికరణం. 4-1)

అనిచెప్పబడింది. వీటిలో ప్రబంధశబ్దం గీత, వాద్య, ప్రబంధాలకు వాడబడుతున్నది. అంటే గీతప్రబంధాలు, వాద్యప్రబంధాలు, ఉన్నాయన్నమాట. రూపకమనేది రాగాలప్తి - రూపకాలప్తి అనే ఆలాపభేదంలో వాడబడుతున్నది. రూపకాలప్తి అంటే ఒకపాటకు నియమించిన రాగతాళాలతో ఆలాపంచెయ్యడం. వస్తువనేది వస్తు-వర్ణక భేదంలో కూడా వాడబడుతున్నది. వస్తుప్రబంధమనేది వర్ణక ప్రబంధానికి భిన్నమైనప్రబంధవిశేషం.

3. పద్యాలుగో పద్యం ఒకవిధంగా అన్నమయ్య సంస్కృతంలో చెప్పిన పదలక్షణ కృతికి ఆవాక్యాలను అనుసరించి తాను తెనుగులో వ్రాస్తున్న సంకీర్తన లక్షణమనే గ్రంథానికి 'అనుబంధచతుష్టయాన్ని' సూచిస్తుందనవచ్చు. గ్రంథవిషయం ఏమిటి, ఎవరికొరకు ఈగ్రంథం వ్రాయబడుతున్నది? ఏప్రయోజనంకోసం వ్రాయబడుతున్నది? విషయప్రయోజనాల సంబంధం ఎలాంటిది? అనే వాటిని 'అనుబంధచతుష్టయం' అంటారు. సంకీర్తన నామకపదానికి లక్ష్యలక్షణాలు విషయం, పదరచనా ప్రౌఢి ప్రయోజనం. సాధ్యసాధకభావం సంబంధం. జిజ్ఞాసువులై గ్రహణధారణపటువులైన పిన్నలైనా (బాలురైనా) అధికారులె.

4. సంస్కృతంలోని విషమవృత్తవిశేషాల్లో 'అమృతధార' ఒకటి. అక్షర సంఖ్యామాత్రమే ఇందు ముఖ్యము. ఇందు 1పాదం 20 లఘు+2గురువులు, 2పాదం 8లఘు+2గు, 3పాదం 16లఘు+2గు, 4పాదం 12ల+2గు.

5. పదునేడో పద్యం సంకీర్తన లక్షణకర్త ప్రతిజ్ఞావాక్యం. తాతగారి గ్రంథాన్ని వ్యాఖ్యానించిన తండ్రి అనుమతితో మూలగ్రంథ వాక్యాలను అనుసరిస్తూ వరుసగా పద్యరూపంలో శాస్త్రజ్ఞులకు ప్రియంగా చెప్తాను అనటంలో అన్నమయ్య గ్రంథానికి ఉన్నప్రామాణికత్వం దీనికీ పూర్ణంగా ఉన్నదని చెప్పినట్లయ్యింది. అన్నమయ్య సంస్కృతగ్రంథం లభ్యంకాలేదు. దానికి ఇది భాషాంతరీకరణం అనటానికి వీల్లేకపోయినా 'వరుస'గా చెప్తాననటంవల్ల మూలగ్రంథక్రమాన్ని పాటిస్తున్నదని తనదికూడా శాస్త్రగ్రంథమనీ అభిప్రాయం.

6. వాక్యంఅంటే తెలియజెప్పే ఉద్దేశంతో చేసిన పదప్రయోగం. ఇది ఒకేపదంకావచ్చు. పలుపదాలూకావచ్చు. ఎదుటివానికి చెప్పడంకావచ్చు. ఎదుటలేనివారికి చెప్పటంకావచ్చు. చెప్పేతున్న అభిప్రాయం కొదవలేకుండా పూర్తిగా ఉండాలి.

Pārśvadēva's S.S.S. also gives the same names 'prabandhō rūpakam vastu nibaddhasyābhidhātrayam' (Adhi 4-1) Among these, the word 'prabandha' is used in the case of gīta and vādya . That means there are what are called gīta prabandhas and vādya prabandhas . The name rūpaka is used in the case of ālāpa and certain prabandhas Ālāpa is of two kinds. rāgālapti and rūpākālapti. The latter, rūpakālapti means ālāpa for a song in the prescribed rāga and tāla. The word vastu is also used in contradistinction to varṇaka. Vastuprabandha is distinct from varṇakaprabandha.

3 The 14th verse, one may say, indicates the 'anubandha catuṣtaya' (the fourfold correlation) of S L: both his grandfather's work in sanskṛt as well his present work in Telugu. The subject matter of the work, its contemplated utility, their relationship and the readership for whom it is meant, constitute the fourfold correlation. Here the regulations of pada-compositions called sankīrtanams and examples of the same constitute the subject matter Acquisition of knowledge and ability to compose the sankīrtanam-s is the objective. Their relationship is that of the objective and the attempter. It is addressed to all those who are interested in learning and equipped with good powers of receptivity and retention; even boys

4 Among the uneven verses (visama vrttas) in Sanskrt 'amrtadhāra' is one. The number of syallables (akṣara-s) alone is important in this metre. The first line consists of 20 laghus+ 2 gurus. The second line has 8 laghus + 2 gurus. The third has 16 laghus + 2 gurus. The fourth or last line has 12 laghus + 2 gurus. The author does not mean this verse.

5 The 17th verse constitutes the statement of the author's aims. It also suggests that his work is as authoritative as his grandfather's when he says that he, having been permitted by his father who had written a commentary on the same work , would follow the ideas in original in their sequence and render them in Telugu verses so as to please the scholars in the science of music. Annamayya's work is not extant. Though it cannot be said that the Telugu work is the translation into Telugu, the author's intention to follow the order of sequence makes this work also as much a scientific treatise as his grandfather's.

6. 'Vākya ' is defined as words used with the intention of communicating. It may be a single word or more; it may be addressed to one who is present before the speaker or to someone elsewhere. But the meaning should be self-sufficient.

7 ఈ'సంకీర్తన లక్షణం' అనే గ్రంధాన్ని తెనుగులో వ్రాసిన తాళ్లపాక చినతిరుమలాచార్యుల తండ్రి పెదతిరుమలాచార్యుడని అతడు అన్నమయ్యగారు సంస్కృతంలో వ్రాసిన పదలక్షణ గ్రంథానికి వ్యాఖ్యానంచేసినాడని 16, 17 పద్యాలు చెప్తున్నవి. తాళ్లపాక చినతిరుమలాచార్యుల తమ్ముడు తాళ్లపాక చిన్నన్న (చిన తిరువేంగళనాథుడు). ఇతడు అన్నమాచార్య చరిత్రమును తెనుగులో ద్విపదగా వ్రాసినాడు. ఈచిన్నన్న ద్విపదను గౌరవించినాడని పెదతిరుమలాచార్యులు పదాన్ని గౌరవించినాడని తెనాలి రామకృష్ణకవి 'చిన్నన్న ద్విపద కెఱగుము, బన్నుగఁబెద తిరుమలయ్య పదమునకెఱఁగున్' అనేపద్యంలో చేర్చినాడు. పెదతిరుమలాచార్యులు తనతండ్రి అన్నమయ్యలాగే తానుకూడా 'శృంగార సంకీర్తనలు' 'వైరాగ్యవచనమాలికాగీతాలు' రచించిన పదకవి. అన్నమయ్య లక్షణగ్రంథానికి పెదతిరుమలాచార్యుడు వ్యాఖ్యానం వ్రాయడం ఆయనకు పదంమీద ఉన్న గౌరవాన్ని సూచిస్తుంది. 16 పద్యంలోని 'అలరున్' 'తండ్రి యనుమతమున' అనేమాటలు చినతిరుమలాచార్యులు 'సంకీర్తన లక్షణము' రచించునాటికి అతడు సజీవుడుగా ఉన్నట్లు సూచిస్తాయి. ఈగ్రంధం సంస్కృతంలోని మూలగ్రంథాన్ని అనుసరించి ఉంటేనే ఆయన ఆమోదించి ఉంటాడనేది స్పష్టం.

7. Verses 16th and 17th tell us that Cina Tirumalācārya's father was Peda Tirumālacārya and that the latter had commented upon Annamayya's work in Sanskrt. Tāḷḷapāka Cinnanna (Cina Tiruvēngalanātha) was the younger brother of Cina Tirumalācārya and he wrote A.C. in Telugu in dvipada metre. A cāṭu verse of Tenāli Ramakṛsna ( in Telugu ) states that while Cinnanna respected dvipada composition, Peda Tirumalācārya respected padam composition. Peda Tirumalācā-rya's commentary on Annamayya 's work on Sankīrtana Laksaṇa in Sanskṛt is a solid indication of his great interest in padams Like his father Annamayya, Peda Tirumālacārya has also composed 'śṛṅgāra sankīrtanamulu' as also 'vairāgya vacanamālikā gītamulu' The words 'alaru' (exists happily) and 'tandriyanumata-mbuna' ( with the permission of (my) father) indicates that at the time of composition of S.L. by Cina Tirumalācārya, his father Peda Tirumalācārya was alive . The implication that the latter would have approved it only if it was in accordance with the original, is obvious

వ॥ మహనీయంబగు సంకీర్తన నామక పదసంప్రదాయం బెట్టిదనిన

సీ॥ రమణీయ సంగీత రత్నాకర ప్రబంధాధ్యాయమున నుక్తమయ్యెఁబదము
సముచిత సంగీత చంద్రికాదేశైల యందు మిక్కిలిఁదేటయయ్యెఁబదము
అతులతత్సంవాదమైనట్టి సంగీత చూడామణికిఁబల్కుచోటు పదము
ధన్యసంగీత సుధాకర గ్రంథంబునందు మిక్కిలిఁజెలువొందుఁబదము

తే॥గీ॥ తానె యిన్నిఁటికిని మూలమైన భరత
మందుఁబంచ దశాధ్యాయ మందు విమల
వృత్త చూర్ణ నిబంధక వివిధనామ
భవ్య లక్షణములకు నా స్పదము పదము 18

తా॥ సంకీర్తనమనే పేరుతో వస్తున్న ఈ గొప్ప పదసంప్రదాయం ఎలాంటిదంటే చెప్తాము. ఈ 'పద'మనేది 'సంగీతరత్నాకరం' ప్రబంధాధ్యాయంలో చెప్పబడింది; 'సంగీత చంద్రిక'లో దేశైలను చెప్పినచోట విశదం చేయబడింది; సంగీత చంద్రికతో సంవదించే 'సంగీత చూడామణి'కి పదం పలుకుచోటైంది ; 'సంగీత సుధాకరం' లోను చెప్పబడింది. ఈ సంగీత గ్రంథాలన్నింటికి మూలమైన భరత మనబడే నాట్యశాస్త్రంలో 15 అధ్యాయంలో వృత్తపదం, చూర్ణపదం, నిబంధ పదం మొదలైన పేర్లతో లక్షణ నిర్వచనం చేయబడింది ఈపదమే.

వ్యా॥ గ్రంథకర్త ఈపద్యంలో సంకీర్తనమే పదమని, సంకీర్తన సంప్రదాయం పదసంప్రదాయమని స్పష్టం చేస్తున్నాడు. అంతేకాదు. ఈ పదసంప్రదాయం భరతుని నాట్యశాస్త్రకాలం నుండి వస్తున్నదని అనాదియని చెప్తూ ఈపదాన్ని గురించి సంగీతరత్నాకరం, సంగీత చంద్రిక, సంగీత చూడామణి, సంగీత సుధాకరం వంటి శాస్త్రగ్రంథాలు చెప్పిన్నాయంటూ దాని యెడతెగని గురుపారంపర్యాన్ని ప్రశస్తిని సూచిస్తున్నాడు.

1. భరతం అంటే భరతముని ప్రణీతంగా చెప్పబడుతున్న నాట్యశాస్త్రం. వాచికాభినయం కోసం వ్యాకరణచ్ఛందోవిధానాలు ఇందులో చెప్పబడినై. పదానికి సంబంధించి వృత్త, చూర్ణ, నిబంధకాది లక్షణాలు చెప్పిన అధ్యాయం 15 అని గ్రంథకర్త చెప్పాడు. నేడు నాట్యశాస్త్రం కాశీ, బొంబాయి, బరోడా ముద్రణలలో లభిస్తున్నది. వీటిలో కాశీముద్రణంలో మాత్రమే ఈ విషయం 15 అధ్యాయంలో ఉంది. బొంబాయి బరోడా ముద్రణల్లో 14 అధ్యాయంలోనే వస్తుంది. మన గ్రంథకర్త పాఠమే కాశీముద్రణ పాఠమైందనవచ్చు.

అముఖ్య శ్లోకాలివి:

ఏభిః శబ్దవిధానైః విస్తారవ్యంజనార్థ సంయుక్తైః
పదబంధాః కర్తవ్యా నిబద్ధబంధాస్తు చూర్ణావా॥

Verse 18:

Tr: The great pada-tradition called Sankīrtanam is being explained. This pada is spoken of in the chapter on prabandha-s in the beautiful work Sangīta Ratnākara; enunciated under 'dēśaila' (dēśa+ēlā: indigenous ēlā ) in S.Ca. ; its corresponding work S.C. also waxes eloquent on pada; S.S. also gracefully includes it. This padam has been treated and defined under various heads like vṛtta, cūrṇa and nibandhaka in the 15th chapter of 'Bharatam' which is the source book.

Com. The author is making clear in this verse that Sankīrtan is padam and sankīrtan tradition is verily the pada-tradition. Not merely that. The hoariness of this from the days of N.S. of Bharata and the uninturrupted nature of this tradition is spelt out by tracing its treatment in the N.S. and the subsequent works S.R., S.Ca., S.C and S.S . Thus is the excellence of padam established.

1. 'Bharatam' here means the treatise of Bharata, i.e. Nāṭya Śāstra. In the context of vācikābhinaya (verbal interpretation) grammar and prosody are also dealt with in this work briefly. Our author refers pointedly to the 15th chapter where vṛtta, cūrṇa and nibandhaka varieties of pada are dealt with . Today N.S. is available in three editions, namely the Benares edition, the Bombay edition and the Baroda edition. The subject matter referred to by our author occurs in the 15th chapter only in the Benares edition; in the rest of the two editions it occurs in 14th chapter. Clearly the version of Nāṭyaśāstra available to our author has later formed the basis for the Benares edition. The following are the relevant ślōkas:

విభక్త్యంతం పదంజ్ఞేయం నిబద్ధం చూర్ణమేవచ
తత్ర చూర్ణపదస్యేహ నువిబోధత లక్షణమ్॥
అనిబద్ధ పదం ఛందస్తథాచానియతాక్షరమ్
అర్థాపేక్ష్యాక్షరన్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధై॥
నిబద్ధాక్షర సంయుక్తం యతిచ్ఛేదసమన్వితమ్
నిబద్ధంతు పదంజ్ఞేయం ప్రమాణనియతాత్మకమ్॥
ఏవం నానార్థసంయుక్తైః పాదైర్వర్ణవిభూషితైః
చతుర్భిస్తు భవేద్యుక్తం ఛందోవృత్తాభిధానవత్॥

(నా.శా.బరోడా ముద్రణం. 14 అధ్యా-38-42)

అంతేకాదు. నాట్యశాస్త్ర తాళాధ్యాయం (బరోడా ముద్రణం. 31 అధ్యా)లోనే సప్త గీత ప్రకృతి సందర్భంలో గీతం దేవతారాధకము, పుణ్యము అని బహిర్గీతాంగ శాఖావిహీనం ' పదనిర్యుక్త 'మని చెప్పబడింది. ఇది స్తుతిమాత్రపరమైన పదం; సంకీర్తనమన్నమాట. విప్ర దాసు డనే సంగీతశాస్త్రవిద్వాంసుడు తన 'సంగీత చంద్రము' (క్రీ.శ. 1625 ప్రాంతం పూర్వపుది) అనే గ్రంథంలో దేవస్తుత్యర్థాలైన ఆశ్రవణాద్యంగాలు అపదం, పదబద్ధం అని రెండురకాలని, అపదం 'నిర్గీతం' అనబడుతుందని, పదబద్ధమైంది 'బహిర్గీతం' అనబడుతుందని, ఇది సర్వదేవ ప్రియావహమని అందుచేత ఆశ్రవణాదుల్ని పదబద్ధాలుగానే ప్రయోగించాలని చెప్పాడు. (చూడు : డా.పి.యస్.ఆర్. అప్పారావుగారి నాట్యశాస్త్రానువాదం. తెలుగు. పుట 1161-16 అధ సూచిక మరియు 890 పుట) కాబట్టి దేవస్తుత్యాత్మకమైన పదం నాట్యశాస్త్రకాలంనుండి అవిచ్ఛిన్నంగా సాగుతున్నదే.

2. గ్రంథకర్త ఈపద్యంలో కొన్ని సంగీత గ్రంథాల పేర్లయితే చెప్పాడుకాని ఆశాస్త్రగ్రంథాల కర్తలపేర్లు చెప్పలేదు; వాటి కాలక్రమాన్నీ పాటించలేదు. నేడు భరతుని నాట్యశాస్త్రంగా మనకు దొరుకుతున్న గ్రంథం 'షట్సాహస్రి' (అంటే ఆరువేలశ్లోకాల గ్రంథం) అంటారు. దీనికి ముందు 'ఆదిభరతం' 'వృద్ధభరతం' అనేపేరుతో 'ద్వాదశసాహస్రి' (12 వేలశ్లోకాల గ్రంథం) ఉండేదని అది యిప్పుడు అలభ్యమని శారదాతనయుని 'భావప్రకాశన' (క్రీ.శ. 1175-1250 ప్రాం.) మనేగ్రంథం వల్ల తెలుస్తుంది. నేడు దొరుకుతున్న నాట్యశాస్త్రం క్రీ.పూ. 100- క్రీ.శ 300 మధ్యకాలానికి చెందిందని ఒక అంచనా.

'ēbhiḥ śabda vidhānaiḥ vistāra vyañjanārtha samyuktaiḥ
Padabandhāḥ kartavyā nibaddhabandhāstu cūrṇāvā.II
vibhaktyantam padam jñēyam nibaddham cūrṇamēva ca
tatra cūrṇapadasyēha suvibodhata lakṣaṇam II
anibaddhapadam chandaḥstadhācaniyatākṣaram
arthāpēksyākṣara syūtam jñēyam cūrṇapadam budhaiḥ II
nibaddhākṣara samyuktam yatichchēda samanvitam
nibaddhaṁtu padam jñēyam pramāṇa niyatātmakam II
ēvam nānārtha saṁyuktaiḥ pādair varna vibhūsitaiḥ
caturbhistu bhavēdyuktam chandō vṛttābhidhānavat II

(N.S. Baroda ed. 14 Adhya-38-42 Slokas)

Not merely this. In the Tāla adhyāya of N S (31 ch Baroda ed) in the context of saptagīta prakṛti a gīta is said to be a form of worshipping Gods and that it brings punya; that it is called padaniryukta. A musicologist by name Vipradāsa in his Sangīta Candramu (Prior to 1625 A D) says that āśravana and other subsidiaries pertaining to hymnal composition are of two kinds, namely apadam and padabaddham, the former being called nirgītam and the latter bahirgītam He urges that as bahirgītam pleased all Gods āsrāvana etc may be used as padabaddha-s only. (Vide Nātya Śāstra-Tel.tr. by Dr P S R.App a Rao page 161 Foot note 16 and appendix -2 , page 890) So padam as a hymnal composition continues uninterrupted from the time of Nātya Śāstra

2 The author has mentioned, in this verse, names of some musical treatises, but has not mentioned their authors nor are they in a chronological order The N.S. available to us today, is called 'satsāhasri' ( a work with 6000 ślōkas).From Śāradātanaya's Bhāvaprakāsaka (1175 A.D- 1250 A.D ) we understand that there was a bigger work with 12,000 ślokas called 'Ādi Bharatam' or 'Vrddha Bharatam' It is estimated that the N.S extant today belongs to the period 100 B C - 300 A.D

దీనికి తరువాతిది 'సంగీత చూడామణి'. ఈ పేరుతో నాలుగు గ్రంథాలు వినబడుతు న్నాయి. అందులో మూడు శిథిలస్థితిలో మైసూరు ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్‌లో ఉన్నై. ఒకటి బరోడా ఓరియంటల్ ఇన్స్టిట్యూట్‌లో ఉన్నట్లు తెలుస్తున్నది. మైసూరులో ఉండేవాటిలో కర్త పేరు తెలియనిదొకటి (P 1298/1). జగదేకమల్లుని పేరుతో ఉండేది ఒకటి (P 5081). హరిపాల మహీపాలుని పేరుతో ఉండేది ఒకటి (P 105/1). ఈ మూడుగ్రంథాల పత్రాలు తాళానికి సంబంధించినవని 'ప్రబంధాల'నుగురించి వీనిలో లేదని తెలుస్తున్నది. బరోడా ప్రతి కవిచక్రవర్తి పేరుతోఉన్నట్లు, మళయాళలిపిలో ఉన్నట్లు తెలుస్తున్నది. దాని ప్రతినే కాబోలు జగదేకమల్లుని పేరుతో సంగీత నాటక అకాడమీ, ఢిల్లీ, వారు ప్రచురించినారు. ఇది తాళసంబంధిమాత్రమే. ఇది యిట్లుండగా తాళానికి ప్రబంధా లకూ సాధికారగ్రంథమనదగిన జగదేకమల్లుని 5 ప్రకరణాల సంగీతచూడామణి వరలక్ష్మి సంగీత అకాడమీ, మైసూరు, వారివద్ద లభ్యంగా ఉన్నట్లు డాక్టర్ వి.యస్. సంపత్కుమా రాచార్యగారి 'కర్ణాటక సంగీత పారిభాషిక శబ్దకోశ' (1 వాల్యూం. 286,287 పుట) (కన్నడగ్రంథం) చెప్తున్నది. కాని ఇదిపై (P 5081) కి ప్రతిక అని తెలుస్తున్నది. చినతిరుమలాచార్యులు పేర్కొన్న సంగీతచూడామణి జగదేకమల్లునిదే అనుకోవాలి. ఇతని రాజ్యకాలం క్రీ.శ. 1134-43. చిన తిరుమలాచార్యులు 41 పద్యంలో పల్లవముంటే శిఖాపదంఉండదు, శిఖాపదం ఉంటే పల్లవం ఉండదంటూ 'చూడామణి' గ్రంథంలో చెప్పబడిందని చంద్రికాకర్త చెప్పినారని వ్రాయటం వల్ల - తాను స్వయంగా సంగీత చూడామణిని చూడలేదనుకోవాలి. అంతేకాదు. సంగీత చూడామణికి తర్వాతి గ్రంథం సంగీత చంద్రిక అనికూడా తెలుస్తున్నది.

'సంగీత చంద్రిక' అనే సంస్కృత గ్రంథం రెండధ్యాయాల (శారీర లక్షణం వరకు) జెరాక్స్‌ప్రతిని ఈ టీకాకర్త మద్రాసు యూనివర్సిటీ సంగీతశాఖలో రీడరు డా. ఎన్. రామనాథన్ గారివద్ద చూచారు. కర్తమాధవభట్టు అని తెలుస్తున్నది. తంజావూర్ సరస్వతీ మహల్ లైబ్రరీలో దీని మూలప్రతి ఉన్నట్లు తెలుస్తున్నది. వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతిలోను (స్టాక్ నం. 7012) ఇది ఉంది. అముద్రితంగా ఉన్న విప్రదాసుని 'సంగీత చంద్రము' ఇదీ పేరు గ్రంథాలవునోకాదో తెలియదు.

తర్వాతి గ్రంథం హరిపాలమహీపాలుని సంగీత సుధాకరం. ఇది క్రీ.శ. 1175 ప్రాంతా నిది. మద్రాసు గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరిలో ఒక కాగితపు లిఖిత ప్రతి (R. 3082) ఉంది.

అటుతర్వాతిది ప్రసిద్ధమైన 'సంగీత రత్నాకరం'. శార్ఙ్గదేవుడు దీనికర్త. క్రీ.శ. 1230 ప్రాంతపు రచన.

Next to this comes S.C. At least four works are known by this name Three of them are in the Oriental Research Institute, Mysore and they are in bad condition One is known to be in the Oriental Institute, Baroda Among those at Mysore, one pertains to an unknown author ( P 1298/1). Another is by Jagadēkamalla (P 5081) Yet another is by Haripāla Mahīpāla (P 105/1) The leaves of these three manuscripts are said to pertain to tāla and do not include any on prabandha-s It is understood that the mss at Baroda is in Malayalam script with the author named as Kavi Cakravarti Perhaps, it is this that has been published by the Sangit Nātak Akademy, New Delhi, under the authorship of Jagadēkamalla This deals only with tāla Be that as it may, the Karnātaka Sangīta Paribhāsika Śabda Kōśa in Kannaḍa compiled by Dr V.S.Sampatkumārācārya ( Vol.I - pages 286,287) says that Jagadēkamalla's S C. , an authoritative work on prabandhas and tāla in 5 prakaranas is available at Varalakṣmi Sangita Akadamy, Mysore But it is understood it is only a copy of the above mentioned p.5081. We have to presume that the S C. mentioned by Cina Tirumalācārya is that of Jagadēkamalla. He reigned between 1134 A D -1143 A.D As our author quotes only the author of S Ca. (in verse 41 )to the effect that S C lays down the absence of śikhāpada if pallava is there and vice versa we have to infer that Cina Tirumalācārya had not seen S.C Not only that It also establishes the fact that S Ca. is posterior to S.C

This annotator has seen a photostat copy of two chapters ( up to Śarīra laksana) of a Sānskṛt work by name Sangīta Candrika, with Thiru .Dr. N Ramanathan, faculty of Music , University of Madras, Madras. The author is said to be one Mādhava Bhaṭṭa. It is understood the original work is at T.S.M Library, Tanjore. S V.O.R.I Tirupati is said to have a photostat copy of the same ( Stock No.7012) Whether the unpublished 'Sangīta Candramu' of Vipradāsa and this work are the same or not is not clear. Both are dated vaguely as prior to 1625 A.D. and 1615 A.D . respectively

The next work is S.S. of Haripāla Mahīpāla. This work is assigned to circa 1175 A.D. There is a paper manuscript in G O.Ms Library, Madras-5 (R.No.3082)

Next to this comes the famous S.R. of Śārṅgadēva It was composed circa 1230 A.D.

3. సంగీత చంద్రికలోని 'దేశైల' భాగం మనకు దొరకదుకాని సంగీత రత్నాకరంలోని ప్రబంధాధ్యాయమే మనకిప్పటికి చాలు. ఈ అధ్యాయంలో సూడప్రబంధాలు, ఆలిప్రబంధాలు, విప్రకీర్ణప్రబంధాలు, సాలగసూడ ప్రబంధాలు, రూపక ప్రబంధాలు అనే శీర్షికల క్రింద చాల ప్రబంధాలు చెప్పబడినై. 'ఏలాప్రబంధం' అనేది సూడప్రబంధాల్లో ఒకటి.

ఏలా, కరణ, డేంకీభిర్వర్తన్యా ఝొంబడేన చ

లంభ రాసైకతాలీభి రష్టభిః సూడ ఉచ్యతే ॥

(సంగీ. రత్నా. 4 అధ్యా - 23 శ్లో)

ఏలా, కరణ, డేంకీ, వర్తనీ, ఝోంబడ, లంభ, రాస, ఏకతాలీ అనే ఎనిమిది ప్రబంధాలు సూడప్రబంధాలని చెప్పబడతాయని అర్థం. ఏలా సామాన్యం పదమౌతుందని అందులో దేశైల తెనుగు పదం అనీ చినతిరుమలాచార్యుల స్పష్టమైన అభిప్రాయం. తెనుగులో 'లక్షణశిరోమణి' రచించిన పొత్తపి వేంకట రమణ కవి (క్రీ.శ. 1700 ప్రాం) ఏలలనే పదాలంటూ అవి సూళాదుల కనుగుణంగా ఉండవలెనంటూ ఇలా వ్రాశాడు.

"ఇవి సంగీత తాళనిర్ణయములు గీతసృష్టి గీతపుష్టి మాత్రాధిక్య మాత్రలోపమ్ముల రాగ తాళమ్ముల పదమ్ముల నర్జునభరతమ్ము ఏలలని వాని లక్షణమ్ములు చెప్పబడియుండు ; నందు

"కర్ణాటలాట గౌళాంధ్ర ద్రవిళానాంతు భాషితం

ఏళాస్సప్తవిధా జ్ఞేయా ప్రోక్తా మత్యాధి తాళతః"

అన్నారుగావున నీ దేశభాషల పదముల చెప్పవచ్చుననిన్ని, మూడు చరణములకు ఖండికాత్రయము అని పేరుగలదనిన్ని పల్లవము ఉపపల్లవము అనిన్ని, యివి మాత్రాసమక నిబద్ధములైన 'ప'గణాదులతో గూర్చవలెనననిన్ని సూళాదుల (క)ను గు (ణ)ముగా నుండవలెననిన్ని, సంగీతరత్నాకరము మొదలైన గ్రంథము(లు) అర్జున భరతాది ఏళాప్రకారంబున పగణాదుల రాగతాళమ్ముల సంగీతరీతిని తేటపడియుండుగాన నీసాహిత్యమార్గంబున లక్షణంబున బొరవవి యట్లుండె." (లక్షణ.శిరో. 3 ఆ-425, 426,427). పదం సూళాదులకు చెందిన ఏల అనేది దీనితో గట్టిపడుతున్నది.

పై సంగీతరత్నాకరంలో చెప్పిన 'సూడ' శబ్దం గీతి విశేషసమూహాన్ని చెప్పే దేశి శబ్దమని కల్లినాథుని వ్యాఖ్య. 'చతుర్దండి ప్రకాశిక' అనే సంగీత గ్రంథం వ్రాసిన వేంకటమఖి (17 శ), సంగీత సారామృతము రచించిన తులజాజి మహారాజు (18 - శ) ఈ అభిప్రాయన్నే అనుసరించారు. కాని కన్నడంలో సుళు+హాది=సుళాది అని విడదీసి చెప్పి

3. Since the 'dēśaila' portion of S.Ca.is not availabnle to us the prabandhādhyāya of S.R. may serve our present purpose. Many prabandha-s, under the heads of sūḍa, āli, viprakīrṇa and sālagasūda are described in this chapter of S.R. Ēlā prabandha is one of the sūḍa prabandha -s·

'ēlā karaṇa dēnkībhir vartanyā jhombaḍēna ca
lambha rāsaikatālībhi rastabhiḥ sūda ucyatē'
(Sangīta Ratnākara. Adhyā 4-23 sl)

It means ēlā ,karaṇa, dēnkī, vartanī, jhōṁbaḍa, lambha, rāsa and ēkatālī are the eight prabandha-s called sūdaprabandhas It is the clear opinion of Cina Tirumalācārya that ēlā is padam and that as dēśaila it is Telugu padam. In Telugu, Pottapi Venkaṭaramana kavi (circa 1700 A.D) in his work L.S (3 āśvāsa-425,426,427 ) mentions A B. and S.R. and says that ēlā-s are padam-s coming under sūḷādi-s with rāga, tāla etc, that padam-s can be composed in regional languages on the authority of S.R., that the first 3 lines are called 'khandikā traya' with 'pallava' and 'upa-pallava', that they should be composed with mātrāsamaka-'pa' gaṇa -s (gana-s equivalent to 5 matras each unit, without restriction on the placement of gurus and laghus) That a padam comes under sūḷādi-s is confirmed by this.

Kallinātha's commentary on S R says that the word sūda is an indegenous (deśi) word connoting a certain group of a particular type of songs (gita-s). Vēnkatamakhin, the author of Caturdandiprakāsika (17c) and Tulajāji Mahārāja, the author of Sangīta Sārāmṛta have followed this opinion But in Kannada there is a school of thought which splits the word sūlādi as sulu+hādi

ముముక్షువులు నిత్యానందం పొందటానికి సులభమార్గమని ఒకవ్యుత్పత్తి చెప్పటం ఉంది. ఈ 'సూళాదు' అనే పదాలు భిన్నతాళాల్లో పాడే వెర్వేరు భాగాలుగల కొంచెం పొడ వైన పాటలు. ధ్రువ, మఠ్య, రూపకం, ఝంప, త్రిపుట, అర్థ, ఏకతాళం అనే ఏడు సూళాదిసప్తతాళాలు. కన్నడంలో ఈసూళాదులను కూర్చిన మొదటి వాగ్గేయకారుడు శ్రీపాదరాయరు. వ్యాసరాయరు, పురందరదాసరు సూళాదులు ప్రచలితంచేసిన వారె. ఇవి కన్నడంలోని దాససాహిత్యానికి విశిష్టాలంటారు. సంగీతశాస్త్రంలో 'ఛాయాలగ' మనే పదబంధం 'సాలగ' అయింది. 'కరపాట' అనే పదబంధం 'కైవార'(డ) అయింది. ప్రబం ధాల్లో సాలగసూడ ప్రబంధాలు ఉన్నవి. 'సాలగ' శబ్ద సాహచర్యంతో సూడ శబ్దంకూడ 'సూళ' గా మారినట్లు తోచుతుంది. ఇంక ఈసూళాదికి చేరిన 'ఏల' ఎలా వచ్చిందో చూద్దాం. ఏలా శబ్దాన్ని ఏలకితీగే అనేఅర్థంలో పాటకు పేరుగా చెప్పడం కుదరదు.

'ఏలా' శబ్దం సంస్కృత 'హేలా' శబ్దంనుండి వచ్చిందనటం సులభం. కాని అర్థం పొసగదు. 'హేలా' శబ్దానికి కండ్లు కనుబొమల వికారంచేత తెలియదగిన మనోవికారం అని, తిరస్కారం అని అర్థాలు. ఇది ఒక నది పేరుకూడ. ఏలా ప్రబంధం అనేపాటకు ఈ అర్థాలు సరిపడవు. 'ఏల' శబ్దంలోని శబ్దాంత దీర్ఘం సంస్కృతభాషాలక్షణం వల్ల వచ్చింది 'ఏల' అనేది ద్రావిడ భాషా శబ్దమని చెప్పవచ్చు. 'ఏల' అనే పేరుతో సంస్కృత వృత్తరత్నాకరంలో 15 ఛందంలో పుట్టిన ఒక వృత్తం ఉంది. దీనికి స-జ-న-న-య గణాలు. 6 అక్షరంమీద యతి. మాత్రాసంఖ్య 19 అవుతుంది. ఇదే ఛందస్సునే తెలుగులో అప్పకవి 'ఇల' అనేపేరుతో చెప్పాడు. గణాలు స-జ-న-న-స. 8యతిస్థానం. మాత్రల సంఖ్య 18 అవుతుంది. చిత్రకవి పెద్దన్న 5-8 మీద రెండు యతులు చెప్పాడు. ఈచోట సంస్కృత వృత్తరత్నాకరంలో చివరిగణం 'య' గణం కావటం పొరబాటనకతీరదు. వృత్తరత్నాకరంలో గణం తప్పగా ఎక్కితే తెనుగులో అప్పకవి పేరు తప్పగా చెప్పాడు.

నిజానికి రెండూ ఒకే వృత్తమే. ఏలకు మంఠ్య, ద్వితీయ, కంకాల, ప్రతితాళాల్లో ఒకదాంతో పాడాలని నియమం ఉంది. ఈమంఠ్యాదులకు 18 అక్షరాలు ఉంటాయి. అప్పకవి చెప్పిన గణాలతో ఇది ఏలా భేదం కావచ్చు. ఈఏలలు శ్రోతలకు ప్రయోక్తకు ధర్మకామార్థసిద్ధిదములని చెప్పబడింది. అందుచేత వస్తువు ఉదాత్తంగా ఉంటుంది. 'ఏళు' అనే ద్రావిడ శబ్దానికి ఎత్తు, మిఞ్చు, ఉదాత్తత అనే అర్థాలున్నాయి. **(DEDR 851)** ఏలిమలై అంటే ఎత్తైన కొండ. ఏలూరు అన్నపుడు మిఞ్చిన ఉన్న ఊరని అర్థం. ఏలా శబ్దాన్ని ఇట్లు గ్రహించడం ఒకపద్ధతి. రెండవపద్ధతి: తమిళంలోని 'యాళ్' శబ్దమే ఏలగా మారిందని తలచవచ్చు. 'యాళ్' అనేది ప్రాచీనకాలపు తంత్రివాద్యం. 'పాన ర్లనే వారు ఈవాద్యంతో గానంచేసేవారు. శ్రీలంకలోని 'జాఫ్నా' నగరం అసలుపేరు 'యార్పాణమ్' యాళ్ వాద్యంతో పాడిన 'పానర్' కిచ్చిన ఊరట. తమిళ సాహి త్యంలో ముల్లై, కురించి, మరుదమ్, నెయ్దల్, పాలై అనే ప్రాదేశిక విభాగాలున్నాయి.

with the etymology that it is 'the easy way to attain bliss for salvation-minded people'. These are longish songs, different parts being sung in different tāḷa-s The seven tālas under sūḷādi are (1) dhruva (2) maṭhya (3) rūpaka (4)jhaṁpa (5) tripuṭa (6)aṭṭa and (7) ēka tāla. In Kannada, Sripādarāya' was the first to compose the sūḷadi-s. Vyāsarāya and Purandaradāsa have popularised them. These songs are said to be characteristic in dāsa sāhitya. In music the word ' chāyālaga' has become 'sālaga'; 'karapāṭa' has become 'kaivāḍa'. Among prabandha-s there are the 'sālaga-sūḍa' variety. With the proximity and influence of sālaga the word sūda also seems to have changed to 'sūḷa'. Let us consider how the word ēlā belonging to sūḍa group could have been derived: 'Ēlā' in the sense of cardomom creeper cannot be the name of a song. It is easy to say that the word ēlā is derived from the sānskrt word 'hēlā' but the meaning does not fit in. The Sānskṛt word ' helā' has two meanings besides being the name of a particular river. One is emotion inferable from the movement of eyes and eyebrows; another is repudiation These are not suitable to indicate a song. The elongation at the end of the word 'ēlā' may be the result of naturalising into Sanskṛt. One can consider 'ēlā' as a Dravidian word. In Vrttaratnākara of Sanskṛt prosody there is a vrtta called ēlā under the 15th chandam (metre with 15 letters). The gana-s for this are sa-ja-na-na-ya (IIV+IVI+III+III+IVV); caesura (yati) is on the 6th letter. The number of matra-s will be 19. In Telugu the same metre is called ' ilā' by Appakavi. The ganas here are sa-ja-na-na-sa- (IIV+IVI+III+III+IIV); caesura (yati) is on the 8th letter. The number of mātras will be 18. Citrakavi Peddana, another Telugu prosodist lays down caesura on the 5th and the 8th letters. One cannot help saying the ya-gana given in the V.R. in Sanskṛt is a mistake. Similarly the name is given wrongly in Telugu by Appakavi. As a matter of fact both are dealing with the same vrtta . There is a rule that 'ēlā' must be sung with one of the four tālās of manthya, dvitīya, kaṁkāla and pratitāla and they have just 18 syllables. With the gana-s given by Appakavi this can surely be a kind of 'ēlā'. These ēlā-s are said to give dharma, artha and kāma, both to the listeners as well as singers. So the subject matter will be of exalted nature .The Dravidian word Ēlu means height, elevation, exalted position. (DEDR 851) Ēlimalai means a high mountain Ēluru means a town situated on an elevated place. This is one way of interpreting the word ēlā . Another way is to consider the Tamil word 'YAAL' changing into Ēlā . 'YAAL' is an ancient stringed harp-like instrument. People of Pānar community used to sing with the help of this harp. The original name of Jaffna in Sri Lanka is said to be Yārpānam, a village or place gifted to a pānar who sang beautifully with a YAAḶ. There are regional divisions called Muḷḷai, Kurunci, Marudam, Neidal and Pālai in Tamil literature. Each region has a music (pan) of its own: Mullaippaṇ, Kuruncippaṇ,

ఒక్కొక్క ప్రాంతానికి ఒక రకమైన సంగీతం (పన్) ఉంది: ముల్లైప్పన్, కురించిప్పన్, మరుదప్పన్, నెయ్దల్ పన్, పాలైప్పన్. యాళ్ వాద్యం అటుతర్వాత ఆయా ప్రాంతాల సంగీతానికి కూడా పేరైంది. పాలైయాళ్, కురించియాళ్, మరుదయాళ్, నెయ్దలి యాళ్. ఇవి ప్రాచీన తమిళసంగీతంలో ఉండిన సెరుపాలై, కూడిప్పాలై, సదుమలైప్పాలై విల్ కరిప్పాలై అనే మేళాలే అనీ తమిళ సంగీత శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. పురావస్తు పరిశోధనను అనుసరించి గ్రీసు దేశంలో యాళ్ వంటి, జగల్, (Zagal) అనే తంత్రీవాద్యం ఉండేది. సుమేరియన్ తంత్రీవాద్యానికి 'అల్' (al) అనిపేరు. ఈజిప్టు బాబిలోనియా దేశాల్లోను యాళ్ వంటి తంత్రీవాద్యాలు దొరికినై. కాగా 'యాళ్ పాట్టు' 'ఏలపాటగా' మారటం సులభమనవచ్చు. తమిళంలోని 'యార్' తెలుగులో 'ఏఱు' అయినట్లుగా ఇది మార్పుచెంది ఉంటుంది.

ఈ ఏలా ప్రబంధాలు (1) గద్యైల (2) మాత్రైల (3) వర్ణైల (4) దేశైల అని నాల్గు రకాలు. అందులో 'దేశైల' మరల 5 రకాలు.

'కర్ణాట లాట గౌడాంధ్ర ద్రావిడానాంతు భాషయా
దేశాఖ్యైలా బుధైః పంచ ప్రోక్తా మంతాది తాలతః' ॥

(సంగీ. రత్నా. 4 అధ్యా - 114 శ్లో)

(పొత్తపి వెంకటరమణకవి గ్రంథంలో వెనుక చూపిన శ్లోకం సరిగాలేదనేది స్పష్టం)

కర్ణాటైలలో ఆదిమధ్యాంతవర్తులైన అనుప్రాసలుంటాయి. లాటైల ప్రాంతప్రాసతో రస విరాజితంగా ఉంటుంది. గౌడి గమకప్రాసలు లేకుండా ఒకే రసంతో ఉంటుంది. ఆంధ్రైల నానాగమకాలతో రాగాంశలతో రసభావోత్కటంగా ఉంటుంది. ద్రావిడైల ప్రాసవర్జితంగా భూరిభావరసోత్కర్షగా ఉంటుంది.

4. వివిధ వర్ణాలతో అలంకృతమైనట్టి వివిధార్థ బోధకాలైనట్టి నాల్గు పాదాలతో కూడిన ఛందస్సు 'వృత్తం' అనబడుతుంది. వృత్తబద్ధం కాకుండా అక్షర సంఖ్యానియమంకాని గురులఘువుల నిక్క డిక్కడ నిలపాలనేనియమం కాని లేనిది అర్థాపేక్ష ఉండే (వీరశృంగారాదిరసాలను స్ఫురింపచేసే) అక్షరాలకూర్పు గలది 'మార్గపదం' అనబడుతుంది. ఛందోబద్ధమైన అక్షరాలకూర్పు, యతినియమం, అక్షరసంఖ్యానియమం ఉండేది 'నిబద్ధ పదం' అనబడుతుంది.

Marudappaṉ, Neidalpaṉ and Pālaippaṉ. Later on the instrument 'YAAḺ' has come to signify the regional music also: Pālaiyāḷ, Kurunciyāḷ, Marudayāḷ, Neidaliyāḷ. Tamil musicologists say that these are but the cerupālai, Kudippālai, Padumalaippā-lai, and vilkarippālai of ancient Tamil music . According to archaeology there was a 'YAAḺ' like harp called 'Zagal' in Greece. The Sumerian harp was called 'āl'. YAAL - like harps were discovered in Egypt and Babylonia. So one can say that YAAḺ-pāṭṭu could have easily changed into ēlappāṭṭu, ēlapāṭa. The change could have occured in the same way as yāru (Ta) › ēru (Tel) meaning a river.

These ēlā-prabandha -s are of 4 types : (1) gaṇaila (2) mātraila (3) varṇaila and (4) dēśaila. Again among them dēśaila is of 5 kinds : Karnāṭa, Lāṭa, Gauḍa, Āndhra and Drāviḍa varieties:

'karnāṭa lāṭa gauḍāndhra drāviḍānaṁtu bhāṣayā

dēśākhyailā budhaiḥ panca prōktā manṭhāditāḷatah'

(S.R.4 adhya - 114 sl)

(Obviously the sloka cited from Pottapi Vēnkaṭaramana Kavi earlier is not correct). Karñaṭailā has alliterations in the beginning, the middle and the end. Lāṭaila has one rasa only without any gamakas and prāsas. Āndhraila has various gamakas, rāgāmśās bursting with rasa and bhāva. Drāviḍaila has great bhāva and rasa but without assonance.

4. Embellished by various letters and expressive of various meanings a metrical compositon of 4 lines or a stanza is called 'vṛttam'.

That which is not framed-in like a vṛtta, which has no fixation of number of letters or the placement of gurus and laghus (stressed and unstressed syllables in English) but composed with an eye on the expressiveness of sentiment of letter is called 'cūrṇapadam.

That which has a composition of prosodical frame, obligatory caesura and fixation of number of letters is called 'nibaddha padam.

కం॥ అందఱిలో ౖబదమార్గ
చ్ఛందో మూఢాత్ము కవిత ఛందంబుల గో
విందు పదభక్తి విరహిత
మందుని ధర్మక్రియా క్రమంబున నడఁగున్॥ 19

తా॥ కవిత్వం చెప్పేవారందఱిలోకి పదకవితా ప్రస్థానానికి సంబంధించిన ఛందః పద్ధతి తెలియనివాని కవిత్వం ధర్మాచరణం చేసే వారందఱిలోకి గోవిందుని పాదాలయందు భక్తిలేకుండ వేదమంత్రాలతో చేసే ధర్మక్రియాల్లాగ తక్కువ రకమౌతుంది.

వ్యా॥ వేదమంత్రాలతో విధివిధానమైన నిష్ఠురాచారంతో జపహోమయజ్ఞాదులు చేసినంత మాత్రాన చాలదు. గోవిందుని పాదాలయందు భక్తికూడా ఉన్నప్పుడే ఆధర్మక్రియలు శ్రేష్ఠంగా ఉండి సార్థకమౌతాయి. అలాగే ఛందోబద్ధంగా గణయతిప్రాస నియమాలు తప్పకుండా కవిత్వం చెప్పినంత మాత్రాన చాలదు. అది భగవత్సంకీర్తనమై దేవస్తుత్యాత్మకమైన పదరచనగా ఉన్నప్పుడే ఆకవితారచన శ్రేష్ఠంగా ఉండి సార్థకమౌతుందని అభిప్రాయం. పద్యకవులు ఈసడించిన పదకవిత దేవస్తుత్యాత్మకమై కవిత్వానికే సార్థక్యాన్ని శ్రేష్ఠత్వాన్ని కల్పిస్తుందనే కవి అభిప్రాయం గమనించదగ్గది. అలాగే కర్మఠులు ఈసడించే భక్తి ధర్మాచరణానికే సార్థక్యాన్ని శ్రేష్ఠత్వాన్ని కల్పిస్తుందనే అభిప్రాయంకూడ గమనించదగ్గదే.

1. 'పదం' అంటే ఇక్కడ దేవస్తుత్యాత్మకంగా కూర్చిన పాట అని గ్రహించాలి ( పదనిర్యుక్తం).

2. 'ఛందస్' అనే మాటకు వేదం, గణయత్యాదులతో పద్యరచనను పదరచనను చెప్పే శాస్త్రం, స్వాతంత్ర్యం అని అర్థాలు. 'పదమార్గచ్ఛంద' మన్నచోట పదరచనా ప్రస్థానానికి చెందిన రచనాక్రమాన్ని బోధించే లక్షణ శాస్త్రం అని అర్థం. రెండోపాదం చివర 'ఛందంబుల' అన్నచోట వేదాలతో అని అర్థం.

3. 'ధర్మం' అనే మాటకు 'సర్వం ధరతీతి ధర్మః' (అన్నింటిని ధరించేది) అని 'ధ్రియతేజనైరితి ధర్మః' (జనులచేత పూనబడేది) అని వ్యుత్పత్తి. వేదచోదితమైన ధర్మంలో ఆచారం నిష్ఠురంగా ఉంటుంది. వేదం (1) సంహిత (2) బ్రాహ్మణం (3) ఆరణ్యకం (4) ఉపనిషద్ అని 4భాగాలు. వీటిలో బ్రాహ్మణం యజ్ఞయాగాది క్రతువుల స్వరూపాన్ని వాటిని నిర్వహించే క్రమాన్ని చెప్తుంది. సంహితలోని మంత్రాలు ప్రయోగసమయంలో గుర్తుండవలసిన అర్థాన్ని జ్ఞప్తిచేస్తాయి.

ఈవేద చోదితమైన ధర్మాన్ని గూర్చి విపులంగా చర్చించే దర్శనం జైమినికృతమైన 'పూర్వమీమాంస'. ఇది కర్మాచరణాన్ని మాత్రమే చెప్పడం వల్ల ఈశాస్త్రంనిరీశ్వరమని **(atheistic)** కొందరంటారు. 'యజ్ఞోవై విష్ణుః' అని యజ్ఞాన్ని విష్ణుస్వరూపంగా వేదం చెప్తుండగా యజ్ఞయాగాదిక్రతువులను చెప్పే వైదికదర్శనం నిరీశ్వరం కావటానికి అవకాశం లేదు. ఈశాస్త్రంలో భగవంతుని గూర్చి నేరుగా చెప్పకపోయినా 'అపూర్వం' 'అదృష్టం'

Verse 19

Tr. Among all the poets the poetry of one who is ignorant of the metrics of Padakavita will be inferior just as the dharma-kriyas (religious rituals taught by Vēda) of one done with Vēdamantras but without bhakti in the Feet of Gōvinda will be inferior.

Com: It is not enough if one performs japa (repeating mystic syallables) hōma (sacrificing certain substances in the sacred fire or water ) and yajña (scrificing certaince substans for certain gods ) etc. with Vēda mantras and rigorous ācāra-s. It is only when there is devotion (bhakti ) to the Feet of Gōvinda that the deeds of dharma become meaningful and the best. Similarly it is not enough if one composes poetry according to prosody and without defaulting on ganas, yati and prāsa. It is only when it is hymnal, in praise of God and a song (pada) that the poetic composition becomes the best and meaningful The fact that our author opines that padakavita, deprecated generally by versifiers, used for hymnal purposes becomes the best and most meaningful poetry may be noted. Again the opinion that bhakti, generally deprecated by ritualists, makes the religious deeds best and most meaningful, may also be noted.

1. The word 'pada' here has to be understood in the sense of a song in praise of God. (Pada-niryukta).

2.The word 'chandas' carries three manings namely vēda, prosody and freedom. The phrase pada-mārga-chanda means prosodical rules of composition of padam. The word chandaṁbula at the end of the second line means vēdas or vēdamantras.

3.The word 'dharma' has the etymology' sarvam dharatīti dharmaḥ '.(that which bears all) and' dhriyatē janaiḥ iti dharmaḥ' (that code of conduct taken on by men) Here 'dharma' as prescribed by Vēda is intended: that is in the form of japa, hōma and yāga. The ācāra in Vaidika dharma is rigorous. Veda is in 4 parts. (1) Saṁhita (2) brāhmaṇa (3) āranyaka and (4) upanisad. Among them the brāhmaṇa teaches the performance and conduct of kratus (sacrifices) The mantras in the samhita reminds the performer about the meanings that he should remember at the time of the performance. Jaimini's Pūrva-Mīmāṃsa is the system of Philosophy that discusses this 'dharma' enjoined by Vēda. Because it teaches only

అనే ముఖ్యాంశాలు చెప్పబడ్డాయి. ఇవి భగవంతునికి ఉపలక్షణంగా తీసికోదగ్గభావాలు. వైదిక ధర్మంలో 'శ్రద్ధ' గా చెప్పబడిందే 'భక్తి' అనిపించుకుంటుంది. వైదిక ధర్మాచరణంలో కర్మరత్వంతో పాటు భక్తికూడా అవసరమే. భక్తిలేని కర్మరత్వం, భగవత్సంకీర్తనం చెయ్యని కవిత్వం హీనమంటున్నాడు మనకవి. విష్ణుసహస్రనామపీఠికా భాగంలో

'కోధర్మస్సర్వ ధర్మాణాం భవతః పరమోమతః' అని ధర్మజుడు అడిగిన ప్రశ్నకు భీష్ముడు సమాధానంగా చెప్పిన

'ఏషమే సర్వధర్మాణాం ధర్మోఽధిక తమో మతః

యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా'॥

అనేది కర్మరూపమైన అర్చనకు కావలసిన భక్తిని స్తవరూపమైన ధర్మాన్ని రెంటిని చెప్తున్నది. కవికి కర్మిష్ఠికి 'పదభక్తి' అవసరం. కవివిషయంలో అది స్తవరూప పదరచన. కర్మరుని విషయంలో గోవిందపదభక్తి. ఛందస్సు వేదపురుషుని పాదాలని చెప్పటం ప్రసిద్ధమే.

4. 'భక్తి' అన్నపుడు భక్తుడు, భగవంతుడు - ఇద్దఱు ఉంటారు. కనుక ఇది ద్వైత విశిష్టాద్వైతానుయాయులకు ముఖ్యమైన సాధనశాస్త్రం. భక్తిశాస్త్రాలుగా (1) నారద భక్తిసూత్రాలు (2) శాండిల్య భక్తిసూత్రాలు ప్రసిద్ధాలు. రూపగోస్వామి 'ఉజ్జ్వలనీల మణి' కృష్ణభక్తినే బోధిస్తుంది. మధుసూదనసరస్వతి 'భక్తిరసాయనం' భక్తిని 'చిత్త ద్రుతి' స్థాయి భావంగాగల ఒక రసంగా నిరూపిస్తుంది. ఇవన్నీ సంస్కృత గ్రంథాలు.

the ritualism some people say it is atheistic. As Vēda says Viṣṇu is Yajña (yajñō vai viṣṇuḥ) the system of philosophy that teaches about the Vedic sacrifices cannot be atheistic. Though God is not directly mentioned in this philosophy the concepts of 'apūrva' and 'adrsta' are expounded here. These concepts connote only the omnipotent God What is described as 'śraddhā' (earnestness) in Vēdadharma can be called bhakti in ordinary terms. In the performance of Vēdadharma,bhakti is also required along with ritualistic rigour. Our poet says ritualistic rigour without bhakti and poetry which does not praise God are inferior. In the prologue of Viṣṇu Sahasranāma, Dharmaja asks: 'Kōdharmaḥ sarva dharmānām bhavatah paramō matah?' (what is the dharma of all dharmas according to your considered opinion?) Bhīsmā replies:

'ēṣa mē sarva dharmānām dharmōdhikatamō mataḥ
yad bhaktyā pundarīkākṣam stavairarcēnnarassadā'

(Man should worship the White -Lotus Eyed God with hymnal compositions with bhakti. This is the best dharma of all dharmas according to me). This speaks of bhakti being necessarv for the ritual of worship as also the praise of God as dharma. Kavi and Karmisthi ( the ritualist ) both need pada-bhakti. In the case of the poet it is hymnal composition. In the case of the ritualist it is bhakti in the Feet of Gōvinda. It is well known that prosody is described as the Feet of Vēdapuruṣa.

4. The concept of bhakti implies the duo , the bhakta (devotee ) and Bhagavān (the God ). So this is a practical discipline important to dualists and visiṣṭādvaitins (1) Nārada bhakti sūtras (2) Śāndilya bhakti sūtras are well known works as bhakti-śāstras. Rūpagōswamy's 'Ujjvalanīlamaṇi' teaches Kṛṣṇa bhakti exclusively. Madhusūdana Sarasvati's Bhakti Rasāyana establishes 'bhakti ' as a rasa with 'citta druti' as sthāyi-bhāva. These works are all in Sanskṛt.

కం॥ కృతి చెప్పిన యాతఁడలం
కృతియుఁజమత్కృతియుఁ గల్గఁగీర్తించినచోఁ
గృతియగు నటుగాక యహం
కృతిఁగృతి సేయుంగ మిగుల గేలింబడఁడే 20

తా॥ ప్రబంధ రచన చేసిన వాడు అలంకారం చమత్కారం ఉండేటట్లుగా స్తుతిస్తే తన ఉద్దేశం చక్కగా నెరవేరిన వాడౌతాడు. అలాకాకుండా అహంకారంతో పదం కూర్చితే అతడు మిక్కిలిగా నవ్వులపాలు కాకుండునా? అయితీరుతాడని అభిప్రాయం.

వ్యా॥ దేవస్తుత్యాత్మకమైన పదరచనలో కూడ అలంకారచమత్కారాలు ఉండాలని, అప్పుడే పదకర్త కార్యసిద్ధి పొందిన వాడౌతాడని, అహంకారంతో కూర్చితే ఆ కృతి నవ్వులపాలు కాకుండా ఉండదని కవి చెప్తున్నాడు. ప్రకృష్టమైన బంధం - అంటే మేలైన కూర్పు కలది - ప్రబంధం. కృతము అంటే పనితనం, కలది కృతి. పదరచనలో అలంకారచమత్కారాలుంటేనే కర్తకు సిద్ధి **(success)**. అలంకారం అంటే అందం చెయ్యటం; అలమ్ = చాలు అనేటట్లుగా చెయ్యటం; ఇంతకంటే అందంగా చెయ్యలేము; ఇది చాలా తృప్తిగా ఉంది అనిపించేటట్లు చెయ్యడం. ఈ అందానికి ఫలం తృప్తి. ఈ అలంకరించడం అనేది రచనలో శబ్దాలంకారరూపంగాను అర్థాలంకార రూపంగాను ఉండవచ్చు. పదరచనలో ముఖ్యంగా అనుప్రాస రూపమైన శబ్దాలంకారం తప్పకుండా కనబడుతుంది. 'అంఘ్రీ ఖండద్వయం సానుప్రాస మేకేనధాతునా' (సంగీ. రత్నా. 4-33) ఇత్యాదిగా ఏలాప్రబంధ లక్షణం. అర్థాలంకారాలూ ఉండవచ్చు. పాట అనేది ధాతువుకు ఆధారభూతంగా వచ్చే 'మాతు' గనుక శబ్దాలంకారానికే ప్రాధాన్యం. చమత్కారం అభిప్రాయాన్ని చెప్పేతీరును బట్టి కలుగవచ్చు. ఇది అర్థక్రియా పద్ధతి కావచ్చు, అర్థాలంకారమూ కావచ్చు. సౌందర్యచమత్కారాలు లేకపోతే అలంకారప్రయోజనం సిద్ధించదు. గర్వంతో రచనచేస్తే అది నవ్వులపాలు అయితీరుతుంది. లలితకళల్లో దేనికి సంబంధించిన కృతి రచన అయినా సరే కర్త అహంకార నిరాసం చేసుకోవడం అవసరం. కాళిదాసాది మహాకవులు కూడా కావ్యాదిలో స్వీయాహంకారనిరాసం చెయ్యడం ప్రసిద్ధమే. తన అహంకారాన్ని దుల్చివేసుకుంటేనే కృతికర్త తానుచేపట్టిన వస్తువు భావకోశం **(emotional sheath)** లోకి ప్రవేశించగలుగుతాడు. లేకపోతే లేదు. ఇంగ్లీషు సాహిత్యంలో కీట్స్ మహాకవి దీన్నే 'నెగెటివ్ కేపబిలిటీ' **(Negative capability)** అని వ్యవహరించాడు. 'భజసేవాయాం' అనే ధాత్వర్థాన్ని బట్టి భజించుట భక్తి; అంటే సేవించుట అనిఅర్థం. అహంకారం వదలుకుంటేనే భక్తి సాధ్యం అవుతుంది. పదకర్త అహంకారం వదలుకొని రచన చేయ్యాలి అన్నపుడు అది దేవస్తుత్యాత్మకమైన రచన కనుక భక్తితో రచన చెయ్యాలి అని చెప్పినట్లయ్యింది.

1. పద్యప్రారంభంలోని 'కృతి' - 'పదనిర్యుక్తం' 'ప్రబంధం' అనే అర్థంలో వాడబడింది. ఇది కలారచనకు సంబంధించింది. మూడోపాదం మొదట ఉండే 'కృతి' కార్యసిద్ధిని పొందినవాడు, తలచిన పనినెరవేరినవాడు అని మాత్రమే కాకుండా 'పుణ్యుడు' అనే అర్థంలో కూడా వాడబడింది. అనగా కలారచనలో సిద్ధికలగటం మాత్రం కాక పుణ్యంకూడా సంపాదించుకుంటున్నాడన్నమాట. కృతి అనేది 26 ఛందములలో 20వ ఛందానికిని పేరు. 20 అక్షరాలపాదం ఉండేది కృతిచ్ఛందం.

Verse 20:

Tr. If the composer of a kṛti hymns it with alamkāra and camatkāra he will become successful. As against this if he composes with haughtiness would he not become a laughing stock? (certainly becomes a laughing stock).

com. The author says that even a hymnal composition like a kṛti (padam) should possess the attributes of alaṃkāra and camatkāra for the success of the composer and that haughtiness would make the work only a butt of ridicule. A prabandha means that which has the best composition. A kṛti means that which has the workmanship. The composer attains success only if the composition has the attributes of alaṃkāra and camatkāra. The word alaṃkāra means beautification; beautification to the point of saying 'enough,we cannot further improve it'; to the point of making it appear highly satisfactory. Satisfaction is the result of this beauty. This beautification in a composition may be in the form of śabdālaṃkāra or arthālaṃkāra (verbal or semantic figures of speech ). In a pada-composition verbal form of alliteration is incorporated as a rule: for 'anghrau khanda dvayamsānuprāsam ēkēna dhātunā' etc. is the regulation for ēlā prabandham. Arthālaṃkāra-s also can be there. But since a musical composition is the 'mātu' part of a song coming in support of its 'dhātu' verbal alliteration is more important Camatkāra may be experienced by the mode of expression of an idea; this may be arthakriyā paddhati or merely a semantic figure of speech. The purpose of alaṃkāra is not served if it does not result in beauty and sensitiveness. If one composes with haughtiness his work is sure to become a laughing stock. It is well known that great poets like Kālidāsa and others have deliberately expressed their humility as a mark of shedding their own haughtiness. Only when an artist sheds his encrusted ego then only will he be able to enter the emotional sheath of his subject matter John Keats has called it 'negative capability'. From the verbal root ' bhaja sevāyām' is derived the word bhakti which means serving. Only when haughtiness is dropped will bhakti be possible. When it is said that the composer of a padam should first shed his haughtiness and then compose, it is tantamount to saying that he should compose a padam, which is in praise of God or Deity with devotion.

1, The word kṛti at the beginning of the verse is used in the sense of padaniryukta or prabandha This pertains to an artistic composition The word kṛti at the beginning of the third line is used not merlely in the sense of one who has obtained success or one who has become successful but also one who has become meritorious with ' punya'. Again krti is also one of the 26 types of metres in Sanskṛt prosody. The metre with 20 letters for its line is called Krti chandas.

2. అలమ్+కృ+తి-చాలు అనేటట్లుగా అందగించటం అలంకృతి. కాని అందాన్ని నిర్వచించటం కష్టం. తృప్తి, వాల్లభ్యం అనగా కోరవలసినవారు కోరటం, దీనికి ఫలం. ఈ అలంకారాలు గజ్జెలు, అందెల్లాగా బాహ్యాలు. కాని మితంగా ఉండి చాల ఒప్పిదంగా ఉండాలి. రెండో అంశం ఇవి పనిగట్టుకొని వగలు దిగవేసుకొన్నట్లు ఉండక ప్రయత్నరహితంగానే ఒప్పిదం ఉన్నట్లు కూర్చబడాలి (అపృథగ్యత్న నిర్వర్త్యములు కావాలి).

3. చమత్కారం అనేది ఒకవస్తువును చూడగానే తాత్కాలికంగా మనసు విప్పారినట్లు కావటం. ఇది ముఖవికాసంలో కనబడవచ్చు. దీన్నే మనం ఆశ్చర్యం అంటుంటాము. రచనలోని ఒప్పిదంవల్ల మనస్సు అనువదమూ విప్పారుతూ పోవటమే చమత్కారం.

4. కీర్తి అంటే దానాదులవల్ల కలిగే పేరు ప్రతిష్ఠలు. యశస్సు అంటే వ్యక్తిత్వ విశేషం వల్ల కలిగే ప్రతిష్ఠ. కీర్తించటం అన్నపుడు భగవంతుని ఔదార్యకారుణ్యాదులను చెప్పడం అని ముఖ్యాభిప్రాయం. గాంభీర్యశౌర్యాదులను వర్ణించటం (గుణకీర్తనం) అనేది గౌణాభిప్రాయం.

5. అహంకృతి - 'నేను' అనే భావంలోగల గర్వం, మదం. 'అహంతా' అనేది నేను అనే ఎఱుకమాత్రం. 'అస్మితా' (I am) అనే తావన్మాత్రమైన ఎఱుకఅన్నమాట. వర్ణసమామ్నాయంలో అకారం మొదలుకొని హకారం వరకుగల వర్ణాలను సమాహారంచేసి మకారంతో మూసివేస్తే 'అహమ్' అవుతుంది. ఈ 50 అక్షరాల- మాతృకల-కూర్పే కాళికాదేవి మెడలోని పుఱ్ఱెలదండ అని శాక్తేయులు చెప్తారు. వర్ణమాతృకల చైతన్య సమాహారమే వ్యష్టిచైతన్యమని అభిప్రాయం. కర్పూరాది స్తోత్రం ఈవివరణకు ముఖ్యమూలం.

ఈఅహంకారం సాత్వికాహంకారమని రాజసాహంకారమని తామసాహంకారమని మూడు రకాలు. ఈపద్యంలో రాజసతామసాహంకారాలే గ్రహించాలి.

2 The word 'alaṁkṛti' can be split up as 'alam+kṛ+ti' meaning beautifying to the point of saying 'enough'. But beauty is a concept difficult to define . Satisfaction, affection of the beloved are its good results. These embellishments are external like anklets, bells etc but they have to be sparse and must sit well on the body. The second point is that they should not appear to be deliberately donned but that they must appear casual yet impressive.

3.A sudden sense of expansion of mind felt by the perceiver is called camatkāra It may appear in a flash of brightness on the face of the perceiver. We usally refer to it as 'surprising' A sense of expansion experienced by the perceiver at every step on account of the prettiness of the composition is camatkāra

4. Kīrti is the reputation gained on account of one's generosity and philanthropy. Reputation on account of one's own personality is ' yaśas' In a hymnal compostion praise of God's grace and generosity is the important idea; praising of other qualities is secondary

5.' ahaṁ kṛti'-is haugtiness contained in the thought 'I' Ahaṃtā-is mere awareness of one's self, it is just that much of awareness as we have when we say 'I am' (asmitā). When all the alphabets starting with the vowel' a' and ending with' ha' are signified with these first and last letters closing it with 'm' it become a-ha-m. The fifty Sanskṛt alphabets are said to embellish Goddess Kāli as a garland of skulls, according to Śākta tradition The hymn Karpūrādi stōtra addressed to Kāli is the most famous one in this respect This . ahaṃkāra is of three grades called sātvika, rājasika and tāmasika Only the rājasa and tāmasa types are to be considered in this verse

తే॥గీ॥ పెటులు నేరక చూఁడిన బెనురవంబు
లొదవ లక్ష్యంబునైనఁబ్రయోక్తనైన
సాధనమునైనఁ జెఱుచు నీసరవిగాదె
సంప్రదాయంబు నెఱుఁగని జడునికవిత 21

కం॥ వరదానంబున నైనను
గురుముఖమున నైనఁదెలిసికొను కవివలుకుల్
వరమామృతమౌ లేదా
దురహంకృత కవిత నోరఁదోఁడంగ్రు బుధుల్ 22

తే॥గీ॥ సంప్రదాయాగత జ్ఞానసహితుఁడైన
మనుజు సత్యవితయు వేదమంత్రసమము
అదియు చాలదె శ్రీ వేంకటాచలేశు
చరణములు గను మనువునశ్చరణ మేల 23

తా॥ తెలియక కాల్చినప్పటికి పెట్లుక్రోవి పెద్దచప్పుడుతో దానికి గుఱిగానున్నదానిని గాని, నడపిన వానినిగాని, కడకు క్రోవినేగాని నశింపజేస్తుంది. సంప్రదాయం తెలుసుకోని తెలివిమాలినవాని కవిత్వంకూడ ఇలాగే లక్ష్యాన్నికాని చెప్పినవానినికాని చివరకా కవితనేకాని పాడుచేస్తుంది. (21)

దేవతావరప్రసాదం వల్లగాని గురువునోటిగుండకాని తెలిసికొనే కవిమాటలు అమృతప్రాయాలే ఔతాయి. అలాతెలుసుకోకుండ నేనే చెప్తానని చెప్పినకవిత నోరనే గుంటలో త్రవ్విన మట్టిలాంటిదని తెలిసిన వారంటారు. (22)

సంప్రదాయజ్ఞానం కలవాడు చెప్పినకవిత్వం సత్యవిత్యమై వేదమంత్రాలతో సమానమౌతుంది. శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మాలుతెలుసుకోడానికి అలాంటి కవిత్వమే చాలు. వేరే మంత్ర జపం చెయ్యనక్కఱలేదు. (23)

వ్యా॥ ఈ మూడు పద్యాలు సంప్రదాయానికి ఉండే ప్రాముఖ్యాన్ని చెప్తాయి. జడునికి ఎలాగూ గురువు దైవం రెండూ ఉండవు. అలాంటివాడు సంప్రదాయజ్ఞానం లేకుండా చెప్పే కవిత్వం ఎలా కీడు చేస్తుందో తొలి పద్యం చెప్తుంది. జడుడు కాకపోయినా గురువువల్లకాని దేవతా ప్రసాదం వల్లగాని సంప్రదాయం తెలుసుకోకుండా చెప్పేవాని కవిత్వం గుంటలో మన్ను త్రవ్వినట్లు నోటికి మాత్రం చేద్బాటవుతుందని మలిపద్యం చెప్తుంది. గురుశిష్య వరంపరాగతంగా వచ్చిన జ్ఞానంతో చెప్పిన కవిత్వం వేద మంత్రంతో సమానంగా ఉండి జ్ఞానమోక్షాలకు కారణమౌతుందని మూడో పద్యం చెప్తుంది. సంప్రదాయమనేది గురుశిష్యపరంపరగా వచ్చిన పరిజ్ఞానం. అది శ్రేయస్కరం. శ్రేయస్సు అంటే రాగలశుభం. అది ఐహిక సుఖం కావచ్చు. ఆముష్మికంగా స్వర్గసుఖం కావచ్చు, మోక్షం కూడా కావచ్చు.

'సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్పితః
ఆచార ప్రభవోధర్మో, ధర్మస్య ప్రభురచ్యుతః'

అనే విష్ణు సహస్ర నామస్తోత్ర శ్లోకాన్ని సంప్రదాయపరంగా అన్వయించుకోవచ్చు. ధర్మశాస్త్రం కూడా కుటుంబ సంప్రదాయాన్ని కుల సంప్రదాయాన్ని పాటించమనే చెప్తుంది. కవిత్వంలోను సంగీతంలోను అంతే. జడుని నోటి కవితను పెట్టు క్రోవితో పోల్చి చెప్పడంలో వాక్కు అగ్నితత్త్వమని, అక్షరాల మాతృకావిజ్ఞానం, తత్త్వాలు, విషామృతాది లక్షణాలు, కృతికర్త కృతి భర్తలకు జ్యోతిష సంబంధమైన పొంతనం వగైరాలు తెలియకుండా చెప్పే కవిత్వం కీడు చేస్తుందనే అభిప్రాయం ఉన్నట్లుకనబడుతుంది. ఈ సంప్రదాయక విజ్ఞానం తెనుగులక్షణ గ్రంథాల్లోను తెనుగు నాట పుట్టిన సంస్కృత లక్షణ గ్రంథాల్లోను విశేషంగా ఉంది. మంత్రోపాసన చేసి దేవతా ప్రసాదం వల్ల చక్కటి ప్రతిభనుపొంది కవిత్వం చెప్పటం గాని గురు శుశ్రూషచేసి పాండిత్యం సంపాదించి కవిత్వం చెప్పటంకాని చిరకాలంగా వస్తున్న సంప్రదాయాలే. ఈ రెండూ కాకుండా స్వయంకృషితో సాధన చేసిన కవిత్వం నోటికి శ్రమ మాత్రమే అవుతుందని తర్వాత పద్యంలో కవి చెప్తున్నారు. దేవతా ప్రసాదం వల్లగాని గుర్వనుగ్రహం వల్లగాని సంప్రదాయం తెలుసుకొన్న వారి రచన వేదమంత్ర సమమంటున్నారు గ్రంథకర్త. మంత్రం సరహస్యం. సంప్రదాయజ్ఞానమనేది ఆ రహస్య జ్ఞానమన్నమాట. అది తెలిసినవ్వారు రచనకు గొప్ప శక్తి వస్తుందని అభిప్రాయం. వేదాధ్యయనం గురుశిష్య పరంపరాగతమే కాని స్వయంకృషి లభ్యం కాదు. అట్లే ఇక్కడ కూడ. శ్రీ మద్రామాయణ శ్రీ మహాభారతాలకు వేద తుల్యత్వం, మార్కండేయ పురాణాంతర్గతమైన దుర్గాసప్తశతికి మంత్రత్వం, శంకరకృత సౌందర్యలహరికి శ్రీ విద్యామంత్రతంత్ర గౌరవం ఈ సందర్భంలో గమనింపదగ్గవి.

1. సంప్రదాయం అన్నపుడు రహస్యంగా చెప్పబడిందని అభిప్రాయం.
2. వేంకటాచలేశు చరణములు- అన్నపుడు 'పాదోऽస్య విశ్వాభూతాని' అనే పురుష సూక్త శ్రుతిని బట్టి సృష్టిరూపమైన చతుర్దశ భువనాలు, అందలి ప్రాణులు భగవంతుని పాదస్థానీయములని గ్రహించాలి. భగవంతుని చరణాలు తెలుస్తాయి అంటేసృష్టి రహస్యం తెలుస్తుందని అభిప్రాయం.
3. 'మను' అనే సంస్కృత శబ్దానికి మంత్రమని అర్థం. పునశ్చరణం అనేది మంత్రశాస్త్రంలో మాట. మంత్రజపం చెయ్యటం అని అర్థం. మంత్రసిద్ధికి అక్షరలక్ష అని కాని నియతమైన జపసంఖ్య కాని ఉంటుంది. నియమంగా ఆ జపసంఖ్యను నిర్వహించటం పునశ్చరణ చెయ్యటం అంటారు.

"sarvāgamānām ācāraḥ prathamam parikalpitaḥ
ācāraprabhavō dharmō, dharmasya prabhuracyutaḥ"

Even Dharmaśāstra advises one to follow the tradition of family as well as one's own community So is it in poetry or music. In comparing the poetry in the mouth of a stupid with a pipe-gun or cannon the author seems to have in his mind the following points: Vāk is agnitatva (vāg arcih'-Brhadāraṇyaka upaniṣad 6-2) poetry without the knowledge of mātṛkā vijñana, the tattvas of letters, their poisonous or nectar-like effects, the astrological compatibility between the poet and the patron- may become harmful Much of this traditional knowledge may be found in the laksana grantha-s in Telugu as also similar works written in Sanskṛt in the Telugu country Poetic talent through apprenticeship and study under a guru or the grace of a Deity through mantrōpāsana have been the two hoary traditions in India. In contravention of these, if one practices on his own, such poetry, the author says in the next verse, will only be a strain on his vocal chords. Poetry by one who has obtained the knowledge of tradition either through a guru or the grace of a Deity is equal to Vēdamantra, says the author A mantra is esoteric (sarahasya). Sampradāya jñāna pertains to this secretive aspect. The idea is that the composition gets great power when the esoteric aspect is known . Vedādhyaya-na has always been through the tradition of Guru and śiṣya only. So is here. One can take note of the fact that Srīmad Rāmāyana and Srī Mahābhārata are treated as Vēda-tulya, the Durgā-sapta-śati found in Mārkandēya Purāṇa, is honoured with its every sloka being treated as a mantra and Soundaryalahari of Srī Śankara is treated as mantra and tantra śāstra

1 Sampradāya should be understood as teaching with its esoteric aspect.

2 Vēnkaṭācalēśu Caraṇamulu= Feet of the Lord of Vēnkaṭācala. As per the Vēdamantra 'pādōśya viśvā bhūtāni' of Puruṣa Sūkta, all the fourteen worlds and all the living beings form the part of the Lord's Feet. To say that one realises the Feet of the Lord would mean that one would know the secret of the Lord's creation.

3 The Sānskrt word 'manuḥ' means mantra. Punascaraṇa is a technical term in mantraśāstra. It just means repeating the mantra (japa) If one wants to attain success in a particular mantra he will have to do japa of the mantra a stipulated number of times. Generally, it may be hundred thousand times for each letter of the mantra or a particular fixed number. The japa done in this connection is called punascaraṇa.

కం.॥ పదమగును సుప్తిఙంతము,
పదమవయవ, మవయువియును బదమనఁబరఁగున్
దుదినీ తెలుంగులన్నీ యుఁ
బదకవితా మార్గ సార్వభౌముఁడు దెలిపెన్ 24

వ॥ అందు నవయువ పదం బెట్టిదంటేని

కం॥ విదిత చతుష్పాదంబగు
నది వృత్తం, బదియధాతు, వవయువ సంజ్ఞం
బదియు యని యన్నయార్యుఁడు
పదిలముగా భరతశాస్త్ర పద్ధతిఁబలికెన్ 25

తా॥ సుబంత మనబడే నామవాచక పదమైనా తిఙంత మనబడే క్రియాపదమైనా పదమౌతుంది. పదం అవయవము కూడా ఔతుంది. అవయవి కూడాపదమనిపించుకుంటుంది. పదకవిత్వ మార్గానికి సార్వభౌముడైన అన్నమాచార్యుడు ఈ చందాలన్నీ చెప్పి ఉన్నాడు. (24)

ఇంక అవయువ పదం ఎలాంటిదో చెప్పబడుతున్నది. స్పష్టంగా నాల్గు పాదాల్లో ఉండేది వృత్తం. అదే ధాతువు. అవయువమనే పేరుతో పిలువబడేది అదే- అని భరతశాస్త్ర పద్ధతిగా అన్నయార్యుడు చెప్పాడు. (25)

వ్యా॥ ఈ చోటి రెండు పద్యాల్లో తొలి పద్యం 'పద'మనేదాన్ని పరిచయం చేసి గీతిపరంగా అవయువ, అవయువి భేదాన్నిప్రవేశపెడుతున్నది. రెండో పద్యం అవయువ పదాన్నిగూర్చి చెప్తున్నది.

'సుప్తి ఙంతం పద'మ్మనేది సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధమైన అంశం. 'సుప్పు'లనే నామ విభక్తులచేత నామవాచకాలైన పదాలను సుబంతాలని 'తిఙు'లనబడే క్రియావిభక్తులుచేర్క్రియలైన పదాలను తిఙంతాలని అంటారు. భాషలోని నామవాచకాలుక్రియలు అయిన వాటిని 'పదం' అంటారని అభిప్రాయం. భాషలో కనబడే ఉపసర్గలు, అవ్యయాలు, తద్ధితాలు అనేవాటికి ఈ వ్యవహారం వర్తించదు. భరతుడు వాచికాభినయ సందర్భంగా కవి నటుల శిక్షకోసం వ్యాకరణఛ్ఛందసుల్ని చెప్పినాడు. ధ్రువాగాన సందర్భంగా (32 అధ్యా.) 'యత్కించి దక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్మ'ని పదరచనా పరంగాను చెప్పినాడు. అన్నమయ్య భరత మతాన్ననుసరిస్తూ పద రచనాపరంగా ఈ పద్యాల విషయాలు చెప్పినట్లు గ్రంథకర్త చెప్తున్నాడు. అవయవం అంటే కాలు చేయిలాంటి శరీరభాగం. అవయవాలు కలది అవయువి, అంటే శరీరం అన్నమాట. భరతుడు సప్తగీతక సందర్భంగా సమస్త గీతాలకు (1) వస్తువు (2) అవయవాలు ఉంటాయని చెప్పాడు. అవయవాలకు సంబంధించి 'విదారులు (సంగీత విభాగాలు) చెప్పబడినవి. ఒక విదారి ఉంటే 'ఏకకం,'

Verses 24-25

A 'subantam' or a 'tiṅantam' is called a padam. A padam can be an avayava. An 'avayavi' can also be called a padam. The emperor of pada-kavita (Annamācārya) has explained all these modes. (24)

Now, avayava-pada is described: That is vṛtta which is clearly in four lines. That itself is dhātu. It is the same that is called by the name avayava-Thus said Annayārya in conformity with Bharata Śāstra. (25)

Com: Between the two verses here the first one acquaints us with padam and introduces the differentiation of 'avayava' and avayavi. The second verse speaks about avayava-padam.

'Suptiṅantam padam': This is a well known aphorism in Sānskṛt grammar. Nouns whose stems take the nominal case-endings are called 'subanta-s' and verbs whose roots (with necessary modifications) take the verbal particles called tiṅ-s are called tiṅ-anta-s. It just means that nouns and verbs are called padams. Such usage does not apply to the upa-sarga-s, avyaya-s and taddhita-s found in language. Bharata has given a brief outline of grammar and prosody in his work in the context of vācikābhinaya and for the sake of training of the composers and actors. In the context of dhruvāgāna (Ch.32) he had said that any composition of (meaningful) syllables is called padam(yatkincidakṣarakṛtamtat sarvam pada sanjñitam.)

Our author says that Annamayya has spoken about the contents of these two present verses following Bharata.

రెండుంటే 'వివధం,' మూడు మొదలు ఆరు వరకు విదారులుంటే 'వృత్తం-' అనబడుతాయి. 'వృత్తం అన్నపుడు అందులో అంశం, అపన్యాసం, న్యాసం అనే మూడూ ఉంటాయి. రాగాన్ని లేదా గీతాన్ని ప్రారంభించే స్వరం అంశస్వరం లేదా జీవస్వరం అంటారు. ఇది ఆ రాగాన్ని అభివ్యక్తికి తెస్తుంది.నడుమనడుమ గీతంలో ముగింపు చూపించే స్వరం అపన్యాస స్వరం. గీతాన్ని పాడి ముగించే స్వరం న్యాసస్వరం. వృత్త విషయంగా ఇవి గుర్తుంచుకోవాలి. పదం అవయవం కూడా అవుతుంది అన్నపుడు స్వల్ప భేదంతో రెండు రకాలుగా చెప్పుకోవచ్చు. పదం అనేది గీత భాగం అనేది మొదటిది. ఇలా చెప్పుకున్నప్పుడు పదమనేది పైన చెప్పిన 'విదారి' అవుతుంది. అంతేకాని భాషాపదాలైన సుబంత తిజంతపదాలు కావు. ప్రబంధ పురుషునికి (1) స్వర (2) బిరుద (3) పద) (4) తేనక (5) పాట (6) తాలాలు అంగాలుగా చెప్పబడినై. వీటిలో పదతేనకాలు కళ్లు, పాట బిరుదాలు చేతులు, స్వరతాలాలు చెవులు. స్వరాలు సరిగమలు. బిరుదం ఓజస్విగా కూర్చబడిన మహారాష్ట్రాది భాషా బిరుదమే. పదం అర్థాన్ని ప్రకాశింపజేసేది - తేనకం అనేది మంగళస్వరూపమై పరతత్వాన్ని సూచించే 'తేన' అనే సంస్కృత భాషాశబ్దం. తచ్ఛబ్దానికి తృతీయా విభక్తి ఏకవచన రూపం. పాట అనేది మృదంగాది వాద్యాలమీద చేత్తో పుట్టించే వాద్యస్వరాలు. తాలం మనం విన్నదే. ప్రబంధాంగంగా చూచినప్పుడు పదం అర్థ ప్రకాశకమైన మాట అవుతుంది.

అవయవమే కాదు. అవయవి కూడా చివరకు పదమనబడుతుందని చెప్పినపుడు ధాతు మాతువులు రెండూ చేరి సమగ్రంగా ఉంటూ పాడబడే ప్రబంధం మొత్తం 'పదం' అనిపించుకుంటుందని అభిప్రాయం. ప్రబంధ భాగం పదం అనిపించుకుంటుందని సంగీత రత్నాకరం మీద కల్లినాథుని వ్యాఖ్యలోను ఉంది. రూపకాలప్తి సందర్భంగా వ్యాఖ్య వ్రాస్తూ కల్లినాథుడు ఇలా చెప్తున్నాడు:

> "పదవత్ పదాని। యథా వాక్యస్య పదాన్యవయవాః తథా
> ప్రబంధస్యావయవా విదారీభాగాః పదాన్యుచ్యంతే। నతు
> వాచకాని సుబంతాదీని వా భాషా పదాని।"

సంగీ. రత్నా-అధ్యా. 3-201

'Avayava' means a limb like a hand or leg, a protrusion of the body That which possesses the avayava-s is avayavi, the body. Bharata has stated in the context of sapta-gītaką (the seven types of gītas) that all musical compositions have (1) vastu and (2) avayava-s. Pertaining to these avayava-s or limbs are mentioned what are called 'vidāri-s' (those causing musical sections) If there is one vidāri it is called 'ēkaka'. If two it is 'vivadha' and if there are three to six vidāris it is called 'vrttam'. In a vṛttam of a song the aṁśa, the apanyāsa and the nyāsa are present. The svara or musical note that is used for beginning a raga is called amśasvara or jīvasvara. This is said to expound the rāga. The svara used for intermittent conclusions is callēd apanyāsa.The svara with which a song is concluded is nyāsa svara. These items are to be remembered in the context of a vṛtta also.

When it is said that a padam can be an avayava we can understand it in two ways with a slight difference. The first is padam as a part of the song. When so understood, padam becomes a vidāri cited above. It will not have anything to do with nouns or verbs. Authropomorphically speaking the prabandha-purusa is said to possess the following avayava-s: (1) svara (2) biruda (3) pada (4) tēnaka (5) pāṭa and (6) tāla, Among these pada and tēnaka constitute the eyes; pāta and biruda are the hands; svara and tāla are the ears. Svara-s are the sarigama-s; biruda is a composition of title in vigorous language like Mahārāṣtri Padam is the agent through which meaning is expressed; tēnaka is the auspicious word teṇa which indicates the cosmic spirit or God. It is the singular in instrumental case for the pronoun 'tat'-śabda (taken from the mahāvākya 'tat tvam asi') Pāṭa means the notes engendered on membranophones by the hands of the player. Of course, we are familiar with tāla. As an organ of prabandha, padam is the expressive word, mātu

When padam is considered as avayavi it represents the entire song, both dhātu and mātu put together ,

That a part of prabandha is called a padam is found in Kallinātha's commentary on S.R. in the context of rūpakālapti. He writes thus

> "padavat padāni, yathā vākyasya padānyavayavāḥ tathā prabandhasyāvayavā vidārībhāgāh padānyuccantē. na tu vācakāni subantādini vā bhāsā padāni "

పదాన్ని ప్రబంధావయంగా చెప్పిన తర్వాత అవయవపదం వివరింపబడింది. ఈ అవయవపదం చతుష్పాదమైన వృత్తం అన్నప్పుడు మామూలు పద్య మనేది పాదబద్ధమైన పదనికురుంబం అనేది వాస్తవమే అయినా పాటకు సంబంధించి ఇది నాలుగు పాదాల్లో యతి ప్రాసలతో కూడి వృత్తబంధంగా ఉండే ప్రబంధభాగం అని గ్రహించాలి. ఈ వృత్తబంధంగా ఉండే గీతి ఖండంలో వెనుక చెప్పిన అంశ, అపన్యాస, న్యాస స్వరాలకు అవకాశం వుంటుందని గ్రహించాలి. ఇలాంటిప్రబంధ భాగమే 'ధాతువు' అవుతుంది అన్నప్పుడు అభిప్రాయం ఇది: ధాతువనే మాటకు సంగీత శాస్త్రంలో (1) గేయం (2) అవయవం అని రెండు అర్థాలు ఉన్నాయి. వీటినిబట్టి వృత్తబంధంగా ఉండే ప్రబంధ భాగం ప్రబంధావయవం అవుతుంది. అలాగే సకల ప్రబంధానుగతంగా ఉండె గేయాంశం (పాటలో ఉండే సంగీతం) గాను ఉండి ముందు ముందు చెప్పబోయే ఉద్గ్రాహాది ధాతు ఖండాలుగాను పేర్కొబడతాయి. ఇవే నేడు చరణాలు అనబడుతున్నాయి.

తర్వాతి పద్యంలో శరీర ధాతువులైన వాత పిత్త శ్లేష్మాల సాదృశ్యంతో ఈ 'వృత్తా' లకు ధాతుత్వం చెప్పబడుతోంది గనుక గీత ప్రబంధం లేదా 'పదం' అనేది ప్రధానంగా త్రిధాతు నిర్మితి అనే అభిప్రాయం ఉన్నట్లు చెప్పవచ్చు. అన్నమయ్యగారి కృతుల్లో చాల వాటికి మూడేసి చరణాలు ఉండటం కూడా గమనించవచ్చు.

1. వృత్తమ్. 'వేదే గాయత్ర్యాదౌ వర్తత ఇతి వృత్తమ్' అని ఒక నిర్వచనం. దీన్నిబట్టి ఆయా ఛందస్సుల్లోని గురులఘువుల క్రమాన్ననుసరించి ఏర్పడే సౌష్ఠవయుక్తమైన సూక్ష్మశరీరాన్ని ఊహించుకోవాలి. పాటలో అయితే ఛందస్సువల్ల ఏర్పడే నాదశరీరాన్ని ఊహించుకోవాలి.

   'ఏవం నానార్థ సంయుక్తైః పాదై ర్వర్ణ విభూషితైః
   చతుర్భిస్తు భవేద్యుక్తం ఛందోవృత్తాభిధానవత్॥'

   (నాట్య శాస్త్రం. అధ్యా. 14-శ్లో 42)

భరతుని ఈ శ్లోకం గణాల గొడవకు పోకుండా నాల్గు పాదాల కూర్పును 'వృత్త'మని చెప్తున్నది. పద్యమని పొరబడకుండా దీన్ని మనం 'వృత్త బంధం' అనవచ్చు.

2. ధాతువు: ఈ శబ్దానికి రెండు అర్థాలు చెప్పుకోవాలి. 'వాఙ్మాతురుచ్యతే, గేయం ధాతురిత్యభిధీయతే' (సంగీ. రత్నా. అధ్యా.3-శ్లో.2) పాటలో అర్థవంతమైన మాటలు 'మాతువు'; దాని గేయాంశం 'ధాతువు'. ఈ ధాతువనేది సకల ప్రబంధానుగతమైన గేయధర్మం, అంటేపాటలోని సంగీతం. ధాతువుకు మరొక నిర్వచనం 'ప్రబంధావయవో ధాతుః, స చతుర్ధానిరూపితః' (సంగీ. రత్నా. అధ్యా. 4-శ్లో.7) ఇక్కడ ధాతువనేది ప్రబంధం కూర్పులోని ఒక అంగంగా చెప్పబడింది. ఉద్గ్రాహాదులు ఇలాంటి అంగాలు. అప్పుడీ ధాతువు పాటలోనిగేయ ధర్మంలో ఒక భాగం మాత్రమే అవుతుంది.

After designating padam as prabandhāvayava the avayavapadam is explained. When it is said it is a vṛtta in four lines we should not understand it as a stanza in a poem A padya is , of course, a conglomeration of words fitted in four lines but it is not a song. In the context of a song we have to understand it as a composition in four lines with yati and prasa which may be called vṛtta-bandha which is a part of a song. We must remember that there must be room for aṁśa, apanyāsa and nyāsa in this vrtta. Such a part of prabandha can also become dhātu. In Indian classical music dhātu has two meanings 1 gēya, 2.avayava As a result of this a part of prabandha which is in vrtta- bandha can become a prabandha avayava Similarly it can also be the music of the song-that part that is present in all the musical compositions apart from the libretto These dhātu-s udgraha, etc. will be mentioned in the coming verses. Padam as dhātu can be referred to as udgrāha khanda etc. These vṛtta-bandha parts are nothing but the present day carana-s of a krti.

The next verse attributes dhātutva to vṛttas on the analogy of vāta, pitta, ślēsma. This suggests that a padam was considered tridhātuka. One can see only three caraṇa-s in many of Annamayya's compositions which are vṛtta-s, avayava-s, dhātu khanda-s.

1. Vrttam: 'Vēdē gayatryādau vartata iti vṛttam'· that is one of the etymologies available for the word vṛttam. It means that which pervades the metres gayatri etc in Vēda From this we have to guess the subtle body with symmetry that takes shape following the order of the guru-s and laghu-s in different metres. In a song we have to configurate the nāda śarīra resulting from the chandas or prosody

"ēvam nānārthasaṁyuktaiḥ pādairvarnavibhūsitaiḥ

caturbhistu bhavēd yuktam chandō vrttābhidhānavat "

(N.S.- Adhya 14-SL.42)

This ślōka defines vṛttam as a composition in four lines without bothering about gaṇas or metrical feet We may call this vrttabandha so that we may not mistake the vrtta as any stanza in poetry

2 dhātu· We have to understand this word in two ways.

'Vāṅgmāturucyatē; gēyam dhāturityabhidhīyatē'

(S R. Adhya 3-SL.2)

According to this the meaningful word in a song is mātu and music is dhātu. This dhātu or musicality pervades all the songs. That is the music of the song. Another definition for the word dhatu is 'prabandhāvayavo dhātuḥ sa caturdhā nirūpitaḥ' (S R -Adhy 4,-Sl.7) Here dhātu is described as a component in the composition of a prabandha The dhatus, udgrāha etc. are such component parts in a prabandha. Then this dhātu becomes only a part of the music or musicality of the song

వ॥ ఈ వృత్తంబులకు ధాతు సంజ్ఞలెట్లయ్యె నంటేని

॥ వాతముఁ బిత్తముం గఫము వర్ణిత సర్వశరీర ధారణా
హేతువులయ్యెఁ గావున మహింజెలువొందెను ధాతుసంజ్ఞ; నీ
రీతినె వృత్తముల్ పదశరీర సముద్భవ కారణంబులై
ధాతు సమాఖ్యలందె భరత ప్రముఖాఖిల మౌనిసమ్మతిన్. 26

తా॥ వృత్తాలకు ధాతు సంజ్ఞలు వచ్చిన విధం చెప్తాను. వాత, పిత్త, శ్లేష్మాలనేవి దేహధారణ హేతువులు కావడం వల్ల లోకంలో వాటిని ధాతువులంటున్నారు. ఈ రీతిగానే పద శరీరం పుట్టడానికి వృత్తాలు కారణం కావడం వల్ల భరతాది మౌని ప్రముఖుల ఆమోదంతో ఈ వృత్తాలూ ధాతువులనబడుతున్నాయి.

వ్యా॥ వాతం, పిత్తం, శ్లేష్మం అనేవి ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన అంశాలు. వీటిని ధాతువులని, రోగపరంగా దోషాలనికూడా అంటారు. ఆయుర్వేద వైద్యులు 'నాడి' పరీక్ష చేసేటప్పుడు ఈ వాత పిత్తశ్లేష్మ నాడుల్నే కనిపట్టి చూస్తారు. దేహం ఏర్పడ డానికి ఈ మూడు కారణమనేది ఆయుర్వేద సిద్ధాంతం. ఇలాగే పద శరీరం పుట్టడానికి కారణమౌతూ వృత్తాలూ ధాతువులు అనబడ్డాయి. ధాతువుల స్పష్టమైన ప్రస్తావన మరల 38 పద్యం వద్ద వస్తుంది.

ప్రముఖులైన భరతాది మునులు అనడంలో భరతునితోపాటు కోహల దత్తిలులను కూడాగ్రహించాలని కవి అభిప్రాయంగా కనబడుతుంది. కోహలుడు, దత్తిలుడు, తండు, తాండాయని, తాండ్యుడనే వారు భరతపుత్రులుగా పేర్కొనబడ్డారు. కోహలగ్రంథం లేదు కాని ఇతర నాట్య గ్రంథాంశాలు కొన్ని అభినవగుప్తుడు నాట్యశాస్త్రం మీది వ్యాఖ్యానంలో చిత్రాభినయం మీది 25 అధ్యాయం (బొంబాయి, బరోడ ముద్రణలు)లో చెప్పాడు. కోహల శార్దూల సంవాదంగా ఉన్న 'సంగీత మేరువు'లోని అంశాలు ఇతర సంగీత గ్రంథాల్లో కలిసిపో యినై అని పండితుల తలంపు. కల్లినాథుడు తన సంగీత రత్నాకర - వ్యాఖ్యలో (వర్తనలను వివరిస్తూ) 39కోహల కారికలనిచ్చివాడు. కాని తర్వాతివాడైన కీర్తిధరుని పేర్కొన్నందువల్ల ఈ భాగం ప్రక్షిప్తమన్న సందేహం లేకపోలేదు. కోహలుని రచన నేటి నాట్యశాస్త్రంలో కలిసిపోయిందని, కోహలుడే నాట్య శాస్త్రాన్ని నవరించిన వాడని పండితుల అభిప్రాయం. 'దత్తిలం' అనే సంగ్రహ గ్రంథాన్నిగూర్చి ఇంతవరకే చెప్పబడింది.

ఇంతకూ ఈ పద్యంలో చెప్పబడిన అభిప్రాయం సంగీతరత్నాకరంలోని శ్లోకానికి అను వాదం. ఆ శ్లోకమిది:

వాత పిత్తకఫా దేహధారణాద్ధాతవో యథా
ఏవమేవ ప్రబంధస్య ధాతవో దేహధారణాత్.

(సంగీ. రత్నా. 4అధ్యా- 10/11శ్లో.

verse26:

Tr. The nomentclature of dhātus to vṛttas is being explained. Just as vāta (wind) pitta (bile) and kapha (phlegm) are called dhātus on account of their being the cause for the gross body, these vṛttas also are called dhātus by consent of prominent sages like Bharata and others, on account of their being the cause for the orgnation of the body of padam.

Com. Vāta(wind), pitta (bile) and ślēṣma(phlegm) are called the dhātus or dōsas. This pertains to Ayurvēda popularly called Indian medicine ( and is parallel to the English conception of 4 humours of the body-blood, phlegm, choler and melancholia-the last two being bile and blackbile). when an Ayurvēdic physician feels the pulse of the patient it is these three particular nādị-s that are observed. It is axiomatic in Ayurvēda that these three elements cause the origination of gross-body. Thus vṛttas being considered as cause for origination of the corpus of the song (pada-śarīra) these dhātus are taken up again in verse 38 in specific fashion.

The term 'prominent sages like Bharata and others perhaps includes Kōhala and Dattila too. Kōhala, Dattila, Tandu, Tāndāyani and Tāndya are mentioned as Bharataputras. Some points of Kōhala on dance are mentioned by Abhinavagupta in his commentary on Citrābhinaya under chapter 25 (Bombay & Baroda editions) of N.S. Points of Saṅgīta Mēru, Kōhala's treatise on music in the form of a dialogue between Kōhala and Śārdūla are said to have got merged with other treatises on music. Kallinātha has given some 39 karīkas of Kōhala in his commentary on S.R. But this portion is suspected to be an interpolation as it mentions Kirtidhara who was posterior to Kōhala. Scholars feel that Kōhala's writings got merged with N.S., that he was one of the redactors of N.S. 'Dattilam', a work in the form of a digest of Dattila's work has already been touched upon earlier.

The central idea of this verse is a rendering of the following ślōka from S.R.

'Vāta pitta kaphā dēha dhārāṇaddhātavō yathā

ēvam ēva prabandhasya dhātavō dēhadhāraṇāt'

(S.R. 4 Adhya -10/11 sl.)

సంగీత రత్నాకరంలో ధాతు భేదాల్ని చెప్పే సందర్భంలో ఉద్గ్రాహం, ధ్రువ, ఆభోగం అనే ముఖ్య ధాతువుల్నీ మేలాపకం; అంతరం అనే అముఖ్యధాతువుల్నీ చెప్పిన తర్వాత పై శ్లోకం చెప్పబడింది. అక్కడ ఉద్గ్రాహం, ధ్రువ, ఆభోగం అనే మూడు ముఖ్య ధాతువులు ప్రబంధ శరీరానికివాత పిత్త శ్లేష్మ ధాతువుల్లాంటివని అభిప్రాయం. ఇక్కడ చిన తిరుమలాచార్యుడు వృత్తాలకు ధాతుసంజ్ఞలు చెప్తూ వాతపిత్తాది ప్రశంస చేశాడు. ఇక్కడ వృత్తాలు అంటే అక్షరగణచ్ఛందస్సుల్తో కూడిన పద్యాలని గ్రహించకూడదు. ఆ అక్షర గణాలతో కూడిన వృత్త చ్ఛందస్సుల్లో వర్తించే సూక్ష్మలక్షణాలని గ్రహించాలి. వేదా ల్లోని గాయత్ర్యాది ఛందాల్లో వర్తించేది వృత్తం (గాయత్ర్యాదౌ ఛందసి వర్తతే ఇతి వృత్తమ్) అని వెనుక చెప్పిన వ్యుత్పత్తిని గ్రహించాలి. 38 పద్యం వద్ద ఉద్గ్రాహాది స్పష్ట ధాతువులు నిబద్ధపదానికి అవయవాలైన అవాంతర పదాలకు అనుకూలమైన పల్లవిగా నిరూపింపబడ్డాయి.

This ślōka occurs in S.R. in the context of 'dhātu bhēda-s' (enumeration of different dhātus ) and after listing up the three important ones udgrāha, dhrūva, ābhōga and the minor ones mēlāpaka and antara There the idea is that udgrāha, dhrūva and ābhōga to the prabandha śarīra are like vāta, pitta and ślesma dhātus to the human body.In our Telugu text Cina Tirumalācārya is speaking of vāta, pitta and ślēsma in the context of giving the nomenclature of dhātus to the vrtta-s. Here we should not take vrtta-s to mean merely the four-lined stanzas composed in prosody of aksara-ganas. The etymology of vrtta given earlier as that which pervades the prosodies like gāyatri etc. in Vēdas is to be taken (gāyatryādau chandasi vartatē iti vṛttam) The pervasive subtle element of these metres is what is meant here. The author speaks of udgrāha etc. as pallavi suitable for avāntarapadas as limbs of nibaddhapada at verse 38

వ॥ ఇందులకు భాషానియమం బెట్టెదనిన

ఆ॥వె॥ పదము సంస్కృతమునఁ బ్రాకృతమున దేశ
భాషనైన బొసఁగఁ బలుక వలయుఁ
బ్రాసములును యతులుఁ బద్యభంగినె చెల్లు
ననిరి భరత దత్తిలాది మునులు 27

తా॥ పద రచనకు భాషా సంబంధమైన నియమం చెప్తాను. పదాన్ని సంస్కృతంలో కాని ప్రాకృతంలో కాని దేశ భాషలో కాని కూర్చవచ్చునని యతులు ప్రాసలు పద్యానికి చెల్లినట్లే ఇక్కడ కూడా చెల్లాలి- అని భరతుడు దత్తిలుడు మొదలైన మునులు చెప్పారు.

వ్యా॥ భరతుడు వాచికాభినయ సందర్భంగా సంస్కృత ప్రాకృత పాఠ్యాలను గూర్చి చెప్పాడు. సంస్కృత పాఠ్యానికిసంబంధించి నాట్యశాస్త్రం 14 అధ్యాయం (బొంబాయి, బరోడా ముద్రణలు)లో వ్యాకరణం ఛందస్సుల్నీ, 15 అధ్యాయంలో వృత్తాల్నీ, 16 అధ్యాయంలో లక్షణాలంకార గుణ దోషాల్నీ చెప్పి 17 అధ్యాయంలో ప్రాకృత పాఠ్యం, భాషా, సంబుద్ధి, నామ,కాకుస్వర విధానాలు విపులంగా చెప్పాడు. ఈ అధ్యాయం కాశీ ముద్రణంలో 'భాషా విధానం' అనే పేరుతో 18 అధ్యాయంగా ఉంది. సంస్కృతానికి అపభ్రంశరూపాలై ఆయా ప్రాంతాల్లో మాటాడబడే మాగధి, అవంతి, ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లిక, దాక్షిణాత్య అనే ఏడున్ను భాషలనీ శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, వనౌకసీ మొదలైనవి విభాషలని అక్కడ చెప్పబడింది. భాషలనబడిన ప్రాకృతాల్లో తత్సమ, తద్భవ, దేశ్యపదాలు మూడురకాలూ ఉంటాయి. విభాషల్లో తద్భవ దేశ్యాలు మాత్రమే ఉంటాయి. ఇది నాట్యశాస్త్రం నాటి మాట. అనంతర కాలంలో సంగీత రత్నాకరం నాట్యశాస్త్రాన్ని అనుసరించే ప్రబంధాధ్యాయంలో గురులఘు విధానం, మాత్రాగణాలకోసం రెండక్షరాల అత్యుక్తాచ్ఛందంలో వచ్చే 4రతిగణాలు, మూడక్షరాల మధ్యాచ్ఛందస్సులో వచ్చే 8 కామగణాలు, నాల్గక్షరాల ప్రతిష్ఠాచ్ఛందస్సులో వచ్చే 16 బాణగణాలువివరించింది. ఏలా ప్రబంధ భేదాల్లో గద్యైల, మాత్రైల, వర్ణైల అనే వాటిని చెప్పి కర్ణాట, లాట, గౌడ, ఆంధ్ర, ద్రావిడ భాషల్లో దేశైలను వివరించింది. చినతిరుమలాచార్యులు ఈ పద్యంలో సంస్కృత ప్రాకృత భాషలతోపాటు దేశభాషలైన కర్ణాట, ద్రావిడాంధ్ర భాషలు పదరచనకు తగినవే అంటున్నాడు. ఈ పద్యంలో కవి చెప్పిన యతి ప్రాసలు మాత్రం ఆయా భాషల సంప్రదాయాన్ని అనుసరించి అన్వయించుకోవాలి. సంస్కృతంలో పద విచ్ఛేదరూపమైన విశ్రాంతి యతి. ఇది పాదాంతంలో కూడా ఉండి తీరాలి. పాదాది ద్వితీయ వర్ణ రూపమైన ప్రాసము సంస్కృతంలో లేదు. అనుప్రాసం మాత్రం ఉంది. కన్నడంలో యతి సంస్కృతంలో వలె పదవిచ్ఛేద రూపమైన విశ్రాంతి; ప్రాసం మాత్రం తెనుగులోలాగ ద్వితీయాక్షర ప్రాసం ఉంటుంది. తమిళంలో 'మోనై' అనే పేరుతో యతి తెలుగులో లాగ పాదాద్యక్షర సాజాత్యరూపంగా ఉంటుంది, 'యదుగై' అనే పేరుతో ప్రాసం పాదద్వితీయాక్షర రూపంగానే ఉంటుంది. యతిలో అజ్ఝల్లులకు రెంటికీ మైత్రి కూర్చాలి, ప్రాసలో హల్మాత్రము ఆవృత్తి అయితే చాలు. తెనుగులో యతి తమిళంలో లాగే పాదాద్యక్షరమైత్రి. ప్రాస ద్వితీయాక్షరం. పద్యం 4

Verse-27

Tr. We proceed to give the language regulation for pada composition. Sages like Bharata, Dattila etc, have stated that padam may be composed either in Sānskṛt or in Prākṛt or in (any) regional language; yatis (caesuras ) and prāsa-s are to be observed like in a padya.

Com. Bharata has spoken of composition of Sānskṛt text and Prakrt text in the context of vācikabhinaya (verbal interpertation). In the 14th chapter of N S. (Bombay and Benaras editions) grammar and prosody are dealt with; vṛttas are given the 15th chapter; the 16th chapter has lakṣanas ,alaṃkāras,guṇas and dōṣa-s. All these chapters pertain to the Sanskṛt text. The 17th chapter deals with Prākṛt text, language regulation, naming of characters and modes of intonation This last chapter is the 18th in the Benaras edition with the caption ' bhāṣā vidhāna' (laying down the language regulation). Fallen forms of sanskṛt spoken in different regions under the names of Māgadhi, Avanti, Prācya, Śaurasēni, Ardha-māgadhi, Bāhlika and Dākṣiṇātya are the seven that were called bhaṣa-s. Śākāri, Ābhīri, Cāndāli, Śābari,Drāviḍi, Andhri, Vānaukasi etc. are called vibhāṣa-s (further fallen forms of language). In those that are called bhāsā-s will be found tatsama, tadbhava and dēśya words. Vibhāṣā-s have only tadbhavas and dēśyas. This was the position at the time of the composition of N S. In later times, S.R following the footsteps of N.S. explains in its prabandha adhyāya (4 chapter) gurus and laghus, the 4 ratigaṇas coming from the atyuktā chandas with two letters, the 8 kāmaganas coming from the madhyā chandas with three letters and the 16 bāṇaganas coming from the pratisthā chandas with four letters. It describes the different types of ēla-s like gaṇailā, mātrailā, varṇailā and deals with different kinds of dēśaila in different languages like Kannada, Lāta bhāṣa, Gauḍa, Āndhra and Drāvida Cina Tirumalācārya is upholding the compostion of a padam in a regional language like Telugu. The yati and prāsa spoken of by the poet in this verse have to be suitably understood in accordance with each language considered . In Sanskrt yati is in the form of padavicchēda; the word must end at the end of the line also Prāsa in the form of the second letter of the line repeating in all the four lines is not found in Sanskṛt ; only anuprāsa (alliteration) is used In Kannaḍa yati is like in Sanskrt only but prāsa is like in Telugu, with the second letter of each line recurring in all the four lines. In Tamil yati goes under the name of 'mōnai' and is in assonance with the first letter of the line Same is the case in Telugu. Prāsa in Tamil goes under the name of dugai' with the second letter of each line recurring in all the four lines In yati both the vowel and consonant of the syllable must agree with its counterpart In prāsa, it is enough if the consonant repeats itself. Alliteration or anuprāsa is same in all the languages. It is a verbal figure of speach (śabdālamkā-ra) and is optional, ordinarily.

పాదాల్లోను పాదాదిద్వితీయాక్షర హల్లు అదే రావాలి. అనుప్రాస అన్ని భాషల్లోను ఒకే విధమే. ఇది సాధారణంగా శబ్దాలంకారంగా ఐచ్ఛికంగా ఉంటుంది.

కాని ఈ చోట యతి ప్రాసల్ని పద్యపరంగానే కాకుండ పదపరంగా కూడా గ్రహించాలి. పదాల్లో అక్షర సాజాత్యరూపమైన యతులతోపాటు విరామ రూపయతులుకూడా ఉంటాయి; అంటేపాడటంలోవిరామం వస్తుందన్నమాట. ఉదాహరణకు దేశైలకు సంబంధించిన వస్త్యైలలో పాదపాదానికి నాల్గేసి యతులుండాలని నియమం. అలాగే వాద్య సంగీతంలోను లయ ప్రవృత్తి నియమం యతి అనబడుతున్నది. సమయతి, గోపుచ్ఛయతి, స్రోతోవహాయతి అనే ఈ మూడు యతులు సంగీత విద్యార్థులకు పరిచితాలే. వాద్య ప్రబంధాల్లోను 'యతి' అనేది ఉంది. అలాగే ప్రాస అన్నపుడు పద్యంలో పాదద్వితీయాక్షరం ఒకటే కావాలి అనే నియమంతోపాటు అనుప్రాసను కూడా గుర్తుంచుకోవాలి. పదరచనలో అనుప్రాసకు ప్రాధాన్యం ఉంది. ఏలా పద రచనలో పాదాది తొలిపదం అనుప్రాసతో కూడిన ఖండద్వయంగా ఉండాలని సంగీత రత్నాకర లక్షణం. 'అంఘ్రౌ ఖండద్వయం సానుప్రాస మేకేన ధాతునా' (సంగీ. రత్నా. 4 అధ్యా- 33శ్లో.)

1. పద్యంలో కాకపోయినా వ్యాఖ్యానంలో స్పృశింపబడిన సంగీతశాస్త్ర మాత్రాగణాలు వివరింపబడుతున్నై.

(a) రెండక్షరాలుండే అత్యుక్తా ఛందస్సు. తెలుగులో ఇవి ఉపగణాలు. కన్నడంలో వీటినే 'బ్రహ్మ'గణాలంటారు. తమిళంలో వీటిని, 'ఈరశై' అంటారు.

లఘువునకు గుర్తు : I గురువుకు గుర్తు : U

U U = గల

I U = లగ (వ)

U I = గగ

I I = లల

ప్రస్తారంలో తొలిరెండువరసల్ని విడిచిపెట్టడం, మిగిలిన వాటిలో లఘువు మొదట ఉన్న గణాలకు మరొక లఘువు ముందుంచడం తెనుగులో సంప్రదాయం. కన్నడంలో తొలిరెండు వరసలు విడిచేపద్ధతి లేదు. లఘ్వాదికి ముందు మరొక లఘువు చేర్చుట ఉన్నది. తమిళంలో 'నిరై'కి 2 హ్రస్వాలుగాని, హ్రస్వదీర్ఘాలుగాని రావచ్చుగనుక మూడంశలు వచ్చినా 'ఈరశై' అవుతుంది.

సంగీత శాస్త్రంలో UU - IU - UI - II అనే ఈ నాల్గుగణాలను రతిగణాలంటారు. లఘ్వాది గణాలకు ముందు మరొకలఘువుంచటం సంగీత శాస్త్రంలోను చెప్పబడింది. 'కింతు తత్ర లఘ్వాద్యాయే తేష్వాదా వధికోలఘుః' (సంగీ. రత్నా 4-64) 'తత్రాపి లఘుపూర్వేష్వాదా వధికోలఘుః కర్తవ్య ఇత్యర్థః' అని కల్లినాథ వ్యాఖ్య.

But yatı and prāsa mentioned here are to be understood not merely as applying to a stanza but to a musical composition like padam too. In padams yatı-is not merely in the form of assonance (aksara sājātya rūpa) but in the form of respite too; it means there will be respite in singing at certain points For example in vastvailā, a variety of dēśailā, it is enjoined that there should be four yatis in each line Similarly in instrumental music regulation of functioning of laya (laya pravrtti niyama) is called yatı Students of music are familier with sama, gopuccha and srōtōvaha yatis Among vādya prabandhas too there is one called yati Similarly we have to remember anuprāsa (alliteration ) in the context of prāsa In the composition of padam anuprasa plays an important role. According to S R it is a rule that in the composition of ēlāpadam the first verbal unit should be in two parts embellished by alliteration.

'anghrau khanda dvayam sānuprāsam ēkēna dhātuña'- (S.R.-4-33)

1. Mātrā-gaṇas touched upon in the commentary, though not in the verse, are being explained

a) Gaṇas are metrical syllabic units A gana with two letters belongs to atyuktā chandas in Sānskrt In Telugu these units come under upa-ganas(subsidiary units) In Kannaḍa they are called Brahma ganas; in Tamil they belong to Īrasai A laghu is represented with I,guru with U. If prastāra is done for a two lettered unit in accordance with prosodical rules they will be as follows

| | | |
|---|---|---|
| U U - | ga - ga | These 4 permutations are called |
| I U - | la - ga | Rati ganas in music |
| U I - | ga - la | In Telugu the first two rows of |
| I I - | la - la | permutations are omitted in any prastāra |

Thus here only the last two are accepted Again prefixing a laghu to these units starting with a laghu is also the tradition Thus the units UI, III are called Sūrya ganas in Telugu In Kannada the first two rows of Prastāra are also accepted prefixing a laghu to those starting with a laghu is there Thus the 4 permutations UU,IIU, UI, III are accepted as Brahma ganas In Tamil a'nirai'may be in the form of two short letters or one short letter and a long letter, either by themselves or in conjunction with a consonant These ganas come under'īraśai'eventhough there may be 3 letters in some units In music also the custom of prefixing a laghu to the unit starting with a laghu and accepting it as a gana is followed 'kintu tatra lapūrvā yē tēshvādā vadhiko laghuḥ (S R 4-64) Kallınātha comments' tatrāpi laghupūrvēsu ādāvadhiko laghuh kartavyaḥ'

(b) మూడక్షరాల 'మధ్యా' ఛందస్సు.

U U U = మ<br>
I U U = య<br>
---<br>
U I U = ర<br>
I I U = స<br>
U U I = త<br>
I U I = జ<br>
U I I = భ<br>
I I I = న

ఈ 8 మూడక్షరాల గణాలు. సంగీత శాస్త్రంలో వీటిని కామగణాలని వ్యవహరిస్తారు. తొలిరెండువరుసలు విడిచి లఘ్వాది గణాలకు ముందు మరొక లఘువు చేర్చితే తెలుగులో ఇంద్రగణాలనబడే గణాలు ఏర్పడతాయి. (ర-నగ-త-సల-భ-నల). కన్నడంలో తొలిరెండు వరుసలు వదలకుండ లఘ్వాదులకు లఘువు ముందు చేర్చితే వచ్చే మ-నగ-ర-నగ-త-సల-భ-నల గణాలను విష్ణుగణాలంటారు. తమిళంలో ఇవి 'మూారశై' క్రిందవస్తాయి.

(c) నాల్గక్షరాల ప్రతిష్ఠా ఛందస్సు

U U U U<br>
I U U U<br>
---<br>
U I U U<br>
I I U U<br>
U U I U<br>
I U I U<br>
U I I U<br>
I I I U<br>
U U U I<br>
I U U I<br>
U I U I<br>
I I U I<br>
U U I I<br>
I U I I<br>
U I I I<br>
I I I I

**(b) The three lettered unit called madhyā chandas.**

U U U - ma-gaṇa !
I U U - ya-gaṇa -

U I U - ra-gaṇa !
I I U - sa-gaṇa !
U U I - ta-gaṇa !
I U I - ja-gana !
U I I - bha-gana !
I I I - na-gaṇa !

These 8 permutations are called Kamā-gaṇas in music, of course with prefix of a laghu where a unit starts with laghu. In Telugu the process gives (ra-na ga-ta-sa la-bha-na la) 6 units only, after rejecting the first two rows And these are called Indra gaṇas In Kannaḍa, without, rejecting the first two rows we get (ma-sa ga-ra-na ga-ta-sa la-bha-na la) eight units which are called Viṣṇu gaṇas In Tamil they come under 'mūrasai

c) The four-lettered unit called pratistha chandas

U U U U
I U U U

U I U U
I I U U
U U I U
I U I U
U I I U
I I I U
U U U I
I U U I
U I U I
I I U I
U U I I
I U I I
U I I I
I I I I

These 16 permutations are called Bāṇa gaṇas in music with prefix of a laghu where a unit starts with laghu In Telugu, rejecting the first two rows and prefixing a laghu where a unit starts with laghu we get 14 gaṇas which are called Chandra-ganas In Kannaḍa all the 16 units with a pre-fixture of laghu wherever necessary, gives what are called Rudra-gaṇas. In Tamil these come under 'nālasai'

ఈ 16 నాల్గక్షరాల గణాలు. వీటిని సంగీతశాస్త్రంలో బాణగణాలంటారు. లఘ్వాది గణాలకు ముందు లఘువు చేర్చటం ఇక్కడకూడా అన్వయిస్తుంది. తెలుగులో తొలి రెండువరసల్ని విడిచి లఘ్వాదులకు ముందు లఘువుంచితే చంద్రగణాలు ఏర్పడతాయి. కన్నడంలో తొలిరెండువరసలు కలుపుకొని లఘ్వాదులకు ముందు లఘువుంచితే ఈ ఏర్పడే గణాలను రుద్రగణాలంటారు. తమిళంలో ఇవి 'నాలశై' క్రిందకు వస్తాయి.

ఇట్లే మూడు ఛృందాల్లోను ఏర్పడే మాత్రాగణాల్లో సంగీతంలో

6 మాత్రల గణానికి 'ష' గణమని సంకేతం

5 మాత్రల గణానికి 'వ' గణమని పేరు.

4 మాత్రల గణానికి 'చ' గణమని పేరు.

3 మాత్రల గణానికి 'త' గణమని పేరు.

2 మాత్రల గణానికి 'ద' గణమని పేరు.

పంచ, చతుర్, త్రి, ద్వ్య - అనేవాని ఆది హల్లులతో ఈ పేర్లు పెట్టబడినై.

The mātra-ganas thus derived are given the following symbolic short names in music:

a gaṇa with 6 mātras-'cha'-gaṇa
a gaṇa with 5 mātras-'pa'-gaṇa
a gaṇa with 4 mātras-'ca'-gaṇa
a gaṇa with 3 mātras-'ta'- gaṇa
a gaṇa with 2 mātras-'da'-gaṇa

The first consonants of panca, catur, tri and dvi-indicating the number are taken as symbolic names.

శా॥ కర్ణాట ద్రవిళాంధ్ర లాటవిలసద్గౌడాది భాషాస్థితిం
గర్ణాపూర్ణ సుధా సమాన రుచులంగల్గించు దేశైళ దా
స్వర్ణం బాభరణత్వ మొందు కరణిన్ సంగీత శాస్త్రంబులన్
వర్ణింపం దగు నామజాతి యుతమై వర్తించుఁ బ్రత్యేకమై 28

తా॥ (భాషా నియమాన్నిబట్టి సంస్కృతంలోనో ప్రాకృతంలోనో కాకుండా) కర్ణాట, ద్రావిడ, ఆంధ్ర, లాట, గౌడాది దేశాల్లో మాటాడబడే దేశ భాషల్లో కూర్చిన 'దేశైల' అనే పదం బంగారం వేర్వేరు పేర్లతో నగలై ఆహ్లాదం కల్గించినట్లుగా కన్నడం, తమిళం, తెనుగు, లాటదేశభాష, గౌడ దేశభాషల్లో వేర్వేరు పేర్లతో సంగీత శాస్త్ర గ్రంథాలకెక్కినదై వినేవారి చెవులకు ఆహ్లాదం గొల్పుతుంది.

వ్యా॥ గ్రంథకర్త ఈ పద్యంలో 'దేశైల' అనేది కన్నడం, తమిళం, తెనుగు, లాట దేశభాష, గౌడ దేశభాష మొదలైన దేశ భాషల్లో ఉంటూ సంగీత శాస్త్రానికెక్కిందం టున్నాడు. పద్యంలో కవివాడిన ఆది శబ్దాన్నిబట్టి ఈ ఐదే కాక మరికొన్ని దేశభాషలు కూడా ఉద్దేశింపబడినట్లు అనుకోవాలి. ఈ విషయంలోకొంత అవ్యవస్థ ఉన్నట్లు కనబడు తుంది. సంగీత రత్నాకరం దేశైలనుగూర్చి చెప్తూ దాన్ని పై 5 భాషలకు మాత్రమే పరిమితం చేసి ఇలా చెప్పింది.

'కర్ణాట లాట గౌడాంధ్ర ద్రావిడానాంతు భాషయా
దేశాఖ్యైలా బుధైః వంః ప్రోక్తామంరాది తాలతః'

-(4 అధ్యా- 144 శ్లో)

మన గ్రంథకర్త ఈ శ్లోకాభిప్రాయాన్నే చెప్పినా ఆది శబ్దం ఒకటి చేర్చాడు. ఇతనికి తర్వాత కాలపు పొత్తపి వెంకటరమణకవి (క్రీ.శ. 1700 ప్రా. ) దాదాపు ఇదే శ్లోకం వ్రాసి 'ఏలాస్సప్త విధాజ్ఞేయా' అన్నాడు. నాట్య శాస్త్రంలో భాషలనబడ్డ ప్రాకృతాలు 7 చెప్పబడినై. వాటిలో 'దాక్షిణాత్య' ఒకటి ఉన్నా తమిళాంధ్రాలు అక్కడ విభాషల్లోనే చెప్పబడినై. పదకవులు, లాక్షణికులు ఈ పద్యంలోని ఐదింటికంటే ఎక్కువ దేశభాషల్నే గుర్తిస్తూ వచ్చారని చెప్పాలి. సంగీత రత్నాకరం నాటికంటె అనంతర కాలంలో వచ్చిన మార్పిది.

ముద్ద బంగారం ఇంట్లో ఎంత ఉన్నా ప్రయోజనం లేదు. నగలుగా చేయించి పెట్టుకొంటేనే ఆహ్లాదం. ఈ భావం క్రొత్తదేమీ కాదు. ఈ గ్రంథకర్తకు పూర్వుడైన విన్నకోట పెద్దన (క్రీ.శ. 1402-1407) తన కావ్యాలంకార చూడామణి 9ఉల్లాసంలో వ్యాకరణాన్ని చెప్పబోతూ 'తొడవుగాక పసిడిఁ దొడిగిన నొప్పునే, కనకమింటనెంత కలి గెనేని' (7 పద్యం) అన్నాడు. ఈ కవి కూడా 'స్వర్ణంబా.భరణత్వమొందు కరణిన్' అనడంలో అలాంటి భావమే ఉంది. దేశభాషను బంగారంలాంటి విలువైన వస్తువుగాను, ఆ భాషలోని రచనలనుపదాలను బంగారపు నగలవంటివిగాను భావించడం అనేది ఇక్కడ గమనించదగిన పరమార్థం.

Verse 28

Tr: Just as gold affords us pleasure in the form of ornaments of different types and names, 'dēśaila' composed in any of the indegenous languages spoken in the countries of Karṇāṭa, Drāviḍa, Āndhra, Lāta, Gauda, etc (languages other than Sānskṛt or Prākrt) gets mentioned in musical treatises under different types and names and affords us earfuls of nectar- like pleasure

Com: The author says that Śangīta Śāstra has recognised 'dēśaila' (ēlā in different regional languages) in Kannaḍa, Tamil, Telugu, Lāṭa-bhāṣa, Gauda bhāṣa under different types and names. The use of' ādi' in the verse meaning etcetera should be taken to have been intended to indicate other regional languages too. In this respect there seems to have been some unstable conditions S R. delimits 'dēśaila' to 5 languages saying thus·

'karnāṭa lāṭa gauḍānḍhra drāvidānāntu bhāsayā,
dēśākhyailā budhaiḥ panca proktā manthāditālataḥ'

(4-114)

Our author, though he has mentioned the same languages, has added 'ādi' (etcetera). Pottapi Vēnkaṭaramanakavi (c.1700 A D) posterior to our author, mentions the same ślōka but with 'ēlassapta vidhā jñēyā', making the number of languages seven N S. mentions 7 prākṛts undenr the name bhāsa-s Although one among them is called dāksinātya (language of the South) Telugu and Tamil are mentioned only under vibhāṣā-s We have to take it that musical composers and rhetoricians have been recognising more than these 5 regional languages This is the change that has come after the composition of S.R.

An ingot of gold at home does not afford the owner any pleasure until it is made into ornaments This idea is not new Vinnakōṭa Peddana (A D 1402-1407) in the 9th Ullāsa of his work K.A.C (9-7) says how can one adorn himself with gold however much he may possess unless it is made into an ornament. Similar is the idea in our authors's simile 'like gold becoming an ornament'. The main idea to be taken note of here is that indegenous language came to be considered valuable like gold and compositions in such languages were considered similar to gold ornaments.

ఈ గ్రంథం 'సంకీర్తన లక్షణ'మే కాని ప్రబంధలక్షణమో పదలక్షణమో కాదు. భగవత్సంకీర్తనకు అంగంగా మాత్రమే పద రచన స్పృశింపబడుతున్నది. అందుచేత సంగీత శాస్త్రపరమైన కొదవలు తప్పవు. ఏలాప్రబంధం లేదా ఏలాపదంఅనే సంగీత రచన పురాతనమైంది. జగదేకమల్లుని సంగీత చూడామణి (క్రీ.శ. 1134-43)లో ఏలాప్రబంధాన్నిగూర్చి శతాధిక శ్లోకాలు, కర్ణాటైలను గురించి మాత్రం దాదాపు 100 శ్లోకాలు ఉన్నట్లు తెలుస్తుంది. హరిపాల మహీపాలుని (క్రీ. 1175) సంగీత సుధాకరంలో సంగ్రహంగాను, పార్శ్వదేవుని 'సంగీత సమయసారం'లో సంగ్రహంగాను ఏలా ప్రబంధం చెప్పబడింది. శార్ఙ్గ దేవుని సంగీత రత్నాకరం (క్రీ. శ. 1230)లో 356 ఏలా ప్రబంధ భేదాలుచెప్పబడినై. మన గ్రంథకర్త ఏలా సామాన్యాన్ని గురించిచెప్పకుండానే తనకు ప్రసక్తమైనంత వరకు దేశైలను గురించి పలుకుతున్నాడు. 'దేశైల' అనేది ఏలా విశేషం గనుక ఏలా సామాన్య స్వరూపం స్థూలంగానైనా తెలియాలి. అందుచేత ఇక్కడ కొంత, గ్రంథకర్త నిబంధనామ పదాన్ని గురించిపలికిన 34 పద్యం దగ్గర కొంత, వివరింపబడుతుంది.

గానం ధాతువులతోటి ప్రబంధాంగాలతోటి నిబద్ధమైతే నిబద్ధగానం అనిపించుకుంటుంది. ప్రబంధాంగాల సంఖ్యనుబట్టి జాతి నిర్ణయం. ఛందస్సు, తాలం, అంగములు, ధాతువులు, రాగము, రసము, భాష మొదలైన వాటి నియమం వల్ల ప్రబంధాలు నిర్యుక్తాలని అనిర్యుక్తాలని రెండు రకాలు. నియమాలున్నవి నిర్యుక్తాలు. లేనివి అనిర్యుక్తాలు. ఉదాహరణానికి రాగాలాపనకు ఈ నియమాలు ఏవీ ఉండవు కాబట్టి అది అనిర్యుక్తం. ప్రబంధాలు మళ్ళా (1)సూడ ప్రబంధాలు (2) ఆలి ప్రబంధాలు (3) విప్రకీర్ణ ప్రబంధాలు అని మూడు విధాలు. సూడ ప్రబంధాలు గీత విశేషాలు. వెనుక చెప్పిన సూళాది సప్త తాలాల్లో ఒక దానితో పాడేవి. ఇవి మార్గసూడలు. వీనిని సూడస్థాలు అని కూడా అంటారు. ఏలాది సూడప్రబంధాల నడుమ ఏర్పడే వానికే ఆలిప్రబంధాలని పేరు. ఈ రెండు రకాలకు భిన్నమైనవి విప్రకీర్ణాలు. సంగీత రత్నాకరంలో సూడ ప్రబంధాలు 8+ ఆలి ప్రబంధాలు 24+విప్రకీర్ణ ప్రబంధాలు 36- మొత్తం 68 చెప్పబడినై. ఇవికాక సాలగసూడ ప్రబంధాలు .7, రూపక ప్రబంధ భేదాలు ఉన్నవి.

ఏలా పదంలో వస్తువు ఉదాత్తం. త్యాగం, లోకానురాగమనే సౌభాగ్యం, శౌర్యం, ధైర్యం, ధార్మికత్వం మొదలైన గుణాలు ఇందులో వర్ణింపబడతాయి. సంగీత రత్నాకరాన్ని అనుసరించి ఏలకు పద సంఖ్యా నియమం, ప్రతిపదానికి పేరు, అధిదేవత, ప్రాణం అనేవి ఉన్నాయి. అలాగే గానక్రమం ఉంది. ఏలకు తొలి రెండు పాదాల్లో ఐదేసి పదాలు, మూడోపాదంలో రెండు పదాలు, నాల్గోపాదంలో మూడు, ఐదోపాదంలో ఒకటి మొత్తం 16పదాలు. మొదటి 3పాదాల్లోని తొలి పదాలు అనుప్రాసతో కూడిన ఖండద్వయంగా ఉండాలి. ఆ వెంటనే గనుక ప్రయోగం చేయాలి. తొలి రెండు పాదాల్లోని చివరి మూడు పదాలు పల్లవం. నాల్గో పాదంలో పదం వర్ణ్యనామాంకితంగా ఉండాలి. ఐదోపాదంలోని

The present work is conceived as 'Sankīrtana Laksana' and not as either 'Prabandha Laksaṇa' or 'Pada Laksana' Composition of a padam is touched upon here only as an adjunct of hymnody So some difficiencies regarding the science of music are inevitable Ēlā prabandha or ēlā padam is an ancient mode of composition S C of Jagadēkamalla (A D 1134-43) is said to contain more than a hundred ślōkas on 'ēlā prabandha' and 'karnātaila' is said to have been covered roughly in another 100 ślōkas Ēlā is described briefly in S S of Haripāla Mahīpāla (c 1175 A D) and S S S of Pārśvadēva S R of Śārṅgadēva (C 1230A D ) mentions 356 varieties of Ēlā Our present author is speaking of 'dēśaila' in so far as it concerns him-without saying anything on the general charectenstics of ēlā Since 'dēśaila' is just one type of 'ēlā' it is necessary for us to know the concept of ēlā at least in a general way Hence some explanation is offered to the reader here in this regard as also under the verse No 34 where 'nibaddha pada' is dealt with

Music framed in dhātus and prabandha aṅga-s is called nibaddha gāna The jāti of a prabandha is decided by the number of prabandha angas present in it Again prabandha-s are of two kinds, namely niryuktas and aniryuktas Those which are regulated in respect of items like chandas, tāla, aṅgas, dhātus, rāga, rasa, bhāsa etc are niryukta prabnandhas Those that are not regulated in respect of the above points are aniryukta-s. For example rāgālāpana has no regulation regarding any of the aforementioned points, hence it is aniryukta Prabandhas are classified into three groups (1) Sūda (2) āli and (3) viprakīrna Prabandhas Sūda prabandha-s are a particular group of prabandhas sung with one of the seven tālas mentioned as sūlādi tālas earlier These are 'śuddha sūda'-s These are called 'sūdastha'-s also Those that are located somewhere within the range of these sūda prabandhas like ēlā etc are called 'āli prabandhas' Viprakīrnas are those that are different from these two groups S R describes 8 sūda prabandhas, 24 āli prabandhas and 36 viprakīrna prabandhas- a total of 68. Besides,there are 7 sālaga sūda prabandhas

Ēlāpadam has an exalted theme Munificience (tyāga) popularity (sowbhāgya/lokānurāga), heroism(śaurya) bravery (dhairya) and righteousness (dhārmikatva ) etc are praised in this composition It has a fixed number of padams or units with a name, a life force (prāna) and a presiding deity for each It has its specified procedure of singing(gānakrama) Ēlā has 5 padas or syllabic units in each of the first and second lines, 2 in the third, 3 in the fourth and 1 in the fifth The total number of padams or syllabic units is 16 The first syallabic unit in the first three lines should be of two parts each, with alliterattion Gamaka has to follow the singing of this first syllabic unit The last three syllabic units or padas

పదం వాగ్గేయకారుని ముద్రతో ఉండాలి. ఏలను మంఠ, ద్వితీయ, కంకాల, ప్రతితాల మనే వాటిలో ఏదో ఒక తాళంతో పాడాలని నియమం. సమగ్రహం కాక అతీత అనాగత గ్రహాల్లో ఒకటి పాటించాలి. ఈ 16పదాలను రెండోసారి కూడా పాడి ధ్రువం అన బడే 4 పాదంలోని తొలిపదం వద్ద (13వ పదం) ముగించవలసిందని కల్లినాథుని బోధ. అభోగ మనబడే ధాతువుతో ఐదోపాదం పాడిన పిమ్మట ధ్రువమనే నాల్గోపాదం పాడి ముగించమని సింగభూపాలుని బోధ. పదాల్ని పెట్టెలుగా, పెట్టెల్లో పదాల పేర్లు, క్రింద ప్రాణం, పైన అధిదేవత, ఎడమప్రక్కన ధాతువు, కుడి ప్రక్కన మిగిలిన వివరాలతో ఏల నిర్మాణాన్ని ఈ విధంగా చూపవచ్చు పటం చూడండి

వెనుక చూపినట్లుగా అయితే ఏలా ప్రబంధం 1) ఉద్గ్రాహం 2) ధ్రువం 3) ఆభోగం అనే మూడు ధాతువులతో త్రిధాతుకం ఔతుంది. దీనిని చతుర్ధాతుకంగా చూచే సోమే శ్వరాదులు 11పదాల వరకు ఉద్గ్రాహంతో పాడాలని 12వ పదం 'మేలాపకం' అనే వేరే ధాతువని అన్నారు. పెట్టెల క్రింద చూపబడిన దశ ప్రాణాలకూ లక్షణాలు చెప్పబ డినై. గాన క్రమంలో వీటిని పాటించాలి. తొలి రెండు చరణాల్లో పల్లవమనే చివరి పదత్రయంలో తొలి రెండింటిని విలంబితమానంలోను మూడోదాన్ని ద్రుతమానంలోను పాడాలి. అలాగే నాల్గోపాదంలోని మూడుపదాల్లో తొలి రెండింటిని మధ్యమానంలోను మూడోదాన్ని విలంబిత మానంలోను పాడాలి. ఇది ఏలా సామాన్యలక్షణం. ఈ ఏలాపదం గణైల, మాత్రైల, వర్ణైల, దేశైల అని నాల్గు రకాలు. అందులో గణైల మనకు పరిచి తంగా ఉండే మూడక్షరాలు గణాలతో ఏర్పడేదే. 5 భగణాలమీద ఒక నగణంతో కూర్చేది నాదావతి. 5 రగణాల మీద ఒక నగణంతో కూర్చేది హంసావతి. 5తగణాల మీద ఒక జగణంతో కూర్చేది నందావతి. 5మగణాల మీద ఒక యగణంతో కూర్చేది భద్రావతి. వీటి భగణ రగణాదులను వికృతులుగా చేయటం వల్ల 93 భేదాలు, ప్రకారాంతరవికృతులు 15, మొత్తం ఇది 112 విధాలు ఔతుంది.

మాత్రైల అనేది వెనుక చెప్పిన రతి, కామ, బాణ, మిశ్రగణాలతో క్రమంగా 4రకాలు. రతిగణాలతో 11-11-10 లఘువులుండేది రతి లేఖ, కామగణాలతో 22-22-20 లఘు వులుండేది కామలేఖ. బాణగణాలతో 33-33-30 లఘువులుండేది బాణలేఖ. మిశ్ర గణాలతో 44-44-40 లఘువులుండేది చంద్రలేఖ. (లఘు సంఖ్యలు ఒక్కొక్క పాదానికి చెప్పబడినై. మూడు సంఖ్యలు వరుసగా మూడు పాదాలకు అని గ్రహించాలి.) నందిమ తాన్ననుసరించి 5ఛగణాలు+1 తగణంతో ఇందుమతి; 5 పగణాలు+1చగణం జ్యోతిష్మతి; 1ఛగణం+3చగణాలు +1పగణం +1ఛగణం-నభస్వతి; 1దగణ+1పగణ+4చగణాలు+ 3పగ ణాలు+1ఛగణం+1తగణం-వసుమతి- ఇట్లివి 4రకాలు. అర్జునమతాన్ననుసరించి వెనుక చెప్పిన నాదావత్యాదులే స్వగణ భంగములచేత మాత్రైల లై 4రకాలౌతాయి. ధనంజయ మతాన్ననుసరించి పైరతి లేఖాదుల గణనియమం విడిచి మాత్రా సంఖ్య పాటిస్తే అది 4రకాలౌతుంది. వీటిలో విశేషాలు మరో 4రకాలు. ఇట్లిది మొత్తం 20రకాలు.

of the first two lines constitute the pallava The fourth line should have a syllabic unit or pada mentioning the name of the hero or leader The only pada or syllabic unit in the fifth line should contain the mudra(impress) of the composer (vāggēyakāra) It is enjoined that ēlā should be sung in one of the four tālas called mantha, dvitīya, kaṅkāla and pratitāla Singing should be started with visamagraha i e either atīta graha or anāgata graha but not sama graha Kallināthа's teaching is that having sung these 16 syllabic units for the second time nyāsa should be made at the first unit of the 4th line, called 'dhruva' Singabhūpāla's teaching is that having sung the 5th line called 'ābhōga', dhruva, the 4th line, is sung again and left off Showing the serially numbered syllabic units or padas in boxes, their prāna below and the presiding deity above, dhātu on the left side and other details on the right side the format of ēlā can be represented as in the format given.

As per the format shown ēlā prabandha becomes tridhātuka with (1)udgrāha (2) dhruva and (3) ābhōga Sōmēśwara and others who considered it caturdhātuka said udgrāha shall be the dhātu for the first 11 syllabic units and the 12th unit should be sung with 'mēlāpaka' - different dhātu. There are definitions for the ten prānas indicated below the boxes They have to be followed while singing In the Pallava of the first two lines, the first two units (3 and 4) should be sung in vilambitamāna and the last in drutamāna Similarly the first two units of the 4th line (dhruva) should be sung in madhyamāna and the third unit in vilambitamāna These are the regulations of ēlā in general

Ēlāpadam is of four kinds namely (1) ganaila (2) mātraila (3) varnaila and (4) dēśaila Among these ganaila takes its shape with the three-lettered gana-s familiar to us. Five 'bha' gaṇas plus one 'na'-gana per line makes for nādāvati,, five 'ra' ganas plus one 'sa' gana makes for hamsāvati, five 'ta'-ganas plus one 'ja'-gana makes for nandāvati, five 'ma' -ganas plus one 'ya'-gana makes for bhadrāvati. By modifiying these 'bha','ra','ta', and 'ma' ganas 93 varieties are obtained. Other types of modifications yield another 15 varieties. Thus ganaila has 4+93+15=112 varieties

Mātraila also is of four kinds with (1) rati gaṇas (2) kāma gaṇas (3) bāṇa gaṇas and (4) miśra gaṇas respectively. These gaṇas have already been explained Thus if three lines are composed respectively with 11,11 and 10 laghus consisting of ratiganas, it is rati-lēkha If three lines are composed respectively with 22,22 and 20 laghus with kāma-ganas it is kāmalēkha. If three lines are composed respectively with 33,33 and 30 laghus with bāṇa-ganas it is bānalēkha If three lines are composed respectively with 44,44 and 40 laghus with misra gaṇas it is candralēkha

# ĒLĀ PRABANḌHA



గణాల నియమంకాని మాత్రల నియమంకాని కాకుండ వర్ణ సంఖ్యా నియమం మాత్రం ఉండేది వర్ణైల. ఇందులో అంఘ్రిఖండద్వయం 6,7,8 అక్షరాలతో కూడి ఉంటుంది. (6+6, 7+7, 8+8), 29 అక్షరాల వరకు పోవచ్చును. కాగా ఇది 24 రకాలౌతుంది. ఇంక దేశైల. ఏ దేశభాషలో కూర్చబడుతుందో ఆ భాష పేరును బట్టి ఇది (1) కర్ణాటైల (2) లాటైల (3) గౌడైల (4) ఆంధ్రైల (5) ద్రావిడైల అని 5రకాలు.

కర్ణాటైల : దేశైలల్లో ముఖ్యమైంది. సంగీత రత్నాకరం దీన్ని ఒక్కదాన్నే 12 శ్లోకాల్లో చెప్పి మిగిలిన నాల్గింటిని 4 శ్లోకాల్లో చెప్పింది. కర్ణాటైలలో ప్రతిపాదంలోను ఆది మధ్యాంతాల్లో అనుప్రాస ఉంటుంది. మంఠ, ద్వితీయ, కంకాల, ప్రతితాలాల్లో ఏదో ఒక తాళంలో ఉండటం దేశైలకు సామాన్య నియమం. ఇక్కడా అంతే. కర్ణాటైల అరు విధాలు. ఇందులో కామగణాల ఉపయోగం ఎక్కువ. కామగణాలనేవి మనకు పరిచితమైన త్ర్యక్షరగణాలే. గణైల దగ్గర చెప్పిన నాదవత్యాదులు త్ర్యక్షరగణాలతో ఏర్పడినవే. ఇవీ ఒక రకమైన కర్ణాటైల అనబడినవి. ఈ నాదవత్యాదులకు గణాదినియమం అంఘ్రిఖండద్వయమాత్ర పరిమితం. తర్వాత స్వేచ్ఛగా కూర్చవచ్చు. వాని రాగతాళాలు నియతాలు.

(a) 1. నాదావతి: 5భగణాలు+1నగణం. టక్కరాగం. మంఠతాళం.
2. హంసావతి: 5రగణాలు+1నగణం. హిందోలరాగం. ద్వితీయతాళం
3. నందావతి: 5తగణాలు+1జగణం. మాలవకైశికరాగం. ప్రతితాళం
4. భద్రావతి: 5మగణాలు+1యగణం. కకుభరాగం. కంకాల తాళం.
(మాత్రల లెక్కగా చూస్తే ఇవి క్రమంగా పాదానికి 23, 29, 29, 35 వచ్చే రచనలు- అర్జునమతానుసారంగా ఇవే సరిగా మాత్రైలలు ఔతాయి)

According to Nandi school 5 'cha'-gaṇas plus a 'ta' -gana per line makes for Indumati; 5 'pa'-ganas plus a 'ca'-gana per line makes for Jyōtismati; one 'cha'-gana plus 3 'ca' ganas plus 'pa' gana plus 'cha' gaṇa makes for Nabhasvati, one 'da' gana plus 'pa' gana plus 4 'ca'-ganas plus 3 'pa' ganas plus 'cha' -gana plus 'ta' -gana makes for Vasumati Thus these are of 4 kinds.

According to Arjunamata the afore-said Nādāvati and others become 4 kinds by breaking up those gaṇas into mātras.

According to Dhananjaya school if the number of mātras are observed instead of ganas in rati-lēkha etc. spoken above they become four kinds. There are another 4 kinds here Thus Mātraila is of 20 kinds

If merely the regulation of the number of letters (varna-s) as against the regulation of gaṇas or mātras-is observed, it is called varnaila The bifurcated parts of the first syllabic unit in each of the first three lines may have 6,7,8, upto 29 letters. Thus it is of 24 (29-6=23+1) kinds with these lower and upper limits of 6-29 letters

Now, 'dēśaila' Named after the regional language in which the 'ēlā' is composed, it is of 5 kinds namely (1) Karnātaila (2)Lātaila (3) Gaudaila (4) Āndhraila and (5) Drāvidaila.

Karṇātaila· This is the most important of the Dēśaila varieties. S R. devotes 12 ślōkas to this variety and covers the rest in only 4 ślōkas Karnātaila has every one of its three lines embellished by alliteration at the beginning, at the middle and at the end It is sung in one of the tāla-s maṇtha/dvitīya/kaṅkāla/pratitā-la as is the general rule for ēla-s Mostly kāma ganas are used in this and we know they are only the three-lettered ganas familiar to us Nādāvati and others spoken of under gañaila take their form with these three-lettered ganas So these are treated as one kind of Karṇāṭaila Under this category the regulation of gañas is limited to the bifurcated parts of the first unit of the respective lines. Thereafter the composer has full freedom But the rāga and tāla are fixed The followingt are the deatils

a 1.Nādāvati 5 'bha' ganas +1'na' gana- takkārāga, mantha tāla

2.Hamsāvati 5 'ra' ganas +1 'sa' gana - Hindōlarāga, dvitīya tāla

3 Nandāvati 5 'ta' ganas +1 'ja' gana-Mālavakaisikarāga, pratitāla

4 Bhadravati: 5 'ma' ganas+ 'ya' gana- Kakubharāga Kankālatāla
(In terms of mātras these are respectively 23,29,29 and 35. These are exactly the mātrailas according to Arjunamata)

(b) సులేఖ: తొలి రెండుపాదాలకు 2 కామగణాలు+1 రతిగణం; పాదాద్యనుప్రాసం. మూడో పాదానికి 4కామగణాలు+1రతి గణం; ఆది మధ్యానుప్రాసం (ఇదే రతి లేఖ కూడా) మిగిలినది నాదావతికి వలె నియమం ( రాగతాళములు వగైరా).

(c) కామలేఖ: తొలి రెండు పాదాలకు 4 కామగణాల చొప్పున ఉంటాయి. ఆది మధ్యానుప్రాసం. మూడోపాదానికి 8 కామగణాలు. ఆదిమధ్యాంతానుప్రాసం. వెనుకటి హంసావతికి చెప్పిన రాగతాళాలు.

(d) స్వరలేఖ: ప్రతి పాదానికి 4 కామగణాల చొప్పున మూడు పాదాలకు నియమం. ఆది మధ్యల్లో అనుప్రాసం. నందావతికి వలె రాగతాళాలు.

(e) భద్రలేఖ: తొలి రెండు పాదాలకు 6కామగణాలు+1 బాణగణం చొప్పున. మూడో పాదంలో 8 కామగణాలు. మూడు పాదాల్లోను ఆది మధ్యాంతాల్లో అనుప్రాస. రాగతాళాలు భద్రావతికి వలె.

(f) ఛందస్వతి: మూడుపాదాల్లోను పాదానికి 5 కామగణాలు+ 1రతిగణం+1 కామగణం ఉండాలి. అప్పుడు సులేఖాది భేదాలే ఛందస్వంతము అనబడతాయి (ఒక కామగణం ఎక్కువ చెయ్యాలి). రెండు పాదాల చివరనో మూడు పాదాల చివరనో మూడో పాదం పరిమాణంగల పదం కూర్చితే అది 'శిఖాపదం' అనిపించుకుంటుది. (ఈ ప్రసక్తి మరల 40, 41 పద్యాల వద్ద వస్తుంది).

<u>లాటగౌడాంధ్ర ద్రావిడైలలు:</u> లాటైలలో పాదాంతానుప్రాసం ఉంటుంది. రసము లనేకాలు. గౌడైలలో గమకానుప్రాసలుండవు; ఒక్కటే రసం ఉంటుంది. ఆంధ్రైలలో పలు విధాలైన గమక విశేషాలు, రాగాంశాలు, రసాలు, భావాలు ఉంటాయి. ద్రావిడైలలో అనుప్రాస ఉండదు కాని రసాలు భావాలు బహులాలు. ఈ చెప్పిన ఏలలకు మిగిలిన లక్షణాలు కర్ణాటైలతో సమానమే కాని ఛందస్వంతాల్లో మాత్రం నాల్గో పాదం ఒకటి ఎక్కువగా కూర్చబడుతుంది.

రెండు పాదాల్లో అనుప్రాస లేకుండా మూడో పాదంలో అనుప్రాస ఉండి, ధ్రువాభోగాలు అనుప్రాసలో కూడి, పాద పాదానికి ప్రత్యేకంగా పదచ్ఛేద రూపమైన నాల్గేసి యతులుండి వర్ణైలలో లాగ రాగ-రస-రీతి-వృత్తి దేవతాది నియమం ఉండక తక్కిన విషయాల్లో ఆ లక్షణం ఉండేది 'వస్త్వైల' అవుతుంది.

b Sulēkha The first two lines have 2 kāmaganas plus one ratigana each with alliteration at the beginning The third line has 4 kāmaganas plus 1 ratigana with alliteration in the beginning and the middle. This is called ratilēkha too Rāga and tāla are fixed as for nādāvati.

c Kāmalēkha The first two lines have 4 kāmaganas each with alliteration at the beginning and the middle The third line has 8 kāmaganas with alliteration at the beginning, the middle and the end Rāga and tāla are as for Hamsāvati

d Svaralēkha All the three lines have 4 kāma gaṇas each with alliteration at the beginning and the middle Rāga and tāla are as for Nandāvati

e.Bhadralēkha. The first two lines have 6 kāma ganas plus one bāna gana each. The third line has 8 kāmaganas.All the three lines have alliteration at the beginning, at the middle and at the end Rāga and tāla are as for Bhadrāvati

f Chandasvati If all the three lines have 5 kāmaganas plus 1 ratigaṇa, plus 1 kāma gana each, the Sulēkha becomes Chandasvati.Similarly an extra kāmagana in each line makes the other varieties also chandasvanta-s If a unit equal to the third line is added either at the end of the first two lines or three lines, then this extra unit is called 'sikhāpadam' (This concept occurs again under the verses 40 and 41)

Lāṭa, Gauḍa, Āndhra and Drāviḍa ēlās Lāṭaila has alliteration at the end of the line It has many rasa-s, Gauḍaila is devoid of gamaka and anuprāsa It has only one rasa. Āndhraila has various types of gamakas, rāgāṁśa-s, rasas and bhāvas Drāviḍaila does not have alliteration but possesses many rasas and bhāvas. Other regulations are common to these along with Karṇāṭaila But in chandasvantas a fourth line is composed in excess.

If there are four yatis in the form of padaccheda in each line and with alliteration in the third, fourth and fifth lines (the latter two covering dhruva and ābhōga) unregulated in respect of rāga, rasa, rīti, vṛtti, dēvata etc but following varṇaila in other respects, it is called 'vastvaila' (Vastvaila has regulation of rāga, rasa, riti, etc.)

ఏలా ప్రబంధాలు బహు విధాలుగా ఉంటూ వచ్చినై. సంగీత రత్నాకరం నాటికి వీటిలో ముఖ్యమైన వాటిని సంగ్రహించడం ఏలా సామాన్య లక్షణం ఏర్పరచడం జరిగిందని తలప వచ్చు. సంగీత రత్నాకరానికి పూర్వపుదైన 'సంగీత సుధాకరం'లో ఏల బహువిధమంటూ గద్యైల అయిన నాదావతి మాత్రమే చెప్పబడింది. దీనికి తర్వాతది అనదగిన 'సంగీత సమయసారం'లో నాదావతి అన్న పేరును కూడా చెప్పకుండా గద్యైల చెప్పబడింది. ఈ రెండింటిని అనుసరించి ఏలలో పాదానికి ఆరు గణాలచొప్పున ఉంటాయి. ప్రాస సమన్వి తమైన పాదత్రయం ఉద్గ్రాహధాతువు. ప్రతి పాదాంతంలో గమక ప్రయోగం. అటుపై పల్లవి. పల్లవికి గణమాత్రల నియమం లేదు. నాల్గోపాదంతో మేలాపక ధాతువు రావాలి. అటుపై నేతృ నామాంకితమై అనుప్రాసతో కూడిన ధ్రువ ఉంటుంది. అటుపై వాగ్గేయ కార ముద్రతో కూడిన చరణం అభోగధాతువుగా ఉంటుంది. ఆభోగాన్ని పాడిన పిమ్మట ధ్రువను పాడి న్యాసం చెయ్యాలి అనేది గానక్రమం- (సంగీత సుధాకరం గీత ప్రకరణం, సంగీత సమయసారం 4అధి- 130, 131,132, 133, 134 శ్లో). ఈ గ్రంథాలు ఏలను (1) చతుర్ధాతుకంగా దర్శించడం (2) పాదాంతంలో గమక ప్రయోగం చెప్పడం (3) పల్లవానికి గణ, వర్ణనియమంలేదనటం గమనింపదగిన అంశాలు. సంగీత రత్నాకరం నాటికి ఏలా ప్రబంధం త్రిధాతుకమనే భావం బలకొని వెనుకటి ఆరేసి గణాల రెండు పాదాలే (12 గణాలు) ఖండత్రయంలోని 5+5+2 పదాలుగా వ్యవస్థీకరించడం జరిగింది. ఈపద్ధతిని అనుసరించే కాబోలు అరుణ గిరినాథుడు తన తమిళ 'తిరుప్పుగళ్' కావ్యంలో 12గణాల (సీర్‌కళ్) తర్వాత 'తొంగల్' **(pendent)** అనబడే తూగు పదమొకటి కల 'విరుత్తాలు' వ్రాశాడు. ఇతర 'విరుత్తాల'లోనూ ఇలాంటి తూగుపదాల్ని కూర్చాడు. బహుశః ఇదే శిఖాపదం అనబడి ఉండొచ్చు. ఇప్పటికి ఈ పరిచయం చాలు.

Ēlā-s have been of many kinds We may think these have been collected together and general norms for ēlā establisned by the time of S.R. S.S., a work antenor to S.R says ēlā is of many kinds and gives only 'gaṇaila' - nādāvatı vanety. S.S.S. posterior to S S but aterıror to S.R. gives only a gaṇaila without even mentioning the name of the variety. According to these two earlier works each line of an ēlā has 6 gaṇas. The first three lines have udgrāha. There is gamaka at the end of each line. Then comes the pallavı. Pallavı has no regulation of ganas or mātras The fourth line should have 'mēlapaka'. Then comes the 'dhruva' with the hero's name, followed by the last line with vaggēyakāra mudra and ābhōga dhātu. The procedure of singing is that after singing ābhōga, dhruva should be sung and nyāsa made (S.S gita prakarana; S.S.S -4 adh-130,131,132,133,134,ślōkas) We may note that these works view ēlā as (1) caturdhātuka (2) with gamaka at the end of each line (3) without regulation of gaṇa or varṇa in pallava. By the time S.R. came the view that ēla is tridhātuka seems to have strengthened and the two lines with 6 gaṇas each (2 x6 =12) have been rearranged as khandatraya with 5,5 and 2 ganas respectively. Following this arrangement, perhaps, Arunagirinātha in his Tamil work 'Tiruppugazh' composed 'Viruttams' with a pendent called 'tōngal' after every 13 gaṇas or seers In other' viruttams 'also he has introduced this balancing unit Perhaps this must have come to be called a sikhapādam. This introduction is enough for the present.

వ.॥ అట్టి పదం బెన్ని విధంబులం బెలువొందు ననిన

కం.॥ బంధుర వృత్త పదంబు, ని
బంధ పదము, చూర్ణపదము భరతాగమసం
బంధంబునఁ బద విజ్ఞా
నాంధులకును దాళ్లపాక యన్నయ దెలిపెన్॥ 29

తా॥ సంగీత శాస్త్ర గ్రంథాల్లో 'దేశైల' అనబడ్డ పదమనేది ఎన్ని విధాలుగా ఉంటుందంటే వృత్తపదం, నిబంధపదం, చూర్ణపదం అనే పేర్లతో నాట్యశాస్త్రాన్ననుసరించి మువ్విధంగా ఉంటుందని పద విజ్ఞానం ఏమీ తెలియనివాళ్లకోసం తాళ్లపాక అన్నయ చెప్పారు.

వ్యా॥ వెనుక 24పద్యం వద్ద సుబంతం, తిఙంతం పదమని చెప్పబడ్డది. అంటే నామ విభక్తి కాని క్రియావిభక్తికాని ఏదైనాసరే విభక్తి అయితే చాలు, అదిచివర ఉండేది 'పదం.' విభక్తిచేరనిది 'శబ్దం,' ఉదారహణకు 'రామ' అనే ప్రాతిపదికకు సంస్కృత నామవిభక్తి చేరనప్పుడు 'రామశబ్దం' అంటారు. నామవిభక్తిచేరాక 'రామః' అని ఉన్నప్పుడు అది పదమన్పించుకుంటుంది. విభక్త్యంతం పదమని అభిప్రాయం.

ఈ పదాలు రెండు రకాలు. నిబద్ధం. చూర్ణం. నిబద్ధమంటే ఛందోబద్ధం. చూర్ణమనేది గురు లఘు నివేశ నియమం కాని, అక్షరసంఖ్యానియమం కాని లేకుండా వృత్తబద్ధం కాకుండా రసాభివ్యక్తి కోసమైన అక్షరాల కూర్పు ఉండేది.

ఛందోబద్ధమైన అక్షరాల కూర్పు, యతి, అక్షర సంఖ్యా నియమం ఉండేది 'నిబద్ధ పదం'. అనేకార్థాలను స్ఫురింపచేసే అక్షరాల కూర్పుతో అలంకరింపబడ్డ నాల్గు పాదాలతో కూడిన ఛందస్సు 'వృత్తం' అనిపించుకుంటుంది. ఈ ఛందస్సనేది అక్షరసంఖ్యాభేదం చేత 26 విధాలుగా ఛందశ్శాస్త్రంలో చెప్పబడింది. 26 అక్షరాలకు మించి ఉంటే అలాంటి కూర్పులను 'మాలావృత్తాలు' అంటారు. దండక వృత్తం సంస్కృతంలో రెండు నగణాల మీద రగణాలో, యగణాలో, తగణాలో కూర్చుతూ పాదానికి 27 అక్షరాలు మొదలు 999 అక్షరాలు దాకా ఉండేటట్లు కూర్చదగింది.

1. 'బంధుర వృత్త పదంబు' అనేచోట 'బంధురవృత్త'మని భ్రాంతిపడరాదు. (సంస్కృత ఛందంలోను దాన్ని అనుసరించే తెనుగుకన్నడాల్లోను 'బంధురమనే పేరుతో ఒక వృత్తం ఉంది. ఇది 25 ఛందానికి చెందింది. అంటే పాదానికి 25అక్షరాలు ఉంటాయన్నమాట. వరుసగా నాలుగు నగణాలమీద ఒకసగణం ఆపైని మూడు భగణాలు అటుపిమ్మట ఒక్కగురువు ఉంటాయి. (4న+1స+3భ+ 1గ)'; 16 అక్షరం మీద యతి ఉంటుంది) దట్టంగా నాల్గు పాదాల్తో వృత్తంగా కూర్చబడిన పదం అని మాత్రమే అర్థం చేసుకోవాలి.
2. పద రచనలో నిబద్ధం అన్నపుడు అక్షర సంఖ్యా నియమం, ఛందస్సు, యతి అనేవాటి తోపాటు తాలం, పాత అనేవి కూడా ఉంటాయి. తాళం వేస్తూ చప్పడయ్యేటట్లుగా ఒక చేత్తో మరో చేతి మీదకాని రెండు చేతుల్తో సమానంగా కాని దెబ్బ కొట్టడం లేదా చిటిక వేయుటం 'పాత'. 'పాత' అంటే దెబ్బ పడటం. ఇది సశబ్దక్రియ. నియతాక్షర సంఖ్య లేక, పాదనియమం లేక, యతి నియమం లేక కూర్చబడింది అనిబద్ధం. ఇది తాలనియమం లేకుండా వాద్యాల్లో ప్రయోగింపబడుతుంది!

Verse 29

Tr Tāllapāka Annaya made it known for the enlightenment of those who are blind to the knowledge (vijñāna) of padam that the divers kinds of such a padam, (as has been called 'dēśaila' in the treatises of music) as related to Nātya sāstra are the closely knit vṛttapadam, the nibandhapadam and the cūrnapadam

Com It has been stated under verse no.24 that a subanta or tiṅanta is a padam. That means a stem with a nominal case ending or verbal particle indicating person, number and tense as a suffix is a padam That which does not possesss this 'vibhakti' as suffix is a śabda; for instance, the base or stem 'rāma' without the suffix of its vibhaki is called 'rāma śabda' After a nominal case ending is added on and it becomes' Rāmaḥ', it is called a padam. The point is that which ends with a vibhakti is padam

Here musical compositions are called padams These padams are two kinds· nibaddha (framed) and cūrṇa (free lit. granules). That which is prosodically framed in or bound is nibaddha. That which has no regulation of guru and laghu, no regulation in respect of number of letters and not bound in a stanza but composed of letters expressive of a certain sentiment is cūrna

Composition of letters in a prosodical frame with yati and regulation of numbe of letters, makes for 'nibaddhapadam' If it is a stanza of four lines compos d of expressive letters it is called a vṛtta Prosody or chandas is described in chandas śāstra as 26 kinds based on the difference of number of letters in each line If the number of letters per line execeds 26, such compositions are called mālā vṛtta-s Danḍaka vṛtta in sanskṛt can have anywhere between 27-999 letters per line, starting with 2 'na'-ganas and 'ra'-gaṇas or 'ya'-ganas or 'ta'-ganas.

1.The verse starts with the words 'bandhura vṛtta padaṃbu' Here one should not mistakenly comprehend 'bandhura vṛtta' (In sanskṛt prosody and as followers of the same, in Telugu and Kannada, there is a vṛtta called 'bandhura' This pertains to the 25th chandam which means that it has 25 letters per line Four 'na' -gaṇas serially plus one 'sa'-gaṇa plus three 'bha'gaṇas serially plus one guru make for a line The yati is on the 16th letter ) We have to understand it only to mean a close-knit composition of a stanza in four lines.

2.In pada-compostion nibaddha type includes not merely the regulation in respect of the number of letters, prosody and yati but the tāla and pāta also Tāla is a familar concept, though not its intricacies The saśabda kriya in tāla-namely the noisy stroke with one hand on the other or with both the hands or by snapping of fingers-is pāta. Literally pāta means falling or fall A composition without fixation of the number of letters or yati is anibaddha This one without a tala is used only in vādyas

వ.॥ అందు వృత్తపదం బెట్టిదనిన

కం.॥ అందములై షడ్వింశ
ఛ్ఛందోగణయుక్త వృత్తజాతుల పదముల్
కుందనమునకుం బరిమళ
మందిన క్రియ వృత్తపదములలరుచు నుండున్ 30

తా॥ వృత్తపదం, నిబంధ పదం, చూర్ణపదం అనే మూడింటిలో వృత్తపదమనేది ఎలాంటిదో చెప్తాను. వృత్తపదాలనేవి ఇరవై యారుఛందాల్లోను అక్షర గణాలతో ఏర్పడే వృత్త పదాలుగాను మాత్రా గణాలతో ఏర్పడే జాతులుగాను బంగారానికితావి అబ్బినట్లుగా అందంగా వికాసం కలిగి ఉంటాయి. (పద్యాలైనవి పాటలు కావటం బంగారానికి తావి అబ్బటం లాంటిది).

వ్యా॥ పాటకు, పద్యానికి ఉండే లక్షణమే ఛందస్సు. 'చది ఆహ్లాదే' అనే ధాత్వర్థాన్ననుసరించి ఆహ్లాద పరిచేది ఛందస్సు అని వ్యుత్పత్తి చెప్పడం ఒక పద్ధతి. 'ఛదిసంవరణే' అనే ధాత్వర్థాన్ననుసరించి చెప్పదల్చుకొన్న విషయాన్ని (అక్షర సంఖ్యా నియమం ఉండే) పద్యపాదాలతో కప్పి ముస్తాబు చేసి నివేదించడం ఛందస్సు అని వ్యుత్పత్తి చెప్పడం రెండో పద్ధతి. ఎలా చెప్పినా ఆహ్లాదమే పరమార్థం. సంగీతపరమైన ఈ గ్రంథంలో కవి 'అందములై' 'అలరుచునుండన్' అనే పదాలతో సౌందర్యాన్ని పుష్ప వికాస సంతోషాలనూ స్మరింపజేస్తూ ఆహ్లాదాన్నే వ్యంజిస్తున్నారు.

సంస్కృతంలో ఋగ్వేద మంత్రాలు వృత్త బద్ధాలు, యజుర్వేదం గద్యాత్మకం. చాలా వరకు ఋగ్వేదమంత్రాలే గాన ప్రధానాలై సామవేదం అయింది. వేదపురుషునికి ఛందస్సుపాదాలని (ఛందః పాదేతు వేదస్య) చెప్పబడింది. అందుచేత ఛందస్సు వేదాంగాల్లో ఒకటి అయింది. సంస్కృతంలో వైదికచ్ఛందస్సు వేరుగా లౌకికచ్ఛందస్సు వేరుగా ఉంది. లౌకికచ్ఛందస్సులో పింగళాచార్యుని ఛందోగ్రంథం ప్రాచీనతమం. బాగా ప్రచారానికి వచ్చిన తర్వాతి గ్రంథం కేదారభట్టు వృత్తరత్నాకరం. తెనుగు కన్నడ భాషలు ఛందో విషయంలో ఈ గ్రంథాన్నే ఎక్కువగా అనుసరించాయని చెప్పవచ్చు.

తెనుగు ఛందస్సులో యతి ప్రాసలు విశేషమైన అంశం. తమిళంలో 'మోనై' 'యదుగై' అనే పేర్లతో క్రమంగా 'యతి' 'ప్రాస' ఉన్నాయి. యతి అక్షర సాజాత్య రూపం. ప్రాసము హల్ మాత్రావృత్తి. తమిళం నుండే వీటిని తెనుగు గ్రహించి ఉండాలి. కన్నడంలో అక్షర సాజాత్య రూపమైన యతి లేదు. సంస్కృతంలోలాగ పదవిచ్ఛేద రూపమైన యతి మాత్రమే ఉంది. హలావృత్తిగల ప్రాస ఉంది.

verse 30

Tr (Among the vrtta padam, nibandha padam and cūrna padam mentioned earlier ) vṛttapadam is being explained Vṛttapadams are those that blossom forth beautifully as though gold has acquired fragrance, from the twenty six kinds of metres in the form of vrttāpadams with aksaragaṇas and jātis with mātrā-ganas

Com The regulatory principle of a song or a verse is its prosody called chandas From the root 'cadi āhlādanē', one etymology of the word 'chandas' is 'that which exhilerates' From the root 'chadi saṁvaraṇē', another etymology of the word is 'that which dresses up the thought like apparel' Exhileration is the essence in both the cases Musically oriented as this work is the author suggests only exhileration by speaking of beauty, blossoming etc through his words' 'andamulai alarucunundu' (Tel andamu-beauty, alaru-a flower, happiness, (vb) blossoming)

In sanskṛt the mantras of Rgvēda are vrttabaddha (framed in metrical form) Yajurvēda is in prose form, mostly the Rgvēda mantras form the corpus of Sāma vēda attuned for singing Chandas is called the feet of Vēdapuruṣa (chandaḥ pādētu Vēdasya) So it has become one of the vēdāngas, a subsidiary subject for the study of Vēda In Sānskrt the chandas of the Vēdas and that of the secular literature are different In laukika chandas, the work of Pingala is the most ancient The next work that has become very popular is V R of Kēdārabhatta One can say that Telugu and Kannada have followed this work to a large extent in regard to metrics

In Telugu prosody the yati and the prāsam are the distinguishing features These are present in Tamil under the name of 'monai' and '[illegible]dugai' respectively yati is caesura in the form of akṣarasājātya (assonance), prāsam is repetition of the consonant in the form of second letter in each line These should have come to Telugu from Tamil only Kannaḍa observes padavicchēda as yati like Sanskrt and there is no aksarasājātyarūpa yati, but it observes prāsam like Tamil and Telugu

సంస్కృతచ్ఛందస్సులోను దాన్ని అనుసరించే తెనుగు కన్నడాది భాషల్లోను గురు లఘు స్వరూపం మొదటి అంశం. హ్రస్వాక్షరాలు లఘువులు. దీర్ఘాక్షరాలు, సంయుక్తాక్షరాలకు, బిందువునకు, విసర్గకు ముందున్న అక్షరాలు, పొల్లులతో కూడిన అక్షరాలు గురువులు. తెప్పపాటు కాలానికి మాత్ర అని సంజ్ఞ. (నిమేషోన్మేషాభ్యా మన్యతరేణ తులితః కాలః మాత్రా). ఒక మాత్ర కాలంలో ఉచ్చరింపబడే అక్షరం లఘువు. అంతకంటె ఎక్కువకాలంలో ఉచ్చరింపబడేది గురువు. గురువును రెండు మాత్రలకాలమని సామాన్యంగా చెప్పినా హ్రస్వము పొల్లుతో కూడినపుడు (వనిత(స్)ఒకటిన్నర మాత్రలు; దీర్ఘాక్షరమైనప్పుడు రెండు మాత్రలు, ప్లుతోచ్చారణంలో మూడు మాత్రలు అవుతుంది. తమిళంలో పద్ధతి వేరు. అక్కడ అంశం 'అశై', గణం 'శీర్' అనబడుతాయి. నేరశై,నిరైయశై అనే పేర్లతో అక్కడ 'శీర్ల' కూర్పు. ఒక హ్రస్వం కాని దీర్ఘం కాని తానుగాగాని ఒక వ్యంజనం (పొల్లు అక్షరం)తో చేరిగాని 'నేరశై' అవుతుంది. ఒక్క హ్రస్వం గణంలో ఆద్యంశంగా మాత్రం రాదు. 'నిరైయశై' అనేది రెండు హ్రస్వాలు కాని, లేదా ఒక హ్రస్వం ఒక దీర్ఘం కాని, తాముగాని పొల్లుతో కూడిగాని వస్తుంది. ఈ నేర్, నిరైలు రెండు మూడు నాలుగు అవుతూ 'శీర్లన బడే గణాలవుతాయి.

సంస్కృతంలో లాగే తెనుగు కన్నడాల్లోనూ గురు లఘువులతో కూడి త్రికాలనబడే మూడక్షరాల అక్షరగణాలు, మాత్రల లెక్కతో ఏర్పడే మాత్రాగణాలు ఉన్నాయి. అక్షర గణాలతో ఏర్పడే నాల్గు పాదాల ఛందస్సు కలవానికి 'వృత్తాలు' అని పేరు. మాత్రాగణాలతో ఏర్పడే వానికి 'జాతులు 'అని పేరు. (సంస్కృత ఛందస్సులోనూ, వర్ణచ్ఛందం, మాత్రాచ్ఛందం ఉన్నాయి. 'మాత్రావర్ణ విభేదేన ఛందస్తదిహ కథ్యతే' అని వృత్తరత్నాకరం) సంస్కృతంలో మాత్రా చ్ఛందస్సుతో ఏర్పడే ఆర్యాభేదాలు, గీతి భేదాలు 'జాతులు' అనబడుతాయి.

మూడు అక్షరాల చేరిన దాన్ని త్రికమంటారు. ఇలాంటి త్రికగణాలు మూడో ఛందాన్ని ప్రస్తరించటం వల్ల ఏర్పడతాయి. ప్రస్తారం చెయ్యటానికి తొలుత అన్నీ గురువులువ్రాసి, తరువాతి వరుసల్లో తొలి గురువు క్రింద లఘువు వ్రాసి, పూర్వస్థానాన గురువుంచి మిగత భాగాన్ని అలాగే ఉంచుతూ పోవాలి. అన్నీ లఘువులు వచ్చే వరకు ఇలాగే వ్రాయాలి. మూడక్షరాల 'మధ్య'మనే ఛందస్సుకు ప్రస్తారం, గణాలు చూపబడుతున్నాయి.

| | |
|---|---|
| U U U= మగణం | U U I = తగణం |
| I U U= యగణం | I U I = జగణం |
| U I U= రగణం | U I I = భగణం |
| I I U= సగణం | I I I = నగణం |

వీటికే అక్షరగణాలని, విసర్గగణాలని పేరు.

In prosody, in Sanskrt as well as Telugu and Kannada that follow it, the concept of guru and laghu is the first item. Short letters are laghus. Long letters, letters that come before conjunct consonants, bindu and visarga and those with a mere consonant succeeding them are gurus. The time taken for the batting of an eyelid is designated as mātra. (nimēṣōnmēsābhyām anyatarēna tulitah kālah:) A letter which can be uttered in a mātra is a laghu That which takes more than that is guru. Though a guru is generally equated with two mātras or laghus it can vary. a short letter followed by a mere consonant is only one and a half mātras; when it is a long letter it is two mātras, it will be three mātras when uttered as a pluta. The Tamil system is different. In Tamil a component is asai; a gaṇa or foot is' sīr'. A gaṇa is formed with 'nērasai' and 'niraiasai' A short letter or long letter either by themselves or with a consonant constitute a 'nērasai'; a short letter does not occur as the first item of a' sīr' Two short letters or one short and another long letter, either by themselves or with a consonant, constitute 'niraiasai' These 'asais'-'nēr' and 'nirai'-two or three or four join together and form the 'sīrs'.

Like in sanskrt there are both the three lettered aksaragaṇas called trikas as well as mātrāganas in Telugu and Kannaḍa. Those with four lines of akṣaragaṇas are called vrttas; those that are formed from mātrāganas are called jātis (sanskrt has varnachandas as well as mātrācchandas ,'matrā varna vibhēdēna chandas tad iha kathyatē-vrttaratnākara) In sanskṛt the different kinds of āryas and gītis that are composed in mātrāchandas are called 'jātis'.

A three lettered unit is called a trika Such trika-ganas are obtained from prastāra of the third chandas which means the chandas which has three constituents of guru-laghus. Prastāra process: write down all the constituents as gurus in the first row Write a laghu under the first guru and keep others as they are in the next row. Again write the laghu under the first guru, make the preceding laghu a guru and keep the other part as it is Continue the process until all the constituents occur as laghus. The third chandas is called 'madhyā' chandas Its prastāra and gaṇas are shown below :

Symbols: guru - U laghu: I

1. U U U - 'ma' gaṇa.
2 I U U - 'ya' gaṇa
3 U I U - 'ra' gaṇa
4. I I U - 'sa' gaṇa
5. U U I - 'ta' gana
6 I U I - 'ja' gana
7. U I I - 'bha' gaṇa
8. I I I - 'na' gaṇa

These are called 'aksaraganas' and 'nisargagaṇas'

ఇక ప్రథమచ్ఛందస్సులో పాదానికి ఒక అక్షరం. ఆ అక్షరం లఘువు కావచ్చు, గురువు కావచ్చు. కనుక 'ఉక్తము' అనబడే ప్రథమచ్ఛందంలో వృత్త సంఖ్య 2. 'అత్యుక్త'మనబడే రెండక్షరాల ద్వితీయచ్ఛందంలో గురుగురు, లఘుగురు, గురులఘు లఘు లఘు- అనే ప్రస్తార క్రమంతో నాల్గు వృత్తాలేర్పడతాయి. మూడక్షరాల 'మధ్యమ' ఛందంలో పైని 8భేదాలు వచ్చినవి కనుక వృత్త సంఖ్య ఎన్మిది. ఇలాగి క్రమంగా ఆయా ఛందాల్లో వృత్త సంఖ్య రెట్టింపుగా పెరుగుతూ పోతుంది. ఇరవై ఆరు ఛందాల్లో ఏర్పడే వృత్తాల మొత్తం సంఖ్య 13, 42, 17, 726.

ఇన్ని వృత్తాలు ఉన్నా ఛందః కర్తలు చెప్పినవి 500మించవు. వీనిలో గ్రంథాల్లో వాడబడేవి సుమారు 30. సంస్కృతచ్ఛందాల పేర్లివి:

1. ఉక్తము, 2. అత్యుక్తము 3. మధ్యము 4. ప్రతిష్ఠ 5. సుప్రతిష్ఠ 6. గాయత్రి 7. ఉష్ణిక్కు 8. అనుష్టుప్, 9. బృహతి 10. పంక్తి 11. త్రిష్టుప్ 12. జగతి 13. అతిజగతి 14. శక్వరి 15. అతిశక్వరి 16. అష్టి 17. అత్యష్టి 18. ధృతి 19. అతిధృతి 20. కృతి 21. ప్రకృతి 22. ఆకృతి 23. వికృతి 24. సంకృతి 25. అభికృతి 26. ఉత్కృతి.

నాట్య శ స్త్రంలోని వృత్తాధ్యాయం (15 అధ్యా.)లో 53 వృత్తాలు చూపబడినవి.

సంస్కృతంలో మాత్రాగణబద్ధాలైన కూర్పులు జాతులు. ఇవి కూడా పద్యాలే. నాల్గు పాదాలుంటాయి. సంస్కృతంలో ఆర్యాభేదాలు, గీతిభేదాలు ఈ కోవకు వస్తాయి. ఆర్య 4 మాత్రల గణాలతో కూర్చబడేది. భ-జ-స-నల-గగ అనే గణాలు నాల్గేసి మాత్రలు గలవి. తొలి సగంలో ఏడుగణాల మీద ఒక్క గురువుంటుంది. బేసి స్థానంలో జగణం ఉండరాదు. ఆరోగణం జగణమో నలమో ఉండాలి: ఇక్కడ తొలి లఘువు తర్వాత యతి. ఉత్తరార్థంలో ఆరోగణం ఒక్క లఘువు మాత్రం ఉంటుంది. మిగిలిన లక్షణం పూర్వార్ధంలాగే. ఈ లక్షణం కలది 'పథ్యార్య'. పథ్యార్యలోని ఒకటవపాదం రెండో పాదంలోకి, మూడో పాదం నాల్గోపాదంలోకి చొచ్చినట్లయితే అప్పుడది 'విపులార్య' అవుతుంది. పథ్యార్యలో 2, 4 పాదాల తొలిగణం జగణమైతే అప్పుడది 'చపలార్య' అనిపించుకుంటుంది. తొలి సగంలో 'చపలార్యా'లక్షణం, మలి సగంలో 'పథ్యార్యా' లక్షణం ఉంటే 'ముఖచపలార్య' అవుతుంది. తొలి సగంలో 'పథ్యార్యా' లక్షణం మలి సగంలో 'చపలార్యా'లక్షణం ఉంటే 'జఘన చపలార్య' అవుతుంది. ఇట్లు ఆర్య 5 రకాలు. ఆర్యలోని మాత్రా సంఖ్యను ఇలా చూపవచ్చు.

4+4+4
4+4+1 - 3+4+2
4+4+4
4+4+1 - +4+2

అడ్డగీత ఉన్నచోట పదచ్ఛేద రూపమైన యతి ఉండాలి.

In the first chandas, a line will have only one letter That letter may be a laghu or guru So in the first chandas called 'uktam' the number of vrttas possible is 2 In the second chandas called 'atyuktam' with two letters per line the number of possibilities according to prastāra are guru guru, laghu guru, guru laghu and laghu laghu-four. In the third chandas called 'madhyā' with three letters per line, we have seen above that the number of possibilities is eight and hence 8 vṛttas. Thus the number of vrittas goes on doubling in each of the next higher numbered chandas. The total number of vrttas possible in all the 26 kinds of chandas are 13,42,17,726 But writers on prosody have mentioned not more than 500. Among these only some 30 vṛttas are in use
The names of sànskrt 'chandāmsi' are as follows;

| | | |
|---|---|---|
| 1. uktam | 10. pankti | 19 atidhṛti |
| 2. atyuktam | 11. tristup | 20 krti |
| 3. madhyam | 12. jagati | 21 prakṛti |
| 4. pratisthā | 13. atijagati | 22 ākṛti |
| 5. supratiṣṭhā | 14. śakvari | 23 vikrti |
| 6. gāyatri | 15. atiśakvari | 24. sānskrti |
| 7. usṇik | 16. asti | 25 abhikrti |
| 8. anustup | 17 atyasti | 26. utkṛti |
| 9. brhati | 18. dhrti | |

The vrttādhyāya (15 ch) of N S. has shown 53 vṛttas

In Sanskrt, compositions in mātrāganas are called Jātis. These are also stanzas with four lines Varieties of ārya and gīti come under this head. Ārya is composed with ganas of 4 mātras each. The ganas bha-ja sa-nala-gaga have 4 mātras each The first half contains seven such gaṇas and a guru at the end Ja-gana should not be placed as an odd-numbered gana (1-3-5-7). The sixth gana should be either a 'ja-gana' or 'nala' Here in this sixth gana yati occurs after the first laghu In the second half the sixth gana is made up of only one laghu For the rest it is like the first half Such a composition is called pathyāryā. If the first and third lines of this verse continue into the second and foruth lines respectively without break then it is called vipulāryā. If the pathyāryā has a ja-gana as the first one of the second and fourth lines then it is called 'capalāryā' If the first half has capalāryā regulation and the second half pathyāryā, then it is called 'mukha-capalāryā' If it is pathyāryā in the first half and capalāryā in the second half, it is called 'jaghana-çapalāryā' Thus it is of five kinds. The units of mātra-gaṇas in ārya can be shown as below

| | |
|---|---|
| 4+4+4 | The place of yati (caesura) is |
| 4+4+1-3+4+2 | shown with a dash |
| 4+4+4 | |
| 4+4+1-+4+2 | |

| తెనుగు పేరు | కన్నడం పేరు | గణాలు | గణ సంఖ్య | తెనుగులో యతిస్థానం |
|---|---|---|---|---|
| 1. మహాక్కర | పిరియక్కరె | 1సూ+5ఇం.+1చం. | 7 | 4గణాలమీద |
| 2. మధ్యాక్కర | దొరయక్కరె | 2ఇం+1సూ+2ఇం.+1సూ. | 6 | 3గణాల మీద |
| 3. మధురాక్కర | నడువణక్కరె | 1సూ+3ఇం.+1చం. | 5 | 3గణాలమీద |
| 4. అంతరాక్కర | ఎడెయక్కరె | 1సూ+2ఇం.+1చం. | 4 | 3గణంచివరివర్ణం |
| 5. అల్పాక్కర | కిరియక్కరె | 2ఇం+1చం | 3 | 2గణాలమీద |

కన్నడంలో యతి ఉండదు. ప్రాసమాత్రం ఉంటుంది.

<u>ఉత్సాహం:</u> ప్రతిపాదంలోను సూర్యగణాలనబడే హగణ (UI) నగణం (III)లు ఏడింటి మీద 1గురువుండును. ఐదోగణం మొదటి అక్షరం యతి స్థానం. పాదపాదంలోను హగ ణనగణాల మిశ్రమం మాత్రం ఉండాలి. వీనికి క్రమ నియమం మాత్రం లేదు. (నాల్గు పాదాలు హగణంతో కూర్చితే సుగంధి వృత్తం ఔతుంది; అన్నీ నగణాలైతే విచికిలిత (తరళం) ఔతుంది.)

<u>ద్విపద:</u> మూడింద్రగణాల మీద ఒక్క సూర్యగణంతో తృతీయ గణాద్యక్షరం యతిగా రెండు పాదాలు ప్రాసనియమంతో కూర్చితే ద్విపద అవుతుంది. ద్విపద పాదాలు-ఒకదానిలోనికొకటి ప్రాకరాదు. విడిగా ఉండాలి. ప్రాసయతి-అనగా పాదద్వితీయాక్షరం గురుపూర్వమో లఘు పూర్వమో మరల అట్లే యతిస్థానం ప్రక్కన వచ్చుట- కూడదు. ఈ లక్షణానికికట్టుపడనివాడు పాల్కురికి సోమనాథుడు. తెనుగులో ద్విపదకు ప్రాచుర్యం ఎక్కువే. ద్విపదలో ప్రాస లేకుంటే మంజరీ ద్విపద ఔతుంది. దీనికి కొందరు ప్రాస యతిని అంగీకరిస్తారు.

<u>త్రిపద:</u> దీనికి తెనుగులో వాడుక లేదు. కన్నడభాషలో ప్రాచుర్యమెక్కువ.

<u>చదుష్పద:</u> దీనికే చౌపద, చౌపది అని కూడా పేరు. నాల్గు పాదాలుంటాయి. నాల్గు మాత్రల భ-స-నల-గగ అనే గణాలతో 16 మాత్రలతో కూర్చాలని భీమన అనే ఛందఃకర్త, మూడు చతుర్మాత్రాక గణాల మీద ఒక సూర్యగణమని అనంతుడు, చిత్రకవి పెద్దన అనే ఛందఃకర్తలు చెప్పారు. దీనికి అంత్యానుప్రాస ఉండాలి. 8మాత్రల మీద యతి. 2సూర్యగణాల మీద 9మాత్రలు కూర్చి (6+9=15) 8 మాత్రల మీద యతి వేస్తే విలాళ చతుష్పద అని అప్పకవి. 2 సూర్యగణాల మీద 4మాత్రల గణాలు రెండు ఆ మీద 1లఘువు కూర్చితే విలాళ చతుష్పద అని అనంతుడు, చిత్రకవి పెద్దన. ఇట్లైనా పాదానికి 15 మాత్రలే. అప్పకవి మతం గుర్వంతం; అనంతుడు చిత్ర కవి పెద్దన లఘ్వంత మతం కలవారు. వీరు అంత్యానుప్రాస పాటించారు. అప్పకవి పాటించలేదు.

S-Sūrya In-Indra. C-candra

| Name in Telugu | Name in Kannaḍa | Gaṇas in Telugu | Total | Place of Yati |
|---|---|---|---|---|
| 1.Mahākkara | Piriyakkare | 1S+5In+IC | 7 | after 4 gaṇas |
| 2.Madhyākkara | Doreyakkare | 2In+1S+2In+1S | 6 | after 3 gaṇas |
| 3.Madhurākkara | Naḍuvankkare | 1S+3In+1C | 5 | after 3 ganas |
| 4.Antarākkara | Eḍeyakkare | 1S+2In+1C | 4 | after 3 gaṇas |
| 5.Alpākkara | Kiriyakkare | 2In+1C | 3 | after 2 ganas |

In Kannaḍa there is no yati as in Telugu; but prāsam is common in both the languages.

Utsāham: Each line consists of seven sūrya-ganas (ha-gaṇa-VI, na-gana-III) plus one guru. The first letter of the 5th gaṇa is the place for yati. All the four lines must have an admixture of hagaṇas and nagaṇas; but there is no fixed order for them (If all the four lines are composed with ha-ganas only then it becomes sugandhi vṛtta; if composed with na-ganas only it becomes Vicikilita or Tarala)

Dvipada: Three Indragaṇas followed by a sūryagaṇa make for a line. The first letter of the third gaṇa is the place for yati. Two such lines with prāsam make a dvipada The lines should be separate and one line should not run into the next Prāsa yati-the second letter in the line repeating next to the yati place-is prohibited Pālakuriki Sōmanātha is an exception in this respect. Dvipada has been popular in Telugu If prāsam is not observed in dvipada it becomes manjarī dvipada Some scholars approve of prāsa yati in this variety

Tripada: This is not generally used in Telugu, but popular in Kannada

Catuṣpada This is also called caupada/caupadi. It has four lines Bhīmana, a prosodist, says that it should be composed with 16 mātras per line making use of caturmātrā ganas like bha-sa-nala-gaga (UII-IIU-IIII-UU). Other prosodists like Ananta and Citrakavi Peddana say that it should be composed with 3 caturmātrāganas followed by one sūryagana. It must be embellished with antyānuprāsa (alliteration at the end of the line) Yati is after 8 mātras Composing 2 sūrya gaṇas followed by 9 mātras and with yati after 8 mātras makes it vitāla Catuspada, says Appakavi Ananta and Citrakavi Peddana put it differently saying that composing

పాదానికి 5మాత్రల గణాలు మూడింటి మీద ఒక్క సూర్యగణం కూర్చి (5+5+5+3=18) 8 మాత్రలమీద యతి, అద్యంత ప్రాసలు కూర్చితే 'కర్ణాట చతుష్పద' అవుతుంది. తెనుగులో నగ- సల-త-ర అనేవి 5 మాత్రల గణాలు. మూడింద్రగణాలమీద 1 సూర్యగణం వస్తే అది ద్విపద అని వెనుక చెప్పబడింది. అప్పుడిది ద్విపద అవుతుంది కాని, యతిస్థానంలో మాత్రం కొంచెం మార్పు వస్తుంది. వెల్లటూరి లింగన మంత్రి తన 'సరసాంధ్రవృత్తరత్నాకరం (అముద్రితం)లో దీన్నే స్మర లఘువులు 5 ఉండే మూడు గణాల మీద ఒక సూర్యగణం (5x3 =15+3=18) అంటూ పదలక్షణంగా చెప్పాడు. మూడోగణం తొలి అక్షరం యతి, అద్యంత ప్రాసలుండాలి.

<u>షట్పది:</u> తెనుగులో దీనికి ప్రాచుర్యం లేదు. కన్నడంలో ప్రాచుర్యమెక్కువ.

<u>తరువోజ:</u> దీనికి నాల్గు పాదాలుంటాయి. ద్విపదచ్ఛందమైన 3ఇం+1సూ. అనేదాన్ని రెండుసార్లు కూర్చితే తరువోజ ఒక పాదం ఔతుంది. 3-5-7 గణాల తొలి అక్షరంతో మూడు చోట్ల యతి ఉండాలి. ప్రాస ఉండాలి.

<u>గీతులు:</u> తెనుగు ఉపజాతుల్లో ఆటవెలది తేటగీతులున్నవి. గీతమనేది వీనికి సామాన్యమైన పేరు. దేశిగీతాల్లో ఈ రెండూ సమగీతులు. వీటికి నాలుగు పాదాలుంటాయి. ప్రాసలేదు. ప్రాసయతి చెల్లుతుంది. ప్రతిపాదంలోను 1సూ +2 ఇం+2సూ ఉండి నాల్గో గణం ఆద్యక్షరం యతి కూర్చితే అది తేటగీతి అవుతుంది. బేసిపాదాల్లో 3 సూ + 2ఇం ప్రకారమున్ను, సరిపాదాల్లో 5సూ. గణాలున్ను ఉంటూ నాల్గోగణం ఆద్యక్షరంలో యతికూర్చితే అది ఆటవెలది అనిపించుకుంటుంది. సీసపద్యం వ్రాస్తే ఈ రెండింటిలో ఒకదాన్ని చేర్చి చెప్పాలి; అప్పుడీ గీతి సీసభాగంగానే పరిగణింపబడుతుంది. ఆటవెలది తేటగీతుల్ని విడిగా స్వతంత్రంగా వ్రాయవచ్చుననేది తెలిసిన సంగతే.

ఎత్తుగీతి, మేలనగీతి(కమలనగీతి), పవడగీతి అనేవి విషమగీతులు. ప్రతిపాదానికి 1ఇం+ 2సూ. గణాలు ఉంటూ, మూడోగణం ఆద్యక్షరం యతిస్థానంగా ఉంటూ, నాల్గుపాదాలుండేది ఎత్తుగీతి. ప్రతిపాదంలోను ఏడూ సూర్యగణాలుంటూ ఐదోగణం మొదటి అక్షరం యతిస్థానంగా ఉంటూ నాల్గుపాదాలు నడిచేది మేలనగీతి. దీనిని అప్పకవి కమలనగీతి అని వ్యవహరించాడు. ఆటవెలదియే నాల్గుపాదాల్లోప్రాసతో పవడగీతి అనిపించుకుంటుంది.

2 . uryaganas followed by 2 caturmātrāganas plus one laghu gives vitāla catuaspada This also gives only 15 matras per line Appakavi prefers a guru at the end of the line Ananta and Citrakavi Peddana prefer a laghu at the end of each line. While these latter writers observed antyānuprāsa, Appakavi had not The 3 gaṇas of 5 mātras each followed by one sūryagana (5x3+3=18) with yati after 8 mātras and ādi and antaprāsa make it Karnāta catuspada In Telugu, gaṇas with 5 matras each are naga-sala-ta-ra (IIIIU-IIUI-UUI-UIU) which come under Indra ganas It has been said earlier that 3 Indragaṇas followed by one sūryagana make for dvipada Thus karñata catuspada can not be different from divpada except regarding the place of yati. Vellatūri Lingana in his S A.V.R (unpublished) gave this as padalakṣana saying three kāmaganas of 5 laghus each followed by one sūryagana (5 x 3 + 3 18) with ādi and antaprāsa and yati on the first letter of the third gana (11th laghu ) make it a padam

Satpadi: This is very popular in Kannada but not used in Telugu.

Taruvōja: This has four lines. The dvipada chandas of 3 Indraganas followed by one sūryagana if done consecutively twice becomes one line of Taruvōja. Yati is observed on the first letter of 3rd, 5th and 7th ganas. Prāsa is observed.

Gītam: The Telugu upajātis are āṭaveladi and tētagīti.The common name for both is gītam . Among the indegenous gītams these two are samagītams These have four lines but without prāsa. Prāsayati is allowed One sūryagana followed by two Indragaṇas again followed by two sūryaganas in each line, with yati on the first letter of the fourth gaṇa is called 'tētagīti'. It is āṭaveladi if the first and third lines have three sūryagaṇas followed by two Indraganas and the second and fourth lines have sūrya gaṇas for all the five, with of clourse, yati on the first letter of the 4th gana in all the four lines Either of these two has necssarily to be attached to a sīsapadyam when the latter is composed, in which case the attached gītam will be treated as a part of that It is obvious that āṭaveladi and tēṭagīti can be written and used independently and separately

Ettugīti, mēlanagīti (Kamalanagīti) and pavaḍa gīti are visama gītams in Telugu. One Indragaṇa followed by two sūryagaṇas, with yati on the first letter of the third gana makes for a line of ettugīti and it has four such lines Mēlanagīti has four lines, with each line having seven sūryagaṇas and yati on the first letter of the fifth gana. Appakavi has called it kamalanagīti. Āṭaveladi with prāsa in all the four lines is called pavaḍagīti.

ఆ॥వె॥ వృత్తజాతి యెల్ల విషమంబు సమమును
నర్ధసమమునాఁగ నతిశయిల్లు
నందులోన విషమ మనునది నాలుగు
పాదములును వేఱె భంగిఁ జెల్లు 31

కం॥ నాలుగు పాదంబులు నొక
చాలున వర్తించునదియ సమవృత్తం బా
లీలన్ సమపదమును దా
ళాలంకృత సామ్యపాదమై చెన్నొందున్ 32

తే॥గీ॥ విషమ పాదంబులొక రీతి వెలయుచుండ
సమ చరణములు వేఱొక్క చందమైన
నర్ధసమ వృత్తమనఁ జెల్లు; నట్టి పదము
అర్ధసమపద మని యన్నయార్యుఁడనియె. 33

తా॥ వృత్తజాతి అంతాకూడా (1) సమవృత్తాలు (2) విషమవృత్తాలు (3) అర్ధ సమ వృత్తాలు అని మూడు తెగలుగా ఉంటాయి. అందులో విషమ వృత్తం అనేది నాలుగు పాదాల్లో ఒక్కొక్క పాదమూ ఒక్కొక్క విధంగా ఉంటుంది. (31)

నాలుగు పాదాలూ ఒకే విధంగా నడిచేది సమవృత్తం. సమపదమనేది కూడా తాళంతో కూడి నాల్గుపాదాలూ ఒకే విధంగా నడుస్తుంది. (32)

బేసి సంఖ్యతో చెప్పదగిన ఒకటోపాదం మూడోపాదం అనేవి ఒక విధంగా ఉంటుండగా సరిసంఖ్యతో చెప్పదగిన రెండోపాదం నాల్గో పాదం అనేవి వేఱొక విధంగా ఉన్నట్లైతే అప్పడది అర్ధసమవృత్తమనిపించుకుంటుంది. అలాగ ఉన్నపదం కూడా అర్ధసమపదమని అన్నయార్యుడు చెప్పాడు. (33)

వ్యా॥ పద్యం పదం కావటమనేది బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంటుందని వెనుకటి పద్యంలో చెప్పిన గ్రంథకర్త ఈ మూడు పద్యాల్లో పద్యాల స్వరూప భేదాన్నాశ్రయించిన తెగలను, చెప్పి ఆ లక్షణాలనే పదాలకూ అన్వయించి చెప్తున్నాడు.

సమ్మానంగా ఉండేది సమం, సమంకానిది విషమం (వి+సమ - విషమ) అర్ధం, అంటే సగపాలు, సమానంగా ఉంటేది అర్ధసమం.

నాల్గుపాదాల కూర్పు ఉండటమే వృత్తానికి ముఖ్యలక్షణం. కనుక ఈ సమత్వం, విషమత్వం, అర్ధసమత్వం అనేవి నాల్గుపాదాల పరంగా అన్వయించుకోవాలి. అందుచేతనే నాలుగు పాదాలూ నాలుగు రకాలుగా (ఒక్కోపాదం ఒక్కోరకంగా) ఉండటం విషమ వృత్తలక్షణంగా చెప్పబడింది.

Verse 31-33

Tr.The entire vṛttajāti comes under the catagories of (1) sama vṛttas (2) viṣama vṛttas and (3) ardhasama vṛttas. Among these the viṣama variety has each of its four lines differently. (31)

That is sama vṛtta where all the four lines run in uniformly identical way. Similar is samapada whose four lines are uniformly identical but embellished with tāla (32)

While the odd numbered (1,3) lines are composed in one way as the even numbered (2,4) lines are composed differently then it is called ardhasama vṛtta. Annayārya has stated that a similar padam is called ardhasama padam (33).

Com: The author who extolled in the previous verse padya (stanza) becoming a padam (song) with the hyperbole of gold getting fragrance states the three categories of vṛttas and applies the same classification to padams also in these three verses.

That which is even or uniform is sama. That which is not even or uniform is viṣama (vi+sama). That which is half even is ardhasama.

Since the main characteristic of vṛtta is its being in four lines, this evenness,unevenness or half-evenness has to be understood in terms of the four lines. It is because of this that each of the four lines being different in structure or composition is described as a mark of visama vrtta.

ఇక్కడ వృత్తాలకు చెప్పిన ఈ మాటలు నాలుగు పాదాలుగా కూర్చబడే జాతులకూ ఉపజాతులకు కూడా అనువర్తిస్తాయి. 'వృత్త జాతియెల్ల' అనే పదబంధం ఏక వచ నాంతమై వృత్తసమూహాన్ని మాత్రమే చెప్తున్నా అందులో ఉన్న 'జాతి' పదం పద్యాల్లోని జాతులకూ ఉపజాతులకు జ్ఞాపకంగా వాడబడింది.

నాల్గు పాదాలూ సమంగా లేని వృత్తాలకు 'గౌణ వృత్తా' లనిపేరు. అప్పుడు అర్ధస మవృత్తాలు, విషమవృత్తాలూ గౌణ వృత్తాల కోవకే వస్తాయి. ఛందస్సంఖ్య పాదంలో ఉండే అక్షరాల సంఖ్యకు గుర్తు. ఇరవైయో ఛందం అన్నప్పుడు పాదానికి ఇరవై చొప్పున అక్షరాలుంటాయని అర్థం. అక్షరాలైతే ఇరవై ఉండవచ్చునుగాని గురులఘువుల క్రమం, గణాలు ఒక్కోపాదంలో మారవచ్చు. అలాగు గనుక తొలిపాదంలో ఉండే అక్షర సంఖ్యకు కట్టుబడి ఉంటూ మిగత పాదాల్లో గురులఘు క్రమమో గణాలో మారితే అప్పుడా విష మత్వం తొలిపాదానికి చెందిన ఛందఃస్థానానికే సంబంధించి ఉంటుంది. అప్పుడది 'స్వస్థాన విషమ వృత్తం' అనిపించుకుంటుంది. గురులఘువుల లేదా గణాల క్రమంతో పాటు అక్ష రసంఖ్యకూడా మారితే 'పరస్థాన విషమ వృత్తం' అనిపించుకుంటుంది. నాల్గుపాదాల్లోను అక్షర సంఖ్య, గురులఘు క్రమం లేదా గణక్రమం ఏపాదానికాపాదంలో మారిపోతే అప్పు డది 'సర్వపరస్థాన విషమవృత్తం'. ఇదేవిధంగా అక్షర సంఖ్యమారకుండా ఒకసగం - అంటే రెండు పాదాల్లో ఉండే గురులఘుక్రమంగాని గణక్రమం గాని రెండోసగంలో మారితే అప్పుడది 'స్వస్థాన అర్ధ సమవృత్తం'. ఒకసగానికీ రెండోసగానికి అక్షర సంఖ్య కూడా మారితే అప్పుడది 'పరస్థాన అర్ధసమ వృత్తం' అనిపించుకుంటుంది.

ఉదాహరణకు 11వ ఛందానికి చెందిన (1) ఇంద్రవజ్ర (2) ఉపేంద్రవజ్ర (3) *కాంతి (4) వాతోర్మి అనే నాల్గు భిన్న వృత్తపాదాలతో 'వారాంగి' అనే స్వస్థాన విషమ వృత్తం ఏర్పడుతున్నది : దాని వివరాలివి.

<u>వారాంగి :-</u>

1 పాదం : ఇంద్ర వజ్ర - త-త-జ-గా గణాలు : 11 అక్షరాలు

2 పాదం : ఉపేంద్ర వజ్ర - జ-త-జ-గా గణాలు : 11 అక్షరాలు

3 పాదం : కాంతి - త-జ-జ-గా గణాలు : 11 అక్షరాలు

4 పాదం : వాతోర్మి - మ-భ-త-వ గణాలు : 11 అక్షరాలు

ఇలాగే 'అరిగ జాస్త్రం', 'నదీప్రఘోషం' అనేవి స్వస్థాన విషమవృత్తాలు.

These remarks apply to jātis and upajātis also which are composed in four line stanzas. Although the phrase vrttajāti is in singular and denotes only vṛattas, the component jāti is used in a mnemonic sense as a reminder of jāti and upajāti verses. Vrttas whose four lines are dissimiliar are called 'gauṇa vṛttas' So ardhasama vṛttas and viṣama vrttas come under gauṇa vrttas.The serial number of the chandas indicates the number of letters in a line. Thus 20th chandas means that a line of this chandas has 20 letters While the number of letters may be 20 per line there is room for the order of gurus and laghus or gaṇas changing in each line So if the number of letters in the first line is maintained in the other lines but with a different order of gurus and laghus then the unevenness pertains to the chandas of the first line only. Then it is called svasthāna visama vrttam. If the number of letters also changes along with the order of gurus and laghus or gaṇas it is then called parasthāna visama vṛttam. If each one of the four lines have different number of letters, order of gurus, laghus or ganas then it becomes sarva parasthāna visama vṛttam

In the same way, if the number of letters remains constant in all the four lines but two of the lines are having different order of gurus and laghus or gaṇas from the remaining two then it becomes svasthāna ardhasama vrttam If one half differs from the other half even in the number of letters then it is called parasthāna ardhasama vrttam.

For example a svasthāna visama vrtta called 'Vārāngi' is formed from four differnt types of verses called (1) Indravajra (2) upēndra vajra (3) kānti and (4) vātōrmi. All the four belong to the 11th chandas The following are the details of its formations.

Vārāngi: 1 Line -ta-ta-ja-gaa - (11 letters) -Indravajra
2 Line-ja-ta-ja-gaa (11 letters)-upēndravajra
3 Line-ta-ja-ja-gaa (11 letters)-kānti
4 Line-ma-bha-ta-va (11 letters)-vātōrmi.

'Angajāstra' and 'Nadīpraghōṣa' are two other 'svasthāna visama vrttas

10వ ఛందములోని భ-మ-స-గ (10 అక్షరాలు) అనే రుగ్మవతి తొలిపాదంగాను 11వ ఛందంలోని భ-భ-భ-గ-గ (11 అక్షరాలు) అనే దోధక పాదాలు 2,3,4 పాదాలు గాను చేరి 'శ్రీ రమణము' అనే పరస్థాన విషమవృత్తం ఏర్పడుతుంది.

వీణారచనము, ఉద్ధత, మధుర, మణిదీపిక అనేవి సర్వపరస్థాన విషమ వృత్తాలుగా తెనుగులో చెప్పబడినవి.

ఇంక ఒక్క ఛందంలో పుట్టిన ఒక్కవృత్తమే సమమైన గురులఘుక్రమ విన్యాసంతో నాల్గుపాదాల్లోను సమానంగా ఉండేది సమవృత్తం. దీనికి ఉదాహరణలు అనవసరం. మనం చదివే వృత్తాలు తరచుగా సమవృత్తాలే. గ్రంథకర్త ఈ సమవృత్త లక్షణాన్నే పదానికీ అన్వయించి 'సమపదం' అంటున్నాడు. అయితే ఇక్కడ గమనించవలసిన అంశాలు ఒకటిరెండు ఉన్నాయి. వృత్తం అన్నప్పుడు పద్యమోశ్లోకమో అనే భావం మరచిపోయి నాల్గుపాదాల కూర్పు అని గుర్తుంచుకోవాలి. ఎందుకంటే పదాలు వృత్తబంధాలుగా ఉంటాయి, నాల్గుపాదాల కూర్పు ఉంటుంది. తర్వాతి అంశం ఈ పదాల పాదాలు తాళాలంకృతాలుగా ఉంటాయని గ్రంథకర్త చెప్తున్నాడు. తాళాన్ని గురించి కవి 36,37 పద్యాల వద్ద ప్రసంగించబోతున్నా ఇక్కడ గమనించవలసిన అంశాలు ఒకటి రెండు చెప్పాలి.

పదానికి లేదా పాటకు ఉండే రాగతాళాల్లో రాగం కంటే తాళం ముఖ్యమైంది. ఒకరాగానికి కూర్చిన పదాన్ని లేదా పాటను వేరొక రాగంతో పాడటం సులభమే కాని ఒకతాళానికి కూర్చిన పాటను మరొకతాళానికి మార్చటం సులభమైన పనికాదు. తాళంకోసం అక్షరాల కూర్పు అమర్చబడి ఉంటుంది కనుక ఆకూర్పు మరొకతాళానికి ఒదిగిరాదు. సమపదం అన్నపుడు పదంలోని నాల్గుపాదాలూ సమంగా ఉండడమే కాదు తాళగతి కూడా సమంగానే అమరిరావాలి. అంటే లయసరిగాకుదరాలి. వేగంగా పాడితే ద్రుతమానం. మధ్యరకంగా పాడితే మధ్యమానం. నిదానంగా పాడితే విలంబిత మానం. విలంబితానికి రెట్టింపు వేగం మధ్యమానంలోను, దానికి రెట్టింపు వేగం ద్రుతమానంలోను ఉంటాయి. ఈగాన గమనకాల ప్రమాణం 'లయ'. ఈ లయప్రవర్తనను బట్టి 'యతి' అనేది ఏర్పడుతుంది. వాటిలో 'సమయతి' అనేది ఒకటి. తాళంలో సమమైన కాలప్రమాణంకల ఒకేరకపు అంగాలు ఉంటే అది 'సమయతి' ఔతుంది. మామూలుగా నాలుగు అక్షరాల కాలం ఒకలఘువు అంటారు. నాల్గేసి అక్షరాలకు తాళం పడుతూపోతే అది ఏకతాళం అవుతుంది. తాళాలకు అక్షరసంఖ్య ఉంటుంది కనుక రచనలో జాగ్రత్త అవసరం. సమానకాలాలు ఉండే స్వరసమూహావులయ 'సమయతి' అని తెలుసుకుంటేచాలు. సమపదాల కూర్పులో ఛందస్సుతో పాటు అలాంటి తాళలక్షణం ఉండాలంటున్నాడు గ్రంథకర్త.

With 'Rugmavatı ' having bha-ma-sa-ga-ganas (10 letters) of 10th chandas as the first line and Dōdhaka lines with bha-bha-bha-gaga ganas (11 letters) of 11th chandas for 2nd,3rd, and 4th lines a parasthāna visama vrtta called 'srīramanam' is formed

Vīnāracana, Uddhata, Madhura and Manidīpika are given as sarva parasthāna vṛttas in Telugu

A vṛtta born in a particular chandas running uniformly in all the four lines with its order of ganas and laghus and gurus unchanged, makes for a samavritta. There is no need for examples here. The vrttas we generlly read are, more often than not, are sama vrittas. The author has applied these regulations to a padam to define a samapadam. But there are one or two points to be noted here While thinking of a vrtta we have to forget the padya or ślōka and rember that it is a composition of four lines Padams are vritta bandhas in four lines but they are not padyas or ślōkas. The author says that these lines of padams are embellished by tāla. Though the author is going to speak about tāla in verse 36 and 37 some points need to be stated here

Between the rāga and tāla of a padam or song, the latter is more important than the former A padam or song composed in a particular rāga can be easily sung in another rāga. It is not so easy to change the tāla in which it is composed. The letters or syllables of the text are arranged in such a way as to suit the tāla that the composition does not fit in with a different tāla A samapada has not merely its four lines in a uniform fashion but its tāla too runs uniformly. That means the laya has to be adhered to Singing fast is drutamāna; singing with medium speed is madhyamāna; and singing slow is vilambitamāna. The tempo gets doubled in madhyamāna which gets further doubled in drutamāna . The standard of this tempo measure is called 'laya'. Based on the behaviour of this 'laya' what is called 'Yati' occurs. 'Samayati' is one of the classical three or modern six 'yati's. If the tāla has the same type of components having uniform time-units (kālaprama-ṇa) then it is called samayati. Generally the time taken to utter four short letters is called a laghu. If tāla occurs after every group of four letters it is called ēkatāla Since tāla is known by the number of letters that it may comprehend , care in composition is neccessary. It is enough if we understand that the laya of a group of musical notes with uniform time-units has samayati. The author is saying that the composition of samapadams has not merely its prosody but also this tāla laksana.

ఇంక అర్ధసమవృత్తం. వృత్తం నాలుగు పాదాలకూర్పు అయినప్పుడు అర్ధసమవృత్తంలో రెండుపాదాలు ఒకవిధంగాను మిగిలిన రెండుపాదాలు మరొకరకంగాను ఉంటాయని స్ఫురిస్తుంది. అయితే ఏరెండు పాదాలు అన్నది కూడా ఇక్కడ ఒక అంశమే. తొలిరెండుపాదాలు (1,2) ఒకసగం. మలిరెండుపాదాలు (3,4) మరొక సగం. ఇది ఒకపద్ధతి. బేసిపాదాలు (1,3) ఒకసగం; సరిపాదాలు (2,4) మరొక సగం. ఇది మరొకపద్ధతి. ఈ రెండుపద్ధతులు గ్రహింపవచ్చు. వీటితోపాటు లాక్షణికులు ఒకపాదం ఒకరకంగాను మిగిలిన మూడుపాదాలు మరొకరకంగాను ఉన్నప్పుడుకూడ అర్ధసమమనే అన్నారు. వీటిలోను మరల స్వస్థాన అర్ధసమాలు, పరస్థాన అర్ధసమాలు అనే భేదం ఉంటుంది.

స్వస్థాన అర్ధసమాల్లో 11వ ఛందానికి చెందిన ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర అనేవాటి మిశ్రణం ఉండే 'ఉపజాతి' ఒక్కటే తెనుగు గ్రంథాల్లో కనబడుతుంది. ఇంద్రవజ్రకు త,త,జ,గగ - గణాలు (9+2= 11 అక్షరాలు) ఉపేంద్రవజ్రకు జ,త,జ,గగ - గణాలు (9+2= 11 అక్షరాలు) రెండింటికి 8యతిస్థానం. ఈరెండింటి మిశ్రణం చేత 14 రకాలు ఉపజాతి పద్యాలు ఏర్పడతాయి.

'ఏకత్రపాదే, చరణద్వయేవా, పాదత్రయే వాన్యతరస్థితశ్చేత్

తయోరిహాన్యత్ర తదోహనీయా చతుర్దశోక్తా ఉపజాతిభేదాః'

అనే లక్షణాన్ని అనుసరించి ఆభేదాలు క్రింద చూపబడుతున్నవి.

ఇ - ఇంద్రవజ్రపాదం, ఉ= ఉపేంద్ర వజ్రపాదం అని సంకేతం. నాలుగు అక్షరాలు వరుసగా 1-2-3-4 పాదాలకు గుర్తులు.

| | |
|---|---|
| 1. ఇ-ఉ-ఉ-ఉ | 8. ఇ-ఇ-ఇ-ఉ |
| 2. ఉ-ఇ-ఉ-ఉ | 9. ఇ-ఇ-ఉ-ఉ |
| 3. ఉ-ఉ-ఇ-ఉ | 10. ఇ-ఉ-ఇ-ఉ |
| 4. ఉ-ఉ-ఉ-ఇ | 11. ఉ-ఇ-ఇ-ఉ |
| 5. ఉ-ఇ-ఇ-ఇ | 12. ఉ-ఉ-ఇ-ఇ |
| 6. ఇ-ఉ-ఇ-ఇ | 13. ఉ-ఇ-ఉ-ఇ |
| 7. ఇ-ఇ-ఉ-ఇ | 14. ఇ-ఉ-ఉ-ఇ. |

మన గ్రంథకర్త బేసి (1,3) పాదాలు ఒకరకంగా సరి (2,4) పాదాలు ఒకరకంగా ఉండటం అర్ధసమలక్షణమని చెప్పటాన్ని ఉపలక్షణంగా మాత్రమే తీసుకోవాలి. 12 వఛందానికి చెందిన 'ప్రమితాక్షరం' (స,జ,స,స) అనేది బేసిపాదాల్లోను, ప్రియంవద (న-భ-జ-ర) అనేది సరిపాదాల్లోను వస్తే 'అజిత ప్రతాపం' అనే అర్ధసమవృత్తం అవుతుంది.అలాగే 13వ ఛంధానికి చెందిన ప్రహర్షిణి (మ-న-జ-ర-గ) బేసి పాదాల్లోను రుచిర (జ-భ-స-జ-గ) అనేది సరిపాదాల్లోను వస్తే 'రతిప్రియ' మనే అర్ధసమవృత్తం అవుతుంది. ఇవి స్వస్థానార్ధసమాలు.

Now, the ardhasama vrtta. A vrtta being a composition of four lines ardhasama vrtta suggests that one half or two lines being one way and the other half or other two lines being different . But which two lines? The first and second lines constitute one half and the third and fourth lines constitute the other  This is one way of looking at it. The odd numbered lines, the first and third, constituting one half and the even numbered lines, the second and fourth, constituting the other half is another way of looking at it. Both these can be accepted. But the prosodists have called it ardhasama even when one line is in one way and the other three in a different way. Again the classification of svasthāna ardhasamas and parasthāna ardhasamas is there.

Among the svasthāna ardhasamas, the 'upajāti' verse composed by an admixture of 'indravajra' and 'upēndravajra' metres, both belonging to the 11th chandas, alone is seen in Telugu works. 'Indravajra' has ta-ta-ja-gaga (VVI-VVI-IVI-VV) gaṇas (9+2=11 letters). 'upēndravajra' has ja-ta-ja-gaga ( IVI-VVI-IVI-VV) gaṇas (9+2 = 11 letters). Yati is on the 8th letter in both cases. By mixing up these two metres 14 types of upajatis are formed. These varieties are shown below in accordance with the ślōka: 'ēkatra padē caraṇa dvayēvā, padatrayēvānyatarasthitascēt, tayōrihānyatra tadōhanīyā, caturdaśōktā upajātibhe-dāḥ. I= indravajara . U= upēndravajra. The four letters represent the metres in the serial lines of 1-2-3-4.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | I | U | U | U | 8. | I | I | I | U |
| 2 | U | I | U | U | 9 | I | I | U | U |
| 3. | U | U | I | U | 10 | I | U | I | U |
| 4. | U | U | U | I | 11 | U | I | I | U |
| 5. | U | I | I | U | 12 | U | U | I | I |
| 6 | I | U | I | I | 13 | U | I | U | I |
| 7. | I | I | U | I | 14 | I | U | U | I |

The fact that our author has indicated the odd numbered lines (1,3) being composed one way and the even numbered (2,4) lines being composed in a different way as ardhasama should be taken only as a symptomatic statement ' Pramitākṣaram' with sa-ja-sa-sa gaṇas in the odd lines and 'priyaṃvada' with na-bha-ja-ra gaṇas in the even lines both belonging to the 12th chandas, give an ardhasama vṛtta called 'Ajitapratāpam' Similarly 'praharṣiṇi' with ma-na-ja-ra-ga gaṇas in odd lines and 'rucira' with ja-bha-sa-ja-ga ganas in even lines (both of 13th chandas ) give another ardhasama vṛtta called 'ratipriya' These are svasthāna ardhasamas.

10వ ఛందానికి చెందిన సుముఖి (స-స-జ-గ) బేసి పాదాల్లోను 11వ ఛందానికి చెందిన వనమాల(స-భ-ర-ల-గ) సరిపాదాల్లోను వస్తే 'వియోగిని' అనే పరస్థాన అర్ధసమవృత్తం అవుతుంది. అట్లే 11వ ఛందానికి చెందిన కలితాంతము (త-జ-జ-వ) బేసి పాదాల్లోను 12వ ఛందానికి చెందిన తోటకము (స-స-స-స) సరిపాదాల్లోను వస్తే 'మనోహరం' అనే పరస్థాన అర్ధసమవృత్తం అవుతుంది. ఇలాంటివి ఇంకా ఉన్నాయి. మనకివి చాలు.

ఇలాంటి అర్ధసమలక్షణంతో కూడిన పదాలు అర్ధసమపదాలు అనిపించుకుంటాయని అన్నమాచార్యులు చెప్పినట్లుగా చినతిరుమలాచార్యులు లక్షణనిర్దేశం చేస్తున్నారు.

సమపదాలకు చెప్పినట్లుగా విషమపదాలకు అర్ధసమపదాలకు తాళసంబంధమైన నిర్దేశం ఏదీలేకపోవడం గమనించాలి.

ఉండే అవకాశాలను అన్నింటిని అవలోడిస్తుంది శాస్త్రం. అంతమాత్రంచేత అన్నింటికీ లక్ష్యాలు ఉన్నాయనికాని అన్నింటిని అనుసరించాలనికాని అభిప్రాయంకాదు. పథ్యమూ ఆహ్లాదకరమూ అయిన దాన్నే గ్రహించాలి.

1. 32 పద్యంలోకవి సమపదం 'తాళాలంకృత సామ్యపాదం' అన్నాడు. ఇక్కడ తాళముచేత అలంకరింబడిన సామ్యపాదం అని అర్థం. నాల్గుపాదాలు తాళానికి చక్కగా ఒదిగిరావాలి అని అభిప్రాయం. అంతేకాని తాళాలంకారం ఉండాలి అని భ్రాంతిపడకూడదు. దేశితాళాలనబడే 35 తాళాలకు పురందరదాసు స్వరాలతోకూర్చిన తాళాలంకారాలు ఉన్నమాటనిజమే అయినా ఆయన అన్నమయ్యకంటే చాల చిన్నవాడైన సమకాలీనుడు. పురందరదాసు తిరుపతికి వచ్చినప్పుడు అన్నమయ్యను దర్శించినట్లు అన్నమాచార్య చరిత్ర చెప్తున్నది. కాబట్టి పురందరదాసు స్వరసంచారంతో కూర్చిన తాళాలంకారాలు అన్నమయ్య చెప్పిన లక్షణంలోకిగాని దాన్ని అనుసరించే ఈ తెనుగు లక్షణంలోకికాని ప్రవేశించడం సంభావ్యంగా ఉండదు.

'Sumukhı' (sa-sa-ja-ga) from the 10th chandas ın odd lınes and vanamālı (sa-bha-ra-laga) from the 11th chandas in even lines gıve a parasthāna ardhasama vṛtta called 'viyōgini' . Similarly' kalıtāntam' (ta-ja-ja-va) of 11th chandas in odd lines and totakam (sa-sa-sa-sa) of 12th chandas in even lines gıve 'manōharam' another parasthāna ardhasama vrtta. There are more lıke these. Enough for our purpose.

That padams havıng thıs ardhasama laksana are called ardhasamapadas was enuncıated by Annamācārya, says our author Cına Tırumalācārya.

We may note here that tāla is not referred to ın the case of vıṣamapadams and ardhasamapadams.

A Śāstra explores all the possibilities That does not mean that examples can be provıded for all or that one should follow all the possıbilıtıes One has to make a healthy and pleasant selectıon

In verse 32 the author qualıfıes samapadam as tālālaṁkrta sāmyapa-dam It just means uniformly lıned verse embellished by tāla All the four lınes must fıt ınto the tāla unıformly well One should not mıstake ıt to mean that tāla alaṁkāra should be there For all the 35 dēśītālas there are, no doubt, alaṁkāras said to have been composed by Purandaradāsa, wıth theır svarasancāras But he was only a younger contemporary to Annamayya Annamācārya carıtra speaks of Purandaradāsa meetıng Annamācārya when he visıted Tirupatı So ıt ıs not probable that tāla-alaṁkāras wıth svarasancāra composed by Purandara dāsa should get ınto Annamayya's work on sankīrtan ın Sānskrt or ınto thıs Telugu work

వ॥ మఱి నిబంధనామపదం బెట్టిదనిన

మ॥ యతులుం బ్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసం
గతులుం గల్గి నిబంధనామపద మాఖ్యాతార్థ సంయుక్త స
త్కృతియై తాళులపాక యన్నయగురూక్తిన్ లోకవిఖ్యాతమై
జితమాధ్వీక సితాసుధారస రుచిస్ఫీతంబునై చెన్నగున్ 34.

తా॥ ఇంక నిబంధపదం అనేది ఎలాంటిదో చెప్తాను. దీనికి యతులు, ప్రాసలు, మాత్రాగణాలననుసరించే పదాలు, తాళాల సంగతి ఉంటాయి. పదంలో చెప్పదలచిన అర్థం ఏదైనా ఉంటుంది. నేర్పైన కూర్పుగాను ఉంటుంది. ఇప్పపూలకల్లును, నిర్మలమైన అమృతాన్ని కూడా గెల్చిన రుచితో అందంగా ఉంటుంది. తాళ్ళపాక అన్నయగురుడు చెప్పడం చేత ఇదిలోకంలో ప్రసిద్ధికెక్కింది.

వ్యా॥ పదరచనకు తాళ్లపాక అన్నమాచార్యులు గురుడని ప్రస్తుతింపబడుతున్నాడు. 'పద నిర్యుక్త' మనే పేరుతో భరతుడు నామమాత్రంగా చెప్పిన దేవస్తుత్యాత్మకమైన పదానికి మొదటిసారిగా సంస్కృతంలో లక్షణం ప్రతిపాదించిన వాడు అన్నమయ్య. ఆయన రచించినన్ని పదాలు తెనుగులోనే కాదు మరే భారతీయ భాషలోను ఎవరూ రచించలేదు. రచనలో పద్యకవులెవరూ ఆయన చాయలకైన రాలేరు. భాష ఆయన చేతిలో మైనపు ముద్ద. భావన మధురాతి మధురం. ఇన్నికారణాలచేత పదరచనాగురుత్వం ఆయనకు తగి ఉంది.

నిబంధ, నిబద్ధ శబ్దాలు సమానార్థకాలే. ఉద్గ్రాహాది ధాతువులచేత ప్రబంధాంగాలైన స్వర,బిరుధ, పద, తేనక,పాట, తాళాలనే వాటిచేత దేశిరాగాల్లో వాగ్గేయకారుడు జనరంజకంగా కూర్చిన గానం నిబద్ధం. అదే నిబంధపద మనబడుతున్నది.

28 పద్యం క్రింద వ్యాఖ్యలో ప్రాచీనులు చెప్పిన ఏలా పదలక్షణం అందలి భేదాలు విపులంగా ఉల్లేఖింబడినై. ఇక్కడ తెనుగులాక్షణికులు చెప్పిన పదలక్షణాలు ఒకటిరెండు స్పృశింపబడుతున్నాయి.

వెల్లటూరి లింగన మంత్రి తన 'సరసాంధ్ర వృత్త రత్నాకరం' (1550-1600 A. D) (దీనికే మాల్యాద్రి నృసింహచ్ఛందమని కూడపేరు) లో పదలక్షణాన్ని ఇలా చెప్పాడు.

'స్వర లఘువులెదుగల త్రిగణ రవిగణము
సరస గణ యుగముపై జత యతిక్రమము
వర పదాంతము నందు వలెఁ బ్రాస సమము
వరఁగ నరసింహ నాపదము గైకొనుము'

Verse:34

Tr. Now nibandha padam is being explained. It possesses yatis, prāsa, words following mātrā-gaṇas; association of a tāla; it carries a certain meaning intended to express; it will be a skilled composition. It will be a beautiful one, its sweetness surpassing that of the wine prepared from the flowers of Bassia latifolia or even nectar. It has become famous in the world on account of Tāḷḷapāka Annaya, the preceptor, composing them.

Com: Tāḷḷapāka Annamācārya is extolled as the preceptor of padam composition. It was Annamayya who propounded the regulations of padam-composition nominally enumerated by Bharata as 'pada-niryukta' which is simple hymnodic composition . No one seems to have composed as many padams as he has, not merely in Telugu but in any Indian language. The excellence of his compositions is such that other padya-kavis can never hope to come anywhere near him. Language behaves like a ball of wax in his hands with maximum plasticity. His imagination is sweeter than the sweetest. For all these reasons and more, preceptorship of pada-composition is justified in his case.

The words nibandha and nibaddha mean the same thing, 'framing in' or 'framed-in'. Music (gāna ) composed for popular taste in dēśi-rāgas by a vāggēyakāra framing it in with dhātus like udgrāha etc. and prabandha components called svara, biruda, pada, tēnaka, pāṭa and tāla is called nibaddha gāna. Such a padam, is nibandha-padam.

In the commentary under verse 28 the regulations of ēlā-padam and their varieties as enunciated by the ancients have been extensively described. Here one or two instances of pada-lakṣaṇa as enunciated by the Telugu prosodists are touched upon. Vellaṭūri Linganamantri (1550-1600 A.D.) in his 'S A.V R.' otherwise known as 'Mālayādri Nṛsimhacchandam' has stated pada-lakṣaṇa to this effect:

'Three smara-gaṇas comprising five laghus each succeeded by one sūrya-gana (for each line) with yati after two gaṇas (in each line) and prāsa both in the beginning as well as at the end of each line, make for padam'

ఈ గ్రంథకర్త మన గ్రంథకర్తకు కొంచెం తర్వాతివాడు. వెనుకచెప్పిన కామగణాలే స్మరగణాలు. మూడో ఛందంలో పుట్టిన గణాలే ఇవి. కాగా త్ర్యక్షర గణాలే కామగణాలు ఔతాయి. వాటిలో లఘ్వాదిగణాలకు ముందు మరొక లఘువు ఉంచితే కామగణా లన్నీ ఏర్పడతాయి. ఐదుమాత్రలకు ఐదులఘువులుండే గణాలు మూడుకూర్చి మరొక్క సూర్యగణాన్నికలపాలి. సూర్యగణానికి నగణమైనా (III) హగణ (UI) మైనా మూడు మాత్రలు. మొత్తం పాదానికి 5 X 3 = 15 + 3 = 18మాత్రలు. రెండుగణాల పైనయతి చెల్లాలి. ద్వితీయాక్షరప్రాసతోపాటు పాదాంతంలోను ప్రాస ఉండాలి. ఈలక్షణపద్యం దీనికి లక్ష్యం ఔతుంది. ఇక్కడ విశేషమేమంటే ఇది సరిగా కర్ణాటచౌపద లక్షణం. కన్నడంలో నాగవర్మ ఛందోంబుధిలో ఇదే లక్షణం 8 మాత్రల మీద యతితో రఘటా లక్షణం క్రింద చెప్పబడింది. ఇది తెనుగులోని 'ద్విపద' కూడ అవుతుంది.

పై లక్షణకర్తకు తరువాతి వాడైన వార్తాకవి రఘునాథయ్య (1660-1680 A.D.) తన 'లక్షణ దీపిక'లో పదలక్షణాన్ని ఇలా చెప్పాడు.

క॥ 'పాదము ప్రాసము వడియును
శోధించి పదాఱు కళల సూత్రం బరయన్
నాదాంగ రాగలీలలఁ
బాదంబాలించి చెప్పఁ బదమై యొప్పున్.

గీ॥ ధన్యతకుఁ బల్లవికి విరోధంబు లేక
క్రియ ఫలింపఁగ నియమంబు గీలుకొలిపి
ప్రాస యతులును సమయతుల్ భాసురముగ
తాళ పద్ధతి రచియింపఁ దగుఁ బదంబు

ఇందుకు తాత్పర్యము. కళలనంగా లఘువులకు సంజ్ఞ. చరణం 1కి 16 లఘువులు నియమం. ధన్యత అనగా నుపపల్లవికి పేరుగనుక పల్లవికి యుపపల్లవికి క్రియచేర్పుగా చెప్ప వలెను. లయప్రధానంగా రాగవరుస ప్రాసవడి వర్గవళ్లను చెప్పవలెను.' (707,708,709)

ఇతని లక్షణంలో పాదానికి 16 మాత్రలే చెప్పబడినై. ఉపపల్లవి క్రొత్తగా వినబడు తున్నది. రాగతాళాలు చెప్పబడినై.

ఇంక 18 శతాబ్దినాటి పొత్తపి వెంకటరమణకవి తన 'లక్షణ శిరోమణి' వృత్తాధికా రంలో 'అర్జున భరతాన్ని' 'సంగీత రత్నాకరాన్ని' స్మరించి పదాన్నిగుర్చి ఇలా చెప్పాడు.

'కావున నీదేశ భాషల పదములు చెప్పవచ్చుననిన్ని, ఏళలనగా పదములనిన్ని మూడు చరణములకు ఖండికాత్రయము అని పేరుగలదనిన్ని, పల్లవము ఉపపల్లవము అనిన్ని యివి మాత్రానమక నిబద్ధములైన పగణాదులతోఁగూర్చవలెననిన్ని నూళాదుల (క)ను గు(ణ) ముగా నుండవలెననిన్ని' సంగీత రత్నాకరము మొదలైన గ్రంథము(లు) అర్జునభరతాది ఏళా ప్రకారంబున పగణాదుల రాగతాళమ్ముల సంగీత రీతిని తేటపడి యుండుగాన నీసాహిత్య మార్గంబున లక్షణంబున కొరవవి యుట్లుండె.' (3-427)

The author of this work was a little posterior to our present author, Cina Tirumalācārya Smara-ganas are kāma-ganas explained earlier They are born in the third chandas and tryaksara-ganas themselves can become kāma-ganas We have to prefix one laghu to those beginning with a laghu We have to suffix a sūryagana-either 'na' gana(III) or 'ha-gana'(UI) to a succession of three ganas of five matras each in line Thus the total number of mātras for a line is 5x3+3=18. Caesura (yati) has to be observed after the first two gaṇas i e. at the beginning of the third gaṇa. Prāsa pertaining to the second and last letters of the lines has to be observed The verse which gives this laksana is itself an example for the regulation. The note-worthy point is that this regulation is nothing but that of karnāṭa-caupada. Nāgavarma the Kannaḍa prosodist of yore, has given this regualtion under the category of raghaṭa with yati after 8 mātras. In Telugu, this composition can be taken as dvipada variety too.

Vārtākavi Raghunāthaiah, (1660-1680 A D) another prosodist posterior to the above one, gives padalaksaṇa, in his L.D to this effect:

"That shines as padam if each line is composed with sixteeen kalas observing yati and prāsa fitting with a rāga and tāla. The pallavi and dhanyata should not fall apart; the verb should be fruitful; prāsayatis and sama-yatis can be used and the composition should be in accordance with tāla"

The purport is this. The word 'kalās' signifies 'laghus' The regulation is 16 laghus for each line 'Dhanyata' is another name for 'upapallavi' The verb should be such that it comprehends both the pallavi and upapallavi The composition with prāsayatis and varga-yatis should fit in with a rāga and a tāla, being laya-pradhāna (Laksaṇadīpika. 707,708, and 709)

In this regulation only 16 mātras per line is advocated We hear about upapallavi' for the first time. Rāga and tāla are mentioned

Again, Pottapi Vēnkataramaṇakavi (18c) in the Vṛttādhikāra of his L S. mentioned A.B and S.R and spoke about padam to this effect: "So padams can be composed in indegenous language and ēlās mean padams; three caranas go by the name of 'khandikātraya' (and there are) pallava and upapallava and (all) these are composed by 'pa' -gaṇas of equal number of matras each; these should be in accordance with sūḷādis, these are clearly given in Sangīta Ratnākara etc. and in accordance with ēlā-lakṣana given in Arjuna Bharata comprising of pa-gaṇas, rāga and tāla in the way of music; and so these do not come under the domain of literary regulations and let it be so (L S. 3-427)

దీనిలో పాదానికిన్ని మాత్రలని నిర్దేశం లేదు. పంచమాత్రాకాలైన గణాలు ఉండాలని మాత్రమే చెప్పబడింది. మూడు చరణాలనటంలో త్రిధాతుకత్వం సూచింపబడింది. పల్లవి అనుపల్లవి చెప్పబడ్డవి. ఈ ఏలాపదం సూళాదులకనుగుణంగా ఉండాలని రాగ తాళాలుంటాయని చెప్పబడింది. ఇతనికాలానికి పదరచన కేవలం సంగీత సంబంధిగాతోచి సాహిత్యాన్నుండి వేఱుపడ్డది. పాదానికి ఆఱని, ఐదని ప్రాచీనులు చెప్పిన పదనియమం పోయి గణసంఖ్యా నియమం రావటం అదికూడ పోయి పాదానికి 16 మాత్రలనడం. చివరకు మాత్రాసమకాలైన పగణాలతో కూర్చాలనటం - క్రమంగా వచ్చిన మార్పు. తాళ్లపాక వారి సంకీర్తనల్లో పల్లవితో పాటు మూడేసి చరణాలు ఉండటం మామూలు. ప్రతి చరణం నాల్గుపాదాల వృత్తబంధంగా ఉంటుంది. చరణాలసంఖ్యకు అపవాదాలు లేక పోలేదు.

పదరచనలో పాదానికి ఇన్ని అనే గణసంఖ్యా నియమంకాని మాత్రా సంఖ్యానియమం కాని లేదని నాలుగు, ఐదు, ఆఱు మాత్రల గణాలు వాడుకోవచ్చునని రాగతాళాలకు అనుగుణంగా వీటిని నియమించుకోవచ్చునని యతులు, ప్రాసలు ఉంటాయని పల్లవి చరణ త్రయం ముఖ్యమని సారాంశం.

ఈ సందర్భంలో నాట్యశాస్త్రం చెప్పిన సలహాగమనింపవచ్చు. ఆర్యావృత్తాల్లో నాల్గేసి మాత్రాలకే గణాలు చూచుకోవాలని, గీతకాల్లో ఐదేసి మాత్రల గణాలు చూచుకోవాలని, తాళప్రధానాలు కనుక వైతాళీయాల్లో (రగడలు వగైరా) ఆఱేసి మాత్రల గణాలు చూడాలని 14 అధ్యాయం (బరోడా ప్రతి)లో చెప్పబడింది.

1 'నిబద్ధ మనిబద్ధం తద్ ద్వేధా నిగదితం బుధై॥
బద్ధం ధాతుభిరంగైశ్చ నిబద్ధమభిధీయతే
ఆలప్తిర్బంధ హీనత్వాదనిబద్ధ మితీరితా॥

(సంగీ. రత్నా. 4-4/5)

రాగాలాపన అనిబద్ధం.

2. 'మాత్రానీకముల్' అనేది పదాలు, తాళసంగతులు అనేవాని నడుమ వేయబడింది. మాత్రలసమూహాలు అనే ఆ అభిప్రాయం ఇటు పదాలపరంగా మాత్రాగణాలుగా నోమాత్రల సంఖ్యగానో అన్వయానికి వస్తుంది, అటు తాళపరంగా కూడా అన్వయానికి వస్తుంది. 36 పద్య వివరణం చూడండి.

3. అఖ్యాతం అంటే చెప్పబడింది అని శబ్దార్థం. భాషాపరంగా ఆఖ్యాతం అనేది క్రియాశబ్దం. ధాతువుకు భూతభవిష్యద్వర్తమానాది కాలసూచకాలైన తిఙ్లు చేరింది ఆఖ్యాతం; దీనికి కర్తృపదమైన నామశబ్దానికి ఉండే వచనపురుషలు ఉంటాయి. వ్యక్తం చేయబడిన ఏదైనా ఒక అర్థంతో కూడింది అని గ్రహిస్తేచాలు.

This regulation does not fix the number of mātras per line It only speaks of ganas of five mātras each. The three caranas referred to as khandikātraya indicates 'tridhātukatva ' of pada 'Pallavi' and 'anupallavi' are mentioned. Ēlāpadam is enjoined to be in accordance with 'sūḷādis' with rāga and tāla By the time of this author composition of padams was considered to belong only to music and got divorced from literature The number of words or units per line fixed by the ancients as six (S S S ) and five (S.R) lapsed. Regulation of the number of ganas per line came and even that lapsed Then came number of mātras per line (16) and finally composition with pa-ganas of 5 mātras each was advocated This is the gradual change that came over the composition of padam The sankīrtans of Tāllapāka poets contain generally three caranas with pallavi Each carana is a vṛttabandha in four lines There are exceptions to this rule of three caranas.

The sum and substance of all this is that there is no fixed number of either ganas or mātras per line in pada composition and that one can use units of four or five or six matras as suited to a rāga and tāla, observing yati and prāsa. Three caranas with pallavi is the more important part

In this context one can note the advice of N S. In āryā-vrttas the ganas are to be scanned for four matras each; in gītakas scanning is for five mātras each gana or unit and since tāla is important, in vaitālīyas (raghata.etc ) it is for six mātras each unit (Baroda N S 14 ch)

1. nibaddham anibaddham tad dvēdhā nigaditam budhaiḥ
   baddham dhātubhirangaisca nibaddham abhidhīyatē
   alaptir bandhahīnatavād anibaddaham itīrītam

(S 4-4/5)

   rāga ālāpa is anibaddha

2 the compound 'mātrānīkamul'is incorporated in
   between 'padambulunu and tālasangatulun'

The groups of mātras referred to relates itself to padams/ words in terms of mātra -gaṇas or number of mātras on one hand and on the other, it relates itself to tāla also. (vide commentary under verse 36)

3 'ākhyāta' means that which has been said Applied to language 'ākhyāta' is verb The verbal root with the tense particles of past, present and future, called 'tin-s is called ākhyāta Its number and person will be in accordance with the subject noun. Here it is enough if it is understood as " with a certain meaning expressed "

వ॥ అట్టి నిబంధనామ పదంబునకు దదంగంబులైన యతిప్రాసాదులవిధం బెట్టిదనిన

క॥ పాదముల నాలుగింటికి
నాదుల నడుముల సవర్ణమగునవి యతు లా
పాద ద్వితీయ వర్ణము
పాదుగ నొక్కటియ చెల్లఁ బ్రాసం బనఁగన్ 35

తా॥ నిబంధపదమనే దానికి అంగాలైన యతి, ప్రాస మొదలైనవి చెప్పబడుతున్నై. నాలుగు పాదాల మొదళ్లలోను మధ్యభాగాల్లోను సజాతీయవర్ణం ఉండటం యతులు అనిపించుకుంటాయి. నాల్గు పాదాల్లోను పాదద్వితీయాక్షరం ఒకటిగానే రావటం ప్రాస అనిపించుకుంటుంది.

వ్యా. అంగాలంటే అవయవాలు. నిబంధపదం సావయవం. పదం శరీరంలాంటిదైతే యతులు, ప్రాసలు, మొదలైనవి సౌష్ఠవం (symmetry) తోకూడిన కాళ్లు చేతుల్లాంటి అవయవాలు.

ఈనిబంధపదం వృత్తబంధంగా ఉంటుంది. అంటే నాలుగు పాదాలుగా ఉంటుంది. ఈనాలుగు పాదాల్లోను పాదాదిలో ఉండే అక్షరంతో సజాతీయమైన అక్షరం పాదమధ్యంలో రావటం యతి. నాలుగు పాదాల్లోను నాలుగు యతులు ఉంటాయి. ఏపాదం యతి ఆపాదానిదే. కాని సజాతీయాక్షరం వచ్చే యతిస్థానం మాత్రం నాల్గు పాదాల్లోను ఒకేచోట వస్తుంది. పాదమధ్యంలో రావటంఅనేది సామాన్యసూత్రం. ఒకపాదానికి 16 మాత్రలుంటే సగానికి 8 మాత్రలు ఔతాయి. అప్పుడు పాదంతొలి అక్షరం 9 వమాత్ర ఉండే అక్షరము సజాతీయంగా ఉండాలి. గణాలసంఖ్యనుబట్టికూడా ఇట్లే చూచుకోవాలి. కొన్నిచోట్ల పాదమధ్యాన్నిదాటి యతి ఉండటం, ఒకటికంటె ఎక్కువ యతిస్థానాలు ఉండటం కూడా ఉండవచ్చు.

యతి అనేది చదివేవాని నాల్కకు విశ్రాంతి స్థానం. సంస్కృతభాషలోను కన్నడంలోను యతి విచ్ఛేదరూపం. యతిస్థానంలో పదమధ్యం రాకూడదు. సంస్కృతంలో పాదం చివరకూడ పదం ముగిసిపోవాలి. దీన్ని పాదాంతయతి అంటారు. 'యతిః సర్వత్ర పాదాంతే, శ్లోకార్ధేతు విశేషతః' అని పింగళచ్ఛందము.

తెనుగులో యతిస్వరూపంవేఱు. యతిస్థానంలో పదచ్ఛేదం ఉన్నా లేకపోయినా పాదం తొలి అక్షరంతో మైత్రిగల అక్షరం ఆచోట వచ్చితీరాలి. ఉదాహరణకు శార్దూలవృత్తానికి 12 యతి స్థానం. అనగా 12 అక్షరం ఉన్నచోట పదచ్ఛేదం జరగాలి. తెలుగులో 12 అక్షరం దగ్గర పదచ్ఛేదం జరిగినా జరుగకపోయినా 1 వ అక్షరంతో మైత్రిగల అక్షరం 13 వ అక్షరంగా వస్తుంది. ఇలాగ నాల్గు పాదాల్లోను యతి ఉండాలి. పదరచనలోను ఇట్లే పాదమధ్యంలో ఒకచోటగాని, ఒకటికంటె ఎక్కువచోట్లగాని యతిని నిర్వహించవచ్చు. యతి అక్షరమైత్రిచేత శ్రావ్యతకు దోహదం చేస్తుంది.

verse 35

Tr.The components of a nibandhapadam, yati, prāsa etc., are being given. Assonant letters at the beginning and middle points of all the four lines are yatis (caesura). The second letter (of all the four lines) being the same is called prāsa.

Com: The components of a nibandhapadam are like its limbs. If the text of the padam is its body yatis, prāsas are like its limbs that contribute to its fullness, symmetry and beauty.

Nibandhapada is composed in vrtta bandha, i.e. in four lines. A letter, assonant with the first letter of each line should occur at the prescribed midpoint of the line. This is called yati. Thus these are found in all the four lines. Yati, in each line is seperate depending on the first letter of that line. But the point of yati is the same in all the four lines. Middle of the line for yati is a general rule. If there are 18 mātras for a line, 8 mātras give half its length or quantity. Then the first letter of the line and the 9th mātra or letter of the line should possess assonance. In case the number of gaṇas is taken, similar is the procedure. In some places yati may be found a letter after the midpoint or in more than one place.

'Yati' is the resting point for the readers' tongue. In Sanskṛt and Kannaḍa, yati is in the form of just a break (caesura) with the word ending there and another starting at the next point.In Sanskṛt there is pādāntayati too; a word has to end at the end of a line and cannot flow into the next line. Pingalacchandas says 'yatiḥ sarvatra pādāntē ślōkārdhētu viśēṣatah'.

The concept of yati is different in Telugu. A break at the yati point is not so important as a letter assonant with the first letter of the line occuring there. For example 12th letter is the yati-point for śārdūlavikrīdita vṛtta. That means any word commenced earlier should end at this point and another word start at the next point. In Telugu whether a word ends or not at the 12th letter , a letter having assonance with the first letter of the line occurs as 13th . Thus it will be observed in all the four lines. Even in the composition of a padam yati has to be observed at the middle of the line. It can also be observed in more places than one if so desired. Yati helps the sonorousness of the song by its assonance.

పాదం రెండో అక్షరం ప్రాస. ఇదికూడ నాల్గుపాదాల్లో ఉంటుంది. 'ప్రకృష్టో వర్ణవిన్యాసః ప్రాసః' అని వ్యుత్పత్తి. ఇది రసస్ఫోరకమని సౌందర్యహేతువని చెప్తారు. తొలిపాదంలో రెండోఅక్షరంగా వచ్చిన అక్షరమే రెండవమూడవ నాల్గవ పాదాల్లోని రెండో అక్షరంగా రావాలి. కాబట్టి ప్రాస నాల్గుపాదాలకూ ఒక్కటిగానే ఉంటుంది. సంస్కృతంలో ఇలాంటి అవృత్తి శబ్దాలంకారం క్రిందికి వస్తుంది. అనుప్రాస అంటారు. కన్నడంలోను తెనుగులోను ప్రాస ఒకేవిధంగా ద్వితీయాక్షరావృత్తిగా ఉంటుంది.

యతికి ప్రాసకు ఒక్కభేదం ఉంది. యతిలో అక్షరమైత్రి అజ్ఝల్లులకు రెండింటికి ఉండాలి. ప్రాసలో వ్యంజనం ప్రధానం. అనగా, హల్లు మాత్రం వస్తేచాలు; వేర్వేరు అచ్చులతోకూడి ఉండవచ్చు. ఉదాహరణానికి ర-రి-రు-రె లు ప్రాసాక్షరాలుగా రావచ్చు. యతి ర-రా-రై-రౌ లకు, రి-రీ-ర్ఱ-రె-రే లకు, రు-రూ-రొ-రో లకు మాత్రమే చెల్లుతుంది.

పదరచనలో పాదాంత ప్రాసకూడ ఉంటుంది. ప్రతిరెండు పాదాలకు చివర అనుప్రాస నిర్వహించటం ఒకపద్ధతి. నాల్గుపాదాలకూ నిర్వహించవచ్చు.

1. అజాది పదాలు వాడేటప్పుడు ఈక్రింది అచ్చులకు పరస్పరం యతిమైత్రి ఉంటుంది.

(a) అ-ఆ-ఐ-ఔ (b) ఇ-ఈ-ఋ-ౠ-ఎ-ఏ (c) ఉ-ఊ-ఒ-ఓ (d) అచ్చులలోని అకారానికి హల్లుల్లోని య-హ లతో యతిమైత్రి, ఋకారానికి రి తో యతిమైత్రి. (e) హల్లులలో పరస్పరం యతి మైత్రి ఈక్రింది విధంగా ఉంటుంది.

క-ఖ-గ-ఘ-క్ష

చ-ఛ-జ-ఝ-శ-ష-స-క్ష

ట-ఠ-డ-ఢ — ఇవి వాడుకగా ఉండేవి. విశేషాలు చాలా ఉన్నై.

త-థ-ద-ధ

ప-ఫ-బ-భ-వ

ంప-ంఫ-ంబ-ంభ-మ

పు-ఫు-బు-భు-ము

య-హ

ర-ఱ

ల-ళ

న-ణ

జ్ఞ-న

The second letter of the line is called prāsa This also is observed in all the four lines. 'prakrişta varna vinyāsaḥ prāsaḥ' is the etymology given.It helps beauty and rasa The second letter in the first line must recur as the second letter in the second, third and fourth lines also. So prāsa is one and the same in all the four lines In Sanskrt such recurrence comes under śabdālaṃkāra. It is called anuprāsa. Prāsa is the same both in Kannaḍa and Telugu- recurrence of the second letter.

But there is one difference between yati and prasa In yati the akṣara maitri comprehends both the vowels and consonants In prāsa only the consonant is important. That means recurrence of consonant alone is enough though it may be conjoined with different vowels. For example, ra-ri-ru-re can occur as prāsa letters. Yati is possible within the groups of letters shown though the consonant is the same in all: ra-rā-rai-rau; ri-rī-ṛ-re-rē; ru-rū-ro-rō.

In pada composition pādānta prāsa (end of the line prāsa) also will be there. One way is to observe it at the end of two consecutive lines. It can be observed in all the four lines also.

1 When words beginning with vowels are used the following groups of vowels are said to have maitri (friendliness, assonance or rhyming):

a) a-ā-ai-au
b) i-ī-ṛ-ṛ-e-ē
c) u-ū-o-ō
d) a and ā among vowels have assonance with consonants 'ya' and 'ha';vowel ṛ has assonace with consonant ri
Assonance among consonants is within the groups shown:
ka-kha-ga-gha-ksa
ca-cha-ja-jha-śa-ṣa-sa-kṣa
ṭa-ṭha-ḍa-ḍha
ta-tha-da-dha
pa-pha-ba-bha-va
mpa-mpha-mba-mbha-ma
pu-phu-bu-bhu-mu
ya-ha
ra-rra(śakaṭa rēpha written as ಱ
la-ḷa
na-ṇa
jña-na

These are commonly used But there are many special types.

2. ప్రాసలో హల్లు ఆవృత్తి అయితే చాలునని చెప్పబడినా కొన్ని విశేషాలున్నై.

(a) వట్రువసుడి ఉన్నహల్లుకు వట్రువసుడిలేని హల్లుతో ప్రాసచెల్లుతుంది. సుకృత-సకియ

(b) క్రావడి ఉన్నహల్లుకు క్రావడిలేని హల్లుకు ప్రాసచెల్లుతుంది.

(c) స-ష, స-శ, న-ణ, ద-ధ, థ-ధ, ఋ-ర, ల-ళ-డ లకు పరస్పరం ప్రాసచెల్లుతుంది.

ఇక్కడకూడా విశేషాలు చాలాఉన్నై. పరిచయమాత్రంగా ఇక్కడ చూపబడినై.

2.Though it is said that the recurrence of consonant is enough for prāsa there are some special points·

a) a consonant with vowel ṛ is in prāsa with the same consonant without vowel ṛ. ex:-sukṛta-sakiya

b) a consonant conjoined with rēpha is in prāsa with the same consonant without rēpha.

c) prāsa is said to exist between the following pairs and groups:

sa - sa;
sa - śa;
na - ṇa;
da - dha;
ṛ - ra;
ḷa - la - da

There are many special points here also. The above are given by way of a brief introduction only.

క॥ మాత్రయొకటి లఘువనఁదగు
మాత్రా ద్వయమైన గురుసమాహ్వయమయ్యెన్
మాత్రా త్రయము ప్లుతంబగు
మాత్రార్ధము ద్రుతము భరత మతమునఁజెలఁగున్ 36

తే॥గీ॥ పూని తాళక్రియాలసన్మాన మునకుఁ
దాళశబ్దంబు వర్తించు ధరణినదియు
దేశి యును మార్గమును నాఁగఁదేజరిల్లు
ధన్య భరతాది బహుసంప్రదాయ లీల. 37

తా॥ ఒక్కమాత్రకు లఘువనిపేరు. రెండు మాత్రలు గురువు. మూడు మాత్రలు ప్లుతం. అర్ధమాత్ర ద్రుతం. భరతమతంలో ఇలాగచెల్లుతుంది. (36)

పనిబడి తాళక్రియతో కొలవటానికే తాళం అనిపేరు. లోకంలో ఆతాళం భరతాదుల సంప్రదాయాలను అనుసరిస్తూ 'మార్గ' అని 'దేశి' అని రెండు రకాలుగా ప్రకాశిస్తున్నది. (37).

వ్యా॥ ఈ రెండు పద్యాలు తాళాన్ని గురించి పలుకుతున్నాయి. 34 పద్యంలో మాత్రా నీకాలు చెప్పి తాళసంగతులు చెప్పబడినై. ఇక్కడ మరలా మాత్రలను గూర్చి తాళాన్ని గూర్చి ప్రసంగింపబడుతున్నది.

మాత్రలను గురులఘువులను గూర్చి చెప్పే పద్యం ఛందస్సుకు సంబంధించిందని ఎందుకనుకోరాదు? ఛందస్సులో గురులఘువులతోడి గణాలుండవచ్చు, మాత్రాగణాలుండ వచ్చు. కాని ద్రుత ప్లుతాలకు అందులో తావులేదు. కనుక రెండు పద్యాలు తాళపరాలే అనిగ్రహించాలి.

'తల ప్రతిష్ఠాయాం' అనే ధాతువు వలన 'తాల' శబ్దం వచ్చింది. గీత నృత్తవాద్యాలు దీనిలో ప్రతిపాదింపబడుతాయి కనుక 'తాల' మనిపేరు. లఘ్వాదులచేత సశబ్దనిశ్శబ్ద క్రియలచేత గీత వాద్యనృత్తాదుల కాలం కొలువబడుతుంది. కనుక 'తాల' మనేది ప్రధా నంగా కాలసంబంధమైంది. తాలానికి (1) కాలం (2) మార్గం (3) క్రియ (4) అంగం (5) గ్రహం (6) జాతి (7) కల (8) లయ (9) యతి (10) ప్రస్తారం అని పది ప్రాణతుల్యమైన అంశాలు చెప్పబడినై. వీటిలో మొదటి 5 ముఖ్యప్రాణాలు రెండో 5 అముఖ్యప్రాణాలు. ఇక్కడ తొలిపద్యం కాలానికి సంబంధించింది.

సంగీతంలో కొలతకు వచ్చేకాలానికి లోకంలో మనం చెప్పుకొనేకాలానికి వ్యత్యాసం ఉంది. సంగీతంలో (1) సూక్ష్మకాలం (2) స్థూలకాలం అని కాలం రెండురకాలు. నూఱు తామరరేకులను ఒకదానిమీద ఒకటి పేర్చి సూదితో గ్రుచ్చితే ఒకరేకు తెగటానికి పట్టేకాలం క్షణం. అలాంటి క్షణాలతో ఈక్రింది సూక్ష్మకాలాలు ఏర్పడుతున్నై.

verse 36-37

TR: One mātra is called laghu; two mātras go under the name of guru; three become pluta; half a mātra is druta. This is according to Bharata's school (36).

Measuring the time with tāla kriya is called tāla. That tāla is of two kinds: 'mārga' and 'dēśi' , following the traditions of Bharata and others (37).

Com: These two verses speak about tāla. In verse 34 tāla is mentioned after mentioning mātras Here again mātras and tāla are taken up for mention as componets of nibaddhapadam.

Can't we consider this verse which speaks of gurus and laghus as related to prosody? No. There may be gurus and laghus or mātrā-gaṇas in prosody; but druta and plúta have no real place there. So both the verses are to be considered related to tāla.

The word 'tāla' is derived from the root 'tala pratiṣṭhāyām'. Because gīta, nṛtta and vādya are enunciated in this it is called tāla It pertains to time factor as the time intervals in gīta, vādya and nṛtta are measured by laghu etc. as also by the saśabda and niśśabda kriyas. Ten vital factors, called prāṇas, of tāla are enumerated: (1) kāla (2) mārga (3) kriyá (4) anga (5) graha (6) jāti (7) kalā (8) laya (9) yati and (10) prastāra. They pertain to the various modes of operation related to tāla. The first five are said to be primary and the second five secondary just as in the case of prāṇas. Here the first verse relates to kāla (time factor).

The time we usally recon in our daily life and the time that comes for measurement in music are not the same.In music it is of two kinds (1) sūkṣma (subte) and sthūla (gross). The time taken by a sharp needle to pierce a lotus petal in a pile of hundred such is called a kṣaṇa. The following are the units of subtle time made up of such kṣanas.

8 క్షణాలు = 1 లవం

8 లవాలు = 1 కాష్ట

8 కాష్టలు = 1 నిమిషం

8 నిమిషాలు = 1 కళ

2 కళలు = 1 చతుర్భాగం

2 చతుర్భాగాలు = 1 అనుద్రుతం

ఇటుమీద చెప్పేవి స్థూలకాలాలు:

2 అనుద్రుతాలు = 1 ద్రుతం

2 ద్రుతాలు = 1 లఘువు

2 లఘువులు = 1 గురువు

3 లఘువులు = 1 ప్లుతం

4 లఘువులు = 1 కాకపాదం

పద్యంలో ద్రుతం అనేది అర్ధమాత్ర అనిచెప్పబడింది కనుక రెండు ద్రుతాలు 1 మాత్ర అవుతుంది. అదే లఘువని చెప్పబడింది. అలాగే 2 లఘువులు, మాత్రాద్వయం, గురువనబడింది. మూడులఘువులు ప్లుతమనబడింది. పైవాటిలో (1) అనుద్రుతం (2) ద్రుతం (3) లఘువు (4) గురువు (5) ప్లుతం (6) కాకపాదం అనే ఆఋన్ను తాళానికి నాలుగో ప్రాణమైన షడంగాలు. ఈనాడు గురు, ప్లుత, కాకపాదాలు వచ్చే తాళాలు ఏవీ వాడుకలోలేవు. ఇప్పుడు వాడుకలో ఉండే తాళాల్లో అనుద్రుతం, ద్రుతం, లఘువు అనే మూడు అంగాలు మాత్రమే వస్తాయి. వీటికి హ్రస్వాక్షరాలకాలం, గుర్తులు ఇలా ఉంటాయి.

| <u>అంగం</u> | <u>హ్రస్వాక్షరసంఖ్య</u> | <u>గుర్తు</u> |
|---|---|---|
| అనుద్రుతం | 1 | U |
| ద్రుతం | 2 | O |
| లఘువు | 4 | I |

అనుద్రుతం నుండి కాకపాదం దాక ప్రస్తారం చేస్తే 16 అంగాలు వస్తాయి. వాటిలో మూడు మాత్రమేపైన చూపబడినై. ద్రుతవిరామమనే అంగానికి 3 హ్రస్వాక్షరాలు. గుర్తు UO. తాళంలో వచ్చే లఘువు సాధారణంగా నాల్గు హ్రస్వాక్షరాలను ఉచ్చరించడానికి పట్టేకాలం (ఛందస్సులో లాగ 1 హ్రస్వాక్షరోచ్చారణ కాలం కాదు).

| | |
|---|---|
| 8 ksaṇas | - 1 lava. |
| 8 lavas | - 1 kāsta |
| 8 kāṣtas | - 1 nımışa |
| 8 nımışas | - 1 kalā |
| 2 kalās | - 1 caturbhāga |
| 2 caturbhāgas | - 1 anudruta |

The followıng are the sthūla kāla (gross) unıts.

| | |
|---|---|
| 2 anudrutas | -1 druta |
| 2 drutas | -1 laghu |
| 2 laghus | -1 guru |
| 3 laghus | -1 pluta |
| 4 laghus | -1 kākapāda |

---

Since the verse says half a mātra ıs druta, two drutas make one mātra whıch ıs called laghu, sımılarly two laghus make a guru, three laghus a pluta Among the above unıts (1) anudruta (2) druta (3) laghu (4) guru (5) pluta and (6) kākapāda are the sıx that are called sadaṅgas as the fourth vital element of tāla ·-'aṅga'. Now , tālas where guru, pluta and kākapāda are used are no longer ın use; the tālas ın use today have only three aṅgas namely anudruta, druta and laghu The followıng are the duratıons of utterance of short letters and theır symbols

| anga | No.of shortletters | symbol |
|---|---|---|
| anudruta | 1 | U |
| druta | 2 | O |
| laghu | 4 | l |

It prastāra ıs done from anudruta to kākapāda it yields 16 angas. Only three of them are shown above wıth symbols Drutavırāma takes three short letters Its symbol ıs U O The laghu that occurs in a tāla generally sıgnıfies now the tıme taken to utter four short letters (It is not the tıme taken to utter one short letter as we fınd ıt in prosody)

తాళమనేది గీత వాద్యనృత్తాల్లో కాలాన్ని కొలచటం అని చెప్పబడింది. ఈకొలిచే పద్ధతికే 'క్రియ' అనిపేరు. ఇది తాళదశప్రాణాల్లో మూడోదిగా చెప్పబడింది. 37 వ పద్యంలో తాళక్రియతో కాలాన్ని కొలచటానికే 'తాళ' శబ్దం వర్తిస్తుందని చెప్పబడింది. ఈ 'క్రియ' (కొలవడం) అనేది సశబ్దక్రియని నిశ్శబ్దక్రియఅని రెండు రకాలు. చేతిమీద చేతితో చప్పుడయ్యేటట్లుగా దెబ్బవెయ్యటం సశబ్దక్రియ. దీన్నే 'ఘాత' అంటారు. వ్రేళ్లతో చిటిక వెయ్యటం కూడా సశబ్దక్రియే. దీన్ని 'ధ్రువం' అంటారు. చేయి విసరటం లాంటిది నిశ్శబ్దక్రియ.

ఈతాళాలు మార్గతాళాలనీ దేశ్యతాళాలని రెండురకాలు. నాట్యశాస్త్రంలో (1) చచ్చత్పుట (2) చాచపుట (3) షట్పితాపుత్రక (4) సంపద్వేష్టాక (5) ఉద్ఘట్టక - అనే 5 తాళాలు చెప్పబడినై. నారదుని 'సంగీత మకరందం' లోను పార్శ్వదేవుని 'సంగీతసమయసారం' లోను 101 తాళాలు చెప్పబడినై. సంగీతరత్నాకరంలో 120 దేశ్యతాళాలు చెప్పబడినై. వీటిలో రత్నాకరకర్త శార్ఙ్గదేవుడు చెప్పినవి రెండు చేరినై. ఈతాళాలకు గురులఘువులతోడి గణాలతో లేదా సంకేతాక్షరాలతో అంగాలు చెప్పబడినై. తెనుగు సాహిత్యంలో పాలకురికి సోమనాథుడు తన కాలంలో ఉండిన 108 తాళాల పేర్లు చెప్పినాడు. ప్రాచీనులు చెప్పిన పేర్లకు ఇతడిచ్చిన పేర్లకు కొన్ని తేడాలు కనిపిస్తున్నె. సోమనాథుడు చెప్పిన తాళాల పేర్లివి : (1) చంచుపుట (2) జాచపుట (3) షడ్గీత (4) ఉత్పుట (5) మోచిత (6) సమతాళ (7) సత్రచ్ఛేద (8) ఎగ (9) బొంబడ (10) ఎడ (11) హడ (12) గారు (13) హడక (14) బంధకరణ (15) బాడకరణ (16) క్రౌంచపద (17) సరకరణ (18) ఆస్థానమండప (19) ఫల (20) చక్రవాక (21) కలహంస (22) ఆర్య (23) లలిత (24) సరళ (25) విరళ (26) ఉమామందిర (27) మత్తమాతంగ (28) రథ్య (29) మర్ధి (30) ముదవ (31) బంధమర్థి (32) రూపక (33) ఏక (34) మడ (35) ఖండితతర (36) అఖండ (37) కంకాళ (38) ఖండిత చండకి (39) ఖండవర్ణ (40) అవిఘూర్ణిత (41) కుటిలఘూర్ణిత (42) గోష్టి (43) అర్ణ (44) కచ్చన (45) అణ (46) ఆదిమాతృక (47) తరక్షణపుత్రి (48) ఉద్వీక్షణ (49) ఉచ్చవటి యుక్షోళిక (50) చటిక (51) యుష్టిక (52) పూర్వకంకాళ (53) మణిమిశ్ర కంకాళ (54) ఖండ కంకాళ(55) కావ్యకంకాళ (56) పంచాళి (57) భిన్నక (58) కోకిల ప్రియ (59) నిరవద్య (60) రన్న (61) కుంజర (62) ఫణి రాజ (63) చతురశ్రధార (64) కృత్యచ్ఛ (65) విద్యాధర (66) రక్తధార (67) ఉత్తమమేరు (68) తాంబూలియాణ (69) మలపు (70) ఉత్ఫుల్లిక (71) మాతంగ (72) అర్ధకళిక (73) సరస్వతి (74) కంఠాభరణ (75) మిశ్ర (76) సమ్మిశ్రవాద (77) సింహవిక్రీడిత (78) సింహనాద (79) సింహనంద (80) లక్ష్మీస్తన (81) ముక్త (82) పంచబ్రహ్మ (83) దశరుద్ధ (84) పంచ (85) చాయణ (86) పరి

Earlier it has been stated that tāla is measurement of time in gīta, vādya and nrtta. The mode of measurement is called 'kriya'. This is enumerated as the third vital element of tāla among the ten The 37th verse says the term tāla applies to measurement of time by tālakriya. This 'kriya ' (operation of measurement) is of two kinds: (1) saśabda kriya and (2) niśśabda kriya Beating of time by beat of one hand on the other so as to give out a sound is sasabda kriya It is called 'ghāta' or 'the stroke'. Snapping one's fingers is also 'sa śabda kriya', It is called 'dhruvam' A mere waving of the hand one way or the other is 'niśśabda kriya'

Tālas are of two varieties: 'mārga' and 'dēśi' 'Nātya sāstra' mentions five mārga tālas only: (1) caccatpuṭa (2) cācapuṭa (3) satpitāputraka (4) sampadve-stāka and (5)udghaṭṭaka Sangīta Makaran da of Nārada; Sangīta Samaya Sāra' of Pārśvadēva enumerate 101 tālas. Sangīta Rantnākara gives 120 dēśya tālas including two created by Sārngadēva himself The angas for these tālas are given by symbolic letters or ganas comprising gurus and laghus In Telugu literature Pālakuriki Sōmanātha (13c) has enumerated the names of 108 tālas prevalent in his time; but some names are different from those given by ancients The names of tālas given by Sōmanātha are .

1 cancupuṭa. 2.Jācaputa (3) sadgīta (4) utputa (5) mōcita (6) sama (7) sattracchēda (8) ega (9) bombada (10) eda (11) haḍa (12) gāru (13)hadaka (14) bandhakarana (15) bādakarana (16) krauncapada (17) sarakaraṇa (18) āsthānamandapa(19)phala (20)cakravāka(21)kalahaṃsa (22)ārya (23) lalita (24) sarala(25)virala (26)umā-mandira (27)mattamātaṇga (28)rathya (29)matthe (30) mudava (31) bandhama-gthe (32)rūpaka (33)ēka (34)maḍa (35) khanditatara (36)avakhanda (37)kankāla (38)khandita candaki (39)khanda varna (40) avighūrnita (41) kutilaghūrnita (42)gosthi (43)arna (44) kaccana (45)āna (46)ādimātrka (47)taraksnaputri(48)u-dvīksaṇa(49)uccāvati yaksōlika (50) catika (51)yastika (52) pūrva kaṃkāla(53)ma-nimiśrakankāla (54) khandakankāla (55) kāvya kankāla(56)pancāli (57)bhinnaka (58)kōkilapriya (59)niravadya (60)ranna (61)kunjara (62)phanirāja (63)caturaśra-dhāra (64)krtyaccha (65)vidyādhara (66)raktadhāra (67)uttamamēru (68)tāmbūli-yāṇa (69)malapu (70)utphullika (71)mātaṅga (72)ardhakaḷika (73)saraswati (74)kanthābharana (75)miśra (76)sammiśra vāda (77)simhavikrīdita (78) simhana-da (79)simhananda (80)lakṣmīstana (81)mukta (82)panca brahma (83)daśaruddha (84) panca (85)cāyana (86) pari (87)prasakta (88)khura (89)visarakhura (90)uttara

(87) ప్రసక్త (88) ఖుర (89) పెసరఖుర (90) ఉత్తర (91) పంచబాణ (92) హరిణ (93) మాయాఖణ (94) ఆదికంకాణ (95) ఖంజర (96) చతురశ్ర ఖంజర (97) కృష్ణఖంజర (98) అనమాన ఖంజర (99) లక్షవతి (100) ధ్రువ (101) లయ (102) తనుభద్ర (103) లక్షణయాణ (104) విలంబిత (105) ఆదిమర్థ (106) వళి (107) ధ్రువమర్థ (108) జంపెమర్థ (పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణం)

పేర్లు తెలిసినా ఈ తాళాల స్వరూపం తెలియరాదు. ప్రాచీనులు చెప్పిన తాళాలతో సంవదించే వాటి అంగాలు తెలుసుకోవచ్చు.

దక్షిణ భారతీయ గానంలో నేడు ప్రచారంలో ఉన్న తాళాలు ఏడు. వాటి పేర్లు, అంగాలు క్రింద చూపబడుతున్నై.

| తాళం పేరు | అంగాలు |
|---|---|
| (1) ధ్రువతాళం | I0II |
| (2) మఠ్య | I0I |
| (3) రూపక | 0I |
| (4) జంపె | IU0 |
| (5) త్రిపుట | I00 |
| (6) ఆట | II00 |
| (7) ఏక | I |

తాళాలు త్ర్యశ్ర, చతురశ్ర భేదంతో రెండు రకాలు. ఈ రెండూకలపితే మిశ్రమనే భేదం వస్తుంది. మిశ్ర త్ర్యశ్రలను కలిపి రెండుగా ఖండిస్తే ఖండజాతి వస్తుంది. ఖండ చతురశ్రాలను కలిపితే సంకీర్ణ జాతి వస్తుంది. లఘువుకు ఈవిధంగా విలువను మార్పు టంతో అది 5 రకాలైనై 7 తాళాలు 7 X 5 = 35 రకాలు అయినై. పంచలఘువుల వివరాలివి.

| లఘువు పేరు | విలువ | మాత్రలు | గుర్తు | గణనం |
|---|---|---|---|---|
| త్ర్యశ్ర లఘువు | 3 అక్షరాలు | 3/4 | $1^{3}$ | ఘాతవేసి 2వ్రేళ్ల ఎంచాలి |
| చతురశ్ర లఘువు | 4 అక్షరాలు | 1 | $1^{4}$ | ఘాతవేసి 3వ్రేళ్ల ఎంచాలి |
| మిశ్ర లఘువు | (3+4) = 7 అక్షరాలు | 1 3/4 | $1^{7}$ | ఘాతవేసి 6వ్రేళ్ల ఎంచాలి |
| ఖండ లఘువు | $\frac{7+3}{2}$ = 5 అక్షరాలు | 1 1/4 | $1^{5}$ | ఘాతవేసి 4వ్రేళ్ల ఎంచాలి |
| సంకీర్ణ లఘువు | (5+4) = 9 అక్షరాలు | 2 1/4 | $1^{9}$ | ఘాతవేసి 8వ్రేళ్ల ఎంచాలి |

(91)pancabāna (92)hariṇa (93)māyākhaṇa (94)ādıkaṅkāna (95)khanjara (96)caturaśra khanjara (97)kṛṣṇakhanjara (98)asamāna khanjara (99)lakkhavatı (100) dhruva (101) laya (102)tanubhadra (103)lakkhanayāṇa (104)vilambita (105)ādimatthe (106) vaḷi (107) dhruvamaṭṭhe (108) jampe maṭṭhe .(Pandıtārādhaya caritra-parvata prakaraṇa).

Though the names are known their forms are not known The angas of those that correspond with the more ancient ones can perhaps be known .

In south Indıan music there are seven tālas in use today Their names and aṇgas are given below

| Name of tāla | aṅgas |
|---|---|
| 1.Dhruva | 1011 |
| 2.Mathya | 101 |
| 3.Rūpaka | 01 |
| 4.Jaṁpe | 1U0 |
| 5.Tripuṭa | 100 |
| 6.Āta | 1100 |
| 7.Ēka | 1 |

Tālas are generally of. two kjinds depending on the value gıven to laghu. If the value ıs 3 short letters it ıs tryaśra. If the value is 4 short letters it is caturaśra. Other vaneties arise out of these two. If tryaśra and caturaśra are mixed we have a miśra jāti laghu whose value ıs 7 short letters If tryaśra ıs added on to this miśra and cut into two (7+3=10/2=5) we get a khanda jātı laghu wıth the value of 5 short letters. If a caturaśra laghu is added on to the khanda laghu we get what is called a sankīrṇa laghu wıth 5+4=9 short letters. By changıng the value of laghu thus the above shown seven tālas multıply themselves into 7x5=35 varieties. The details of the type of laghus are given below.

| Name of laghu | Value in no letters (short) | matras | symbol | counting |
|---|---|---|---|---|
| 1. trya'śra laghu | 3 | 3/4 | $1^3$ | 1 beat and count 2 fingers |
| 2.caturaśra laghu | 4 | 1 | $1^4$ | 1 beat count 3 fingers |
| 3.miśra laghu (3+4) | 7 | $1^3/_4$ | $1^7$ | 1 beat and count 6 fingers |
| 4. Khanḍa laghu (7+3/2) | 5 | $1^1/_4$ | $1^5$ | 1 beat and count 4 fingers |
| 5. sankīrṇa laghu (5+4) | 9 | $2^1/_4$ | $1^9$ | 1 beat and count 8 fingers |

తాళం వెయ్యటంలో వచ్చే సశబ్ద నిశ్శబ్ద క్రియలు కూడా మార్గదేశి భేదంతో రెండు రకాలు. దేశ్యక్రియలు మాత్రం ఇక్కడ చెప్పబడుతున్నై.

<u>సశబ్దక్రియ:</u> ధ్రువకం. చప్పుడయ్యేటట్లుగా కుడిచేత్తో దెబ్బవెయ్యటం లేదా వ్రేళ్లతో చిటిక వెయ్యటం.

<u>నిశబ్దక్రియలు:</u>

(1) సర్పిణి : చేతిని ఎడమవైపునకు విసరటం

(2) కృష్య : ఎడమకు ఉన్న చేతిని కుడివైపునకు విసరటం

(3) పద్మిని : అరచేయి క్రిందకు మళ్లించి చేయిచాచుట

(4) విసర్జితం : అధోముఖ హస్తాన్ని వెలుపలికి విసరటం

(5) విక్షిప్తం : అలా విసరినచేతి వ్రేళ్లను ముడుచుట

(6) పతాక : చేతిని పైకి విసరుట

(7) పతిత : పైకి విసరిన చేతిని క్రిందికి తెచ్చుట

అనుద్రుతానికి ధ్రువకమనే సశబ్దక్రియ వాడాలి. ద్రుతానికి ధ్రువకమనే సశబ్దక్రియ, విసర్జిత అనే నిశ్శబ్దక్రియ వాడాలి. అంటే ఘాతవేసి పిమ్మట చేతిని వెనక్కి విసరాలి. ఇది రెండక్షరాల కాలం అవుతుంది. ఇంక లఘువుకు ధ్రువకమనే సశబ్దక్రియ, విక్షిప్త అనే నిశ్శబ్దక్రియ వాడాలి. ముందు ఘాతవేసి ఆపిమ్మట చిటికెన వ్రేలు మొదలుగా ఆ లఘుజాతికి తగినట్లు వ్రేళ్ళు లెక్కించాలి.

పురందరదాసు ఈ దేశ్యతాళాలు 35కి స్వరసంచారంతో అలంకారాలు కూర్చినాడు. వీటిసాధన వల్ల స్వరజ్ఞానం తాళజ్ఞానం కలుగుతాయి. ఉదాహరణకు ధ్రువతాళానికి 1011 (లఘువు, ద్రుతము లఘువు లఘువు) అంగాలు. దీంట్లోని లఘువు చతురశ్రజాతి లఘువు అనుకొంటే అప్పుడు దానికి 10 ఆవర్తాలతో

సరిగమ / గరి / సరిగరి / సరిగమ.

(లఘువు) (ద్రుతం) (లఘువు) (లఘువు)

అనే స్వరసంచారంతో ప్రారంభం ఉంటుంది. తొలిఖండంలో 5 ఆవర్తాలు మలిఖండంలో 5 ఆవర్తాలు ఉంటాయి. తొలిఖండంలో మధ్యస్థాయి షడ్జస్వరంతో ప్రారంభం. మలిఖండంలో తారస్థాయి షడ్జస్వరం. తొలిఖండం చివరి ఆవర్తంలో చివర తార షడ్జం ఉంటుంది. మలిఖండం చివరి ఆవర్తం చివర మధ్యషడ్జం ఉంటుంది. తొలిఖండపు స్వర ప్రస్తారాలు ఆరోహణ క్రమంలోను మలిఖండపు స్వరప్రస్తారాలు అవరోహణ క్రమంలోను ఉంటాయి. ఒక్కొక్క తాళాక్షరానికి ఒక్కొక్క స్వరం చొప్పున ఉంటుంది.

The saśabda and niśśabda kriyas in tāla also are of two kinds:

mārga kriyas and dēśyakriyas·Only dēśya kriyas are described below·

Saśabda kriya: It is called dhruvaka: A beat with the right palm on the left causing sound or snapping one's fingers similarly

niśśabda kriyas:

1 sarpini: waving the palm to the left
2. krsya· waving the palm in the left to the right
3. padmini: turning the palm downwards and stretching the hand
4 visarjita: palm facing downwards is waved outwards
5 viksipta:bending the fingers of the hand so waved
6.patāka . waving the hand upwards.
7 patita: bringing the hand downwards so waved

In tāla, an anudruta is counted by the saśabdakriya called dhruvaka; for a druta it is a saśabda kriya dhruvaka and niśśabda kriya called visarjita It means a beat and then waving the palm backwards It is equal to a duration of 2 short letters . For a laghu, saśabda kriya dhruvaka and niśśabda kriya viksipta are used That means a beat first and then counting the fingers starting with the small finger and one less than the value of laghu ( The beat itself counts for one letter)

Purandaradasa is said to have composed alamkāras for all the 35 varieties of tālas with svara sancāra. Practising these is said give svarajñana and tālajñāna to the student For example dhruva tāla has the aṅgas 1011 (laghu, druta,laghu and laghu). Suppose the laghu belongs to caturaśrajāti then the alamkāra will start with

sa ri ga ma / ga ri/ sa ri ga ri/sa ri ga ma
(laghu) (druta) (laghu) (laghu)

and will have 10 rounds or āvartas.

The entire svarasancāra can be written down based on the following principles: The first half and second half will have equal number of āvartas i.e 5 and 5 in the present case The first half starts with madhyasthāyi sadjasvara and the second half starts with tārasthāyai sadjasvara. The last round of the first half will have tārasadja; similarly the last round of the second half will have madhyaṣadja. The svaraprastāra in the first half will be in ascending note (arōhana ) and that of the second half will be in descending note (avarōhana krama) Each tāla letter will be represented by one svara

1. తెనుగులో పాలూరి గోవిందకవి ఈక్రింది గ్రంథాలు రచించాడు.

(a) తాళదశ ప్రాణప్రదీపిక - తంజావూర్ సరస్వతీమహల్ లైబ్రరీవారి ప్రచురణ (13)(1950)

(b) రాగాతాళచింతామణి - గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాసు సీరీస్ L xxxx1 - (1952)

2. అనుద్రుతానికే విరామం, వ్యంజనం, అవ్యక్తం, అనునాసికం అనే పేర్లుకాడా ఉన్నై. ద్రుతానికి వలయుం, బిందుకం, వ్యోమం, అర్ధమాత్ర అనిపేర్లు. లఘువుకు కళ, హ్రస్వం, మాత్ర అని పేర్లు.

3. లఘువు జాతి (త్ర్యశ్ర, చతురశ్రాది) ననుసరించి తాళం భేదిస్తుంది. పద్యాల త్ర్యశ్ర, చతురశ్రాది గతులననుసరించి కొన్ని వృత్తాలు ఆయాగతులకు బాగుంటాయని తలచటం సహజమే. ఏగతిలో ఏయే వృత్తాలు నడుస్తాయో కొన్ని ఉదాహరణలు సూచింపబడుతున్నవి.

(1) త్ర్యశ్ర గతి (3 మాత్రల గణాలు) - సుగంధి, విచికిలిత, పంచచామరం వగైరా.

(2) చతురశ్ర గతి (4 మాత్రల గణాలు) - తోదకం, తోటకం, ప్రహరణ కలిత, మణిగణనికరం, విద్యున్మాల, మానిని, సరసిజం, క్రౌంచపదం, కవిరాజవిరాజితం వగైరా.

(3) ఖండగతి (5 మాత్రల గణాలు) - స్రగ్విణి, త్వరితగతి, వనమయూరం, భుజంగ ప్రయాతం, పద్మనాభం, లయగ్రాహి, లయవిభాతి, లయహారి, మంగళమహాశ్రీ, దండకం వగైరాలు

(4) మిశ్రగతి (7 మాత్రల గణాలు) తరల, మత్తకోకిల వగైరా

రగడ భేదాలు యక్షగానాల్లో వాడబడుతాయి. ఆభేదాలు వాటికి సంబంధించిన తాళాలు 50 పద్యం క్రింద ఇయ్యబడును.

1 In Telugu, Pōlūri Gōvindakavi has written the following two treatises on tāla.

(a)Tāla Daśa Prāna Pradīpika-published by Tanjore Saraswati Mahal Library S.No.13 (1950)
(b)Rāga Tāla Cintamāni published by Government Oriental Mss. Library, Madras-5. Series Lxxxx1 (1952)

2 a anudruta is also variously called virāma, vyañjana, avyakta and anunāsika.
b.druta is also variously called valayam, binduka, vyōma and ardhamātra.
c. laghu is also variously called kala, hrasva, sarala and mātra

3.Depending on the jati of laghu the tāla varies considerably It is natural that certain vṛttas are considered suitable for tryaśra, caturaśra etc gati-s Some examples are given below.

| | | |
|---|---|---|
| 1 | tryaśra gati (gaṇas with 3 mātras) | Sugandhi, Vicikilita, Pancacāmaram etc |
| 2. | caturaśra gati (gaṇas with 4 mātras) | Tōdaka, Tōṭaka, Praharanakalita, Maniganānikara, Vidyunmāla, Mānini, Sarasija, Krauncapada, Kavirājavirājita etc ; |
| 3. | khandagati (ganas with 5 mātras) | Sragvini, Tvaritagati, Vanamayūra, Bhujaṃgaprayāta, Padmanābha, Layagrāhi, Layavibhati, Layahāri, Mangalamahāsri Danḍaka etc., |
| 4. | miśragati (gaṇas with 7 mātras) | Tarala, Mattakōkila etc. |

Different kinds of ragaḍas are used in yakṣagānas... Those varieties and their tālas will be given under verse 50

వ॥ ముందు జెప్పిన నిబంధనామ పదంబునకు నవయవంబులైన యవాంతరపదంబులకు నామంబు లెయ్యవి యనిన

క॥ మొదలుద్గ్రాహము, రెండవ
యది మేళాపము, తృతీయమగు ధ్రువ, మటపై
గదిసిన యది యంతర, మా
తుది నాభోగంబు ముద్రతోఁ జెలువొందున్ 38

తా॥ ముందు చెప్పిన నిబంధ పదమనే దానికి అవయవాలైన విడిపదాలకు పేర్లువివంటే పదం ఎత్తుకోగానే వచ్చేది ఉద్గ్రాహం, రెండోదశలో వచ్చేది మేళాపం, మూడోది ధ్రువం, ఆమీదట వచ్చేది అంతరం, అటుపై చివరగా వచ్చేది ముద్రతోకూడి ఆభోగం అనేపేరుతో అందంగా ఉంటుంది.

వ్యా॥ నిబద్ధపదానికి అంగాలైన యతిప్రాసలను తాళాన్ని గూర్చిపలికి పదానికి అవయవాలైన భాగాలకు పొసగే పేర్లను గూర్చి ఇక్కడ చెప్తున్నాడు. 26 పద్యంలో కూర్చినపదాన్ని శరీరంగా దర్శించి ఆకూర్పునకు ఆధారంగా నిల్చిన వృత్తబంధాల్ని (ఛందస్సుల్ని) ధాతువులుగా చెప్పాడు. అక్కడ పాట రూపంగా ఉండే శరీరానికి ధాతువులను చెప్తే ఇక్కడ ఆపాటలోని భాగాలకు పేర్లను చెప్తున్నాడు.

ఇక్కడ ఒక అంశం గమనించాలి. పదశరీరానికి వృత్తబంధం అనేది (ఛందస్సు) ఒక్కటేకదా అందుచేత ధాతువుకూడా ఒక్కటే అనుకోరాదు. శరీరానికి కారణాలైన వాతపిత్త శ్లేష్మాలనే మూడు ధాతువులు చెప్పబడినై. అవివేర్వేరైనా ధాతుత్వం అనే లక్షణం వాటిలో సామాన్యం. అలాగే వృత్తబంధం అనబడిన ఛందస్సు అక్కడ సామాన్యం అని అదేఛందస్సులో పదశరీరమై భిన్నధాతుకాలైన మూడు చరణాలైనా ఉంటాయని గ్రహించాలి. శరీరం త్రిధాతుకమైనట్లుగానే పదము త్రిధాతుకమనేభావం దీనికాధారం.

సంగీతశాస్త్ర గ్రంథాల్లో ధాతువులని చెప్పబడ్డ ఉద్గ్రాహాదుల్నే మనగ్రంథకర్త ఇక్కడ చెప్తున్నాడు.

గ్రంథకర్త పదంలోని అవాంతరపదాలకు (విడిభాగాలకు) చెప్పినవి. (1) ఉద్గ్రాహం (2) మేళాపం ( 3) ధ్రువం (4) అంతర (5) ఆభోగం. సంగీత రత్నాకరం వీటిని ధాతువులుగా చెప్పి వివరించిన శ్లోకాలివి:

Verse 38

Tr: The Pallavi appropriate to the component individual words of the aforesaid nibandhapadam is being given. That which comes at the starting of the padam is 'udgrāha'; at the second stage 'mēlāpa'; at the third 'dhruva'; next comes 'antara' and after that, lastely, comes the beautififul 'ābhōga' with mudra.

Com. After speaking about yati, prāsa and tāla as the limbs of nibaddhapadam, the author proceeds to say about the 'pallavi' appropriate to the component individual words of padam. In verse 26 the author, viewing the text of the composed sông as its grossbody, spoke of the vṛttabandhas ( the prosodical movements ) supporting the composition as dhātus: while he gave the dhātus for the body of the song there, here he is giving 'pallavi', suitable for the individual parts.

Here we have to take note of a point. The body of a song is in a single vṛttabandha or chandas. Bus that does not mean the dhātu also is one. Vāta, pitta and ślēṣma these three dhātus are given as causes for the human grossbody. Though the three are different the dhātutva (being in the nature of humour) is the common factor. Similarly the prosodical inner movement called vṛttabandha is the common factor in the padam. There will be at least three caraṇas with three different dhātus constituting the body of a padam. Just as the physical body is said to have been constituted by three dhātus the body of a padam also is considered to have been constituted by three dhātus. This idea underlies the whole thinking. The author is mentioning the five dhātus, udgrāha etc., mentioned in works like S. R.

Those that are called dhātus of a padam by the author are (1) udgrāha (2) mēlāpa (3) dhruva (4) antara and (5) ābhōga. S. R. deals with them in the following ślōkas:

"ప్రబంధావయవో ధాతుః స చతుర్ధానిరూపితః
ఉద్గ్రాహః ప్రథమ స్తత్ర తతో మేలాపక ధ్రువౌ ॥
ఆభోగశ్చేతి తేషాంచ క్రమాల్లక్ష్మాభిదధ్మహే
ఉద్గ్రాహః ప్రథమో భాగ స్తతో మేలాపకః స్మృతః ॥
ధ్రువత్వాచ్చ ధ్రువః పశ్చాదాభోగస్త్వన్తిమో మతః
ధ్రువాభోగాంతరే జాతో ధాతురన్యో న్తరాభిధః ॥
సతు సాలగసూడస్థ రూపకేష్వేవ దృశ్యతే
వాతపిత్తకఫా దేహ ధారణా ద్ధాతవోయథా ॥
ఏవమేతే ప్రబంధస్య ధాతవోదేహధారణాత్
తత్ర మేలాపకా భోగా నభవేతాం క్వచిత్క్వచిత్"॥

(సంగీ. రత్నా. 4-7/11)

సంగీతరత్నాకరాన్ననుసరించి కూడ ఉద్గ్రాహం మొదటిది, తర్వాతివి మేలాపక ధ్రువలు; ఆభోగం చివరిది. ధ్రువాభోగాల మధ్యనిర్మింపబడేది అంతర. వీటిలో ఉద్గ్రాహం అనేది అన్వర్థసంజ్ఞ. పదాన్ని 'ఎత్తుకోవడం' అనేది ఉంటుంది. కనుకనే దీన్ని 'ఉద్గ్రాహం' అన్నారు. నేడుమనం దీన్ని 'ఎత్తుగడ' గా పలుకవచ్చు. ఉద్గ్రాహ ధ్రువలను మేలనం (కలపడం) చేస్తుంది గనుక రెండోది మేలాపకం అయింది. ధ్రువత్వం - అనగా నిలకడ వలన ధ్రువ. 'ఆభోగః పరిపూర్ణతా' అనే అభిధానంవలన పదానికి నిండుదనం (పూర్తి కావడం) దీంతో వస్తుంది గనుక ఇది ఆభోగం. ముగింపు అని అభిప్రాయం. వీటిలో అంతర, మేలాపకాలు అప్రధానాలనే చెప్పాలి. 'అంతర' అనేది సాలగసూడ ప్రబంధాలని చెప్పబడే ధ్రువ, మంఠ, ప్రతిమంఠ, నిస్సారుక, అంకతాల, రాసక, ఏకతాళీ ప్రబంధాలకే పరిమితంగాను, 'దృశ్యతే' అని దృశగ్రహణం చేయటంచేత ధ్రువాది ప్రబంధాల్లోకూడ ప్రాచీనులు ఎక్కడ 'అంతర' ను నిర్మించారో అక్కడ మాత్రమే నిర్మించవచ్చునని, దీన్నిబట్టి మంఠాదుల్లో అంతర కనబడుతోందిగనుక మంఠాదుల్లో చేయవచ్చునని, ధ్రువాప్రబంధంలో కనబడటంలేదు గనుక అక్కడ చేయరాదని తెలుసుకోవాలంటూ కల్లినాథుని వ్యాఖ్య.

సంగీతశాస్త్ర గ్రంథాల్లో 'పల్లవము' అనబడ్డదే ఈగ్రంథంలో 'పల్లవి' అనబడింది. నేడుమనంకూడ 'పల్లవి' అనే అంటున్నాము. అయితే శాస్త్రగ్రంథాల్లో ప్రాక్ప్రసిద్ధ దేశీ రాగాల్లోను విభాషారాగంగాను చెప్పబడిన 'పల్లవీ' అనే రాగంకూడా ఒకటిఉంది. దానికీ దీనికీ సంబంధంలేదు.

'Prabandhāvayavō dhātuh sa caturdhanirupitaḥ
udgrāhah prathamastatra talō mēlāpakadhruvau
ābhōgascēti tesām ca kramāllaksmābhidadhmahē
udgrāhaḥ prathamōbhāga statō mēlāpakaḥ smrtah
dhruvatvācca dhruvaḥ pascādābhōgastvantimō mataḥ
dhruvābhōgantarē jāto dhāturanyō ntarābhidhaḥ
sa tu sālaga sūdastha rūpakēsvēva drśyatē
vātapitta kaphā dēha dhāranāddhātavō yadhā
evam ētē prabandhasya dhātavō dēhadhāraṇāt
tatra mēlāpakābhōgau na bhavētām kvacit kvacit.

(S R 4-7/11)

According to S R too udgrāha is the first, next come the two, mēlāpaka and dhruva; ābhōga is the last, that which is woven between dhruva and ābhōga is antara Among these, udgrāha is a meaningful name Baecause there is taking up of the padam (starting /commencing) it is called 'udgrāha' Because 'udgrāha and dhruva are made to join together the second is termed mēlāpaka The third is called dhruva because of its stability Since ābhōga means completeness, the last part which concludes the song called ābhōga Among these mēlāpaka and antara are not so important The fourth called antara occurs only in sālaga sūdaprabandhas-namely dhruva, manṭha, pratimantha,nissāruka,ankatāla, rāsaka and ekatālī prabandhas As the text says 'drśyatē'(is seen),commentator Kallinātha says that even among these antara can be woven only where ancients have done it. He clinches the issue saying since it is seen in mantha etc. it can be done in them and since it is not seen in dhrūva prabandha it should not be done there.

What is called pallavam (tender leaf) in musical treatises is called pallavi in this work; of course we are also calling it pallavi today But there is also a rāga called 'pallavī' among the dēśi-rāgas well known in olden days (a vibhāsā rāga ) This has nothing to do with the 'pallavi' we are dealing with

పదం లేదా పాటలోని విడివిడి భాగాలకు చెప్పిన ఈధాతువులు అనేవి ప్రధానంగా స్వరసంబంధులు. ఏలాది గీత ప్రబంధాలకు చెప్పబడినట్లే తంత్రివాద్యమైన వీణకు దీన్ని ననరించి సుషిరవాద్యమైన వంశవాద్యానికి (పిల్లనగ్రోవి), అట్లే వాద్యప్రబంధాలకు ధాతు విచారం ఉంది. ఇవి వరుసగా సమానాలు కావుకాని ఆపారిభాషిక పదాలు ఇలా ఉంటాయి.

| <u>గీత ప్రబంధాలు</u> | <u>వీణ-వేణువు</u> | <u>వాద్యప్రబంధం</u> |
|---|---|---|
| 1. ఉద్గ్రాహం | 1. విస్తారజ (14) | 1. లహరీ |
| 2. మేళాపకం | 2. కరణ (5) | 2. మొదువు |
| 3. ధ్రువ | 3. ఆవిద్ధ (5) | 3. అంతర |
| 4. అంతర | 4. వ్యంజన (10) | 4. ఉపాంతర |
| 5. ఆభోగం | | 5. ముక్తాయి |

(మధ్యవరుసలో కుండలీకరించిన అంకెలు ఆయావాని అంతర భాగాలను సూచిస్తాయి.)

గీతప్రబంధంలో ధాతువులు గేయాంశానికి చెందిన సరిగమలనబడే స్వరాలు. వీణవంటి తంత్రివాద్యల్లో ఇవి ఘాత (ప్రహారం) వల్ల పుట్టేస్వరాలు. వీణలో లాగే వేణువాద్యం లోను ధాతువులను కల్పించాలని శాస్త్రంచెప్తున్నది. ఈనాడు ఈధాతువులను గూర్చిన ప్రసంగం సాధారణంగా వినబడదు. పాటను సరిగమలతో స్వరపరచడమే ధాతుకల్పనం అని చెప్పవచ్చు. ఇది పాడగలవారందరు చేయగలపనికాదు. శాస్త్రం చక్కగా తెలిసి అను భవరసికులైన ఏకొందరికో సాధ్యంగా ఉండేపని. ఉదాహరణకు తాళ్లపాకవారి సంకీర్తనలు రాగరేకులమీద లభ్యమౌతున్నా 'మాతు' దొరికినట్లేకాని 'ధాతువు' దొరికినట్లుకాదు. ఆపా టలకు రాగనిర్దేశం మాత్రమే ఉంది; ఒక్కటిరెండుచోట్ల తప్ప తాళనిర్దేశంకూడా లేదు. రాగాలపేర్లు తెలిసినా ఆయారాగాలను అనాడు ఎలా పాడేవారో స్పష్టంగా తెలియదు. కనుక వాటిని ఒకతాళానికి యోజించి స్వరం వెయ్యటం సులభంకాదు. అందుచేతనే తిరుమల తిరుపతి దేవస్థానము వారు సంగీతసాహిత్యాల్లో ఆరితేరిన వారిచేత ఏకొన్నిం టికో ఆపని నిర్వహింపచేశారు. వాగ్గేయకారునికి ధాతు మాతువులు రెండుకూర్చడంలో నేర్పుఉండాలి. వాక్కైన 'మాతు', గేయమైన 'ధాతువు' రెండూ కూర్చగలవాడైనందుచే తనే అతడు 'ఉభయకార' శబ్దంతో చెప్పబడ్డాడు. అపదబంధమే 'బయకార'గా మారింది. 'రాయబయకార' అనేది కొందరకు రాజాస్థానంలో వాగ్గేయకారులుగా ఉండిన కారణాన బిరుదం కూడ అయింది.

సాహిత్య రచనలాగే సంగీత రచనకూడ గొప్పశిల్పం. సాహిత్యంలోలాగే ఇక్కడా జ్ఞాతశిల్పులు కొందరు; యదృచ్ఛాశిల్పులు కొందరు. పదరచనలో చివర వాగ్గేయకారుని

The dhātus that are mentioned as appropriate 'pallavi' for the individual words of the padam pertain to the svaras or musical notes Just as they are enjoined in the case of gītaprabandhas they are enjoined to the stringed instrument vīna and following it, to the wind-instrument flute, as also the vādya-prabandhas The following are the names of dhatus in various branches· (These should not be taken to be one to one equivalents Merely the technical terms are presented )

| gītaprabandhas | vīna/vēnu | Vādyaprabandhas |
|---|---|---|
| 1 udgrāha | 1 vistāraja(14) | 1 laharī |
| 2 mēlāpaka | 2 karaṇa(5) | 2 yeduppu |
| 3 dhruva | 3 āviddha(5) | 3 antara |
| 4.antara | 4 vyañjana(10) | 4 upāntara |
| 5 ābhōga | | 5 muktāyi |

Numbers in the middle row indicate subdivisions under each general head

In a gītaprabandha these dhātus are the musical notes, sa, ri, ga,ma,pa, ,dha,ni pertaining to the musical element In a stringed instrument like vīna these are the svaras born from twanging or plucking the strings Sangīta śāstra says that dhātus should be created on flute also as is done on vīna

Today we do not generally hear about these dhātus It is the writing down of the notation in terms of musical notes that may be called dhātu kalpana Not all those that sing can do it It is something that can be done only by a few who are well-versed in musicology and talented For example though the sankīrtan compositions of Tāllapāka poets are a available on the copper plates it is only the mātu (libretto ) that is available and not the dhātu (music ) Those copper plates contain only the names of the rāgas, even tāla is not given except in one or two places Though the names of the rāgās are known, we do not know how those rāgās were sung those days So it is not an easy thing to set them to a tāla and the given raga It is because of this kind of difficulty that the T T Dēvasthānam authorities got only some of them set to music by scholars in music and literature A vāggēyakāra (music composer ) must be skilled in composing both the dhātu and mātu Becuase he is able to compose the words of text that is mātu and the music that is dhātu he is called 'ubhayakāra' (one who does both) This compound has degenerated into 'bayakāra' For those who were appointed in royal courts as music composers 'rāya-bayakāra' became a title

Like literature, composition of music is a great art of sculptural beauty Again as in literature, here also some are conscious artists, some unconscious

ముద్ర ఉండాలనేది నియమం. త్యాగరాజకృతుల్లో 'త్యాగరాజనుత' అనేది చివర వినబ డటం మనమెరిగిందే. కాని దీనికి అపవాదాలు లేకపోలేదు. తాళ్లపాక వారి సంకీర్తనలలో ముద్రలేదు. ముద్ర ఉండేవాట్లో అది ఇష్టదేవతాముద్ర, ఆచార్యముద్ర, క్షేత్రముద్ర, ప్రభుముద్ర వగైరాల్లో ఏదైనా ఒకటి ఉంటుంది. అలాగే పదంలో రాగతాళాలు రెండు చెప్తే రాగతాళముద్ర, రాగం మాత్రం చెప్తే రాగముద్ర. దీనివల్ల ప్రయోజనమేమంటే ఆరాగతాళాలు ప్రసిద్ధంగా వాడుకలో ఉండేవైతే వాటి స్వరూపం సులభంగా తెలుస్తుంది.

కర్ణాటక సంగీతంలో త్రిమూర్తులనిపించుకున్నవారిలో ముత్తుస్వామి దీక్షితర్ సంగీత రచనాశిల్పంలో జ్ఞాతశిల్పులు; ఆయన రచనల్లో రాగముద్రలేనివి అరుదు. శ్యామశాస్త్రి, త్యాగరాజు యదృచ్ఛాశిల్పులు. దీక్షితర్ హంసధ్వని రాగం, ఆదితాళంలో కూర్చిన 'వాతా పిగణపతింభజే . . .' అనే ప్రసిద్ధకృతిలో చివర 'హంసధ్వనిభూషిత హేరంబం' అనిరాగముద్ర ఉంది. శ్యామశాస్త్రి కల్యాణిరాగం రూపకతాళంలోకూర్చిన 'హిమాద్రిసుతే పాహిమాం వరదేవతే' అనేకృతిలో చివరిచరణంలో 'కరిముఖ కుమారజనని కాత్యాయని కల్యాణి' అనిరాగముద్ర. త్యాగయ్యవారి 'మోహనరామ' అనేకృతి మోహనరాగంలోనే ఉంది. హరికథారచయితలు కొందరు తాళముద్ర, రాగతాళముద్రలు రెండుకూడ కూర్చిన వారు న్నారు. ఈపద్ధతి రాగతాళాల పేర్లు చెప్పటంవరకే పరిమితం. వివరాలు తెచ్చుకోవాలి. ఇలాకాకుండా పదం కూర్చడంలోనే స్వరాక్షరాలైన సరిగమలను కూర్చేపద్ధతి కూడా ఒకటి ఉంది.

పదాలు, కృతులు, కీర్తనలు, సంకీర్తనలు ధాతుమాతు సమాహారాలు. మాతువు మాటలకూర్పు. ధాతువు స్వరాల కూర్పు. అంటే స-రి-గ-మ-ప-ధ-ని అనే సప్తస్వ రాలకే పరిమితంగా ఉంటుంది. ధాతుమాతువులకు అభేదంగా స్వరాక్షరాలు వచ్చేటట్లు కూర్చితే దాన్ని 'స్వరాక్షరం' అంటారు. ఇలాగ ధాతుమాతువులకు అభేదంగా కూర్చిన సంగీతరచనను 'స్వరార్థ' ప్రబంధమని 'స్వరాక్షర ప్రబంధ'మని శాస్త్రకారులు అంటారు. సంగీతరత్నాకరంలో దీని లక్షణం ఇలా చెప్పబడింది.

'యత్రస్వరాక్షరై రేవ వాంఛితోऽర్థోऽభిధీయతే

సస్వరార్థో ద్విధా శుద్ధో మిశ్ర స్తైః శుద్ధమిశ్రితైః'

(సంగీ. రత్నా. 4-222)

సాహిత్యంలో ఇలాంటి రచనకు 'సరిగమ పధనులు' అనిపేరు. తెనుగులో విన్నకోట పెద్దన (క్రీ.శ. 1402-1407) రచించిన 'కావ్యాలంకార చూడామణిలో' 'సరిగమపధనులు' అనేశీర్షికతో ఈక్రింది పద్యముంది.

artists. It is a general rule that the composition of a padam should contain the 'mudra' of the composer at the end We know that the lines of krtis of Tyāgarāja have the insignia, 'tyāgarājanuta' But exceptions are not wanting to this rule. The sankīrtans of Tāḷḷapāka poets have no 'mudra' of their names In a composition where there is mudra it can be any one of istadēvatā mudra, ācāryamudra, ksētra mudra, prabhumudra etc Similarly if the names of the rāga and tāla are incorporated in the text of the song it is rāga-tāla mudra; if only rāga's name is incorporated it is rāga mudra The utility of this is that if the rāga and tāla are those that are in use and wellknown, they can be known easily

Among the trinity of karnatic music, Muthuswamy Dīksitar is a conscious artist, among his compositions those without mudra are rare Śyāmaśāstry and Tyāgarāja are unconscious artists In the well-known krti of Dīksitar 'vātāpiganapatim bhajē' composed in Hamsadhvani rāga and Ādıtāla the rāga-mudra is found at the end as 'hamsadhvani bhūṣita herambam' In Śyāmaśāstry's krti 'himādrisutē pātumām paradēvatē' composed in kalyāni rāga and Rūpaka tāla the rāga mudra 'karimukhakumārajanani kātyāyani kalyāni' is there in the last line Tyāgarāja's kṛti 'mōhanarāma' is in mōhana-rāga Among the Harikathā composers there are some who have given rāgamudra and some others who have given rāga-tāla mudra. This method is limited to giving the names of either rāga or tāla or both The other details are to be brought from elsewhere. In contradistinction to this, there is also the method of incorporating the muscial notes themselves like sa , ri, ga, ma in the compostion of the padam

Padams ,krtis , kīrtan s and sankīrtanas are conglomerations of dhātu and mātu Mātu is the compostion of meaningul words, dhātu is the compostion of svaras which means it is limited to the seven musical notes , sa-ri-ga-ma-pa--dha-ni If these svara letters are made to be common to both the compositions of dhātu and mātu then they are called svarāksara-s Such a musical compostion is called 'svarārtha prabandhà or 'svarāksara prabandha' in classical treatises on music S R gives its laksana thus:

"yatra svarāksarairēva vānchitō 'rthō' bhidhīyatē
sa svarārthō dvidhā śuddhō miśrastaihssuddhamisritaiḥ"

(S R 4-222 sl)

In literature it is given the caption 'sarigamapadhanisalu'
In Telugu, Vinnakōta Peddana in his K A C (written between 1402 AD and 1407 AD ) gives the following verse under the caption cited above

కం॥ నీసరిపని నీసరి ధని
నీసరి మాధారి గరిమ నీసరిగారీ
నీసరిగా నిగమాగమ
గోసారులునుం బలుక్యకుల విశ్వేశా॥

దీంట్లో తొలిమూడుపాదాలు స్వరాక్షరాలు. అయినా ఆమాటలకు అర్థం ఉంది.

ఇలాంటి స్వరాక్షరసంపుటి పాటల్లో పదాల్లో శుద్ధరూపంగాను సూచితరూపంగాను ఉండవచ్చు. 'సరిగమపధని' అనే అక్షరాలే, పై పద్యం మూడుపాదాల్లోలాగ - వస్తే అది శుద్ధ స్వరాక్షరసంపుటి అవుతుంది. స్థూలంగా హల్మాత్రసామ్యం ఉంటే సూచిత స్వరాక్షర రచన అవుతుంది. స్వరాక్షరాలకు సూచకాక్షరాలు ఇలాఉంటాయి. సూచకాలు ఏ అచ్చుతోకూడినా, ద్విరుక్తమైనా ఇబ్బందిలేదు.

స - చ,ఛ,జ,ఝ,శ,ష,స

రి - ర,ఱ

గ - క,ఖ,గ,ఘ

మ - మ

ప - వ,ఫ,బ,భ

ధ - త,థ,ద,ధ

ని - న,ణ

స్వాతితిరుణాళ్, రామస్వామిశివన్, సుబ్బరామదీక్షితుల తండ్రి అయిన రామస్వామి దీక్షితులు, స్వరాక్షర సంపుటికి ప్రసిద్ధులు. ఆధునికుల్లో బాలమురళీకృష్ణగారి 'నీగరిమగని' అన్న స్వరాక్షరసంపుటి చెప్పదగింది. త్యాగరాజు, శ్యామశాస్త్రుల రచనల్లో స్వరాక్షరరచన సూచిత పద్ధతిగానే ఉన్నట్లు చెప్పవచ్చు. త్యాగయ్య అమృతవాహిని రాగం - ఆదితాళంలో కూర్చిన 'శ్రీరామపాదమా నిక్రృప చాలునే' అనేకీర్తనలో

ప దనీ ద మ పా, ద మా గా రి స రీ మ పా

శ్రీ రా మ పా ద మా నీ కృ ప చా లు నే

nī-sari pani nī sari dhani
nī sari mādhāri garima nī sangārī
nī sari gā nigamāgama
gō sārulunun jalukya kula viśvēśā"

The first three lines of the verse have svarāksaras; they are meaningful

Such groups of svarākṣaras can be present in padams or songs both in their pure form as well as an indicative form If sa ri ga ma pa dha ni occur as they are with the same vowel combination they make for śuddha svarāksara samputi If there is only rough indication of the consonant alone it is 'sūcitasvarākṣara' compostiion The indications for svaras are given below Either the duplication of the consonant or its combination with any other vowel does not matter

sa-ca,cha, ja, jha, śa, ṣa, sa
ri-ra, ra (with trill)
ga,ka,.kha, ga,gha
ma,ma
pa,pa, pha, ba, bha
dha,ta, tha,da,dha
ni,na,ṇa

Swāti Tirunal, Ramaswamy Śivan, Ramaswamy Dīkṣitar (father of Subbarāma Dikṣita) are well known for their svarāksara samputi-s. Among the moderners Bālamuralikrsṇa's 'nī garima gani'a:svarāksarasāmputi composition is worth mentioning One can say the svarāksara composition in Tyāgarāja's and Śyāmaśāstry's krtis is only in the indicative mode. In Tyāgarāja's kṛti 'srīrāmapādamā nī kṛpa cālunē' composed in Amṛtavāhini rāga-Ādi tāla the following svarākṣra composition can be seen:

pa da ni da ma pā, da mā gāri sarī mapā
srī rā ma pā, da mā nī kṛpa cālunē

'పాదమా' అనేది స్వరసాహిత్యాలు రెండింటిలోను కనబడుతుంది. అయినా ధన్యాసిరాగం - ఆదితాళంలో కూర్చిన 'సంగీతజ్ఞానము భక్తివినా' అనేకృతిలో

సా సా మా(గ)రీ

భృంగినటో శ స మీ ర జ అనే సూచిత శుద్ధస్వరాక్షరాలు రెండు కనబడతాయి. శ్యామశాస్త్రి రచనల్లో ఎక్కడైనా ఒకచోట స్వరాక్షర సంపుటి కన్పిస్తుంది. తోడిరాగం - ఆదితాళంలో కూర్చిన 'రావే హిమగిరి కుమారి' (స్వరజతి) లో

గా మ పా మదనీ

కా మ పా . లి నీ

మ ద నీ ద ని స దా ద ని ద గ రి

మ ది లో ని ను స దా త ల చు కొ ని

వంటి స్వరాక్షరకల్పన ఉంది. దీక్షితర్ రచనల్లో ఈశిల్పం ఎక్కువ. ధాతుమాతువులకు ఏకరూపంగా ఉండే స్వరాక్షరాల కూర్పే క్రమంగా 'స్వరార్థప్రబంధ' రచనగా పరిణమించిందనేది స్పష్టమే.

ఈచెప్పిందంతా గీతప్రబంధాలకు సంబంధించిన విషయం. వాద్యప్రబంధాల్లో ఉద్గ్రాహాది ధాతుకల్పనకు విస్తరమైన శాస్త్రపద్ధతి ఉంది. ధాతుస్వరూపాన్ని గూర్చి ఒక అభిప్రాయం కలగటానికి ఇంతదూరం చెప్పడం జరిగింది.

'pādamā' is common to svara and sāhitya One can see both śuddha and súcita svarākṣaras in the krti 'sangīta jñānamu bhaktivinā in Dhanyāsi rāga-Ādītāla·

sā sā mā (ga) rī
'bhrngi naṭē śa sa mi ra ja

One can see svarākṣara samputi occasionally in Śyāmasāstry's compostion In his 'rāvē himagirikumāri' (svarajati) in Tōdi rāga and Āditāla, the following can be seen:

gā ma pā ma da nī
kā ma pā li ni
ma da nī da ni sa dā da ni da ga.ri
ma di lō ni nu sa dā ta la cu koni

Dīkṣitar's compostions have more of this kind of art. It is obvious composition of svaras as common to dhātu and mātu has led to the composition of 'svarārthaprabandha'

All this pertains to gītaprabndabhas only . There is a prescribed method for dhātukalpana in vādyaprabandhas. All this is shown just to give an idea of the concept of dhātu howsoever inadequate it may be.

వ॥తా॥ యవయవ పదంబులకు ననుకూలంబైన పల్లవియెట్టిదనిన

కం॥ పదముల యర్థమ్ముఁ బల్లవి
వదలక యన్నిఁటికి నేక వాక్యతఁ జేయున్
గుదిగ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మఱియు మఱియుఁ బల్లవియలరున్ 39.

తా॥ పదానికి అవయవాలైన చరణాలకు పొసగింపుగా ఉండే పల్లవి వివరింపబడుతున్నది. పదంలోని చరణాల అర్థానికి దూరం కాకుండా, వాటన్నింటికీ తగులుకొని ఉంటూ అభిప్రాయాన్ని ఒక కొలికికితెస్తూ మాటిమాటికి ఆవర్తింపబడుతూ పదం చివర ఉండేది పల్లవి.

వ్యా॥ 24వ పద్యంలో పదం అవయవమనీ, అవయవి అనీకూడా చెప్పబడింది. అవయవం అంటే కాలు చెయ్యిలాంటి శరీరభాగం. అవయవపదం అన్నప్పుడు చరణమని గ్రహించాలి. అవయవాలు కలది అవయవి. అవయవి పదం అంటే చరణాలన్నీ చేరిన మొత్తం పదం అని గ్రహించాలి. వెనుకటి పద్యంలో నిబద్ధపదానికి అవయవాలైన అవాంతరపదాలకు అనుకూలమైన పల్లవి చెప్పాడు. అదిస్వరసంబంధి. అక్కడకూడా చరణాన్ని అవాంతర పదంగా గ్రహిస్తే ఉద్గ్రాహఖండం, ధ్రువఖండం, ఆభోగఖండం ఇత్యాదిగా ఏర్పడతాయి. కాని అక్కడ మాటల అర్థాల ప్రమేయం ఏమి ఉండదని గ్రహించాలి. ఇక్కడ అర్థం ప్రమేయాంశంగా గ్రహింబడుతోంది. ఇది మొత్తం పదానికంతటికీ సంబంధించిన అర్థము కావచ్చు; ఒక చరణంలో ఉంటూ ఆచరణం చివరన ఒకకొలిక్కి వచ్చే అర్థమూకావచ్చు. పాటఅంతా మహావాక్యం లాంటిదైతే చరణం అవాంతరవాక్యం లాంటిదన్నమాట. ఈప ద్యంలో అవయవపదం అన్నప్పుడు నాలుగుపాదాలుగా వృత్తబంధంలో కూర్చిన 'చరణం' అని ఒకసారీ, మొత్తం పదం ఒకసారి గ్రహించాలి. సార్థకమైన మాటలతో కూర్చిన పాట గేయానికి అవయవమని భావిస్తే అప్పుడీ మొత్తం పదం అవయవపదం అవుతుంది. పల్లవి అనేది ప్రతిచరణంలోని మాటల అర్థాలకు చరణాంతంలో ఏకవాక్యత కూరుస్తుంది. అలాగే పదంలోని అన్నిచరణాల అర్థాలకు కూడ ఏకవాక్యత కూరుస్తుంది. అందువల్లనే ప్రతి చరణాంతంలోను, పదాంతంలోను పల్లవి పాడబడుతుంది.

Verse 39

Tr: Pallavi (or refrain) convenient to the avayava padas of the song is being explained. That is Pallavi which, for purposes of correlating the meaning of padas into a single theme, stands linked up with all of them and is repeated again and again at the end of the padams.

Com: In verse 24 a padam is designated as both an avayavi and avayava (a limb or component part). Avayava means a limb like a hand or leg. Avayava padam should be understood here as carana of the song. That which has limbs or component parts is avayavi. It is necessary to understand avayavi padam as the total song comprising all the caraṇas. In the previous verse the author has given pallavi convenient to the individual words constituting the limbs of a nibaddha padam. That pallavi pertains to the svaras or musical notes. Even there if the caraṇa is treated as avāntarapadam divisions like udgrāha khanda, dhruvā khanda, ābhōga khanda etc., take shape. But we have to note that meanings of words will not come under the perview of consideration there. Here it is taken as a predicate of meanings. This predication may pertain to the meaning or theme of the entire song or it may pertain to the meaning of each caraṇa coming to a thematic terminal at its end. If the whole song is treated as a mahāvākya each caraṇa will be like an avāntara vākya. In the present verse the phrase avayavapada should be alternately understood as meaning the carana composed in vrttabandha in four lines as also the total composition of padam (caranas individually once and collectively once)

If the meaningful text (libretto) is treated as the limb (external protrusion) of the 'gēya' (or 'song') then the corpus of the text becomes an avayavapadam. Pallavi correlates the meanings of the individual words in each caraṇa into a thematic whole; similarly does it correlate all the caranas of the padam into a thematic whole. That is why pallavi is sung at the end of each carana and of the total song too

ఉదాహరణానికి అన్నమయ్యగారి ఈసరళమైన పదం చూడండి.

కాంభోజరాగం - త్ర్యశ్రత్రిపుటతాళం

ఏల రాఁడమ్మా - ఇంతిరో వాఁ
డేల రాఁడమ్మా న - న్నేలిన వాఁడు ॥పల్లవి॥
పచ్చని పులుగుల - బండిమీఁదనుండు
పచ్చవింటి పిన్న - బాలుని తండ్రి
పచ్చనిచాయలఁ - బాయని బంగారు
పచ్చడము గట్టిన - బాగైన వాఁడు॥ఏల॥ 1.

తెల్లని పులుగుపై - తిరుగమరిగినట్టి
తెల్లనిసతి పాలి - దేవరతండ్రి
తెల్లని పఱుపుపై - తేలి పొరలువెట్టు
తెల్లని కన్నులఁ దెలివైన వాఁడు ॥ ఏల॥ 2.

కొండవింటి వాని - గుత్త గొనిన యట్టి
కొండుక ప్రాయపుఁ - గూతురు తండ్రి
కొండలరాయఁడు - కోనేటి తిమ్మయ్య
కొండతలనెత్తి - గుఱుతైనవాఁడు ॥ఏల॥ 3.

ఈపదంలో తొలిరెండు పాదాలు పల్లవి. ఆతర్వాత మూడు చరణాలపాట ఉంది. భక్తుడు నాయిక. భగవంతుడు నాయకుడు. ఇది మధురభక్తి. నాయిక ఉత్కంఠతో నాయకునికై ప్రతీక్షిస్తూ తహతహగా చెలితో పలుకటం సందర్భం. నాయిక తహతహ ప్రధా నాంశం. తొలిచరణంలో రాచిల్కల తేరెక్కి పచ్చని చెరకు వింటితో తిరిగే మన్మధుని తండ్రి బంగారపు రంగు వలువగట్టిన సుందరాంగుడు - నన్ను ప్రియంగా చేపట్టిన నాథుడు ఏలరాడని పల్లవి అన్వయానికి తెస్తుంది. రెండో చరణంలో హంసవాహన అయిన సర స్వతిని పాలించే బ్రహ్మకు తండ్రి, శేషశయనంమీద తేలి జ్ఞానస్వరూపుడై పొరలే వాడనే భావంతో అన్వయం. మూడో చరణంలో ఈశ్వరుణ్ణి స్వాధీనపరచుకొన్న గంగకు తండ్రి, గోవర్ధన గిరినెత్తిన యశస్వి, స్వామిపుష్కరిణి ప్రక్కన వెలసిన వేంకటేశ్వరుడనే భావంతో అన్వయం. భగవంతుని ఐశ్వర్య వీర్య యశస్సులు శ్రీ జ్ఞానవైరాగ్యాలు అనే షాడ్గుణ్యంతో ఇక్కడ నాయకుని సర్వాతిశాయిత్వం చెప్పబడింది. పల్లవికి విడిచరణాలతోను మొత్తం పదం తోను పొసగింపు ఉంది. ఇష్టమైతే ప్రతిచరణంలోని రెండేసి పాదాలకు కూడా పల్లవి పొసగివస్తుందని ఇక్కడ గమనించవచ్చు.

For example let us consider a song of Annamayya composed in Kāmbhōji rāga-miśra triputa tāla

ēla rādammā-intirō vā
dēla rādammā nan-nēlinavādu !(Pallavi).

Paccani pulugula-bandimīdanundu
Paccavinti pinna-bāluni tandri
Paccani cāyala-bāyani bangāru
Paccadamugattina-bāgainavādu- ēla    1

tellani pulugu pai-tiruga mariginatti
tellani sati pati-dēvara tandri
tellani parapu pai-tēli poraluveṭṭu
tellani kannula-telivaina vāḍu !!ēla    2

kondavinti vāni-guttagoninayatti
kondukaprāyapu-gūturutandri
kondala rāyadu-kōnēti timmaya
konda talanetti-gurutainavāḍu !!ēla!!    3

The meaning of pallavi and the three caraṇas of the song are to this effect

"Why my deane! Why does'nt he come, he who has taken me up"
-pallavi

He, the father of the boy that holds the sugarcane bow and rides the chariot drawn by the green parrots (Manmatha) and my beau that wears the unfading golden yellow garment" Why . (1)

"He, the father of the Lord of the white Lady that roams about on a white bird (saraswati rides a swan), he, who turns to this side and that lying down floating on a white bed with his white eyes shining (punḍarīkākśa reclining on Ādi-śēsa in yōganidrā as pure caitanya or consciousness) "Why my deane . . ."(2)

"He the father of the young girl who has won over completely the Lord that used the mountain as his bow (father of Ganga who has won over Īsvara) and he the Lord of Hills residing by the pond (puskarini) and who had become famous by lifting a hill (Gōvardhana)"
-"Why my deane. . " (3)

ఈపల్లవి పుట్టు పూర్వోత్తరాలు సంగీతవిద్వాంసులకే తీరని సమస్యగా ఉన్నాయంటారు. తాళ్లపాక అన్నమయ్యగారి సంకీర్తనల్లో పల్లవి ఉంది. కొన్నింటిలో 'అనుపల్లవి' కూడా ఉంది. రామక్రియ రాగం (రూపకతాళం) లో కూర్చిన 'భక్తికొలది వాఁడే పరమాత్ముడు' అనే సంకీర్తనలో ఈమాటలే పల్లవి. భుక్తి ముక్తి తానెయిచ్చు - భువిపరమాత్ముడు' అనేది 'అనుపల్లవి'. అంటే అన్నమయ్య నాటికి పల్లవి పాదుకొన్నది, 'అనుపల్లవి' పాదుకొంటున్నదని ఊహించవచ్చు. నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణిలో పల్లవి, అనుపల్లవి రెండూ ఉన్నవి. (త్యాగయ్యకు నూరేండ్లైనా ముందు).

ఆలోచిస్తే ఈ 'పల్లవి'కి ఆధారభూతమైన ఆవృత్తి అనేది మొదట లఘుగురువుల పాదాంతా వృత్తిగాను అటుపై పదాల ఆవృత్తిగాను నడిచినట్లు గ్రహించవచ్చు. వైదిక ఛందస్సుల్లో ప్రసిద్ధమైన నాల్గుఛందస్సుల్ని చూద్దాం: గాయత్రి, అనుష్టుభ్, త్రిష్టుభ్, జగతి.

(a) గాయత్రిలో పాదానికి 8 అక్షరాల చొప్పున మూడు పాదాలు ఉంటాయి. ప్రతిపాదంలోని 8 అక్షరాలను నాల్గేసి అక్షరాల రెండుగణాలుగా ఛేదించవచ్చు.

U I U U I U I U

అ గ్ని మీ ళే | పు రో హి తం

U U I U I U I U

య జ్ఞ స్య దే | వ మృ త్వి జం

U U U U I U I U

హో తా రం ర | త్న ధా త మ మ్॥

మూడు పాదాల్లోను లఘుగురువుల ఆవృత్తి పాదద్వితీయార్ధంలో ఒకేవిధంగా ఉండటం గమనించవచ్చు.

In the original song in Talugu the part given above as pallavi is in two lines After that there are three carṇas with four lines for each in the song. Here the devotee is nāyika (lady-love). God is nāyaka (the Lover). This is madhura-bhakti. The context is that of a lady, being in love and unable to bear the delay of her lover's coming expresses her eagerness and anxiety to her close friend The first, the second and the third caraṇa-s relate themselves with the pallavi expressing the apprahensions of the lady concerning the non-arrival of her lover. The song suggests the six qualities of supramacy nemely (1) aiśvarya,(2) vīrya (3) yaśas (4) śrī (5) jñāna and (6) vairāgya. Pallavi has correlation both with the individual caraṇa-s as well as the whole padam. If one wishes it can conveniently relatee itself with every two lines in each caraṇa.

It is said that the origin and development of pallavi in music is an unsolved problem. Tāḷḷapāka Annmācārya's sankīrtanas have pallavi; some have anupallavi too . In the saṅkīrtana composed in rāmakriya rāga (rūpaka tāla) 'bhaktikoladivāḍē 'paramātmuḍu' constitutes pallavi; 'bhuktimukti tānēyiccu-bhuviparamatmuḍu' is given as anupallavi. That means by the time Annamayya came on the scene pallavi had established itself and anupallavi was in the process of stabilising. One can find pallavi and anupallavi in Krṣnalīlā taraṅgiṇi of Nārāyana Tīrtha, at least a hundred years before Tyāgarāja.

On reflection, one can see that the repetition basis of pallavi occurred first as repetition of laghus and gurus in prosody at the end of each line and later on became the repetition of words. We can examine four of the metres in Vedic prosody- gāyatri, anusṭubh, trisṭubh, and jagati

(a) In gāyatri metre each line has 8 letters with three such lines in a verse. The 8 letters in each line can be divided into 2 units of 4 letters each.

| U | I | U | U | / | I | U | I | U |
|---|---|---|---|---|---|---|---|---|
| a | gni | mī | lē | / | pu | rō | hi | tam |
| U | U | I | U | / | I | U | I | U |
| ya | jña | sya | dē | / | va | mṛ | tvi | jam |
| U | U | U | U | / |  | U | 1 | U |
| hō | tā | ram | ra | / | tna | dhā | ta | mam |

Mark the repetition of the pattern of laghu-gurus in the second half of each line.

(b) అనుష్టుప్ఛందంలో 8 అక్షరాల పాదాలు నాలుగు ఉంటాయి. వైదికమైన ఈఛందం లౌకిక సాహిత్యంలో అనుష్టుప్ శ్లోకం అయింది.

I U I U

(1) హిరణ్మయేన/ న పాత్రేణ/ సత్యస్యాపి/ హి తం ము ఖం

I U I U

తత్త్వం పూషన్/ న్నపావృణు/ సత్యధర్మా/ య దృ ష్ట యే

I U I U

(2) సత్యం మాతా/ పితా జ్ఞానం/ ధర్మోభ్రాతా/ ద యా స ఖా

I U I U

శాంతిః. పత్నీ/ క్షమా పుత్రః/ షడే తేమ/ మ బాం ధ వాః

వీటిలో మొదటిది వైదికం. రెండోది లౌకికమైన శ్లోకం. వీటిలోను రెండవ, నాల్గవ పాదాల చివర లఘుగురువుల ఆవృత్తి ఒకేవిధంగా ఉండటం గమనించవచ్చు.

(c) ఇంక త్రిష్టుప్ఛందంలో పాదానికి 11 అక్షరాలుండే 4 పాదాలుంటాయి. పాదానికి మూడేసి గణాలు. చివరిగణం IUU ఈక్రింది ఉపనిషన్మంత్రం చూడండి..

I U U

నా య మా త్మా / ప్రవచనే / న ల భ్యో

I U U

న మే ధ యా / న బ హు నా / శ్రు తే న

I U U

య మే వై ష / వృ ణు తే తే / న ల భ్యో

I U U

త స్యై ష ఆ / త్మా వృ ణు తే / త నూం స్వా మ్

(సంస్కృతంలో పాదాంత లఘువు గురువుగా మారవచ్చు)

(b) An Anustubh verse has 4 lines of 8 letters each. In secular Sanskṛt it has become anustup-ślōka.

| | | | | | / | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | hi | ra | nma | yē | / | na | pā | trē | na |
| | | | | | | I | U | I | U |
| | sa | tya | syā | pi | / | hi | tam | mu | kham |
| | tat | tvam | pū | ṡā | / | nna | pā | vṛ | ṇu |
| | | | | | | I | U | I | U |
| | sa | tya | dha | ṙmā | / | ya | dṛ | ṣṭa | yē |
| 2 | sa | tyam | mātā | | / | pitā | jñā | nam | |
| | | | | | | I | U | I | U |
| | dha | rmō | bhrā | tā | / | da | yā | sa | khā |
| | śā | ntiḥ | patnih | | / | kṣamāputraḥ | | | |
| | | | | | | I | U | I | U |
| | sadē | tē | ma | | / | ma | bān | dha | vāḥ |

Between the above two, the first is a Vedic verse; the second a secular ślōka in two lines. One can see the repetition of pattern of laghu-gurus at the end of the second and fourth lines

c) A verse in triṣṭubh metre has four lines with 11 letters each Each line has 3 gaṇa-s. The last gana or unit is IUU We can peruse the following upaniṣadic mantra.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | I | U | U |
| nā | ya | mā | tmā | / | pra | va | ca | nē | / | na | la | bhyō |
| | | | | | | | | | | I | U | U |
| na | mē | dha | yā | / | na | ba | hu | nā | / | śṛ | tē | na |
| | | | | | | | | | | I | U | U |
| ya | mē | vai | ṣa | / | vṛ | ṇu | tē | tē | / | na | la | bhyaḥ |
| | | | | | | | | | | I | U | U |
| ta | syai | ṣa | ā | / | tmā | vṛ | ṇu | tē | / | ta | nūmsvām | |

(In sanskṛt a laghu at the end of the line can be treated as a guru)

(ఎ) జగతీ ఛందస్సులో పాదానికి 12 అక్షరాల చొప్పన 4 పాదాలుంటాయి. పాదానికి మూడేసి గణాలు.

I U I U

తు వ మ గ్నే / ప్ర థ మో అం /గి రా ఋ షిః

I U I U

దే వో దే వా / నా మ భ వః / శి వః స ఖా

I U I U

త వ ప్ర తే / క వ యో వి / ద్మ నా ప సో

I U I U

అ జా యం త / మ రు తో భ్రా / జ దృ ష్ట యః

గాయత్రి అనుష్టుభ్‌లలో లాగే ఇక్కడ కూడా పాదాంతంలో లఘుగురులఘుగురు ఆవృత్తి చూడవచ్చు. ఇది గణావృత్తి అనుకొందాము.

(ఆ) ఎనిమిదక్షరాల పాదాలు, 12 అక్షరాల పాదాలు కలిపి, నాల్గుపాదాల్ని ఏడు పాదాలుగా పెంచి కూర్చిన 'ప్రగాథ' లో గణావృత్తితోపాటు పదావృత్తి తొంగిచూస్తుంది.

I U I U

యు వాం స్తో మే / భిర్ దేవ యం / త అ శ్వి నా

I U I U

ఆ శ్రా వ యం / త ఇ వ శ్లో / క మా యు వః

I U I U

యు వాం హ వ్యా / భి అ యు వః

I U I U

యు వో ర్ వి శ్వా / అ ధి శ్రి యః

d) A verse in jagati metre has four lines of 12 letters each .Each line has 3 ganas or units.

I U I U

tu va ma gnē / pra tha mo ān -/ gi rā ṛ ṣiḥ

I U I U

de vō dē vā / nā ma bha vaḥ / si vah sa khā

1 U 1 U

ta va vra tē / ka va yō vi / dmanā pa sō

I U I U

a jā yan ta / ma ru tō bhrā/ ja dṛ sṭa yaḥ

One can find repetition of laghu-gurus at the end of lines as in the case of gāyatri and anuṣṭubh verses. This we may call gaṇāvṛtti.

e) Pragātha has seven lines with some made up of 12 letters and some 8 letters In the following verse we can see not merely the repetition of ganas at the end of each line but padāvṛtti also.

I U I U

yu vām sto me / bhir dē va yan / ta a svi nā

I U I U

ā śrā va yan / ta iva ślō / ka mā ya vaḥ

I U I U

yu vām ha vyā / bhi a ya vaḥ

I U I U

yu vōr vi svā / a dhi śri yah

I U I U

వృ క్ష శ్చ వి / శ్వ వే ద సా

I U I U

ప్రు షా యం తే / వాం వ వ యో / హి ర ణ్య యే

I U I U

ర థే ద ప్రా / హి ర ణ్య యే

ఇక్కడ 'హిరణ్యయే' పల్లవ పదాలుగా ఆవృత్తి చూడవచ్చు.

సంగీత రత్నాకరం ఎలా చెప్పినా చాళుక్య జగదేకమల్లుని (క్రీ.శ. 1134-43) సంగీత చూడామణిలోని శ్లోకాలే ఈసందర్భంలో పార్శ్వదేవుని సంగీత సమయసారం (క్రీ.శ. 1300 ప్రాం.) లో కనబడటాన్నిచూస్తే ఏలాప్రబంధవిషయంలో రెండు ప్రస్థానాలున్నట్లు గ్రహించవచ్చు. మైసూరు వరలక్ష్మి సంగీత అకాడమీవారి దగ్గరుండే 'సంగీత చూడామణి' ప్రతి ఆకు నెం.46 A. ఏలా ప్రబంధం పాదానికి ఆరుగణాలని చెప్పి అటుతర్వాత ఇలా అంటున్నది.

"పాదస్యాంతే ప్రయోగస్యాత్పల్ల వాస్యం పదం తతః

పల్లవాక్యే పదేనాపి నియమో గణ వర్ణయోః

అనేనైన ప్రకారేణ ద్వితీయాంఘ్రిః ప్రకల్పనా

గీత్వా తతస్తుతి యాంఘ్రి గీత్వామేలావకోభవేత్"

తప్పుల తడకగా ఉన్న ఈశ్లోకాలే పార్శ్వదేవుని సంగీత సమయసారంలో ఇలా ఉద్ధరింపబడి ఉన్నవి.

"ఉద్గ్రాహేంఘ్రి ద్వయం ప్రాసైః ప్రతి పాదం గణాశ్చ షట్॥

పాదస్యాంతే ప్రయోగః స్యాత్ పల్లవాఖ్యం పదం తతః

పల్లవాఖ్యే పదే నాస్తి నియమో గణ వర్ణయోః॥

అనేనైః. ప్రకారేణ ద్వితీయాంఘ్రేః ప్రకల్పనా

గీత్వాతతస్తృతీయాంఘ్రి గేయే మేలావకో భవేత్॥

I U I U
vṛ ksa sca vı / śva vē da sā
I U I U
pru sā yan tē / vampa va yō / hi ra ṇya yē
I U I U
ra thē da srā / hı ra nya yē

Mark the repetitıon of 'hiranyayē' lıke pallava padas

Whatever may be the stand of S.R.regardıng ēlā prabandha[1], the fact that some ślokas ın thıs regard of Jagadēkamalla's S.C.(1134-43A D.) are found in Pārśvadēva's S.S S (cırca 1300 A D) clearly suggests that there have been two schools of thought Leaf 46 A of S C.(available at Varalaksmı Sangīta Akademy, Mysore) after sayıng that each lıne of ēlāprabandha has sıx ganas has the followıng ślōkas:

"pādasyāntē prayōga syat pallavā khyam ca dam tatah
pallavākhyē padē nā pı nıyamō gana varnayōh
anēnaiva prakā rēna dvīītyāngrech prakalpanā
gītvā tata stutī yānghrı gītvā mēlāpaka bhavēt"

The above ślōkas are full of mıstakes These very ślōka-s occur ın S S S of Pārśvadēva as gıven below.

'udgrāhēnghrı dvayam prāsaıḥ pratipādam ganāsca ṣat
pādasyāntē prayōgasyāt pallavākhyam padam tataḥ
pallavākhyē padē nāstı nıyamō gana varnayōḥ
anēnaıva prakārena dvıtīyānghrēh prakalpanā
gītva tata stṛtī yānghri geyē mēlāpakō bhavēt

(తథా) పాదత్రయమే గీత మేక మేవ విధీయతే

స ప్రాసోऽథ ధ్రువో గేయో వర్ణ్యనామ్నా సమన్వితః॥

ఆభోగశ్చ తతో గేయో గాతు ర్నామ్నా విరాజితః

ధ్రువం గీత్వాతతో న్యాసః సర్వైలాసు ప్రశస్యతే॥

(4 అధికరణం శ్లో. 130-134)

హరిపాలుని సంగీత సుధాకర (క్రీ.శ. 1175) మతంకూడా ఇదే. ఇక్కడ గమనింపదగిన ముఖ్యాంశాలు ఏలాప్రబంధంలో పాదానికి ఆరేసి గణాలుండే రెండు పాదాలు మాత్రమే ఉద్గ్రాహ ఖండం అనీ, పాదాంతంలో గమక ప్రయోగంచేసి పల్లవం పాడాలనీ, ఈపల్లవానికి గణవర్ణ నియమంలేదని, తొలిపాదంలాగే మలిపాదమూ అనడంతో పల్లవం అనేది ఆరుగణాల పాదాలు ముగిసిన తర్వాత వస్తుందనీ స్పష్టం. ఈ రెండుపాదాల 12 గణాలే సంగీత రత్నాకరంలోని ఏలా ప్రబంధలక్షణంలో 5+5+2 గాసర్దుబాటు చేయబడినవని తొలిరెండుపాదాల్లో వచ్చే ఐదేసి పదాల్లోను చివరి మూడేసిపదాలు పల్లవ పదాలనబడినవని స్పష్టంగా తెలుస్తుంది. సంగీత రత్నాకరం చెప్పిన ఏలాపద ప్రథమ ద్వితీయ పాదాంత పదత్రయం 'పల్లవి' గా మారిందని నమ్మజాలని వారు సంగీత చూడామణి, సంగీత సమయసారాలు ఏల ప్రథమ ద్వితీయ పాదాల గణషట్కం తర్వాత చెప్పిన పల్లవాఖ్య పదాలే నేడు మనకు తెలిసిన 'పల్లవి' గా మారినవని గ్రహించడంలో శ్రమ ఉండదు. మనకు తెలిసిన పల్లవి వృత్తబంధంగా నాల్గుపాదాల్లో ఉండే చరణానికి బాహ్యమైన కూర్పు. సంగీత చూడామణి సంగీత సమయసారాల ప్రస్థానం పల్లవిగా పరిణమించిందని, సంగీతరత్నాకర ప్రస్థానం లోపించి పోయిందని చెప్పవచ్చు.

ఏలా ప్రబంధ విషయంలో రెండుప్రస్థానాలుండిన వనటానికి ఆధారమేమి? శాస్త్ర గ్రంథాలైన సంగీత చూడామణి, సంగీతసమయసారాలు ఏలా పాదానికి ఆఱుగణాలని చెప్తుండగా సంగీత రత్నాకరం ఐదుపదాలని చెప్పడం, ఆగ్రంథాలు పాదానికి వెలుపల పల్లవి గణవర్ణనియమం లేకుండా చెప్తుండగా సంగీత రత్నాకరం గణవర్ణనియమాలతో కూడిన పాదంలోని చివరి మూడు పదాలనే పల్లవపదాలుగా చెప్పడం, స్పష్టంగా కనబడే విషయాలు. ఈభిన్నదృష్టులకు కారణం ఏలా ప్రబంధాన్ని త్రిధాతుకంగా సంగీత రత్నాకరం దర్శిస్తే సోమేశ్వర, జగదేకమల్ల, పార్శ్వదేవాదులు చతుర్ధాతుకంగా దర్శించటం. ఈప్రస్థాన భేదాన్ని సంగీత రత్నాకరానికి కల్లినాథుడు వ్రాసిన వ్యాఖ్య చెప్తున్నది. ఏలా ప్రబంధానికి త్రిధాతుకత్వాన్ని కోరేవారు ఉద్గ్రాహానికి 12 పదాలనూ చెప్తారనీ, చతుర్ధాతుకత్వాన్ని కోరే సోమేశ్వరాదులు 11 పదాలకు మాత్రమే ఉద్గ్రాహం చెప్పి 12 వ పదం మేలాపకం అంటారంటూ ఇలా వ్రాశాడు.

(tathā)pādatrayē gītam ēkamēva vidhīyatē
sa prāsō tha dhruvō gēyō varṇya nāmnā samanvitaḥ
ābhōgas ca tātō gēyō gātur nāmnā virājitaḥ
dhruvam gītvā tātō nyāsaḥ sarvailāsu praśasyatē
(adhikarana4-ślōkas 130,131,132,133,and134)

Haripāla's S.S (1175 A.D) is also of the same view

From the above we have to note the following points In ēlā prabandha udgrāha khanda is said to consist of two lines with six ganas each. At the end of the line gamaka prayōga is enjoined After that pallava is to be sung This pallava has no regulation of gana-s and varṇa-s Similarly the composition of the second line too. It is clear that pallava occurs after the completion of six feet lines and gamaka. It can be clearly seen that the 12 ganas of these two lines are found adjusted as 5+5+2 padas in S.R ; the pallava that comes outside the regular lines is pushed into the lines themselves designating the last three pada-s of the first two lines as pallava. Those who find it difficult to believe that the pallava padatraya of S R fame have developed into the well known pallavi may not find it so difficult to believe that the pallava padas without restriction and outside the six foot lines mentioned by S.C and S S.S. have developed into the well known pallavī The pallavī as we know it is the composition outside the carana composed in vṛttabandha in four lines. One can say that while the school of thought advocated by S.R has lapsed, the one advocated by S C and S.S.S has developed into pallavi

What is the basis to argue that there have been two schools of thought regarding ēlāprabandha? Apart from the obviously different regulation cited above the important point that caused the different thinking was some people regarding ēlā as tridhātuka and others as caturdhātuka. S R. viewed elā as tridhātuka Cāḷukya Śomēṣvara, Jagadēkamalla and Pārṣvadēva belonged to the other school, treating it as caturdhātuka. This difference of opinion is recorded by Kallināthа in his commentary on S. R. (Ch 4-36S1). He wrote thus ·

"ఏలా ప్రబంధస్యత్రిధాతుకత్వ మభ్యుపగచ్ఛతా మేతాని ద్వాదశ

పదాన్య ద్గ్రాహ్యో భవంతీతి మతమ్. చతుర్ధాతుకత్వ మభ్యుపగచ్ఛంతః

సోమేశ్వరాదయస్త్వేకాదశానా మేవోద్గ్రాహత్వముక్త్వా ద్వాదశపదం మేలాపక మాహు రిత్యాహ"

మూడోపాదంలో రెండుపదాలే ఉంటాయని అక్కడ పల్లవపదం ఉండదని రెండవ పదం దగ్గర గమక ప్రయోగమని అది మేలాపకమని సోమేశ్వరాదులు అంటారని రత్నా కరకర్త వ్రాసిన శ్లోకానికి (4-3) వ్రాసిన వ్యాఖ్యలో ఈ అంశం ఉంది.

పాదాంతప్రయోగానికి పిమ్మట నియమరహితంగా చెప్పబడిన పల్లవి క్రమంగా నియ మంతో నేడు మనకు తెలిసిన పల్లవిగా స్థిరపడిందనటం సారాంశం.

'ēlā prabandhasya tridhātukatvam abhyupagacchatām ētāni dvādaśapadānyudgrāhō bhavantī iti matam. caturdhātukatvam abhyupagacchantaḥ sōmēśvarādayastvēkādaśānāmevōdgrāhatvam uktvā dvādaśa padam mēlāpakam āhu rityāha'.

It means those who wish to treat ēlāpadam as tridhātuka consider all the twelve words or units as udgraha. Those who wish to treat it as caturdhātuka, namely Sōmēśvara and others consider only eleven units as udgrāha, calling the twelfth mēlāpaka. He is commenting on the ślōka (ch 4-36) that says that in the third line there are only two padas and that there is no pallava (of 3 units) that at the second word gamakprayōga is to be sung and that it as called as mēlāpaka by Sōmēśvara and others.

The sum and substance of all the discussion is that the Pallavi enjoined without regulatory restrictions after the gamaka prayōga at the end of the first two lines has developed into the pallavi as we know it today, acquiring some regulation in the process

# THE TUNES OF DIVINITY

# (SANKĪRTANA LAKṢAṆAMU)

(A Treatise On Hymnody in Telugu

by

**Tāḷḷapāka Cina Tirumalācārya)**

VOLUME-I

*GENERAL EDITORS*

DR. SHU HIKOSAKA
DR. G. JOHN SAMUEL

*TRANSLATION AND COMMENTARY*

DR. SALVA KRISHNAMURTHY, M.A., Ph.D.,




INSTITUTE OF ASIAN STUDIES
MADRAS-600 041
INDIA

# TUNES OF DIVINITY
# SANKĪRTANA LAKṢAṆAMU

**VOLUME-I**
**VOLUME-II**

Editor & Commentator

**Dr. SALVA KRISHNAMURTHY**

Publication No 11-A
Publication No. 11-B

"THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF THIRUMALA THIRUPATI DEVASTHANAMS UNDER THEIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"



First Edition 1990

Price: Rs. 125/-     US $ 30

*Copies can be had from*

Publication Division
INSTITUTE OF ASIAN STUDIES
10th East Street,
Thiruvanmiyur,
Madras-600 041
INDIA
Phone: 416728,
419866

| విషయసూచిక | పుట | CONTENTS | Page |
|---|---|---|---|

# కృతజ్ఞతలు

'సంకీర్తన లక్షణా'నికి సంబంధించిన ఈ కార్యక్రమాన్ని సూచించిన వెంటనే ఆమోదించిన ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ పరిశోధన కార్యక్రమాల డైరెక్టర్ డాక్టర్ జాన్ శామ్యూల్ గారికి ధన్యవాదాలు చెప్పటం నా మొదటి కర్తవ్యం.

ఉపయుక్త గ్రంథసూచిలో చెప్పబడిన గ్రంథకర్తల అందరి కృషి నాకు ఉపకరించిదనటంలో సందేహం లేదు. అయినా గ్రంథకర్తలందరికీ నా కృతజ్ఞతలు; అందులో ముఖ్యంగా శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, డాక్టర్. ఎస్.వి. జోగారావ్. డి.లిట్., డాక్టర్. తూమాటి దోణప్ప. డి.లిట్., డాక్టర్. పి.యస్.ఆర్. అప్పారావ్ గారలకు సాధన్యవాదాలు.

మద్రాసులో ఉన్ననాకు మైసూరు ఓరియంటల్ ఇన్స్టిట్యూట్‌లోని సంగీత తాళపత్ర గ్రంథాలను అవలోడించి విషయం సేకరించి పంపటమేకాక మైసూరు లోని వరలక్ష్మి అకాడమీలోని 'సంగీత చూడామణి' ప్రతినుండి 'శిఖాపదా'నికి సంబంధించిన శ్లోకాలను పంపిన ఆర్.వి.యస్. సుందరం, డి.లిట్., (తెలుగు రీడర్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ కన్నడ స్టడీస్, మైసూర్) గారికి నా హార్దమైన మంగళాశాసనాలు. ఈ శ్లోకాలను ఉపలబ్ధ్యంచేసి తమ అభిప్రాయాన్ని కూడా తెలియజేస్పిన మాన్యమహనీయులు, మైసూరు వరలక్ష్మి అకాడమీ నిర్వాహకులు అయిన మహామహోపాధ్యాయ శ్రీ ఆర్. సత్యనారాయణ గారికి నా కృతజ్ఞతాంజలులు.

'సంకీర్తన లక్షణం' గ్రంథాన్ని రాగిరేకుల మీది పాఠంతో సరిచూచే సౌకర్యాన్ని కలిగించిన తిరుమలతిరుపతి దేవస్థానం సంస్థ అధికారులకు, శ్రీ వేంకటేశ్వర మ్యూజియం, తిరుపతి, క్యూరేటర్, ఏ.కె.వి. యస్. రెడ్డిగారికి, గైడ్ లెక్చరర్ శ్రీ బి. విశ్వనాథం గారికి నా హార్దమైన కృతజ్ఞతలు.

ఈ వ్యాసంగంలో గ్రంథావలోకనానికి సహకరించిన మద్రాసు మ్యూజిక్ అకాడమీ లైబ్రరీ, గవర్నమెంట్ ఓరియంట్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, అధికారులకు మైసూర్ ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ అధికారులకు కృతజ్ఞతలు.

చర్చలకు తమవిలువైన కాలాన్ని వెచ్చించి సహకరించిన మద్రాసు విశ్వవిద్యాలయం సంగీత విభాగానికి చెందిన ప్రొఫెసర్. డాక్టర్ సీతగారికి, శ్రమకోర్చి టైపుస్క్రిప్టు చదివి, పుస్తకాలు ఇచ్చి, పలువిధాల సహకరించిన సంగీతం రీడర్ డాక్టర్ ఎన్. రామనాథం గారికి నా కృతజ్ఞతలు.

మద్రాసు
9-8-89

డాక్టర్. సాళ్వ కృష్ణమూర్తి

# TRANSLITERATION

## For TELUGU

అ -a; ఆ - ā; ఇ - i; ఈ - ī; ఉ- u; ఊ - ū; ఋ - ṛ; ఎ - e; ఏ ē; ఐ - ai; ఒ - o; ఓ - ō; ఔ - au; అం - ṁ;cv; అః - h
క - k; ఖ - kh; గ - g; ఘ - gh; ఙ- ṅ
చ - c; ఛ - ch; జ - j; ఝ - jh; ఞ - ñ
ట - ṭ; ఠ - th; డ - ḍ; ఢ - ḍh; ణ - ṇ
త - t; థ - th; ద - d; ధ - dh; న -n
ప - p; ఫ - ph; బ - b; భ - bh; మ - m
య - y; ర - r; ఱ - ṟ; ల - l; ళ - ḷ; వ - v
శ - ś; ష - ṣ ; స - s; హ - h; క్ష - Kṣ

## For Sanskrit

अ -a; आ - - ā; इ - i; ई - - ī; उ- u; ऊ - - ū; ऋ - ṛ; ए - ē; ए - ai;
ओ - ō; औ - au; अं - ṁ; अः - ḥ
क - k; ख - kh; ग - g; घ - gh; ङ - n
च - c; छ - ch; ज - j; झ - jh; ञ - - ñ
ट - ṭ; ठ - ṭh; ड - ḍ; ढ - ḍh; ण - ṇ
त - t; थ - th; द - d; ध - dh; न -n
प - p; फ - ph; ब - b; भ - bh; म - m
य - y; र - r; ल - l; व - v
श - ś' ; ष - . ṣ; स - s; ह - h; क्ष -. Kṣ

# భూ మి క

## I

### ధ్వ ని

గాలిలాంటి మాధ్యమంలో స్పందనాలు ధ్వని పుట్టేటట్లు చేస్తాయి. 'ట్యూనింగ్ ఫోర్క్' (Tuning Fork) అనబడే ఒక స్వరదాన్ని కఱ్ఱతో కొట్టి మోగించినపుడు అది శీస్పందించటానికి మొదలుపెట్టి గాలిలో అలలలాంటివి ఏర్పడేటట్లు చేయగా మనకు ధ్వని వినబడుతోంది. ధ్వని పుట్టటానికి, ప్రయాణించటానికి ఒక మాధ్యమం కావాలి.

### ప్రతిధ్వని - దీర్ఘ ప్రతిధ్వని

ఒక ధ్వనిని విన్నప్పుడు దాని ముద్ర సెకండులో 10వ భాగం కాలం (1/10 of a second) ఉంటుందని చెప్తారు. ఒక తలం ధ్వనిని పరావర్తింపజేసి ప్రతిధ్వనిని పుట్టించాలంటే అది ఆ ధ్వనిపుట్టే చోటునుండి కనీసం 110 అడుగుల దూరంలో ఉండాలి. అంతేకాదు. ఆ ధ్వని అలపొడవు (Wave-length) ఎంత ఉందో దానికి సమానమైన పరిమాణం ఆ తలానికి (surface) ఉండాలి. దీర్ఘ ప్రతిధ్వని (reverberation) పెద్ద హాలుల్లో, భవనాల్లో కలుగుతుంది. ధ్వని గోడల ఉపరితలం మీద పరావర్తనం చెందటం వల్ల అధికం అవుతుంది. అలాగే కిటికీల గుండాను ధ్వనిని పీల్చుకొనే వస్తువుల గుండాను కొంత భాగాన్ని కోల్పోనూ కోల్పోతుంది. ఈ లాభనష్టాలు తేలిన తర్వాత దానికి ఒక స్తిమితం (balance) ఏర్పడుతుంది. మొదటి ధ్వని ఆగిన తర్వాత కూడా కొంత ధ్వనిశక్తి (sound energy) హాలు గోడలవైపున, వినేవారి చెవుల వైపున ఉంటుంది. ఇది కారణంగా స్పందనవునాడి ధ్వనిని వెలికి విడుస్తుంది. దీనికి ఫలితంగానే దీర్ఘ ప్రతిధ్వని కలుగుతుంది. ఇది నిడుపైన ప్రతిధ్వని మాత్రమే.

### మాధ్యమాలు

ధ్వని ప్రయాణించటానికి ఒక మాధ్యమం కావాలి అని చెప్పాము. గాలి లేని 'వాక్యూవం' (Vacuum)లో ధ్వని వినబడదు. గాలిని తీసివేసిన ఒక సీసాలో మనం ఒక ధ్వని చేస్తే అది వినికిడికి రాదు. ధ్వని గాలి, మట్టి వంటి వాటిల్లోనే కాక వాయువుల్లోనూ, ద్రవ పదార్థాల్లోను, మరి ఇతర ఘన పదార్థాల్లోను ప్రయాణిస్తుంది. ధ్వని వేగం శీతోష్ణ పరిస్థితుల్ని బట్టి మారుతుంది. ఉదాహరణకి తడి గాలిలో ధ్వని ఎక్కువ వేగంతో ప్రయాణిస్తుంది.

### మనిషి చెవి - ధ్వని మోతాదు

మనిషి చెవి సెకనుకు 30మొదలు 38,000 స్పందనాలు కల ధ్వనులను వినగలదని అంటారు. సంగీతంలోని స్వరాలకు సెకనుకు 30మొదలు 4,000 స్పందనాలు గల ధ్వనులు తగి ఉంటాయని చెప్పబడుతోంది.

### సంగీతధ్వనులు

మామూలు ధ్వనులు వేరు, సంగీతధ్వనులు వేరు. మామూలు ధ్వనులు చెవికి కఠోరంగా ఉంటాయి. సంగీత ధ్వనులు వినటానికి హాయిగా ఉంటాయి. వీటి మోతాదు

వ్యా. అన్నమయ్య పదాలు పాడి హరిసంకీర్తనం చేసేవారికి మంత్రోపాసనలతో పని లేదు; వాటికి మంత్రాలతో సమానమైన ప్రభావం ఉందని అభిప్రాయం. (సాళువ నరసింగరాయుడు తన మీద పదమల్లి చెప్పలేదని అన్నమయ్యకు సంకెళ్లు వేయిస్తే ఆయన 'సంకెలలిడువేళ' అనే పదం వేంకటేశ్వరుణ్ణి ఉద్దేశించి పాడేడట. వెంటనే సంకెళ్లూడిపడ్డవట. ఈ అంశం అన్నమాచార్య చరిత్రలో అభిలిఖింపబడింది). గుప్తంగా ఉండే నిధి నిక్షేపాల గుర్తు తెలుసుకోవటానికి పలు రకాల అంజనలు ఎట్లా సులభోపాయాలో అట్లాగే జ్ఞానధనాన్ని గుర్తెఱగటానికి ఇవి సులభోపాయాలు. వేంకటేశ్వర సంకీర్తనం స్వామిదయను జడివానగా కురిపించటమే కాదు దేవతలందఱిని కొలిచిన ఫలమిస్తుంది. ఒకరిని కీర్తిస్తే అందఱిసీ కొల్చినఫలమిచ్చే దైవం పరతత్త్వం కద! వేంకటేశ్వరుడు సర్వదేవతామూర్తి. అన్నమయ్యపదాలు ఇష్టసిద్ధికీ అనిష్టపరిహారానికీ ఉపాయాన్ని ప్రభు సమ్మితంగా చెప్పే వేదాలకు, మిత్ర సమ్మితంగా చెప్పే పురాణాలకూ, కాంతాసమ్మితంగా చెప్పే కావ్యాలకు ఏమాత్రం తీసిపోవు. వాటి సారస్వత సిద్ధి ఇలాంటిది అనటం.

1. 'కృౢత్ సంశబ్దనే' అనే ధాతువునుండి 'కీర్తన' అనే పదంపుట్టింది. పరమేశ్వర గుణాలను పాడటమే కీర్తన. అది తఱచుగా విష్ణుపరం. 'కీర్తనం మునిభిః ప్రోక్తం హరేర్లీలా ప్రగాయనం' అని పూర్వుల మాట. 'సంకీర్తనం భగవతో గుణకర్మ నామ్నాం' అని శ్రీమద్భాగవతం. భగవంతుని పేర్లను, గుణాలను, లీలలను గానం చెయ్యటం సంకీర్తనం. ఇది భక్తిలో భాగమని చెప్పనవసరం లేదు. నవవిధ భక్తిలో చెప్పబడే శ్రవణ, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనలు (సం)కీర్తనలోనే అంతర్భవిస్తాయని చెప్పవచ్చు. క్రీ.శ. 7శతాబ్ది నుండి క్రీ.శ. 17శతాబ్ది చివరిదాక భారతదేశంలో భక్తి ఉద్యమప్రభావం నడిచిందనే చెప్పాలి. దక్షిణభారతంలో మహారాష్ట్ర దేశం క్రీ. శ. 10 శతాబ్దినాటికే పరదేశీయుల దాడులకులోనైంది. స్వధర్మ రక్షణాదులకు నాథసంప్రదాయం దోహదానికి వచ్చింది. (కర్ణాటకంలో బసవన వీరశైవోద్యమం వచ్చింది). మహారాష్ట్రలో కీర్తనకార సంప్రదాయానికి దారి యేర్పడింది. నామ్‌దేవ్, తుకారామ్ వంటి భక్తవర్గం దీనివిపాకానికి కారణం. ఈ కీర్తనకార సంప్రదాయంలో నారదీయ సంప్రదాయమని, వార్కరీ సంప్రదాయమని రెండు సంప్రదాయాలున్నాయి. వీటిలో నారదీయ సంప్రదాయం కీర్తన/సంకీర్తన పద్ధతికి సన్నిహితం అనవచ్చు. వార్కరీ సంప్రదాయం భజనపద్ధతిని జోడించుకుంటుంది. ఈ 'కీర్తన'ను 'పదము' అని 'హరికథ' అని అనటం కద్దు. స్వరతాళాలకు అనుభావకమైంది పదమని భరతుడు చెప్పాడు. కేవలంస్తుతి మాత్ర పదయుక్తమైన గీతం 'పదనిర్యుక్త'మని సంగీతరత్నాకరం (5-58, 59) చెప్తున్నది. కీర్తన, పదం సమానాలే అని స్పష్టం. కన్నడ భాషలోని పురందరదాసుల 'దేవరనామా'లను కీర్తనలనీ, పదాలనీ అనటం ఉంది. ద్వారక కారణంగా మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాల్లో

Com: Those who sing the Lord by singing the padams of Annamayya need no other mantrōpāsana-s.(vide verse 23) It is suggested that they have the miraculous effect of mantras. (Saluva Narasingarāya, patron of Annamayya for sometime, put him in fetters for his refusal to compose a padam on him Annamayya is said to have addressed a song beginning with 'sankelalıduvēla' to Lord Vēnkatēswara when miraculously the fetters fell down unlocking themselves This incident is recorded in A C by Tāllapāka Cinnanna, a brother of the author of S.L. These sankīrtans are the easiest means to spot the treasure of wisdom like collyria in spotting the buried treasures of wealth. Singing Lord Vēnkaṭēswara does not merely bring the Grace of the Lord like an unrelenting shower of rain but also gives the result of worshipping all the Gods It is only the Absolute that can give the results of various other Gods. Vēnkatēswara comprises all Gods Annamayya's padams are in no way inferior to the Vēdas, Purānas and Kāvyas which teach us the way to get fulfilment of our desired objectives and avoidance of the undesired by their commandments, friendly advice and affectionate suggestions respectively This is their literary and scriptural value

1 The word Kīrtan is from the verbal root' 'kṝt saṁśabdanē' Singing the auspicious qualities of the Lord is kīrtan This singing pertains to Visnu, often Ancients have spoken about the singing of Lord Visnu 'Kīrtanam munibhih prōktam, hareh līlā pragāyanam. Srīmad Bhāgavata says' sankīrtanam bhagavatō guna karma nāmnām' -meaning singing the names, qualities and miraculous deeds of the Lord is sankīrtana No need to say that this is part of devotion to God (bhakti) Among the nine types of bhakti all others like śravana, smaraṇa , pādasēvana , arcana, vandana, dāsya, sakhya and ātmanivēdana get covered in sankīrtana India went through the bhakti movement from 7c A D to the end of 17c A D In South India, Mahārāstra was subjected to foreign invasions even by 10c A D It had to protect its own religion and social structure. Nāthasaṁpradāya seems to have helped in this direction (In Karnātaka Vīraśaiva movement of Basavana came up later) Kīrtankār sampradāya came into existance in Mahārāstra Devotees like Nāmdēv, Tukāram gave a fillip to this There are two schools, namely Nāradīya and Vārkarī in this saṃpradāya. Naradīya school may be said to be much closer to the kīrtan /sankīrtan method Vārkarī school imbibes more of bhajan paddhati with the audience joining the kīrtankār This kīrtan is also called Harikatha Bharata has defined padam as being evocative of svara and tāla S R calls a devotional panegyric padaniryukta (5-58,59). It is clear that kīrtan and padam are synonymous Purandaradāsa's 'dēvaranāmagalu' in Kannada

కృష్ణభక్తి ఎక్కువ. మహారాష్ట్ర కర్ణాటాంధ్రాది దక్షిణ ప్రాంతాల్లో రుక్మిణీ కృష్ణుల కథ, గుజరాత్ మొదలుకొని ఉత్తరభారతం పూర్తిగా రాధాకృష్ణుల కథ భక్తికి ఆలంబనమైంది. బెంగాల్‌లోని వైష్ణవ సంప్రదాయంలో ఈ భక్తిపాటల్ని 'పదావళి' అని 'కీర్తనలని కూడా అంటారు. సంధి వచనంలోని 'సంకీర్తన శబ్దము,' పద్యాల్లోని 'పదము' సమానార్థకాలన్నది పరమార్థం. ఈ 'పదము, ప్రబంధము' సమానార్థకాలనేది 14 పద్యంలోని రెండు శబ్దాల ప్రయోగాన్నిబట్టి నిర్ధారితం అవుతుంది.

2. 'మననాత్ త్రాయత ఇతి మంత్రః' (మననము చేయుటవలన సాధకుణ్ణి కాపాడేది కనుక మంత్రము) అని వ్యుత్పత్తి. మంత్ర శాస్త్రం 'గుప్త విద్యల్లో' ఒకటి. మంత్రం ఎప్పుడూ రహస్యమే. గురువు పేరుకూడా చెప్పరాదు. జపంలోకూడా మౌనజపం శ్రేష్ఠం. తనకు మాత్రం వినబడేట్లు ఉపాంశువుగా జపించడం మధ్యమం. ఇతరులకు వినబడేటట్లుగా జపించటం అధమం. మంత్రశక్తి కూడా కార్యాన్ని ( effect) బట్టి అనుమానింపదగిందే (inferable)కాని అది పనిచేసే తీరు మనకు స్పష్టంగా ఉండదు. అన్నమయ్యగారి సంకీర్తనలకు మంత్రత్వం చెప్పటం ఇక్కడ విశేషం. అంతేకాదు. సంకీర్తనలు గొంతెత్తి పాడవలసినవి. మంత్ర జప పద్ధతికి విరుద్ధంగా అట్లా పాడినా మంత్రం ప్రదర్శించే రహస్య శక్తుల్ని ఇవీ ప్రదర్శిస్తాయనటం మరింత గొప్ప విశేషం.

3. నిధి నిక్షేపాలకోసం వెదకేవారు పలురకాలైన అంజనలతో అవి ఉండే స్థలాలను గుర్తు తెలుసుకుంటారు.కాటుకలాగు కంటికి రాచుకొని చూచే అంజనము, (తమలపాకు) మీద రాచి చూచే అంజనము, చేతి బొటనవ్రేలి గోటిమీద రాచి చూచే అంజనము వగైరాలు వినికిడిక అందినవే. నిక్షిప్తధనం గుప్తం. దాన్ని తెలుసుకోటానికి 'అంజనము' సులభోపాయం. వేద శాస్త్రాల్లోను, పురాణాల్లోను, కావ్యాల్లోను క్లేశసాధ్యంగా గర్భీకరింపబడి ఉన్న జ్ఞానధనాన్ని కండ్లకు కట్టినట్లుగా చూపించేవి ఈ పదాలనటం విశేషం. ఈ కారణంచేతనే ఇవి వేదాలకు, పురాణాలకు, కావ్యాలకు తీసిపోయేవికావని తర్వాతి పద్యం చెప్తున్నది.

4. సర్వ ప్రాణులు కోరేది సుఖం. అది ఇష్టసిద్ధి రూపమేకాక అనిష్ట పరిహార రూపం కూడా. ఈ ప్రయోజనానికి అలౌకికమైన ఉపాయాన్ని బోధించేది వేదం అని సాయణాచార్యుల నిర్వచనం. వేదాలు అపౌరుషేయాలు, అంటే లౌకికులైన మనుష్యులు కూర్చినవికావనీ, అవి ఋషులకు తాముగా దర్శనానికి వచ్చిన 'శ్రుతుల' నీ విశ్వాసం. సంగీత శాస్త్రంలోను 'గాంధర్వ'మనబడే సంగీతానికి ఉండే అనాది సంప్రదాయం వల్ల అది అపౌరుషేయగా చెప్పబడింది. 'గాన'మనేది పౌరుషేయమే అని కూడా చెప్పబడింది. అన్నమాచార్యుల సంకీర్తనలు 'గానం'. అవి పౌరుషేయాలు- అనగా అన్నమాచార్యులనే లౌకిక పురుషుడు కూర్చినవి. వీటిని వేదాలనటంలో వీటికీ అపౌరుషేయత చెప్పినట్లయింది. అప్పుడు అన్నమయ్య, వేద మంత్రాలకు ఋషుల్లాగ, ద్రష్ట అవుతాడు. అన్నమయ్య సంకీర్తనలు భావ్యావేశంలో దర్శనానికి వచ్చినవని ఆయన ఋషి కల్పుడని అభిప్రాయం.

are called kirtans as well as padams. Krishna is a popular Deity in Maharāstra and Gujarat perhaps due to the proximity of Dwāraka Rukmiṇi and Kṛṣna are worshipped in Mahārāstra, Karṇātaka and Āndhra, Gujarat and North India have taken up Rādhā-Krsṇa cult The devotional songs in the Vaisṇavite traditions of Bengal are called padāvalī and kīrtans. The point is that sankīrtan and padam are synonymous That this padam and the classical term prabandha are also synonymous is confirmed by the author's use of both the words in verse14

2 ' Mananāt trāyata iti mantraḥ'-'that which protects the practitioner because of meditation', is the etymology of the word 'mantra' Mantraśāstra is one of the esoteric disciplines A mantra is to be kept a secret always Even the name of the preceptor is not to be revealed In japa silent repetition is said to be the best; repetition of mantra being audible to the practitioner is mediocre (it is called upāṁśu); repetition of mantra audible to others is the worst method Also the power of the mantra is to be inferred only by its effect (kārya), the mode of its working will not be clear to us The significant point is that the powers of mantras are attributed to the sankīrtans of Annamayya Not merely this Sankīrtans are to be sung full-throated This is against the japa method More significant is the point that these sankīrtans give the miraculous effects like mantras despite the fact that they are sung in a full-throated fashion

3 Treasure-hunters are said to use various kinds of collyria to find the spots where treasures are buried Ointments applied to the eyes, a betal-leaf or over the surface of a thumb-nail are within our hear-say Treasure buried is concealed An añjanam is a miraculous easy means to spot it out Similarly are useful the padams in visualising the wisdom treasure concealed in Vēdas, Purānas and Kāvyas That is exactly why the next verse says the padams are verily Vēdas etc.

4 All living beings desire happiness It is of two forms fulfilment of the desired and eradication of the undesired That is Vēda which teaches (us) a supra-mundane method to this end This is how Sāyanācārya has defined Vēda Vēdas are apauruseya, not composed by men in mundane fashion, they are said to have appeared before the sages who were seers and heard by them This is the traditional belief In sangītaśāstra also apauruseyata is attributed to 'gāndharva' because of its hoary tradition (anādisaṁpradāya ) etc (S R 4-2) Indigenous tradition called 'gāna' is said to be pauruseya on account of its dependence on the composer or vāggēyakāra Annāmacārya's sankīrtans are obviously 'gāna' and hence human creation or pauruṣēya When these are called Vēdas it is tantamount to attributing apauruṣēyata to them This makes Annamayya a drasta or seer like those of Vēdamantras The suggestion is that Annamayya's compositions are inspired ones and that he is as good as a ṛṣi

5. అన్నమయ్య పదాలు 'బహుదేశ విహారంబులు' అనడంలో అందలి కాకు విశేషాలు సూచింపబడుతున్నవి. కాకువులు ప్రధానంగా (1) స్వరకాకువు (2) రాగకాకువు (3) అన్యరాగ కాకువు (4) దేశకాకువు (5) క్షేత్రకాకువు (6) యంత్ర కాకువు అని ఆరు రకాలు. కాకువు అంటే ధ్వని వికారం. ఒక స్వరంలో మరొక స్వరచ్ఛాయ స్వరకాకువు. ఇది రాగంలో ఏర్పడుతుంది. ఏది రాగానికి ముఖ్యచ్ఛాయో అది రాగకాకువు. ఒక రాగంలో వేరొక రాగచ్ఛాయ విన్పిస్తే అది అన్యరాగకాకువు. దేశస్వభావాన్నిబట్టి ఆయా దేశాల్లో కనబడే ఛాయ దేశకాకువు. మనుష్యుల దేహమొక ఛాయా విశేషం గనుక అట్టిది క్షేత్రకాకువు. వీణ, పిల్లనగ్రోవి మొదలైన యంత్రాల్లో ప్రతీతికి వచ్చే రాగచ్ఛాయ యంత్రకాకువు. ఈచోట దేశకాకు విశేషాలు ఉద్దేశింపబడినవి అనవచ్చును.

6. అన్నమాచార్యుల సంకీర్తన సంప్రదాయం ఆంధ్రదేశానికి క్రొత్తది కాదు. క్రీ.శ. 14 శతాబ్దికి చెందిన సింహగిరికృష్ణమాచార్యులు భజనసంప్రదాయానికి ఆద్యుడు. ఆయన సంకీర్తన పద కవితా పితామహుడు. ఆయన రచనలను 'వచనాల'నీ 'విన్నపా'లనీ అంటారు. ఈయన రచించిన 'సింహగిరి నరహరి వచనాలు' 4లక్షలకు మించినవని అంచనా. ఈయన కాలంలో పాతకమూరి భాగవతులు ప్రసిద్ధులు. కృష్ణమాచార్యులు ఈ పాతకమూరి భాగవతుల సన్నిధిని తన వచన సంకీర్తనాలనుగానం చేసినట్లు తెలుస్తున్నది.

5. Annamayya's padams are called excursions into various countries or regions. This description is meant for drawing our attention to the intonational peculiarities (kākus ) of the sankīrtans. These 'kākus are mainly six types· (1) svara kāku (2) rāga kāku (3) anyarāga kāku (4) dēśa kāku (5) ksētra kāku and (6) yantra kāku. Kāku is modification of sound. A shade of one musical note in another is svarakāku. This occurs in a melody called rāga The main shade of a melody or rāga is rāga kāku. A shade of a melody in another is anya-rāga kāku. Shade of intonation found in different regions or countries as being natural to them is dēśa-kāku. Kṣētra kāku pertains to an individual human being as his body is also considered a particular shade. Shade of melody that is heard on vīṇa or flute is called yantra kāku. Here, one may say, dēaa-kākus are intended.

6. Sankīrtana sampradāya of Annamācārya was not new to the Telugu country. Kṛṣṇamācārya of 13/14c. A D. is the first one we know of in the bhajan sampradāya. He is the grandsire of Sankīrtana Padakavita. His compositions called 'vacanam -s' are estimated to be more than 4 lakhs. During his time Potakamūri-bhāgavata-s were well known. It is learnt Krsnamācārya recited his vacana sankīrtanams in the presence of these Potakamūri-bhāgavata-s

కం.॥ లక్షణములు పదకవితా
రక్షణములు వివిధ కుకవిరాజీ మదన
మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళ్లపాక విభుసత్కవితల్ 7

తా॥ తాళ్లపాక అన్నమాచార్యుల సత్కవితలు పదకవిత్వానికి లక్షణాలు చెప్పేవీ పదకవిత్వాన్ని కాపాడేవి, పలు విధాలైన కుకవి సమూహాల పొగరు వదిలించేవి, సాక్షాత్తు వేంకటాచలపతి చూపులే అయినట్టివి.

వ్యా॥ సత్కవిత అనగానే అసత్కవిత కూడా గుర్తుకువస్తుంది. సత్కావ్యం, అసత్కావ్యం అన్న వాడుక కూడా మనకు తెలుసు. సత్వశుద్ధి గలిగి సత్వశుద్ధికి సహాయపడే కవిత, కావ్యం, సత్కవిత, సత్కావ్యం అవుతాయి. సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ప్రాణుల స్వభావాన్ని నడుపుతున్నాయి. రజోగుణతమోగుణాల స్పర్శ లేని మనస్సే సత్వమనీ సత్వోద్రేకమే భోగరూపమైన ఆనందం అని ఆలంకారికుల వివరణ. అన్నమాచార్యుల సత్కవితలైన పదాలు ఆనందం చిన్నెలని ఒక అభిప్రాయం. పదరచన ఎలా ఉండాలో గుర్తుగా చూపి చెప్పేవని మరొక అభిప్రాయం. పద కవిత అసమర్థుల చేతిలో పడి నిందలపాలు కాకుండా కాపాడేవని పదకవితా రక్షణములన్నదాని అభిప్రాయం. అన్నమయ్యకు సమకాలీనుడే అయిన శ్రీనాథుడు 'ముది విటులు విధ వలంజలు, పదకవితలు' ఇత్యాదిగా ఈసడించిన చాటు పద్యం ప్రసిద్ధమే. సత్కవులు కానివారు కుకవులు. సత్కవిత కుకవులకు సాధ్యం కాదు. సత్కవిత్వరచనకు చాలని వారై కుకవులు పొగరు విడుస్తారు. అన్నమయ్య కవితలు కుకవుల పొగరుదించేవి. ఇంత మాత్రమే కాదు. అవి సాక్షాత్తు వేంకటపతి చూపులన్నప్పుడు మిక్కిలిగా పునీతం చేసేవి, ఆనంద ప్రదాలు అని అభిప్రాయం. 'యతేర్దృష్టిః కవేర్వచః' అని పెద్దలమాట. యతీశ్వరుని చూపు, కవి వాక్కు-మనల్ని పునీతం చేస్తాయని భావం. 'వర్ణనా నిపుణః కవిః' అన్నపుడు నిపుణ శబ్దానికి నేర్పరి అని మాత్రం కాక 'మిక్కిలి పవిత్రీకరించువాడు' (నితరాంపునాతీతి నిపుణః) అని కూడా అర్థం. వేంకటేశ్వరుడు ఈశ్వరుడన్నా కృష్ణుడన్నా యోగేశ్వరుడే అవుతున్నాడు. అన్నమయ్య పదాలు మంత్రాలని చెప్పబడిందిగనుక ఆ మంత్ర జన్యమైన కిరణరూపాన అవే స్వామిచూపులూ అవుతున్నవి. మంత్రమే దేవత. మంత్రోచ్చారణ వల్ల మంత్రరూప దేవత ప్రకాశిస్తుంది. ఆ వెలుగు విశిష్టం. మంత్ర శాస్త్రంలో కిరణ శబ్దం దాదాపు పారిభాషికంలాంటిది. తేజోరూపాన దేవతనుచెప్పుంది. ఇక్కడి గొప్ప అభిప్రాయం ఇది.

Verse 7.

Tr: The 'satkavita-s (excellent poetic compositions ) of Tallapaka Annamācārya are exemplars and protectors of padakavita; they make bad poets shed their pride; they are verily the graceful glances of Vēnkatācalapati.

com: Satkavita brings to the mind asatkavita too. We are aware of the usage of the words 'satkāvya' and 'asatkāvya' also. Composed with and helpful to the purity of spirit (satva) poetry or a poem becomes sat-kavita or sat-kāvya. The three guna-s called satva, rajas and tamas condition and monitor the nature and conduct of all living beings. Ālaṁkārikās explain that the mind untouched by rajas (principle of activity) and tamas (principle of inertia) is itself satva (principle of self-abidance ) and its excitment is enjoyment and bliss. One suggestion is that Annamācārya's padams, excellent compositions as they are, are signs of bliss Another suggestion is that they exemplify the best way of composing padams. Protectors of padakavita only means that they protect this genre of compositions from their name getting sullied in the hands of incapable composers. It is wellknown that Srīnātha, a major poet in Telugu and contemporary to Annamācārya deprecated padakavita in one of his cātu verses by equating it with old and ṣaggy fornicators and widowed-whores. Those who are not satkavi-s are called kukavi-s (poetasters). They are incapable of writing satkavita. Such poets shed their pride on seeing these compositons. Such are the compositions of Annamayya. (It is a characteristic feature of Telugu literature to praise satkavis and deprecate kukavi-s). Not merely that . When they are said to be verily the graceful glances of Lord Vēnkatapati it means they are purifiers and donors of bliss. 'Yatēr dṛṣṭih kavēr vacaḥ' (the glance of a yati or recluse and the word of a poet ) is the adage of the ancients. The glance of the recluse and the word of a poet are said to cleanse and purify us. A poet is also described as 'varṇanā nipunah'- one who is skilled in describing. The sanskṛt word 'nipuṇah' means not merely the skillful but carries the etymological meaning 'a thorough cleanser' (nitarām punāti iti nipuṇah). Whether we take Him as Iswara (Siva) or Kṛṣṇa, Vēnkaṭēswara is the master of Yōga (yōgēswara). The padams of Annamayya have been described earlier as mantras. In mantraśāstra, mantra itself is the deity and when it is uttered, the deity shines as effulgent light. Such a light is generally referred to as kiraṇa (ray) in a technical sense So Annamayya's padams, mantras as they are called, represent the Lord Himself as Light and become his glances, sui-generis. This is the great idea here.

1. లక్షణమన్నపుడు ఛందోవ్యాకరణాది శాస్త్రమని అర్థం. ఇక్కడ పద రచనకు ఉండవలసిన గుర్తుల్నీ గుణాల్నీ నియమాల్నీ చూపి చెప్పేవని (అన్నమయ్య రచనల పరంగా) గ్రహించాలి.

2. సంగీతంలో ఉన్నట్లుగానే దేశ భాషా సాహిత్యాల్లోను మార్గ- దేశి సంప్రదాయాలున్నాయి. తెనుగులో ఈ మార్గదేశి భేదం తొలిసారిగా దేనటిపండని శాసనం (క్రీ. శ. 1145)లోను అటు మీద పాలకురికి సోమనాథుని రచనల్లో, నన్నిచోడుని కుమార సంభవంలోను కనబడుతుంది. అయినా ఈ దేశి సంప్రదాయం క్రీ. శ. 9శతాబ్ది నుండి దొరికే శాసనాల్లోకూడా కనబడుతుంది. అంతకు మునుపు శాసనాలకెక్కకుండా కొంతకాలం ఉండిందని కూడా మనం విశ్వసింపవచ్చు.

దేశి సంప్రదాయం పద్యకవిత పదకవిత అని రెండు రకాలు. తెనుగులో పద్యకవితకు వచ్చిన గుర్తింపు పదకవితకు రాలేదనే చెప్పాలి. శాసనాల్లో దేశిచ్ఛందస్సుల్లో వ్రాసిన పద్యాలు కనపడతాయి. క్రీ.శ. 848 నాటి పండరంగని అద్దంకి శాసనంలో 'తరువోజ,' క్రీ.శ. 848-892 ప్రాంతపు గుణగ విజయాదిత్యుని కందుకూరి శాసనంలోను, క్రీ.శ. 892-929 ప్రాంతపు చాళుక్యభీముని ధర్మవర శాసనంలోను 'సీస' పద్యం, క్రీ.శ. 927-934 ప్రాంతపు యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో 'మధ్యాక్కరలు' కనబడతాయి. దేశిలో పద్యకవిత ఉండగా పద కవిత లేదనుకొనటానికి వీల్లేదు. తెనుగు భాషకు క్రీ.శ.10 శతాబ్దినాటికే ఛందోగ్రంథమున్నట్లు తెలుస్తున్నది. 'యాప్పెరుంగల క్కారికై' అనే 10 శతాబ్దినాటి తమిళ గ్రంథంలో 'వాంచియార్ సెయ్‌ద వడుగచ్ఛందము' (వాంచియార్ చేసి తెలుగు ఛందస్సు) పేర్కొనబడింది. క్రీ.శ. 1000 ప్రాంతపు విరియాల కామసాని గూడూరు శాసనంలో తొలిసారిగా చంపకమాల ఉత్పలమాల అనే సంస్కృత వృత్తాలు కనబడుతున్నాయి. దీన్నిబట్టి అంతకు మునుపు దేశిచ్ఛందమే వ్యాప్తిలో ఉండేదని తలంచవచ్చు.

దేశి సంప్రదాయానికిచెందిన పదకవిత్వం 13శతాబ్ది చివర వెలసిన పాల్కురికి సోమన 'పండితారాధ్య చరిత్ర'లో పేర్కోబడింది. మల్లికార్జున పండితారాధ్యుడు 12 శతాబ్దివాడు. తెనుగుదేశంలో ఆరాధ్యశైవ సంప్రదాయానికి ప్రవర్తకుడు. ఆయన బౌద్ధుల్ని వాదంలో గెలువబోయేటప్పుడు 'తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నంజపర్ణన, గణవర్ణన పదములు' పాడుచు సద్భక్తులు వెంటవచ్చిరని సోమనవర్ణన. (పండితారాధ్య చరిత్ర. 513 పుట.)

1 'Laksaṇa' generally means and indicates a śāstra like chandas (prosody) or vyākarana (Grammar ). Here we have to understand that Annamayya's poetic compositions (padams) exemplify the best ways of composing padams

2.Like in music we have mārga and dēśi traditions in indigenous languages too In Telugu this mārga-dēśi bifurcation appears for the first time in an inscription of Dēsati Panḍa (1145 A.D) and later on in the writtings of Pālakuriki Sōmanātha and in Kumārasaṁbhava of Nannecōda. But the existence of dēśi tradition can be seen as early as 9c. A.D from the extant inscriptions We can also guess that it could have been prevalent earlier to 9c. A.D. also before it got recorded in inscriptions.

Dēśi tradition is of two streams: Padyakavita (poetic composition in indigenous verses) and pada-kavita, (indigenous music compositions). It must be stated that pada-kavita in Telugu has not acquired the same recognition as padya-kavita. Verses composed in indigenous metres of prosody are seen in inscriptions. Addanki inscription of Panḍaranga (848 A D.) contains a 'taruvōja' verse; sīsa verses can be seen in Kandukūru inscription of Gunaga Vijayaditya (848-892 A.D) and Dharmavaram inscription of Cālukya Bhīma (892-929 A D.); 'madhyākkaras' are recorded in the Bezawada inscription of Yuddhamalla (927-934 A.D). The existence of versification in the indigenous (dēśi) stream precludes the absence of padakavita and suggests the coexistence of both. Telugu is known to have had a work on prosody as early as 10th century. The Tamil work 'Yāpperungala-K-Karikai' (10c) speaks of a prosodical work in Telugu by one Vanciyar (vanciyar seyda vadugaccandamum). It is only in the Gudur inscription of Viriyāla Kāmasāni (1000 A.D) that one finds the verses of campakamāla and utpalamāla marking the entry of Sanskṛt metres into Telugu. This suggests the prevalence of indigenous metrics alone earlier in the Telugu country.

Pada kavita of dēśi tradition is mentioned in Panditārādhya caritramu of Pālakuriki Sōmanātha who flourished at the end of the 13 century. Mallikārjuna Panditārādhya belonged to the 12th century, he was the founder-leader of ārādhya-śaiva-śaṁpradāya in Andhra. Pālakuriki Sōmanātha in his work on Panditārādhya describes that devotees of Siva accompanied Panditārādhya on his journey to defeat Buddhists in argument, singing tummeda padamulu, prabhāta padamulu, ānanda padamulu, śankara padamulu, sanja varṇana and ganavarnana padamulu. (Tummeda means a honey-bee. The word occurs as a refrain in the songs of that name The bee represents jiva according to Bhuvanēswarī saṁhita. Parvata means Srīśaila, the abode of Lord Mallikārjuna -a saivite pilgrim centre of great importance, situated in Kurnool district of Āndhra Pradēsh Parvata Padamulu are the songs sung by devotees while climbing up the hill Sanja varnana means description of the evening; gana varṇana means the description of the pramatha-gaṇas-both important to Siva as He dances in the evening and pramathas are His attendants. The rest of the names are clear enough).

ప్రాచీనాంధ్ర లాక్షణికులుచాల కాలము, తెనుగును కూడా ఒక ప్రాకృతముగా పరిగణిస్తూ వచ్చినా దేశిచ్ఛందస్సుల కొన్నింటిని పేర్కొంటూ వచ్చినా పద కవితను సమగ్రంగా చెప్పినవారు కారు. క్రీ.శ. 1402- 1407 నాటి విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి' దేశి సంప్రదాయంలో రగడ, మంజరి, ఉదాహరణాలను పేర్కొంటుంది; కాని యక్షగానాన్నిచెప్పదు. ఛందస్సుల్లో కంద, సీస, గీతి, అక్కర భేదాలను త్రిపది, చౌపది, షట్పదులను తరుహోజను చెప్తుంది. క్రీ.శ. 1453 నాటి అనంతుని 'ఛందోదర్పణం'లో పదకవితకు ఆశ్రయభూతమైన నవ విధరగడలు చెప్పబడినై. క్రీ.శ. 1550 ప్రాంతపు చిత్రకవి పెద్దన 'లక్షణ సారసంగ్రహం'లో రగడ భేదాలను యక్షగానంలో విత్రిపుటాది తాళాలకు ఎట్లావాడుకోవచ్చునో చెప్పబడింది. క్రీ.శ. 1600 ప్రాంతపు వెల్లటూరి లింగనమంత్రి 'సరసాంధ్రవృత్త రత్నాకరము'లో ( కర్ణాట చౌపది లక్షణమే) 5 మాత్రలగణములైన 3స్మరగణాల మీద ఒక సూర్యగణమనుచు, ఆద్యంత ప్రాసలతో, 2గణాలమీద యతితో 'పదలక్షణ'మని చెప్పబడింది. స్మరగణాలనేవి సంగీత శాస్త్రంలో 3అక్షరాల గణాలకు వాడే పరిభాష. క్రీ.శ. 1656 నాటి అప్పకవి తన 'అప్పకవీయము'లో చిత్రకవి పెద్దన చెప్పిన రగడ, యక్షగానలక్షణాలను అనువదించటంతోపాటు లాలిపాటి, పెండ్లిపాట, ధవళము, సువ్వాల, అర్ధ చంద్రికలు అనే విశేష రచనలు చెప్పినాడు. పదలక్షణాన్ని యక్షగానలక్షణాన్ని చెప్తూ పద కవితా భేదాల్ని మధురకవితా శాఖ క్రింద సంగ్రహించింది క్రీ.శ. 1656 తర్వాతి వార్తా కవి రఘునాథయ్య 'లక్షణ దీపిక'. అందిట్లున్నది: 'యక్షగానంబునన్ వెలయు పదంబులు, దరువులు, నేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పద, అష్టపదులు నివి యాదిగా గల్గునన్నియు లయప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల ప్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబులు'. క్రీ.శ. 17 శతాబ్ది చివరివాడైన పొత్తపి వేంకటరమణకవి తన 'లక్షణ శిరోమణి'లో సంగీత రత్నాకరాన్ని అర్జున భరతాన్ని స్మరించి ఏలలే పదాలని, మాత్రాసమకనిబద్ధాలైన 'ప'గణాలతో వానిని కూర్చాలని అవి సూళాదులకు అనుగుణంగా ఉండాలని చెప్పి అవి రాగతాళాలతో సంగీత రీతిని తేటపడి ఉంటాయి గనుక సాహిత్య మార్గాన లక్షణంలో రావని చెప్పాడు. (లక్ష. శిరో. 3-425, 426, 427).

Ancient Telugu prosodists, though they went on treating Telugu as one of the Prākrts, have been mentioning at least some of the indigenous metres. Yet they cannot be said to have treated Padakavita in a comprehensive way. Kavyālankāra Cūdāmani of Vinnakōta Peddana (1402-1407 A D) mentions ragaḍa manjari and Udāharana but not Yakṣagāna in the dēśi stream Verses like kanda, sīsa, gīti, and different types of akkaras, tripadi, caupadi, and satpadi are treated as also taruvōja. Chandōdarpana of Ananta (1435 A D) treats the 9 types of ragaḍas which lend support to a lot of padakavita Laksanasāra Sangraha' of Citrakavi Peddana (1550 A D ) teaches how the different kinds of ragaḍas can be used suitably for talas like 'triputa' etc. in Yakṣagāna. 'Sarasāndhra Vṛttaratnākara' of Vellaturi Linganamantri (c 1600 A.D) gives padalakṣaṇa as 3 kāmaganas of 5 mātras each plus 1 sūrya gaṇa of 3 mātras, with prasa both at the beginning and ending of the lines, with caesura after 2 gaṇas in each line Metrically speaking ( 5x3+3=18matras), this is Karnāta Caupadi only but for the nomenclature of gaṇas as smara gaṇas as found in music treatises like S.R. 'Appakavīyamu' of Appakavi (1656 A.D ) repeats what Citrakavi Peddana has said about ragaḍa and Yakṣagāna but also adds lālipāta (lullaby), penḍlipāṭa, dhavaḷam, suvvāla (pounding song), 'ardhacandrikalu'. It was Lakṣaṇa Dīpika of Vārtākavi Raghunāthaiah (after 1656 A.D) which not only mentioned pada lakṣaṇa and Yaksagāna lakṣaṇa but also brought different types of songs under one head as 'madhura kavita'; Padams, daruvus, ēlās, dhavalas, mangalahāratis, śobhanas, uyyālajōlalu, jakkularēku padamulu, candamāma suddulu, aṣṭakas, ēkapadas, dvipadas, tripadas, catuspadas, astapadas are the songs covered undear this head Laksaṇa Sirōmani of Pottapi Vēnkataramana Kavi (17c A D) makes a mention of S R. and Arjuna Bharatam and categorically states that ēlā-s are padams and that they should be in accordance with 'sulādi-s' of music. As they are tied up with rāga, tāla etc he relegates them to music , severing their connection with literature (L.S. 3-425,426,427).

కం.॥ విన్నంతఁ బాప సంఘము
అన్నియు నడపంగఁ బూఁటయగు తాళులపా
కన్నయ పదములు పాడిన
యన్నయకోవిదుల వేంకటాధిపుఁడేలున్ 8

కం. ॥ సంకీర్ణ వివిధ పాప వి
శంకట చిత్తులకునైన సర్వేశ్వరుపై
సంకీర్తనములు పాడిన
శంకాతంకములు వదలు శమనుని వలనన్ 9

కం. ॥ మదిఁ దాళ్లపాక యన్నయ
పదములపై భక్తిగలిగి పాడిన విభవా
స్పదములగు వివిధ సంపత్
ప్రదములు శ్రీవేంకటేశుపదములు దెలియున్ 10

కం. ॥ నక్తంచరారి తనకును
భక్తుండైనట్టి తాళపాకన్నయ చా
టూక్తి పదబంధ కవితా
రక్తుండై యితర వాగ్విరక్తుండయ్యెన్ 11

మ. ॥ శ్రుతులై, శాస్త్రములై, పురాణ కథలై, సుజ్ఞాన సారంబులై ।
యతిలో కాగమవీధులై, వివిధ మంత్రార్థంబులై, నీతులై।
కృతులై వేంకటశైల వల్లభ రతి క్రీడారహస్యంబులై
నుతులై తాళుల పాకయన్నయ వచోమూర్తిక్రియల్ చెన్నగున్ 12

తా॥ విన్నంత మాత్రానికే పాపాల కదుపులనన్నింటినీ అణచటానికి హామీ యిచ్చే తాళ్లపా కన్నయగారి పదాలు నోరార పాడేటటువంటి లాభమెఱిగిన చదువర్ల ( నీతిమంతులైన విద్వాంసుల)ను వేంకటాచలపతి చేపడతాడు (8).

కలగాపులగంగా కలిసి పాకిన పాపాల విరివితోడి మనసుగల వారికి కూడా సర్వేశ్వరుని మీద (ఈ)సంకీర్తనలు పాడితే యమునివల్ల కలిగే భయ విచారాలు లేదా ఆధి వ్యాధులు విడిచిపోతాయి. (9)

తాళ్లపాకన్నయ పదాలమీద మనసులో భక్తిగలిగి పాడినట్లయితే (ఆ పాడినవారికి) వైభవ స్థానాలైన పలువిధాల సంపదలిచ్చే శ్రీవేంకటేశ్వరుని పాదాలు ( అనుభవపూర్వకంగా) తెలిసి వస్తాయి. (10)

Verses 8-12.

Tr. Tāḻḻápāka Annaya's padam-s are a surety for the eradication of all sins. The judicious who know the benefits and sing them get the protective care of Vēnkaṭācalapati.(8)

If (these) Sankīrtan-s on Sarvēswara (Vēnkaṭēswara, the God Almighty ) are sung even those whose minds are burdened with an amalgam of various sins will be free from the fear and sadness caused by the God of Death . (9).

If Tāḻḻapāka Annaya's padams are sung with devotion the Feet of Srī Vēnkaṭēsa, bestowers of various riches productive of pomp and luxury, will be realised (10).

రాక్షసుల్ని మర్దించే శ్రీ మహావిష్ణువు తనకు భక్తుడైన తాళ్లపాకన్నయ ప్రియం గొలిపే పద బంధాల కవితలో తగులుకొన్నవాడై యితరుల మాటలనొల్లని వాడైనాడు. (11)

తాళ్లపాకన్నయ మాటల క్రొత్త కూర్పులు లేదా విచ్చిత్తి విశేషాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణ కథలు, జ్ఞానసారాలు, ఆగమాల వరుసలు, వలు మంత్రాల అర్థాలు, నీతులు, కృతులు, వేంకటాచలపతి రతి క్రీడల రహస్యాలు, స్తోత్రాలు అవుతూ అందంగా ఉంటాయి. (12).

వ్యా. ॥ ఎనిమిదో పద్యంలో 'అన్నయకోవిదుల' అనేచోట చిన్న శ్లేష. అ+నయ కోవిదులని ఒక విరుపు- ఆ లాభమెఱిగిన చదువరులు /నీతి తెలిసినవిద్వాంసులని అర్థం. 'అన్నయ+కోవిదుల' అనేది రెండో విరుపు. ఈ చోట అన్నయను గూర్చి తెలిసిన చదువర్లు /విద్వాంసులు అని అర్థం. అన్నయ భక్తిని వ్యక్తిత్వాన్ని చదువుసాములను తెలిసి ఆయన సంకీర్తనలు పాడేవారిని వేంకటాచలపతి చేపడతాడని అభిప్రాయం. అన్నమయ్యను తెలిసి ఆయన పదాలు పాడటానికీ స్వామి చేపట్టడానికీ ఏమి సంబంధం? స్వామి భక్తపరతంత్రత. స్వామికి తన మీది భక్తికంటె తన భక్తుల మీద భక్తి ప్రియతరం అనటం. ఇది వైష్ణవ సంప్రదాయ భావం.

పదో పద్యంలోను 'తాళ్లపాక యన్నయ పదములపై' అన్నచోట కూడా చిన్న శ్లేష. తాళ్లపాకన్నయ పదములంటే సంకీర్తనలనేది ఒక అర్థం. పదములంటే పాదాలనేది రెండో అర్థం. అన్నయ పదాలమీద భక్తిగలిగి ఆయన పదాలు పాడితే వేంకటేశ్వరుని పాదాలు తెలుస్తాయనేది రెండోచోట అభిప్రాయం. ఆయన వైకుంఠవాసి అయి విష్ణు సాలోక్యాన్ని సారూప్యాన్ని పొందాడని గమ్యం. ఈ పద్యంలో ఆస్పదశబ్దానికి, సంపత్ పదములనే చోటి పద శబ్దానికి చోటు, స్థానం అని ఒకే అర్థమైనందున సంపత్ప్రదములని 1935 నాటి దేవస్థానంవారి అచ్చుప్రతి పాఠానికి భిన్నంగా సవరించబడింది.

పదకొండో పద్యంలో వేంకటాచలపతి అన్నమయ్య చాటూక్తి పదబంధ కవితారక్తుడు కావడం, ఇతర వాగ్విరక్తుడు కావటం చెప్పబడింది. అన్నమయ్య 'శృంగార మంజరి' చేసి శేషాద్రి శృంగవాసునికి అర్పించినపుడు స్వామి తాను వెనుకటి కృష్ణమాచార్యుల వినుతి చేత కొన్నాళ్లు విరక్తుడుగా నుంటినని, అన్నమయ్య శృంగార సంకీర్తనలకు లోబడి మంచి ప్రాయపువాడ నైనానని మెచ్చుకొని చెప్పి గౌరవించినట్లు 'అన్నమార్య చరిత్ర.' 42పుటలో అభిలిఖింపబడి ఉంది. సంకీర్తనలక్షణం అన్నమాచార్య చరిత్ర రచనకు కొంచెం తర్వాతి రచన కావచ్చు.

The Enemy of Demons, (Sri Vēnkaṭēsa ) having fallen for Tāḻḻapāka Annaya's poesy of pleasing phraseology became un-interested in the utterances of others (11)

Tāḻḻapāka Annaya's verbal innovations are beautiful. They become Vēdas (the infallible scriptures), śāstras (sciences), purāṇic stories, essence of wisdom, rows of āgamas the very contents of mystic formulae, ethics and morals, pieces of art, the very secrets of God's chamber-Pleasures.(12)

Com: There is a pun on 'annaya kovidula' in verse 8. Splitting it up as 'ā + nayakōvidulu' yields the contextual straight meaning of 'Those or such judicious scholars'. 'Annaya + kōvidulu' is another way of splitting the compound. It means those well-versed in the compositions/personality of Annaya. It means those who know the devotion, personality and scholarship of Annaya and sing his songs will get the protection from Vēnkaṭācalapati How are these two things connected? The Lord is devoted to His own devotees. He is more pleased with devotion to His devotees than to Himself. This is a concept well known in Vaisṇavism.

In Verse10 there is a pun on 'padamulapai' in 'tāllapākannaya padamula-pai'. Padamulu means sankīrtans; it also means the (two) feet 'If one gets devoted to the feet of Annaya and sings his sankīrtans, the Feet of the Lord will be realised'-is another meaning. That Annaya after leaving his mortal coils, has reached Vaikunṭha, the abode of Viṣṇu (sālōkya) and assumed a form similar to His (sārūpya ) is to be understood. The text reading as 'sampat padamulu' is emended as 'sampatpradamulu' in view of the fact that the two words āspada and pada in the connected adjectival construction 'vibhāvāspadamulagu vividha sampa-tpadamulu' means the same thing and appear repetitive.

The 11th verse speaks about Lord Vēnkaṭēswara being captivated by Annamayya's poetry of pleasing phraseology and His non-interestedness in others's utterances. This is supported by A.C When Annamācārya composed Sṛngārama-ñjari and made it an offering to Lord Vēnkaṭēswara He is said to have remarked that with Kriṣṇamācārya's devotional praises in earlier days He felt like a recluse and that with Annamayya's erotic panegyric then He felt young and dashing (with a lust for life). (Anna. caritra page 42). It is probable Sankīrtana Laksanamu is slightly posterior to Annamācārya caritra.

1. పన్నెండో పద్యంలో అన్నమయ్య పదాలు/సంకీర్తనలు- 'కృతులై' అని విశేషింపబడినై. అనంతర కాలంలో త్యాగరాజాదుల రచనలకు కృతులన్న పేరు గట్టిగా నిలవటానికి కారణమిదేనేమో! 'కృత మస్యాస్తీతి కృతిః'. అని వ్యుత్పత్తి; సాహిత్యకృతి, సంగీతకృతి, ఆలేఖ్యకృతి, శిల్పకృతి - ఏదైనా కావచ్చు. ఈనాడు ఇంగ్లీషులోని a piece of art అనే పదబంధానికి మొరటు తర్జుమాగా తెనుగులో వాడబడుతోన్న 'కళాఖండం' అనే దానికంటే ఇది చాలా మెరుగైన మాట.

1 Verse12 qualifies the padams/sankīrtans of Annamayya as 'krti-s Etymologically, that which carries the skill is krti, a literary work, a musical composition, a painting, a sculpture etc. This particular usage may be the reason for this nomenclature sticking to the compositions of Tyagaraja and others later on. This is a much better word than the compound 'kalākhanḍamu' currently used in Telugu which is an uncouth translation of the English expression 'a piece of art'

కం॥ భరతాది గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకటభూమీ
ధర వర కీర్తన లక్ష్యము
లురు పదకవితా పితామహుండేర్పఱచెన్ 13

ఆ॥వె॥ అట్టి యన్నయార్యుఁడానతిచ్చిన పద
లక్ష్య లక్షణముల లాగుదెలిసి
పలుక నేర్చెనేని బాలుండుఁబ్రోడయౌ
దత్ప్రబంధ మమృతధారఁబోలు. 14

మ॥ ధరలో దాళులపాకయన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మునుజేయఁబూని తగనుత్పాదించెఁదల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబునఁగవీంద్రానంద సంధాయియై
పరిపూర్ణాఖిల శాస్త్రసమ్మతముగా భావజ్ఞలౌనౌననన్ 15

ఆ॥వె॥ అలరుఁదాళపాక యన్నయార్యసుతుండు
తిరుమలార్యుఁడఖిల దేశికుండు
తత్సుతాగ్రజుండ ధరలోనఁజినతిమ్మ
యాహ్వయుండఁదండ్రి యనుమతమున 16

మ॥ పరమామ్నాయ సమానమై వెలయు మత్పైతామహ గ్రంథమున్
వరచాటూక్తి మదీయ పుణ్యజనక వ్యాఖ్యాతమున్ వేడ్కఁద
చ్చరణాంభోరుహముల్ మదిందలచి సచ్ఛాస్త్రజ్ఞులింపొందఁగా
వరుసం జెప్పెదఁబద్యరూపమునఁదద్వాక్యానుసారంబునన్ 17

తా॥ భరతం అనబడే నాట్యశాస్త్రం మొదలైన గ్రంథాల్లో విశేషంగా కూర్చబడిన శాస్త్రీయమైన నియమాలను వేంకటాచలపతి కీర్తనలనే లక్ష్యాలను గొప్పపదకవితా స్రష్ట (అయిన అన్నమాచార్యుడు) రూపుగట్టచేసినాడు. (13)

పదకవితాపితామహుడైన అన్నయార్యుడు చెప్పిన పదరచన లక్ష్యాల, లక్షణాల రీతి తెలుసుకొని తానూ చెప్పగలిగినట్లయితే ఆచెప్పినవాడు బాలుడైనానరే అతని ప్రబంధం అమృతధారవలె ఉంటుంది. అతడు ప్రౌఢుడనిపించుకుంటాడు (14).

గురువుల్లో సిగబంతి అనదగిన తాళ్లపాకన్నయ లోకంలో సంకీర్తనను గరగరగా చేయ గోరినవాడై మునుపు తానద్దాని లక్షణాన్ని అపూర్వంగా సంస్కృతభాషలో కవులకు ముచ్చటగొల్పేటట్లుగాను, శాస్త్రగ్రంథాలన్నింటికి పూర్ణసమ్మతమౌనట్లుగాను, రసికులైనవారు తల ఊచి ఆమోదించునట్లుగాను గ్రంథరూపాన పుట్టించాడు (15).

Verse 13-17.

Tr. The great creator of the poesy of musical compostitions (Annāmācārya ) defined the signal characteristic regulations of padam extensively codified in works like Nāṭyaśāstra called Bharatam, etc. as also the model kirtans on Vēnkaṭācalapati. (13).

If one can understand the modality of the examples and regulations of padam as enunciated by such Annayārya as described above and compose, such a one, even if he be a green-horn (lad), will become a maestro, with his composition being comparable to a gush of ambrosia (amṛtadhāra) (14).

Tāllapāka Annaya, the top preceptor, intending to freshen up sankīrtana, brought forth its governing principles in Sanskṛt in such a way that it afforded pleasure to the best of poets, that it stood in complete agreement with śāstra and that it drew encomiums from connoisseurs (15).

తాళ్లపాకన్నయకు తిరుమలార్యుడనే కొడుకున్నాడు. ఆయన అన్నింటికి గురుస్థానీయుడు. నేను అతని కొడుకుల్లో పెద్దవాడను. చినతిమ్మయ అనే పేరుగలవాడను. మాతండ్రి సమ్మతిమీద తొలివేదంతో సమానంగా ప్రకాశించే మాతాతగారి గ్రంథాన్ని, ఆహ్లాదకరమైన మాటలతో మానాన్నగారు వ్యాఖ్యానించిన దాన్ని, నేనుకూడ వాళ్ల శ్రీ చరణాల్ని స్మరించి ఆవారి వాక్యాలను అనుసరిస్తూ, శాస్త్రజ్ఞులు సంతోషించేటట్లు, వరుసగా (తెలుగులో) పద్యరూపంగా చెప్తాను. (16, 17).

వ్యా॥ పితామహుడంటే బ్రహ్మ. సృష్టికర్త. పదకవితా పితామహుడు అంటే పదకవిత్వాన్ని సృష్టించినవాడని అభిప్రాయం. బిరుదప్రాయమైన ఈమాట రచనలోని సృజన ధర్మాన్నిబట్టి రావచ్చు; రచించిన కవితల పరిమాణాన్నిబట్టి రావచ్చు. అన్నమాచార్యులకిది బిరుదమని చెప్పటానికి ఇచ్చిన వారెవరనే ప్రశ్న ఉంటుంది. అన్నమయ్యను కొంతకాలం ఆదరించి సేవించిన సాళువ నరసింగరాయలు కూడ 'పదకవితాపితామహు'డని బిరుదమిచ్చినట్లు సాక్ష్యంలేదు. 'కన్నవిన్నవిగావుగదర యీపదము లన్నయార్యునివి మోహనమూర్తులనుచూ' మెచ్చుకొని విన్నట్లు మాత్రమే 'అన్నమాచార్య చరిత్ర' చెప్తున్నది. చిన తిరుమలాచార్యునికి (1537) కృష్ణరాయల ఆస్థానంలో 'ఆంధ్రకవితా పితామహుడు' అల్లసాని పెద్దన (1509-1520) ఉండటం తెలుసు. ఆయన బిరుదులు విన్న చినతిరుమలాచార్యుడు తన తాతగారిని 'పదకవితా పితామహు'డని పిలిచి ఉండవచ్చు. బ్రహ్మదేవునికి నాల్గుమొగాలు; కవిత్వం ఆశు, విస్తర, చిత్ర, మధుర కవిత్వాలని నాల్గు రకాలు. ఈసామ్యంతోను, బ్రహ్మదేవుడు ప్రపంచాన్ని సృష్టించినట్లు కవి కావ్యప్రపంచాన్ని సృష్టిస్తాడు గనుకను 'కావ్యకమలాసన' 'కవిబ్రహ్మ' 'కవితా పితామహ' ఇత్యాది బిరుదుల్లాంటి పదబంధాలు ఏర్పడినవని చెప్పవచ్చు. ఏమైనా అన్నమయ్యగారి విషయంలో 'పదకవితా పితామహత్వం' సార్థకమనటంలో సందేహంలేదు. అన్నమాచార్యులు 32,000 సంకీర్తనలు, ద్విపదప్రబంధంగా తెనుగులో రామాయణం, శృంగారమంజరి, 12 శతకాలు, సంస్కృతంలో వేంకటాద్రి మాహాత్మ్యం, సకల భాషల్లో నానా ప్రబంధాలు (గీతప్రబంధాలు?) వ్రాశాడు. అన్నమాచార్య చరిత్ర దీనికి సాక్ష్యం. ఇంక తెనుగు సాహిత్యంలో నందంపూడి శాసనంలో పేర్కొబడ్డ నారాయణభట్టు సంస్కృత, కర్ణాట, ప్రాకృత, పైశాచి,కాంధ్ర భాషల్లో కవిరాజశేఖరుడు (1053AD). బద్దెనకవి (C 1150) కావ్యకమలాసనుడు, కావ్యచతుర్ముఖుడు; శివదేవయ్య (12/13 C) ఆంధ్రకవితాపితామహుడు; తిక్కన కవిబ్రహ్మ అన్నది ప్రసిద్ధమే. శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు కూడ కవితాపితామహుడే. అల్లసాని పెద్దన 'ఆంధ్రకవితాపితామహుడు'. అన్నమయ్య 'పదకవితాపితామహుడు' అనబడ్డాడు.

Here flourishes Tāllapāka Annayārya's son, Tirumalārya who is the preceptor for all. I am the eldest of his sons, Cina Timmaya by name With the permission of my father and bowing to his feet, I will enunciate, for the pleasure of scholars in the śāstra, the great scripture-like teaching of my grandfather commented upon by my father, in accordance with the original and its commentary and in the form of sequential Telugu verses (16,17)

Com. The word 'pitāmaha' means Brahma, the Creator The compound padakavitā-pitāmaha means the creator of pada-kavita or poesy of musical composition This title-like compound may originate either because of the creativity of one's compositions or because of their sheer bulk or quantity. To say that it is a title of Annamācārya, the question as to who conferred the title on him has to be answered. There does not seem to be any evidence even to say that Sāluva Narasinga Rāya, who revered and patronized him quite for sometime, bestowed the title 'padakavitā- pitāmaha'on him A C merely states that Narasinga Rāya listened to the captivating padams praising them as 'unseen and unheard of' Cina Tirumalācārya (c 1537 A.D) knew about the presence of 'Āndhra Kavitā-pitāmaha' Allasāni Peddana, in the court of Srī Kṛṣṇadēvarāya during the period 1509-1530 A D Familiar with the title of Peddana, Cinna Tirumalācārya, perhaps, thought it fit to call his own grandfather ' Padakavitāpitāmaha'

Brahma, the creator is said to be four-faced; and poetry is classified into four streams, namely āśu (extempore, vistara (extensive), citra (the wonderful) and madhura (the sweet one) As Brahma, the Creator, creates the world, the poet creates the world of poetry Such similitudes seem to have led to the formation of title-like compounds of 'kavibrahma', 'kāvyakamalāsana' 'kavitā-pitāmaha' etc However there is no doubt that the title-like use of 'padakavitā-pitāmaha' is justified in the case of Annamācārya in every sense He has composed 32,000 sankīrtans, Rāmāyana and Sṛṅgāra manjari in dvipada metre and 12 śatakas in Telugu, Vēnkatācalamāhātmyam in Sanskrt and various prabandhas (gīta prabandhas?) in many languages. A C bears testimony to this In Telugu literature, Nārayāna Bhatta, mentioned in Nandampūdi inscription (1053 A D) was 'kavirāja-śēkhara' in Sānskṛt, Kannaḍa, Prākṛt, Paiśāci and Āndhra languages Baddena kavi (c. 1150 A D ), called himself 'kāvyakamalāsana' and was referred to as 'kāvya caturmukha' 'Śivadēvayya (12/13 c ) held the title 'Āndhra kavitāpitāmaha' It is well known that Tikkana is called' kavibrahma' Kamalanābhāmatya, the grandfather of Srīnātha,was also a 'kavitāpitāmaha' Allasāni Peddanna held the title 'āndhrakavitāpitāmaha' Annamayya is referred to as 'padakavitāpitāmaha''

దీనితోపాటు అష్టభాషా పాండిత్యం తెనుగులో ప్రసిద్ధం. సంస్కృతం, ప్రాకృతం, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశం, ఆంధ్రం - ఇవి అష్టభాషలని అప్పకవి చెప్పినాడు. భాస్కర రామాయణ కర్తలలో ఒక్కడైన మల్లికార్జునభట్టు అష్టభాషాకవిమిత్రుడు. అష్టభాషాకవుల్లో సూర్యుని వంటివాడని అభిప్రాయం. వెంచుకలదిన్నె శాసనాన్ని బట్టి నాచన సోమనాథుడు అష్టభాషల్లో విద్వాంసుడు. నిశ్శంకకొమ్మనకూడ 'అష్టభాషా కవితాప్రవీణుడు'. ఈసంకీర్తన లక్షణకర్త అయిన తాళ్లపాక చినతిరుమలాచార్యుడు కూడ అష్టభాషాదండకం చెప్పి (7-11-1537 నాడు) రాగిరేకులమీద చెక్కించినాడు. కాగా ఇతని తాతఅయిన అన్నమయ్యకు పలుభాషలు తెలిసి ఉండటం సంభావ్యమే. అది వాగ్గేయకారునికి ఉండవలసిన యోగ్యతకూడ.

పద్నాలుగో పద్యంలో 'పదలక్ష్యలక్షణములు' - 'తత్ప్రబంధము' అన్నపుడు పదము, ప్రబంధము అనేపదాలు సమానార్థకాలుగా వాడబడటం గమనించాలి.

పదునైదో పద్యంలో భావజ్ఞులను రసికులన్నపుడు అలంకారశాస్త్రమనే రసశాస్త్రం తెలిసినవారని గ్రహించాలి. భావం అంటే మనోవికారం; అది ఉద్రేకరూపంగా ఉంటుంది. శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనేవాటిని క్రమంగా చెవితోవినటం, చర్మంతో ముట్టుకొవటం, కంటితో చూడటం, నాల్కతో రుచిచూడటం, ముక్కుతో వాసన చూడటంవల్ల మనస్సుకు వికారం, ఉద్రేకం కలుగుతుంది. ఉద్రేకాన్ని వడబోసిన సారమే 'రసం' అనిపించుకుంటుంది. లౌకికానుభవంలోని ఇంద్రియజన్యమైన జ్ఞానప్రతీతిని పరవశింపజేసే రసానుభవంగా మార్చటమే లలితకళలన్నింటి ప్రమేయం. రసంలేని భావంలేదు. భావంలేని రసంలేదు. (నభావ హీనో స్తి రసః, నభావోరస వర్జితః) అని ఆలంకారికుల అభిప్రాయం.

పదునారోపద్యంలో కవి తన్ను 'చిన తిమ్మయ' గా చెప్పుకొన్నాడు. చిన తిరుమలాచార్యునే చిన తిరుమలయ్య, చినతిమ్మయ్య, తిరుమలదీక్షిత, తిమ్మాదీక్షిత, చినతిమ్మ, చిన్న తిమ్మన్న, చిన్న తిరుమలయ్యంగార్, సిరుతిరుమలై అయ్యంగార్, తిరుమల - అనే పేర్లతో వ్యవహరించడం ఉంది.

పదునేడో పద్యంలో 'పరమామ్నాయసమానమై' అనేచోట పరమము అంటే ఆద్యం, ఉత్కృష్టం, ప్రధానం అని అర్థాలు; అలాగే ఆమ్నాయము అంటే వేదం, ఉపదేశం, సంప్రదాయం అని అర్థాలు. పరమామ్నాయమనే పదబంధానికి తొలువేదం, ఉత్కృష్టమైన ఉపదేశం, ముఖ్యసంప్రదాయం అనే మూడురకాల అభిప్రాయాలూ కుదురుతాయి, బాగుంటాయి. పాఠకులు తమకు నచ్చినట్లు గ్రహింపవచ్చు.

Along with this, 'aṣṭa bhāṣāpānditya' (being a scholar linguist in eight languages ) was well known in Telugu Appakavi (1656 A.D) enumerates (1) Sānskrt (2) Prākrt (3) Śaurasēni (4) Māgadhi, (5) Paiśāci (6) Cūlika (7) Apabhraṁśa and (8) Āndhram as the eight languages Mallikārjuna Bhatta, author of a part of Bhāskara Ramāyana in Telugu was 'aṣṭabhāṣākavimitra'. It means that he was like the Sun among the 'aṣtabhāsākavi-s'. According to the inscription of Pencukaladinne, Nācana Sōmanātha was a scholar in aṣtabhāsā-s Niśśanka Kommana also was 'aṣtabhāṣākavitā pravīṇa'. Tāḷḷapāka Cina Tirumalācārya, our author of Sankīrtana Laksaṇamu , has composed a daṇḍakam in astabhāsā-s and had it engraved on copper plates on 7.11 1537 So it is probable his grandfather, Annamayya, knew many languages. It is also one of the qualifications of a vāggēyakāra. That in verse 14 the words 'padam' and 'prabandham u' used in the compounds 'padalaksyalakṣaṇamulu' and 'tat prabandhamu' mean the same-thing and are synonymous, may be noted

In verse 15, when we understand bhāvajña-s as rasikā-s the implication is that they are knowledgeable in Alaṅkāraśāstra which may be called rasa- sāstra Modification of mind is called bhāva. It is in the form of excitement. This excitement occurs as a result of auditory, tactile, ocular, gustatory and olfactory sensations and activities. The distilled essence of this excitement is called rasa. Fine arts try to convert our awarness of mundane sensations into a bewitching enjoyment of rasa. There is no emotion sans rasa; no rasa sans emotion. (na bhāva hinōsti rasaḥ, na bhāvō rasavarjitaḥ). This is the thinking of ālamkānka-s.

In verse 16, the author calls himself 'Cina Timmaya . Cina Tirumalācārya was variously called Cina Tirumalayya, Cinna Timmayya, Tirumala Dīksita, Timmā Dīksita, Cina Timma, Cinna Timmanna, Cinna Tirumalayyangār, Ciru Tirumalai Ayyangār and Tirumala.

In verse 17, there is the phrase, 'paramāmnayāsamānamai' the component ' paramamu' carries the meanings, the first, the best, and the most important; similarly the component 'āmnāya' means the Revealed Scripture (Vēda), the Teaching (upadēśa) and the tradition (saṁprādāya handed down from teacher to disciple) So the phrase can mean the Ancient Veda, the best teaching or the most important tradition. All the three meanings are correct and good. Readers may choose the one they like

1. భరతం అన్నపుడు నాట్యశాస్త్రం, ఆదిశబ్దంచేత దానితోపాటు మరికొన్ని నాట్య సంగీత శాస్త్రగ్రంథాలు అనిగ్రహించాలి. భరతుడు 'నాట్యశాస్త్ర' కర్త. దీని రచనాకాలం క్రీ.పూ. 100-క్రీ.శ. 300. మధ్యకాలం అని అంచనా. ఇది నాట్యానికి దానికి సంబంధించి సంగీతసాహిత్యాలకూ తొలిలక్షణ గ్రంథం. (భరతునికి పూర్వం శిలాలి, కృశాశ్వులనే నటసూత్రకర్తలున్నట్లు తెలుస్తున్నా వారి గ్రంథాలు దొరకలేదు.) భరతుడనే మాటకు భావ-రాగ-తాళాలతో పాడేవాడని, నటుడని అర్థం చెపుతూ నాట్యశాస్త్రం సంకలన గ్రంథమనీ భరతుడు కల్పితవ్యక్తి అని అనటానికి అవకాశంఉంది. కాని నాట్య శాస్త్రంలో పరస్పర విరుద్ధాంశాలు, స్వవచోవ్యాఘాతాలు కనబడవు; గొప్పపరిశీలనా శక్తి కనబడుతుంది. అందుచేత ఎవరో ఒక మహాపురుషుడు దీన్ని రచించినాడని నమ్మవచ్చు. తర్వాతివారు కోహల, దత్తిలులు. కోహలగ్రంథంకనరాదు. దత్తిల గ్రంథం సంగ్రహమొకటి 242 శ్లోకాలతో లభించింది. ఇది క్రీ.శ. 3-4 శ. నాటిదని భావిస్తారు. మతంగుని 'బృహద్దేశి' తర్వాతిది. దీన్ని క్రీ. శ. 5-9 శ. మధ్యవచ్చిందంటారు. కొందరు క్రీ.శ. 5 శతాబ్ది అనే నమ్ముతారు. తర్వాతిది చాళుక్య సోమేశ్వరుని అభిలషితార్థచింతామణి (11శ) అటుపిమ్మటిది జగదేక మల్లుని 'సంగీతచూడామణి'. జగదేకమల్లుడు చాళుక్యసో మేశ్వరుని కొడుకు. క్రీ.శ. 1134-43 మధ్యపాలించినరాజు. ఆపైది హరిపాలమహీపాలుని 'సంగీత సుధాకరం'. హరిపాలుడు సౌరాష్ట్రరాజు. క్రీ.శ. 1175 ప్రాంతమువాడు. ప్రసిద్ధమైన 'సంగీత రత్నాకరం' అటుతర్వాతిది. శార్ఙ్గదేవుడు కర్త. క్రీ.శ. 1230 ప్రాంతపు రచన. దీనికి సర్వజ్ఞసింగభూపాలుడు 'సుధాకర'మనే వ్యాఖ్యానాన్ని (క్రీ.శ. 1380 ప్రాం.), ఇమ్మడిదేవరాయల (క్రీ.శ. 1446-65) ఆస్థాన విద్వాంసుడైన కల్లి నాథుడు 'కలానిధి' అనే వ్యాఖ్యానాన్ని వ్రాశారు. పార్శ్వదేవుని 'సంగీతసమయసారం' మతంగుని, సోమేశ్వరుని, భోజుని పేర్కొంటుంది; సింగభూపాలుడీ గ్రంథాన్ని తొలిసారిగా పేర్కొన్నాడు గనుక దీన్ని 1140 -1380 క్రీ.శ. మధ్యకాలపు రచనగా భావిస్తారు. వీటిలో మనసంకీర్తనలక్షణకర్త సంగీతరత్నాకరాన్ని, సంగీతచంద్రికను, సంగీతచూడామణిని, సంగీతసుధాకరాన్ని 18 పద్యంలో కంఠోక్తిగా పేర్కొన్నాడు. కాని కర్తలపేర్లు చెప్పలేదు.

2. నిబద్ధమైన దేశిగానంలో 'ప్రబంధ'మనేది గానవిశేషం. నారదుని సంగీతమక రందంలోని గాయకలక్షణంలో 'ప్రబంధగాన నిష్ణాతః' (సంగీతాధ్యాయ 4పా-34 శ్లో) అనిప్రయోగం. సంగీతరత్నాకరంలో నిబద్ధగానానికి ప్రబంధం, వస్తువు, రూపకం అనే మూడున్నూ సంజ్ఞలని ఇలా చెప్పబడింది.

"సా చాస్మాభిః పురాప్రోక్తా నిబద్ధం త్వధునోచ్యతే

సంజ్ఞాత్రయం నిబద్ధస్య ప్రబంధో, వస్తు, రూపకమ్"

(సంగీ.రత్నా. 4-6)

1. In verse 13, Bharataṁ etcetera includes certain other treatises on drama, dance and music. Bharata is the author of N.S. The work is assigned approximately to the period 100 B C -300 A.D. This is the earliest available treatise on dance. Music and literature are also treated in this, in so far as they are relevant to dance. Though it is known that Śilāli and Kṛśāsva, the authors of Nata Sūtras existed prior to Bharata, their works are not extant The word 'bharata' is sometimes said to mean an actor, one who could sing with bhāva, rāga and tāla. This makes room for saying that Bharata is a fictitious person and that N S. is a compilation of the work of many writers. However considering the fact that N.S is remarkably free from inner contradictions and self contradictory statements as also its keen powers of observation, one can believe that it has been composed by some great man Next come Kōhala and Dattila. Kōhala's work is not extant. Dattila's work, in the form of a gist called 'Dattilam' in 242 ślōkas, is available. This is thought to belong to 3rd/4th century A.D Next comes 'Bṛhaddēśi' of Matanga This is assigned to the period bestween 5th and 9th centuries A D. Some think it to belong to 5th c. A.D. Next comes' Sangīta Cūḍāmaṇi' of Jagadēkamalla, son of Cālukya Sōmēśwara Jagadēkamalla was a reigning monarch between 1134 A D -1143 A.D 'Sangīta Sudhākara ' is the next work, composed by Haripāla Mahīpāla who ruled Saurāstra c 1175 A D. Next comes the famous S R. Its author is Śārṅgadēva. It is thought to have been composed around 1230 A D. Śarvajña Singabhūpāla (c.1380 A.D) has written a commentary called 'Sudhākara ' on this work Again Kallinātha employed in the court of Dēvarāya II (1446 A.D - 1465 A D) has written another excellent commentary called 'Kalānidhi ' on this S.S.S. of Pārśvadēva mentions Matanga, Bhoja and Somēswara; and it was Singabhūpala who quoted Pārśvadēva for the first time So the work is assigned to the period between 1140 A.D -1380 A.D. Among these, the author of S.L. expressly mentions S.R , S.Ca, S.C and S.S in verse 18 without mentioning the names of the authors.

2 'Prabandha' is a particular form of music (gāna visēṣa ) in bound indigenous music (nibaddha dēśi gānà). S.M. gives expertise in singing prabandha-s as a qualification of a singer (prabandhagāna niṣṇātah ) (S.M.Sang. Adhya .4-34 sl). S.R gives three names to the form of bound music namely prabandha, vastu and rūpaka;

'sa cāsmābhiḥ purāproktā nibaddhaṁtvadhunōcyatē'
saṁjnatrayam nibaddhasya prabandhō vastu rūpakam'

(S.R.4-6)

సంగీత సమయసారం (పార్శ్వదేవ)లోను

'ప్రబంధోరూపకంవస్తు నిబద్ధస్యాభిధాత్రయమ్' (అధికరణం. 4-1)

అనిచెప్పబడింది. వీటిలో ప్రబంధశబ్దం గీత, వాద్య, ప్రబంధాలకు వాడబడుతున్నది. అంటే గీతప్రబంధాలు, వాద్యప్రబంధాలు, ఉన్నాయన్నమాట. రూపకమనేది రాగాలప్తి రూపకాలప్తి అనే ఆలాపభేదంలో వాడబడుతున్నది. రూపకాలప్తి అంటే ఒకపాటకు నియమించిన రాగతాళాలతో ఆలాపంచెయ్యడం. వస్తువనేది వస్తు-వర్ణక భేదంలో కూడా వాడబడుతున్నది. వస్తుప్రబంధమనేది వర్ణక ప్రబంధానికి భిన్నమైనప్రబంధవిశేషం.

3. పద్నాలుగో పద్యం ఒకవిధంగా అన్నమయ్య సంస్కృతంలో చెప్పిన పదలక్షణ కృతికి ఆవాక్యాలను అనుసరించి తాను తెనుగులో వ్రాస్తున్న సంకీర్తన లక్షణమనే గ్రంధానికి 'అనుబంధచతుష్టయాన్ని' సూచిస్తుందనవచ్చు. గ్రంథవిషయం ఏమిటి, ఎవరికొరకు ఈగ్రంథం వ్రాయబడుతున్నది? ఏప్రయోజనంకోసం వ్రాయబడుతున్నది? విషయప్రయోజనాల సంబంధం ఎలాంటిది? అనే వాటిని 'అనుబంధచతుష్టయం' అంటారు. సంకీర్తన నామకపదానికి లక్ష్యలక్షణాలు విషయం, పదరచనా ప్రౌఢి ప్రయోజనం. సాధ్యసాధకభావం సంబంధం. జిజ్ఞాసువులై గ్రహణధారణపటువులైన పిన్నలైనా (బాలురైనా) అధికారులే.

4. సంస్కృతంలోని విషమవృత్తవిశేషాల్లో 'అమృతధార' ఒకటి. అక్షర సంఖ్యామాత్రమే ఇందు ముఖ్యము. ఇందు 1పాదం 20 లఘు+2గురువులు, 2పాదం 8లఘు+2గు, 3పాదం 16లఘు+2గు, 4పాదం 12ల+2గు.

5. పదునేడో పద్యం సంకీర్తన లక్షణకర్త ప్రతిజ్ఞావాక్యం. తాతగారి గ్రంథాన్ని వ్యాఖ్యానించిన తండ్రి అనుమతితో మూలగ్రంథ వాక్యాలను అనుసరిస్తూ వరుసగా పద్యరూపంలో శాస్త్రజ్ఞులకు ప్రియంగా చెప్తాను అనటంలో అన్నమయ్య గ్రంథానికి ఉన్నప్రామాణికత్వం దీనికి పూర్ణంగా ఉన్నదని చెప్పినట్లయ్యింది. అన్నమయ్య సంస్కృతగ్రంథం లభ్యంకాలేదు. దానికి ఇది భాషాంతరీకరణం అనటానికి వీల్లేకపోయినా 'వరుస'గా చెప్తాననటంవల్ల మూలగ్రంథక్రమాన్ని పాటిస్తున్నదని తనదికూడా శాస్త్రగ్రంథమనీ అభిప్రాయం.

6. వాక్యంఅంటే తెలియజెప్పే ఉద్దేశంతో చేసిన పదప్రయోగం. ఇది ఒకేపదంకావచ్చు. పలుపదాలూకావచ్చు. ఎదుటివానికి చెప్పడంకావచ్చు. ఎదుటలేనివారికి చెప్పటంకావచ్చు. చెప్పుతున్న అభిప్రాయం కొదవలేకుండా పూర్తిగా ఉండాలి.

Pārśvadēva's S.S.S. also gives the same names 'prabandhō rūpakam vastu nibaddhasyābhidhātrayam' (Adhi 4-1) Among these, the word 'prabandha' is used in the case of gīta and vādya . That means there are what are called gīta prabandhas and vādya prabandhas . The name rūpaka is used in the case of ālāpa and certain prabandhas Ālāpa is of two kinds. rāgālapti and rūpākālapti. The latter, rūpakālapti means ālāpa for a song in the prescribed rāga and tāla. The word vastu is also used in contradistinction to varṇaka. Vastuprabandha is distinct from varṇakaprabandha.

3 The 14th verse, one may say, indicates the 'anubandha catuṣṭaya' (the fourfold correlation) of S L: both his grandfather's work in sanskṛt as well his present work in Telugu. The subject matter of the work, its contemplated utility, their relationship and the readership for whom it is meant, constitute the fourfold correlation. Here the regulations of pada-compositions called sankīrtanams and examples of the same constitute the subject matter Acquisition of knowledge and ability to compose the sankīrtanam-s is the objective. Their relationship is that of the objective and the attempter. It is addressed to all those who are interested in learning and equipped with good powers of receptivity and retention; even boys

4 Among the uneven verses (visama vrttas) in Sanskrt 'amrtadhāra' is one. The number of syallables (akṣara-s) alone is important in this metre. The first line consists of 20 laghus+ 2 gurus. The second line has 8 laghus + 2 gurus. The third has 16 laghus + 2 gurus. The fourth or last line has 12 laghus + 2 gurus. The author does not mean this verse.

5 The 17th verse constitutes the statement of the author's aims. It also suggests that his work is as authoritative as his grandfather's when he says that he, having been permitted by his father who had written a commentary on the same work , would follow the ideas in original in their sequence and render them in Telugu verses so as to please the scholars in the science of music. Annamayya's work is not extant. Though it cannot be said that the Telugu work is the translation into Telugu, the author's intention to follow the order of sequence makes this work also as much a scientific treatise as his grandfather's.

6. 'Vākya ' is defined as words used with the intention of communicating. It may be a single word or more; it may be addressed to one who is present before the speaker or to someone elsewhere. But the meaning should be self-sufficient.

7 ఈ'సంకీర్తన లక్షణం' అనే గ్రంధాన్ని తెనుగులో వ్రాసిన తాళ్లపాక చినతిరుమలాచార్యుల తండ్రి పెదతిరుమలాచార్యుడని అతడు అన్నమయ్యగారు సంస్కృతంలో వ్రాసిన పదలక్షణ గ్రంథానికి వ్యాఖ్యానంచేసినాడని 16, 17 పద్యాలు చెప్తున్నవి. తాళ్లపాక చినతిరుమలాచార్యుల తమ్ముడు తాళ్లపాక చిన్నన్న (చిన తిరువేంగళనాథుడు). ఇతడు అన్నమాచార్య చరిత్రమును తెనుగులో ద్విపదగా వ్రాసినాడు. ఈచిన్నన్న ద్విపదను గౌరవించినాడని పెదతిరుమలాచార్యులు పదాన్ని గౌరవించినాడని తెనాలి రామకృష్ణకవి 'చిన్నన్న ద్విపద కెఱఁగుమ, బన్నుగఁబెద తిరుమలయ్య పదమునకెఱఁగున్' అనేపద్యంలో పేర్కొన్నాడు. పెదతిరుమలాచార్యులు తనతండ్రి అన్నమయ్యలాగే తానుకూడా 'శృంగార సంకీర్తనలు' 'వైరాగ్యవచనమాలికాగీతాలు' రచించిన పదకవి. అన్నమయ్య లక్షణగ్రంథానికి పెదతిరుమలాచార్యుడు వ్యాఖ్యానం వ్రాయడం ఆయనకు పదంమీద ఉన్న గౌరవాన్ని సూచిస్తుంది. 16 పద్యంలోని 'అలరున్' 'తండ్రి యనుమతమున' అనేమాటలు చిన తిరుమలాచార్యులు 'సంకీర్తన లక్షణము' రచించునాటికి అతడు సజీవుడుగా ఉన్నట్లు సూచిస్తాయి. ఈగ్రంధం సంస్కృతంలోని మూలగ్రంథాన్ని అనుసరించి ఉంటేనే ఆయన ఆమోదించి ఉంటాడనేది స్పష్టం.

7. Verses 16th and 17th tell us that Cina Tirumalācārya's father was Peda Tirumālacārya and that the latter had commented upon Annamayya's work in Sanskrt. Tāḷḷapāka Cinnanna (Cina Tiruvēngalanātha) was the younger brother of Cina Tirumalācārya and he wrote A.C. in Telugu in dvipada metre. A cāṭu verse of Tenāli Ramakrṣna ( in Telugu ) states that while Cinnanna respected dvipada composition, Peda Tirumalācārya respected padam composition. Peda Tirumalācārya's commentary on Annamayya 's work on Sankīrtana Laksaṇa in Sanskṛt is a solid indication of his great interest in padams Like his father Annamayya, Peda Tirumālacārya has also composed 'śṛṅgāra sankīrtanamulu' as also 'vairāgya vacanamālikā gītamulu' The words 'alaru' (exists happily) and 'tandriyanumatambuna' ( with the permission of (my) father) indicates that at the time of composition of S.L. by Cina Tirumalācārya, his father Peda Tirumalācārya was alive . The implication that the latter would have approved it only if it was in accordance with the original, is obvious

వ॥ మహనీయంబగు సంకీర్తన నామక పదసంప్రదాయం బెట్టిదనిన

సీ॥ రమణీయ సంగీత రత్నాకర ప్రబంధాధ్యాయమున మక్తమయ్యెఁబదము
సముచిత సంగీత చంద్రికాదేశైల యందు మిక్కిలిఁదేటయయ్యెఁబదము
అతులతత్వంవాదమైనట్టి సంగీత చూడామణికిఁబల్కుచోటు పదము
ధవ్యసంగీత సుధాకర గ్రంథంబునందు మిక్కిలిఁజెలువొందుఁబదము

తే॥ గీ॥ తానె యిన్నిఁటికిని మూలమైన భరత
మందుఁబంచ దశాధ్యాయ మందు విమల
వృత్త చూర్ణ నిబంధక వివిధనామ
భవ్య లక్షణములకు నా స్పదము పదము 18

తా॥ సంకీర్తనమనే పేరుతో వస్తున్న ఈ గొప్ప పదసంప్రదాయం ఎలాంటిదంటే చెప్తాము. ఈ 'పద'మనేది 'సంగీతరత్నాకరం' ప్రబంధాధ్యాయంలో చెప్పబడింది; 'సంగీత చంద్రిక'లో దేశైలను చెప్పేనచోట విశదం చేయబడింది; సంగీత చంద్రికతో సంవదించే 'సంగీత చూడామణి'కి పదం పలుకుచోటైంది ; 'సంగీత సుధాకరం' లోను చెప్పబడింది. ఈ సంగీత గ్రంథాలన్నింటికి మూలమైన భరత మనబడే నాట్యశాస్త్రంలో 15 అధ్యాయంలో వృత్తపదం, చూర్ణపదం, నిబంధ పదం మొదలైన పేర్లతో లక్షణ నిర్వచనం చేయబడింది ఈపదమే.

వ్యా॥ గ్రంథకర్త ఈపద్యంలో సంకీర్తనమే పదమని, సంకీర్తన సంప్రదాయం పదసంప్రదాయమని స్పష్టం చేస్తున్నాడు. అంతేకాదు. ఈ పదసంప్రదాయం భరతుని నాట్యశాస్త్రకాలం నుండి వస్తున్నదని అనాదియమని చెప్తూ ఈపదాన్ని గురించి సంగీతరత్నాకరం, సంగీత చంద్రిక, సంగీత చూడామణి, సంగీత సుధాకరం వంటి శాస్త్రగ్రంథాలు చెప్తున్నాయంటూ దాని యెడతెగని గురుపారంపర్యాన్ని ప్రశస్తిని సూచిస్తున్నాడు.

1. భరతం అంటే భరతముని ప్రణీతంగా చెప్పబడుతున్న నాట్యశాస్త్రం. వాచికాభినయం కోసం వ్యాకరణఛ్ఛందోవిధానాలు ఇందులో చెప్పబడినై. పదానికి సంబంధించి వృత్త, చూర్ణ, నిబంధకాది లక్షణాలు చెప్పిన అధ్యాయం 15 అని గ్రంథకర్త చెప్పాడు. నేడు నాట్యశాస్త్రం కాశీ, బొంబాయి, బరోడా ముద్రణలలో లభిస్తున్నది. వీటిలో కాశీముద్రణంలో మాత్రమే ఈ విషయం 15 అధ్యాయంలో ఉంది. బొంబాయి బరోడా ముద్రణలో 14 అధ్యాయంలోనే వస్తుంది. మన గ్రంథకర్త పాఠమే కాశీముద్రణ పాఠమైందనవచ్చు.

అముఖ్య శ్లోకాలివి:

ఏభిః శబ్దవిధానైః విస్తారవ్యంజనార్థ సంయుక్తైః
పదబంధాః కర్తవ్యా నిబద్ధబంధాస్తు చూర్ణావా॥

Verse 18:

Tr: The great pada-tradition called Sankīrtanam is being explained. This pada is spoken of in the chapter on prabandha-s in the beautiful work Sangīta Ratnākara; enunciated under 'dēśaila' (dēśa+ēlā: indigenous ēlā ) in S.Ca. ; its corresponding work S.C. also waxes eloquent on pada; S.S. also gracefully includes it. This padam has been treated and defined under various heads like vṛtta, cūrṇa and nibandhaka in the 15th chapter of 'Bharatam' which is the source book.

Com. The author is making clear in this verse that Sankīrtan is padam and sankīrtan tradition is verily the pada-tradition. Not merely that. The hoariness of this from the days of N.S. of Bharata and the uninturrupted nature of this tradition is spelt out by tracing its treatment in the N.S. and the subsequent works S.R., S.Ca., S.C and S.S . Thus is the excellence of padam established.

1. 'Bharatam' here means the treatise of Bharata, i.e. Nāṭya Śāstra. In the context of vācikābhinaya (verbal interpretation) grammar and prosody are also dealt with in this work briefly. Our author refers pointedly to the 15th chapter where vṛtta, cūrṇa and nibandhaka varieties of pada are dealt with . Today N.S. is available in three editions, namely the Benares edition, the Bombay edition and the Baroda edition. The subject matter referred to by our author occurs in the 15th chapter only in the Benares edition; in the rest of the two editions it occurs in 14th chapter. Clearly the version of Nāṭyaśāstra available to our author has later formed the basis for the Benares edition. The following are the relevant ślōkas:

విభక్త్యంతం పదంజ్ఞేయం నిబద్ధం చూర్ణమేవచ
తత్ర చూర్ణపదస్యేహ సువిబోధత లక్షణమ్॥
అనిబద్ధ పదం ఛందస్తథాచానియతాక్షరమ్
అర్థాపేక్ష్యాక్షరన్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధై॥
నిబద్ధాక్షర సంయుక్తం యతిచ్ఛేదసమన్వితమ్
నిబద్ధంతు పదంజ్ఞేయం ప్రమాణనియతాత్మకమ్॥
ఏవం నానార్థసంయుక్తైః పాదైర్వర్ణవిభూషితైః
చతుర్భిస్తు భవేద్యుక్తం ఛందోవృత్తాభిధానవత్॥

(నా.శా.బరోడా ముద్రణం. 14 అధ్యా-38-42)

అంతేకాదు. నాట్యశాస్త్ర తాళాధ్యాయం (బరోడా ముద్రణం. 31 అధ్యా)లోనే సప్త గీత ప్రకృతి సందర్భంలో గీతం దేవతారాధకము, పుణ్యము అని బహిర్గీతాంగ శాఖావిహీనం ' పదనిర్యుక్త 'మని చెప్పబడింది. ఇది స్తుతిమాత్రపరమైన పదం; సంకీర్తనమన్నమాట. విప్ర దాసు డనే సంగీతశాస్త్రవిద్వాంసుడు తన 'సంగీత చంద్రము' (క్రీ.శ. 1625 ప్రాంతపుది) అనే గ్రంథంలో దేవస్తుత్యర్థాలైన ఆశ్రవణాద్యంగాలు అపదం, పదబద్ధం అని రెండురకాలని, అపదం 'నిర్గీతం' అనబడుతుందని, పదబద్ధమైంది 'బహిర్గీతం' అనుబడుతుందని, ఇది సర్వదేవ ప్రియావహమని అందుచేత ఆశ్రవణాదుల్ని పదబద్ధాలుగానే ప్రయోగించాలని చెప్పాడు. (చూడు : డా.పి.యస్.ఆర్. అప్పారావుగారి నాట్యశాస్త్రానువాదం. తెలుగు. పుట 1161-16 అథ స్పూచిక మరియు 890 పుట) కాబట్టి దేవస్తుత్యాత్మకమైన పదం నాట్యశాస్త్రకాలంనుండి అవిచ్ఛిన్నంగా సాగుతున్నదే.

2. గ్రంథకర్త ఈపద్యంలో కొన్ని సంగీత గ్రంథాల పేర్లయితే చెప్పాడుకాని ఆశాస్త్రగ్రంథాల కర్తలపేర్లు చెప్పలేదు; వాటి కాలక్రమాన్నీ పాటించలేదు. నేడు భరతుని నాట్యశాస్త్రంగా మనకు దొరుకుతున్న గ్రంథం 'షట్సాహస్రి' (అంటే ఆరువేలశ్లోకాల గ్రంథం) అంటారు. దీనికి ముందు 'ఆదిభరతం' 'వృద్ధభరతం' అనేపేరుతో 'ద్వాదశసాహస్రి' (12 వేలశ్లోకాల గ్రంథం) ఉండేదని అది యిప్పుడు అలభ్యమని శారదాతనయుని 'భావప్రకాశన' (క్రీ.శ. 1175-1250 ప్రాం.) మనేగ్రంథం వల్ల తెలుస్తుంది. నేడు దొరుకుతున్న నాట్యశాస్త్రం క్రీ.పూ. 100- క్రీ.శ 300 మధ్యకాలానికి చెందిందని ఒక అంచనా.

'ēbhiḥ śabda vidhānaiḥ vistāra vyañjanārtha samyuktaiḥ
Padabandhāḥ kartavyā nibaddhabandhāstu cūrṇāvā.II
vibhaktyantam padam jñēyam nibaddham cūrṇamēva ca
tatra cūrṇapadasyēha suvibodhata lakṣaṇam II
anibaddhapadam chandaḥstadhācaniyatākṣaram
arthāpēksyākṣara syūtam jñēyam cūrṇapadam budhaiḥ II
nibaddhākṣara samyuktam yatichchēda samanvitam
nibaddhaṁtu padam jñēyam pramāṇa niyatātmakam II
ēvam nānārtha saṁyuktaiḥ pādair varna vibhūsitaiḥ
caturbhistu bhavēdyuktam chandō vṛttābhidhānavat II

(N.S. Baroda ed. 14 Adhya-38-42 Slokas)

Not merely this. In the Tāla adhyāya of N S (31 ch Baroda ed) in the context of saptagīta prakṛti a gīta is said to be a form of worshipping Gods and that it brings punya; that it is called padaniryukta. A musicologist by name Vipradāsa in his Sangīta Candramu (Prior to 1625 A D) says that āśravana and other subsidiaries pertaining to hymnal composition are of two kinds, namely apadam and padabaddham, the former being called nirgītam and the latter bahirgītam He urges that as bahirgītam pleased all Gods āsrāvana etc may be used as padabaddhas only. (Vide Nātya Śāstra-Tel.tr. by Dr P S R.Appa Rao page 161 Foot note 16 and appendix -2 , page 890) So padam as a hymnal composition continues uninterrupted from the time of Nātya Śāstra

2 The author has mentioned, in this verse, names of some musical treatises, but has not mentioned their authors nor are they in a chronological order The N.S. available to us today, is called 'satsāhasri' ( a work with 6000 ślōkas).From Śāradātanaya's Bhāvaprakāśaka (1175 A.D- 1250 A.D ) we understand that there was a bigger work with 12,000 ślokas called 'Ādi Bharatam' or 'Vrddha Bharatam' It is estimated that the N.S extant today belongs to the period 100 B C - 300 A.D

దీనికి తరువాతిది 'సంగీత చూడామణి'. ఈ పేరుతో నాలుగు గ్రంథాలు వినబడుతున్నాయి. అందులో మూడు శిథిలస్థితిలో మైసూరు ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్‌లో ఉన్నై. ఒకటి బరోడా ఓరియంటల్ ఇన్స్టిట్యూట్‌లో ఉన్నట్లు తెలుస్తున్నది. మైసూరులో ఉండేవాటిలో కర్త పేరు తెలియనిదొకటి (P 1298/1). జగదేకమల్లుని పేరుతో ఉండేది ఒకటి (P 5081). హరిపాల మహీపాలుని పేరుతో ఉండేది ఒకటి (P 105/1). ఈ మూడుగ్రంథాల పత్రాలు తాళానికి సంబంధించినవని 'ప్రబంధాల'నుగురించి వీనిలో లేదని తెలుస్తున్నది. బరోడా ప్రతి కవిచక్రవర్తి పేరుతోఉన్నట్లు, మళయాళలిపిలో ఉన్నట్లు తెలుస్తున్నది. దాని ప్రతినే కాటోలు జగదేకమల్లుని పేరుతో సంగీత నాటక అకాడమీ, ఢిల్లీ, వారు ప్రచురించినారు. ఇది తాళసంబంధిమాత్రమే. ఇది యిట్లుండగా తాళానికి ప్రబంధాలకూ సాధికారగ్రంథమనదగిన జగదేకమల్లుని 5 ప్రకరణాల సంగీతచూడామణి వరలక్ష్మి సంగీత అకాడమీ, మైసూరు, వారివద్ద లభ్యంగా ఉన్నట్లు డాక్టర్ వి.యస్. సంపత్కుమారాచార్యగారి 'కర్ణాటక సంగీత పారిభాషిక శబ్దకోశ' (1 వాల్యూం. 286,287 పుట) (కన్నడగ్రంథం) చెప్తున్నది. కాని ఇదిపై (P 5081) కి పుత్రిక అని తెలుస్తున్నది. చినతిరుమలాచార్యులు పేర్కొన్న సంగీతచూడామణి జగదేకమల్లునిదే అనుకోవాలి. ఇతని రాజ్యకాలం క్రీ.శ. 1134-43. చిన తిరుమలాచార్యులు 41 పద్యంలో పల్లవముంటే శిఖాపదంఉండదు, శిఖాపదం ఉంటే పల్లవం ఉండదంటూ 'చూడామణి' గ్రంథంలో చెప్పబడిందని చంద్రికాకర్త చెప్పినారని వ్రాయటం వల్ల - తాను స్వయంగా సంగీత చూడామణిని చూడలేదనుకోవాలి. అంతేకాదు. సంగీత చూడామణికి తర్వాతి గ్రంథం సంగీత చంద్రిక అనికూడా తెలుస్తున్నది.

'సంగీత చంద్రిక' అనే సంస్కృత గ్రంథం రెండధ్యాయాల (శారీర లక్షణం వరకు) జెరాక్స్‌ప్రతిని ఈ టీకాకర్త మద్రాసు యూనివర్సిటీ సంగీతశాఖలో రీడరు డా. ఎన్. రామనాథన్ గారివద్ద చూచారు. కర్తమాధవభట్టు అని తెలుస్తున్నది. తంజావూర్ సరస్వతీ మహల్ లైబ్రరీలో దీని మూలప్రతి ఉన్నట్లు తెలుస్తున్నది. వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతిలోను (స్టాక్ నం. 7012) ఇది ఉంది. అముద్రితంగా ఉన్న విప్రదాసుని 'సంగీత చంద్రము' ఇదీ పేరు గ్రంథాలవునోకాదో తెలియదు.

తర్వాతి గ్రంథం హరిపాలమహీపాలుని సంగీత సుధాకరం. ఇది క్రీ.శ. 1175 ప్రాంతానిది. మద్రాసు గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరిలో ఒక కాగితపు లిఖిత ప్రతి (R. 3082) ఉంది.

అటుతర్వాతిది ప్రసిద్ధమైన 'సంగీత రత్నాకరం'. శార్ఙ్గదేవుడు దీనికర్త. క్రీ.శ. 1230 ప్రాంతపు రచన.

Next to this comes S.C. At least four works are known by this name Three of them are in the Oriental Research Institute, Mysore and they are in bad condition One is known to be in the Oriental Institute, Baroda Among those at Mysore, one pertains to an unknown author ( P 1298/1). Another is by Jagadēkamalla (P 5081) Yet another is by Haripāla Mahīpāla (P 105/1) The leaves of these three manuscripts are said to pertain to tāla and do not include any on prabandha-s It is understood that the mss at Baroda is in Malayalam script with the author named as Kavi Cakravarti Perhaps, it is this that has been published by the Sangit Nātak Akademy, New Delhi, under the authorship of Jagadēkamalla This deals only with tāla Be that as it may, the Karnātaka Sangīta Paribhāsika Śabda Kōśa in Kannaḍa compiled by Dr V.S.Sampatkumārācārya ( Vol.I - pages 286,287) says that Jagadēkamalla's S C. , an authoritative work on prabandhas and tāla in 5 prakaranas is available at Varalakṣmi Sangita Akadamy, Mysore But it is understood it is only a copy of the above mentioned p.5081. We have to presume that the S C. mentioned by Cina Tirumalācārya is that of Jagadēkamalla. He reigned between 1134 A D -1143 A.D As our author quotes only the author of S Ca. (in verse 41 )to the effect that S C lays down the absence of śikhāpada if pallava is there and vice versa we have to infer that Cina Tirumalācārya had not seen S.C Not only that It also establishes the fact that S Ca. is posterior to S.C

This annotator has seen a photostat copy of two chapters ( up to Śarīra laksana) of a Sānskṛt work by name Sangīta Candrika, with Thiru .Dr. N Ramanathan, faculty of Music , University of Madras, Madras. The author is said to be one Mādhava Bhaṭṭa. It is understood the original work is at T.S.M Library, Tanjore. S V.O.R.I Tirupati is said to have a photostat copy of the same ( Stock No.7012) Whether the unpublished 'Sangīta Candramu' of Vipradāsa and this work are the same or not is not clear. Both are dated vaguely as prior to 1625 A.D. and 1615 A.D . respectively

The next work is S.S. of Haripāla Mahīpāla. This work is assigned to circa 1175 A.D. There is a paper manuscript in G O.Ms Library, Madras-5 (R.No.3082)

Next to this comes the famous S.R. of Śārṅgadēva It was composed circa 1230 A.D.

3. సంగీత చంద్రికలోని 'దేశైల' భాగం మనకు దొరకదుకాని సంగీత రత్నాకరంలోని ప్రబంధాధ్యాయమే మనకిప్పటికి చాలు. ఈ అధ్యాయంలో సూడప్రబంధాలు, ఆలిప్రబంధాలు, విప్రకీర్ణప్రబంధాలు, సాలగసూడ ప్రబంధాలు, రూపక ప్రబంధాలు అనే శీర్షికల క్రింద చాల ప్రబంధాలు చెప్పబడినై. 'ఏలాప్రబంధం' అనేది సూడప్రబంధాల్లో ఒకటి.

ఏలా, కరణ, ఢేంకీభిర్వర్తన్యా ఝొంబడేన చ

లంభ రాసైకతాలీభి రష్టభిః సూడ ఉచ్యతే ॥

(సంగీ. రత్నా. 4 అధ్యా - 23 శ్లో)

ఏలా, కరణ, ఢేంకీ, వర్తనీ, ఝోంబడ, లంభ, రాస, ఏకతాలీ అనే ఎనిమిది ప్రబంధాలు సూడప్రబంధాలని చెప్పబడతాయని అర్థం. ఏలా సామాన్యం పదమౌతుందని అందులో దేశైల తెనుగు పదం అనీ చినతిరుమలాచార్యుల స్పష్టమైన అభిప్రాయం. తెనుగులో 'లక్షణశిరోమణి' రచించిన పొత్తపి వేంకట రమణ కవి (క్రీ.శ. 1700 ప్రాం) ఏళలనే పదాలంటూ అవి సూళాదుల కనుగుణంగా ఉండవలెనంటూ ఇలా వ్రాశాడు.

"ఇవి సంగీత తాళనిర్ణయములు గీతసృష్టి గీతపుష్టి మాత్రాధిక్య మాత్రలోపమ్ముల రాగతాళమ్ముల పదమ్ముల నర్జునభరతమ్ము ఏలలని వాని లక్షణమ్ములు చెప్పబడియుండు ; నందు

"కర్ణాటలాట గౌళాంధ్ర ద్రవిళానాంతు భాషితం

ఏళాస్సప్తవిధా జ్ఞేయా ప్రోక్తా మత్యాధి తాళతః"

అన్నారుగావున నీ దేశభాషల పదముల చెప్పవచ్చుననిన్ని, మూడు చరణములకు ఖండికాత్రయము అని పేరుగలదనిన్ని పల్లవము ఉపపల్లవము అనిన్ని, యివి మాత్రాసమక నిబద్ధములైన 'ప'గణాదులతో గూర్చవలెననిన్ని సూళాదుల (క)ను గు (ణ)ముగా నుండవలెననిన్ని, సంగీతరత్నాకరము మొదలైన గ్రంథము(లు) అర్జున భరతాది ఏళాప్రకారంబున పగణాదుల రాగతాళమ్ముల సంగీతరీతిని తేటపడియుండుగాన నీసాహిత్యమార్గంబున లక్షణంబున జొరవవి యట్లుండె." (లక్షణ.శిరో. 3 ఆ-425, 426,427). పదం సూళాదులకు చెందిన ఏల అనేది దీనితో గట్టిపడుతున్నది.

పై సంగీతరత్నాకరంలో చెప్పిన 'సూడ' శబ్దం గీతి విశేషసమూహాన్ని చెప్పే దేశి శబ్దమని కల్లినాథుని వ్యాఖ్య. 'చతుర్దండి ప్రకాశిక' అనే సంగీత గ్రంథం వ్రాసిన వేంకటమఖి (17 శ), సంగీత సారామృతము రచించిన తులజాజి మహారాజు (18 - శ) ఈ అభిప్రాయన్నే అనుసరించారు. కాని కన్నడంలో సుళు+హాది=సుళాది అని విడదీసి చెప్పి

3. Since the 'dēśaila' portion of S.Ca.is not availabnle to us the prabandhādhyāya of S.R. may serve our present purpose. Many prabandha-s, under the heads of sūḍa, āli, viprakīrṇa and sālagasūda are described in this chapter of S.R. Ēlā prabandha is one of the sūḍa prabandha -s·

'ēlā karaṇa dēnkībhir vartanyā jhombaḍēna ca
lambha rāsaikatālībhi rastabhiḥ sūda ucyatē'
(Sangīta Ratnākara. Adhyā 4-23 sl)

It means ēlā ,karaṇa, dēnkī, vartanī, jhōṁbaḍa, lambha, rāsa and ēkatālī are the eight prabandha-s called sūdaprabandhas It is the clear opinion of Cina Tirumalācārya that ēlā is padam and that as dēśaila it is Telugu padam. In Telugu, Pottapi Venkaṭaramana kavi (circa 1700 A.D) in his work L.S (3 āśvāsa-425,426,427 ) mentions A B. and S.R. and says that ēlā-s are padam-s coming under sūḷādi-s with rāga, tāla etc, that padam-s can be composed in regional languages on the authority of S.R., that the first 3 lines are called 'khandikā traya' with 'pallava' and 'upa-pallava', that they should be composed with mātrāsamaka-'pa' gaṇa -s (gana-s equivalent to 5 matras each unit, without restriction on the placement of gurus and laghus) That a padam comes under sūḷādi-s is confirmed by this.

Kallinātha's commentary on S R says that the word sūda is an indegenous (deśi) word connoting a certain group of a particular type of songs (gita-s). Vēnkatamakhin, the author of Caturdandiprakāsika (17c) and Tulajāji Mahārāja, the author of Sangīta Sārāmṛta have followed this opinion But in Kannada there is a school of thought which splits the word sūlādi as sulu+hādi

ముముక్షువులు నిత్యానందం పొందటానికి సులభమార్గమని ఒకవ్యుత్పత్తి చెప్పటం ఉంది. ఈ 'సూళాదు' అనే పదాలు భిన్నతాళాల్లో పాడే వెర్వేరు భాగాలుగల కొంచెం పొడవైన పాటలు. ధ్రువ, మఠ్య, రూపకం, ఝంప, త్రిపుట, అర్థ, ఏకతాళం అనే ఏడు సూళాదిసప్తతాళాలు. కన్నడంలో ఈసూళాదులను కూర్చిన మొదటి వాగ్గేయకారుడు శ్రీపాదరాయరు. వ్యాసరాయరు, పురందరదాసరు సూళాదులు ప్రచలితంచేసిన వారె. ఇవి కన్నడంలోని దాససాహిత్యానికి విశిష్టాలంటారు. సంగీతశాస్త్రంలో 'ఛాయాలగ' మనే పదబంధం 'సాలగ' అయింది. 'కరపాట' అనే పదబంధం 'కైవార'(డ) అయింది. ప్రబంధాల్లో సాలగసూడ ప్రబంధాలు ఉన్నవి. 'సాలగ' శబ్ద సాహచర్యంతో సూడ శబ్దంకూడ 'సూళ' గా మారినట్లు తోచుతుంది. ఇంక ఈసూళాదికి చేరిన 'ఏల' ఎలా వచ్చిందో చూద్దాం. ఏలా శబ్దాన్ని ఏలకితీగే అనేఅర్థంలో పాటకు పేరుగా చెప్పడం కుదరదు.

'ఏలా' శబ్దం సంస్కృత 'హేలా' శబ్దంనుండి వచ్చిందనటం సులభం. కాని అర్థం పొసగదు. 'హేలా' శబ్దానికి కండ్లు కనుబొమల వికారంచేత తెలియదగిన మనోవికారం అని, తిరస్కారం అని అర్థాలు. ఇది ఒక నది పేరుకూడ. ఏలా ప్రబంధం అనేపాటకు ఈ అర్థాలు సరిపడవు. 'ఏల' శబ్దంలోని శబ్దాంత దీర్ఘం సంస్కృతభాషాలక్షణం వల్ల వచ్చింది 'ఏల' అనేది ద్రావిడ భాషా శబ్దమని చెప్పవచ్చు. 'ఏల' అనే పేరుతో సంస్కృత వృత్తరత్నాకరంలో 15 ఛందంలో పుట్టిన ఒక వృత్తం ఉంది. దీనికి స-జ-న-న-య గణాలు. 6 అక్షరంమీద యతి. మాత్రాసంఖ్య 19 అవుతుంది. ఇదే ఛందస్సునే తెలుగులో అప్పకవి 'ఇల' అనేపేరుతో చెప్పాడు. గణాలు స-జ-న-న-స. 8యతిస్థానం. మాత్రల సంఖ్య 18 అవుతుంది. చిత్రకవి పెద్దన్న 5-8 మీద రెండు యతులు చెప్పాడు. ఈచోట సంస్కృత వృత్తరత్నాకరంలో చివరిగణం 'య' గణం కావటం పొరబాటనకతీరదు. వృత్తరత్నాకరంలో గణం తప్పగా ఎక్కితే తెనుగులో అప్పకవి పేరు తప్పగా చెప్పాడు.

నిజానికి రెండూ ఒకే వృత్తమే. ఏలకు మంఠ్య, ద్వితీయ, కంకాల, ప్రతితాళాల్లో ఒకదాంతో పాడాలని నియమం ఉంది. ఈమంఠ్యాదులకు 18 అక్షరాలు ఉంటాయి. అప్పకవి చెప్పిన గణాలతో ఇది ఏలా భేదం కావచ్చు. ఈఏలలు శ్రోతలకు ప్రయోక్తకు ధర్మకామార్థసిద్ధిదములని చెప్పబడింది. అందుచేత వస్తువు ఉదాత్తంగా ఉంటుంది. 'ఎళు' అనే ద్రావిడ శబ్దానికి ఎత్తు, మిఖ్ఖు, ఉదాత్తత అనే అర్థాలున్నాయి. **(DEDR 851)** ఏళిమలై అంటే ఎత్తైన కొండ. ఏలూరు అన్నపుడు మిఖ్ఖున ఉన్న ఊరని అర్థం. ఏలా శబ్దాన్ని ఇట్లు గ్రహించడం ఒకపద్ధతి. రెండవపద్ధతి: తమిళంలోని 'యాళ్' శబ్దమే ఏలగా మారిందని తలచవచ్చు. 'యాళ్' అనేది ప్రాచీనకాలపు తంత్రీవాద్యం. 'పాణర్లనే వారు ఈవాద్యంతో గానంచేసేవారు. శ్రీలంకలోని 'జాఫ్నా' నగరం అసలుపేరు 'యార్పాణమ్' యాళ్ వాద్యంతో పాడిన 'పాణర్' కిచ్చిన ఊరట. తమిళ సాహిత్యంలో ముల్లై, కురించి, మరుదమ్, నెయ్దల్, పాలై అనే ప్రాదేశిక విభాగాలున్నాయి.

with the etymology that it is 'the easy way to attain bliss for salvation-minded people'. These are longish songs, different parts being sung in different tāḷa-s The seven tālas under sūḷādi are (1) dhruva (2) maṭhya (3) rūpaka (4)jhaṁpa (5) triputa (6)aṭṭa and (7) ēka tāla. In Kannada,Sripādarāya' was the first to compose the sūḷadi-s. Vyāsarāya and Purandaradāsa have popularised them. These songs are said to be characteristic in dāsa sāhitya. In music the word ' chāyālaga' has become 'sālaga'; 'karapāṭa' has become 'kaivāḍa'. Among prabandha-s there are the 'sālaga-sūḍa' variety. With the proximity and influence of sālaga the word sūda also seems to have changed to 'sūḷa'. Let us consider how the word ēlā belonging to sūḍa group could have been derived: 'Ēlā' in the sense of cardomom creeper cannot be the name of a song. It is easy to say that the word ēlā is derived from the sānskṛt word 'hēlā' but the meaning does not fit in. The Sānskṛt word ' helā' has two meanings besides being the name of a particular river. One is emotion inferable from the movement of eyes and eyebrows; another is repudiation These are not suitable to indicate a song. The elongation at the end of the word 'ēlā' may be the result of naturalising into Sanskṛt. One can consider 'ēlā' as a Dravidian word. In Vṛttaratnākara of Sanskṛt prosody there is a vrtta called ēlā under the 15th chandam (metre with 15 letters). The gana-s for this are sa-ja-na-na-ya (IIV+IVI+III+III+IVV); caesura (yati) is on the 6th letter. The number of matra-s will be 19. In Telugu the same metre is called ' ilā' by Appakavi. The gaṇas here are sa-ja-na-na-sa- (IIV+IVI+III+III+IIV); caesura (yati) is on the 8th letter. The number of mātras will be 18. Citrakavi Peddana, another Telugu prosodist lays down caesura on the 5th and the 8th letters. One cannot help saying the ya-gaṇa given in the V.R. in Sanskṛt is a mistake. Similarly the name is given wrongly in Telugu by Appakavi. As a matter of fact both are dealing with the same vrtta . There is a rule that 'ēlā' must be sung with one of the four tālās of maṇthya, dvitīya, kaṁkāḷa and pratitāla and they have just 18 syllables. With the gana-s given by Appakavi this can surely be a kind of 'ēlā'. These ēlā-s are said to give dharma, artha and kāma, both to the listeners as well as singers. So the subject matter will be of exalted nature .The Dravidian word Ēlu means height, elevation, exalted position. (DEDR 851) Ēlimalai means a high mountain Ēḷuru means a town situated on an elevated place. This is one way of interpreting the word ēlā . Another way is to consider the Tamil word 'YAAḶ' changing into Ēlā . 'YAAḶ' is an ancient stringed harp-like instrument. People of Pāṇar community used to sing with the help of this harp. The original name of Jaffna in Sri Lanka is said to be Yārpāṇam, a village or place gifted to a pāṇar who sang beautifully with a YAAḶ. There are regional divisions called Muḷḷai, Kurunci, Marudam, Neidal and Pālai in Tamil literature. Each region has a music (pan) of its own: Mullaippaṇ, Kuruncippaṇ,

ఒక్కొక్కప్రాంతానికి ఒక రకమైన సంగీతం (పన్) ఉంది: ముల్లైప్పన్, కురించిప్పన్, మరుదప్పన్, నెయ్దల్‌పన్, పాలైప్పన్. యాళ్‌వాద్యం అటుతర్వాత ఆయాప్రాంతాల సంగీతానికి కూడా పేరైంది. పాలైయాళ్, కురించియాళ్, మరుదయాళ్, నెయ్దలి యాళ్. ఇవి ప్రాచీన తమిళసంగీతంలో ఉండిన సెరుపాలై, కూడిప్పాలై, నదుమలైప్పాలై విల్‌కరిప్పాలై అనే మేళాలే అని తమిళ సంగీత శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. పురావస్తు పరిశోధనను అనుసరించి గ్రీసు దేశంలో యాళ్‌వంటి, జగల్, (Zagal) అనే తంత్రీవాద్యం ఉండేది. సుమేరియన్ తంత్రీవాద్యానికి 'అల్' (al) అనిపేరు. ఈజిప్టు బాబిలోనియా దేశాల్లోను యాళ్‌వంటి తంత్రీవాద్యాలు దొరికినై. కాగా 'యాళ్‌పాట్టు' 'ఏలపాటగా' మారటం సులభమనవచ్చు. తమిళంలోని 'యాళ్' తెలుగులో 'ఏఱు' అయినట్లుగా ఇది మార్పుచెంది ఉంటుంది.

ఈ ఏలా ప్రబంధాలు (1) గణైల (2) మాత్రైల (3) వర్ణైల (4) దేశైల అని నాల్గు రకాలు. అందులో 'దేశైల' మరల 5 రకాలు.

'కర్ణాట లాట గౌడాంధ్ర ద్రావిడానాంతు భాషయా
దేశాఖ్యైలా బుధైః పంచ ప్రోక్తా మంతాది తాలతః' ॥

(సంగీ. రత్నా. 4 అధ్యా - 114 శ్లో)

(పొత్తపి వెంకటరమణకవి గ్రంథంలో వెనుక చూపిన శ్లోకం సరిగాలేదనేది స్పష్టం)

కర్ణాటైలలో ఆదిమధ్యాంతవర్తులైన అనుప్రాసలుంటాయి. లాటైల ప్రాంతప్రాసతో రస విరాజితంగా ఉంటుంది. గౌడి గమకప్రాసలు లేకుండా ఒకే రసంతో ఉంటుంది. ఆంధ్రైల నానాగమకాలతో రాగాంశలతో రసభావోత్కటంగా ఉంటుంది. ద్రావిడైల ప్రాసవర్జితంగా భూరిభావరసోత్కర్షగా ఉంటుంది.

4. వివిధ వర్ణాలతో అలంకృతమైనట్టి వివిధార్థ బోధకాలైనట్టి నాల్గు పాదాలతో కూడిన ఛందస్సు 'వృత్తం' అనబడుతుంది. వృత్తబద్ధం కాకుండా అక్షర సంఖ్యానియమంకాని గురులఘువుల నిక్కడిక్కడ నిలపాలనేనియమం కాని లేనిది అర్థాపేక్ష ఉండే (వీరశృంగారాదిరసాలను స్ఫురింపచేసే) అక్షరాలకూర్పు గలది 'చూర్ణపదం' అనబడుతుంది. ఛందోబద్ధమైన అక్షరాలకూర్పు, యతినియమం, అక్షరసంఖ్యానియమం ఉండేది 'నిబద్ధపదం' అనబడుతుంది.

Marudappan, Neidalpan and Pālaippan. Later on the instrument 'YAAḺ' has come to signify the regional music also: Pālaiyāḷ, Kurunciyāḷ, Marudayāḷ, Neidaliyāḷ. Tamil musicologists say that these are but the cerupālai, Kudippālai, Padumalaippā-lai, and vilkarippālai of ancient Tamil music . According to archaeology there was a 'YAAḺ' like harp called 'Zagal' in Greece. The Sumerian harp was called 'āl'. YAAL - like harps were discovered in Egypt and Babylonia. So one can say that YAAḺ-pāṭṭu could have easily changed into ēlappāṭṭu, ēlapāṭa. The change could have occured in the same way as yāru (Ta) › ēru (Tel) meaning a river.

These ēlā-prabandha -s are of 4 types : (1) gaṇaila (2) mātraila (3) varṇaila and (4) dēśaila. Again among them dēśaila is of 5 kinds : Karnāṭa, Lāṭa, Gauḍa, Āndhra and Drāviḍa varieties:

'karnāṭa lāṭa gauḍāndhra drāviḍānaṁtu bhāṣayā

dēśākhyailā budhaiḥ panca prōktā manṭhāditāḷatah'

(S.R.4 adhya - 114 sl)

(Obviously the sloka cited from Pottapi Vēnkaṭaramana Kavi earlier is not correct). Karñaṭailā has alliterations in the beginning, the middle and the end. Lāṭaila has one rasa only without any gamakas and prāsas. Āndhraila has various gamakas, rāgāmśās bursting with rasa and bhāva. Drāviḍaila has great bhāva and rasa but without assonance.

4. Embellished by various letters and expressive of various meanings a metrical compositon of 4 lines or a stanza is called 'vṛttam'.

That which is not framed-in like a vṛtta, which has no fixation of number of letters or the placement of gurus and laghus (stressed and unstressed syllables in English) but composed with an eye on the expressiveness of sentiment of letter is called 'cūrṇapadam.

That which has a composition of prosodical frame, obligatory caesura and fixation of number of letters is called 'nibaddha padam.

కం॥ అందఱిలోఁ బదమార్గ
చ్ఛందో మూఢాత్ము కవిత ఛందంబుల గో
వింద పదభక్తి విరహిత
మందుని ధర్మక్రియా క్రమంబున నడఁగున్॥ 19

తా॥ కవిత్వం చెప్పేవారందఱిలోకి పదకవితా ప్రస్థానానికి సంబంధించిన ఛందః పద్ధతి తెలియనివాని కవిత్వం ధర్మాచరణం చేసే వారందఱిలోకి గోవిందుని పాదాలయందు భక్తిలేకుండ వేదమంత్రాలతో చేసే ధర్మక్రియాల్లాగ తక్కువ రకమౌతుంది.

వ్యా॥ వేదమంత్రాలతో విధివిధానమైన నిష్ఠురాచారంతో జపహోమయజ్ఞాదులు చేసినంత మాత్రాన చాలదు. గోవిందుని పాదాలయందు భక్తికూడా ఉన్నప్పుడే ఆధర్మక్రియలు శ్రేష్ఠంగా ఉండి సార్థకమౌతాయి. అలాగే ఛందోబద్ధంగా గణయతిప్రాస నియమాలు తప్పకుండా కవిత్వం చెప్పినంత మాత్రాన చాలదు. అది భగవత్సంకీర్తనమై దేవ స్తుత్యాత్మకమైన పదరచనగా ఉన్నప్పుడే ఆకవితారచన శ్రేష్ఠంగా ఉండి సార్థకమౌతుందని అభిప్రాయం. పద్యకవులు ఈసడించిన పదకవిత దేవస్తుత్యాత్మకమై కవిత్వానికే సార్థక్యాన్ని శ్రేష్ఠత్వాన్ని కల్పిస్తుందనే కవి అభిప్రాయం గమనించదగ్గది. అలాగే కర్మఠులు ఈసడించే భక్తి ధర్మాచరణానికే సార్థక్యాన్ని శ్రేష్ఠత్వాన్ని కల్పిస్తుందనే అభిప్రాయంకూడ గమనించదగ్గదే.

1. 'పదం' అంటే ఇక్కడ దేవస్తుత్యాత్మకంగా కూర్చిన పాట అని గ్రహించాలి ( పదనిర్యుక్తం).

2. 'ఛందస్' అనే మాటకు వేదం, గణయత్యాదులతో పద్యరచనను పదరచనను చెప్పే శాస్త్రం, స్వాతంత్ర్యం అని అర్థాలు. 'పదమార్గచ్ఛంద' మన్నచోట పదరచనా ప్రస్థానానికి చెందిన రచనాక్రమాన్ని బోధించే లక్షణ శాస్త్రం అని అర్థం. రెండోపాదం చివర 'ఛందంబుల' అన్నచోట వేదాలతో అని అర్థం.

3. 'ధర్మం' అనే మాటకు 'సర్వం ధరతీతి ధర్మః' (అన్నింటిని ధరించేది) అనీ 'ధ్రియతేజనైరితి ధర్మః' (జనులచేత పూనబడేది) అని వ్యుత్పత్తి. వేదబోదిత మైన ధర్మంలో ఆచారం నిష్ఠురంగా ఉంటుంది. వేదం (1) సంహిత (2) బ్రాహ్మణం (3) ఆరణ్యకం (4) ఉపనిషద్ అని 4భాగాలు. వీటిలో బ్రాహ్మణం యజ్ఞయాగాది క్రతువుల స్వరూపాన్ని వాటిని నిర్వహించే క్రమాన్ని చెప్తుంది. సంహితలోని మంత్రాలు ప్రయోగసమయంలో గుర్తుండవలసిన అర్థాన్ని జ్ఞప్తిచేస్తాయి.

ఈవేద చోదితమైన ధర్మాన్ని గూర్చి విపులంగా చర్చించే దర్శనం జైమినికృతమైన 'పూర్వమీమాంస'. ఇది కర్మాచరణాన్ని మాత్రమే చెప్పడం వల్ల ఈశాస్త్రంనిరీశ్వరమని **(atheistic)** కొందరంటారు. 'యజ్ఞోవై విష్ణుః' అని యజ్ఞాన్ని విష్ణుస్వరూపంగా వేదం చెప్తుండగా యజ్ఞయాగాదిక్రతువులను చెప్పే వైదికదర్శనం నిరీశ్వరం కావటానికి అవకాశం లేదు. ఈశాస్త్రంలో భగవంతుని గూర్చి నేరుగా చెప్పకపోయినా 'అపూర్వం' 'అదృష్టం'

Verse 19 ,

Tr. Among all the poets the poetry of one who is ignorant of the metrics of Padakavita will be inferior just as the dharma-kriyas (religious rituals taught by Vēda) of one done with Vēdamantras but without bhakti in the Feet of Gōvinda will be inferior.

Com: It is not enough if one performs japa (repeating mystic syallables) hōma (sacrificing certain substances in the sacred fire or water ) and yajña (scrificing certaince substans for certain gods ) etc. with Vēda mantras and rigorous ācāra-s. It is only when there is devotion (bhakti ) to the Feet of Gōvinda that the deeds of dharma become meaningful and the best. Similarly it is not enough if one composes poetry according to prosody and without defaulting on ganas, yati and prāsa. It is only when it is hymnal, in praise of God and a song (pada) that the poetic composition becomes the best and meaningful The fact that our author opines that padakavita, deprecated generally by versifiers, used for hymnal purposes becomes the best and most meaningful poetry may be noted. Again the opinion that bhakti, generally deprecated by ritualists, makes the religious deeds best and most meaningful, may also be noted.

1. The word 'pada' here has to be understood in the sense of a song in praise of God. (Pada-niryukta).

2.The word 'chandas' carries three manings namely vēda, prosody and freedom. The phrase pada-mārga-chanda means prosodical rules of composition of padam. The word chandaṁbula at the end of the second line means vēdas or vēdamantras.

3.The word 'dharma' has the etymology' sarvam dharatīti dharmaḥ '.(that which bears all) and' dhriyatē janaiḥ iti dharmaḥ' (that code of conduct taken on by men) Here 'dharma' as prescribed by Vēda is intended: that is in the form of japa, hōma and yāga. The ācāra in Vaidika dharma is rigorous. Veda is in 4 parts. (1) Saṁhita (2) brāhmaṇa (3) āranyaka and (4) upanisad. Among them the brāhmaṇa teaches the performance and conduct of kratus (sacrifices) The mantras in the samhita reminds the performer about the meanings that he should remember at the time of the performance. Jaimini's Pūrva-Mīmāṃsa is the system of Philosophy that discusses this 'dharma' enjoined by Vēda. Because it teaches only

అనే ముఖ్యాంశాలు చెప్పబడ్డాయి. ఇవి భగవంతునికి ఉపలక్షణంగా తీసికోదగ్గభావాలు. వైదిక ధర్మంలో 'శ్రద్ధ' గా చెప్పబడిందే 'భక్తి' అనిపించుకుంటుంది. వైదిక ధర్మాచరణంలో కర్మరత్వంతో పాటు భక్తికూడా అవసరమే. భక్తిలేని కర్మరత్వం, భగవత్సంకీర్తనం చెయ్యని కవిత్వం హీనమంటున్నాడు మనకవి. విష్ణుసహస్రనామపీఠికా భాగంలో

'కోధర్మస్సర్వ ధర్మాణాం భవతః పరమోమతః' అని ధర్మజుడు అడిగిన ప్రశ్నకు భీష్ముడు సమాధానంగా చెప్పిన

'ఏషమే సర్వధర్మాణాం ధర్మోధిక తమో మతః

యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా'॥

అనేది కర్మరూపమైన అర్చనకు కావలసిన భక్తిని స్తవరూపమైన ధర్మాన్ని రెంటిని చెప్తున్నది. కవికి కర్మిష్ఠికి 'పదభక్తి' అవసరం. కవివిషయంలో అది స్తవరూప పదరచన. కర్మరుని విషయంలో గోవిందపదభక్తి. ఛందస్సు వేదపురుషుని పాదాలని చెప్పటం ప్రసిద్ధమే.

4. 'భక్తి' అన్నపుడు భక్తుడు, భగవంతుడు - ఇద్దఱు ఉంటారు. కనుక ఇది ద్వైత విశిష్టాద్వైతానుయాయులకు ముఖ్యమైన సాధనశాస్త్రం. భక్తిశాస్త్రాలుగా (1) నారద భక్తిసూత్రాలు (2) శాండిల్య భక్తిసూత్రాలు ప్రసిద్ధాలు. రూపగోస్వామి 'ఉజ్జ్వలనీల మణి' కృష్ణభక్తినే బోధిస్తుంది. మధుసూదనసరస్వతి 'భక్తిరసాయనం' భక్తిని 'చిత్త ద్రుతి' స్థాయి భావంగాగల ఒక రసంగా నిరూపిస్తుంది. ఇవన్నీ సంస్కృత గ్రంథాలు.

the ritualism some people say it is atheistic. As Vēda says Viṣṇu is Yajña (yajñō vai viṣṇuḥ) the system of philosophy that teaches about the Vedic sacrifices cannot be atheistic. Though God is not directly mentioned in this philosophy the concepts of 'apūrva' and 'adrsta' are expounded here. These concepts connote only the omnipotent God What is described as 'śraddhā' (earnestness) in Vēdadharma can be called bhakti in ordinary terms. In the performance of Vēdadharma,bhakti is also required along with ritualistic rigour. Our poet says ritualistic rigour without bhakti and poetry which does not praise God are inferior. In the prologue of Viṣṇu Sahasranāma, Dharmaja asks: 'Kōdharmaḥ sarva dharmānām bhavatah paramō matah?' (what is the dharma of all dharmas according to your considered opinion?) Bhīsmā replies:

'ēṣa mē sarva dharmānām dharmōdhikatamō mataḥ
yad bhaktyā pundarīkākṣam stavairarcēnnarassadā'

(Man should worship the White -Lotus Eyed God with hymnal compositions with bhakti. This is the best dharma of all dharmas according to me). This speaks of bhakti being necessarv for the ritual of worship as also the praise of God as dharma. Kavi and Karmisthi ( the ritualist ) both need pada-bhakti. In the case of the poet it is hymnal composition. In the case of the ritualist it is bhakti in the Feet of Gōvinda. It is well known that prosody is described as the Feet of Vēdapuruṣa.

4. The concept of bhakti implies the duo , the bhakta (devotee ) and Bhagavān (the God ). So this is a practical discipline important to dualists and visiṣṭādvaitins (1) Nārada bhakti sūtras (2) Śāndilya bhakti sūtras are well known works as bhakti-śāstras. Rūpagōswamy's 'Ujjvalanīlamaṇi' teaches Kṛṣṇa bhakti exclusively. Madhusūdana Sarasvati's Bhakti Rasāyana establishes 'bhakti ' as a rasa with 'citta druti' as sthāyi-bhāva. These works are all in Sanskṛt.

కం॥ కృతి చెప్పిన యాతఁడలం
కృతియుఁజమత్కృతియుఁ గల్గఁగీర్తించినచోఁ
గృతియగు నటుగాక యహం
కృతిఁగృతిసేయుంగ మిగుల గెలింబడడే 20

తా॥ ప్రబంధ రచన చేసిన వాడు అలంకారం చమత్కారం ఉండేటట్లుగా స్తుతిస్తే తన ఉద్దేశం చక్కగా నెరవేరిన వాడౌతాడు. అలాకాకుండా అహంకారంతో పదం కూర్చితే అతడు మిక్కిలిగా నవ్వులపాలు కాకుండునా? అయితీరుతాడని అభిప్రాయం.

వ్యా॥ దేవస్తుత్యాత్మకమైన పదరచనలో కూడ అలంకారచమత్కారాలు ఉండాలని, అప్పుడే పదకర్త కార్యసిద్ధి పొందిన వాడౌతాడని, అహంకారంతో కూర్చితే ఆ కృతి నవ్వులపాలు కాకుండా ఉండదని కవి చెప్తున్నాడు. ప్రకృష్టమైన బంధం - అంటే మేలైన కూర్పు కలది - ప్రబంధం. కృతము అంటే పనితనం, కలది కృతి. పదరచనలో అలంకారచమత్కారాలుంటేనే కర్తకు సిద్ధి (success). అలంకారం అంటే అందం చెయ్యటం; అలమ్ = చాలు అనేటట్లుగా చెయ్యటం; ఇంతకంటే అందంగా చెయ్యలేము; ఇది చాలా తృప్తిగా ఉంది అనిపించేటట్లు చెయ్యడం. ఈ అందానికి ఫలం తృప్తి. ఈ అలంకరించడం అనేది రచనలో శబ్దాలంకారరూపంగాను అర్థాలంకార రూపంగాను ఉండవచ్చు. పదరచనలో ముఖ్యంగా అనుప్రాస రూపమైన శబ్దాలంకారం తప్పకుండా కనబడుతుంది. 'అంఘ్రౌ ఖండద్వయం సానుప్రాస మేకేనధాతునా' (సంగీ. రత్నా. 4-33) ఇత్యాదిగా ఏలాప్రబంధ లక్షణం. అర్థాలంకారాలూ ఉండవచ్చు. పాట అనేది ధాతువుకు ఆధారభూతంగా వచ్చే 'మాతు' గనుక శబ్దాలంకారానికే ప్రాధాన్యం. చమత్కారం అభిప్రాయాన్ని చెప్పేతీరును బట్టి కలుగవచ్చు. ఇది అర్థక్రియా పద్ధతి కావచ్చు, అర్థాలంకారమూ కావచ్చు. సౌందర్యచమత్కారాలు లేకపోతే అలంకారప్రయోజనం సిద్ధింపదు. గర్వంతో రచనచేస్తే అది నవ్వులపాలు అయితీరుతుంది. లలితకళల్లో దేనికి సంబంధించిన కృతి రచన అయినా సరే కర్త అహంకార నిరాసం చేసుకోవడం అవసరం. కాళిదాసాది మహాకవులు కూడా కావ్యాదిలో స్వీయాహంకారనిరాసం చేయ్యడం ప్రసిద్ధమే. తన అహంకారాన్ని దుల్చివేసుకుంటేనే కృతికర్త తానుచేపట్టిన వస్తువు భావకోశం (emotional sheath) లోకి ప్రవేశింపగలుగుతాడు. లేకపోతే లేదు. ఇంగ్లీషు సాహిత్యంలో కీట్స్ మహాకవి దీన్నే 'నెగటివ్ కేపబిలిటీ' (Negative capability) అని వ్యవహరించాడు. 'భజసేవాయాం' అనే ధాత్వర్థాన్ని బట్టి భజించుట భక్తి; అంటే సేవించుట అనిఅర్థం. అహంకారం వదలుకుంటేనే భక్తి సాధ్యం అవుతుంది. పదకర్త అహంకారం వదలుకొని రచన చేయ్యాలి అన్నపుడు అది దేవస్తుత్యాత్మకమైన రచన కనుక భక్తితో రచన చెయ్యాలి అని చెప్పినట్లయ్యింది.

1. పద్యప్రారంభంలోని 'కృతి' - 'పదనిర్యుక్తం' 'ప్రబంధం' అనే అర్థంలో వాడబడింది. ఇది కలారచనకు సంబంధించింది. మూడోపాదం మొదట ఉండే 'కృతి' కార్యసిద్ధిని పొందినవాడు, తలచిన పనినెరవేరినవాడు అని మాత్రమే కాకుండా 'పుణ్యుడు' అనే అర్థంలో కూడా వాడబడింది. అనగా కలారచనలో సిద్ధికలగటం మాత్రం కాక పుణ్యంకూడా సంపాదించుకుంటున్నాడన్నమాట. కృతి అనేది 26 ఛందములలో 20వ ఛందానికిని పేరు. 20 అక్షరాలపాదం ఉండేది కృతిచ్ఛందం.

Verse 20:

Tr. If the composer of a kṛti hymns it with alamkāra and camatkāra he will become successful. As against this if he composes with haughtiness would he not become a laughing stock? (certainly becomes a laughing stock).

com. The author says that even a hymnal composition like a kṛti (padam) should possess the attributes of alaṁkāra and camatkāra for the success of the composer and that haughtiness would make the work only a butt of ridicule. A prabandha means that which has the best composition. A kṛti means that which has the workmanship. The composer attains success only if the composition has the attributes of alaṁkāra and camatkāra. The word alaṁkāra means beautification; beautification to the point of saying 'enough,we cannot further improve it'; to the point of making it appear highly satisfactory. Satisfaction is the result of this beauty. This beautification in a composition may be in the form of śabdālaṁkāra or arthālaṁkāra (verbal or semantic figures of speech ). In a pada-composition verbal form of alliteration is incorporated as a rule: for 'anghrau khanda dvayamsānuprāsam ēkēna dhātunā' etc. is the regulation for ēlā prabandham. Arthālaṁkāra-s also can be there. But since a musical composition is the 'mātu' part of a song coming in support of its 'dhātu' verbal alliteration is more important Camatkāra may be experienced by the mode of expression of an idea; this may be arthakriyā paddhati or merely a semantic figure of speech. The purpose of alaṁkāra is not served if it does not result in beauty and sensitiveness. If one composes with haughtiness his work is sure to become a laughing stock. It is well known that great poets like Kālidāsa and others have deliberately expressed their humility as a mark of shedding their own haughtiness. Only when an artist sheds his encrusted ego then only will he be able to enter the emotional sheath of his subject matter John Keats has called it 'negative capability'. From the verbal root ' bhaja sevāyām' is derived the word bhakti which means serving. Only when haughtiness is dropped will bhakti be possible. When it is said that the composer of a padam should first shed his haughtiness and then compose, it is tantamount to saying that he should compose a padam, which is in praise of God or Deity with devotion.

1, The word kṛti at the beginning of the verse is used in the sense of padaniryukta or prabandha This pertains to an artistic composition The word kṛti at the beginning of the third line is used not merlely in the sense of one who has obtained success or one who has become successful but also one who has become meritorious with ' punya'. Again krti is also one of the 26 types of metres in Sanskṛt prosody. The metre with 20 letters for its line is called Krti chandas.

2. అలమ్+కృ+తి-చాలు అనేటట్లుగా అందగించటం అలంకృతి. కాని అందాన్ని నిర్వచించటం కష్టం. తృప్తి, చాలు అనగా కోరవలసినవారు కోరటం, దీనికి ఫలం. ఈ అలంకారాలు గజ్జెలు, అందెల్లాగా బాహ్యాలు. కాని మితంగా ఉండి చాల ఒప్పిదంగా ఉండాలి. రెండోఅంశం ఇవి పనిగట్టుకొని నగలు దిగవేసుకొన్నట్లు ఉండక ప్రయత్నరహితంగానే ఒప్పిదం ఉన్నట్లు కూర్చబడాలి (అపృథగ్యత్న నిర్వర్త్యములు కావాలి).

3. చమత్కారం అనేది ఒకవస్తువును చూడగానే తాత్కాలికంగా మనసు విప్పారినట్లు కావటం. ఇది ముఖవికాసంలో కనబడవచ్చు. దీన్నే మనం ఆశ్చర్యం అంటుంటాము. రచనలోని ఒప్పిదంవల్ల మనస్సు అనవరతమూ విప్పారుతూ పోవటమే చమత్కారం.

4. కీర్తి అంటే దానాదులవల్ల కలిగే పేరు ప్రతిష్ఠలు. యశస్సు అంటే వ్యక్తిత్వ విశేషం వల్ల కలిగే ప్రతిష్ఠ. కీర్తించటం అన్నపుడు భగవంతుని ఔదార్యకారుణ్యాదులను చెప్పడం అని ముఖ్యాభిప్రాయం. గాంభీర్యశౌర్యాదులను వర్ణించటం (గుణకీర్తనం) అనేది గౌణాభిప్రాయం.

5. అహంకృతి - 'నేను' అనే భావంలోగల గర్వం, మదం. 'అహంతా' అనేది నేను అనే ఎఱుకమాత్రం. 'అస్మితా' (I am) అనే తావన్మాత్రమైన ఎఱుకఅన్నమాట. వర్ణసమామ్నాయంలో అకారం మొదలుకొని హకారం వరకుగల వర్ణాలను సమాహరించేసి మకారంతో మూసివేస్తే 'అహమ్' అవుతుంది. ఈ 50 అక్షరాల- మాతృకల-కూర్పే కాళికాదేవి మెడలోని పుఱ్ఱెలదండ అని శాక్తేయులు చెప్తారు. వర్ణమాతృకల చైతన్య సమాహారమే వ్యష్టిచైతన్యమని అభిప్రాయం. కర్పూరాది స్తోత్రం ఈవివరణకు ముఖ్యమూలం.

ఈఅహంకారం సాత్త్వికాహంకారమని రాజసాహంకారమని తామసాహంకారమని మూడు రకాలు. ఈపద్యంలో రాజసతామసాహంకారాలే గ్రహించాలి.

2 The word 'alaṁkṛti' can be split up as 'alam+kṛ+ti' meaning beautifying to the point of saying 'enough'. But beauty is a concept difficult to define . Satisfaction, affection of the beloved are its good results. These embellishments are external like anklets, bells etc but they have to be sparse and must sit well on the body. The second point is that they should not appear to be deliberately donned but that they must appear casual yet impressive.

3.A sudden sense of expansion of mind felt by the perceiver is called camatkāra It may appear in a flash of brightness on the face of the perceiver. We usally refer to it as 'surprising' A sense of expansion experienced by the perceiver at every step on account of the prettiness of the composition is camatkāra

4. Kīrti is the reputation gained on account of one's generosity and philanthropy. Reputation on account of one's own personality is ' yaśas' In a hymnal compostion praise of God's grace and generosity is the important idea; praising of other qualities is secondary

5.' ahaṁ kṛti'-is haugtiness contained in the thought 'I' Ahaṃtā-is mere awareness of one's self, it is just that much of awareness as we have when we say 'I am' (asmitā). When all the alphabets starting with the vowel' a' and ending with' ha' are signified with these first and last letters closing it with 'm' it become a-ha-m. The fifty Sanskṛt alphabets are said to embellish Goddess Kāli as a garland of skulls, according to Śākta tradition The hymn Karpūrādi stōtra addressed to Kāli is the most famous one in this respect This . ahaṃkāra is of three grades called sātvika, rājasika and tāmasika Only the rājasa and tāmasa types are to be considered in this verse

తే॥గీ॥ పెటులు నేరక చూఁడిన బెనురవంబు
లొదవ లక్ష్యంబునైనఁబ్రయోక్తనైన
సాధనమునైనఁజెఱుచు నీసరవిగాదె
సంప్రదాయంబు నెఱుఁగని జడునికవిత 21

కం॥ వరదానంబున నైనను
గురుముఖమున నైనఁదెలిసికొను కవిపలుకుల్
పరమామృతమౌ లేదా
దురహంకృత కవిత నోరఁదోఁడంద్రు బుధుల్ 22

తే॥గీ॥ సంప్రదాయాగత జ్ఞానసహితుఁడైన
మనుజు సత్కవితయు వేదమంత్రసమము
అదియు చాలదె శ్రీవేంకటాచలేశు
చరణములు గను మనువునశ్వరణ మేల 23

తా॥ తెలియక కాల్చినప్పటికి పెట్లుక్రోవి పెద్దచప్పుడుతో దానికి గుఱిగానున్నదానిని గాని, నడపిన వానినిగాని, కడకు క్రోవినేగాని నశింపజేస్తుంది. సంప్రదాయం తెలుసుకోని తెలివిమాలినవాని కవిత్వంకూడ ఇలాగే లక్ష్యాన్నికాని చెప్పినవానినికాని చివరకా కవితనేకాని పాడుచేస్తుంది. (21)

దేవతావరప్రసాదం వల్లగాని గురువునోటిగుండకాని తెలిసికొనే కవిమాటలు అమృతప్రాయాలే ఔతాయి. అలాతెలుసుకోకుండ నేనే చెప్తానని చెప్పినకవిత నోరనే గుంటలో త్రవ్విన మట్టిలాంటిదని తెలిసిన వారంటారు. (22)

సంప్రదాయజ్ఞానం కలవాడు చెప్పినకవిత్వం సత్కవిత్వమై వేదమంత్రాలతో సమానమౌతుంది. శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మాలుతెలుసుకోడానికి అలాంటి కవిత్వమే చాలు. వేరే మంత్ర జపం చెయ్యనక్కఱలేదు. (23)

వ్యా॥ ఈ మూడు పద్యాలు సంప్రదాయానికి ఉండే ప్రాముఖ్యాన్ని చెప్తాయి. జడునికి ఎలాగూ గురువు దైవం రెండూ ఉండవు. అలాంటివాడు సంప్రదాయజ్ఞానం లేకుండా చెప్పే కవిత్వం ఎలా కీడు చేస్తుందో తొలి పద్యం చెప్తుంది. జడుడు కాకపోయినా గురువువల్లకాని దేవతా ప్రసాదం వల్లగాని సంప్రదాయం తెలుసుకోకుండా చెప్పేవాని కవిత్వం గుంటలో మన్ను త్రవ్వినట్లు నోటికి మాత్రం చేద్పాటవుతుందని మలిపద్యం చెప్తుంది. గురుశిష్య పరంపరాగతంగా వచ్చిన జ్ఞానంతో చెప్పిన కవిత్వం వేద మంత్రంతో సమానంగా ఉండి జ్ఞానమోక్షాలకు కారణమౌతుందని మూడో పద్యం చెప్తుంది. సంప్రదాయమనేది గురుశిష్యపరంపరగా వచ్చిన పరిజ్ఞానం. అది శ్రేయస్కరం. శ్రేయస్సు అంటే రాగలశుభం. అది ఐహిక సుఖం కావచ్చు. ఆముష్మికంగా స్వర్గసుఖం కావచ్చు, మోక్షం కూడా కావచ్చు.

'సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్పితః
ఆచార ప్రభవోధర్మో, ధర్మస్య ప్రభురచ్యుతః'

అనే విష్ణు సహస్ర నామస్తోత్ర శ్లోకాన్ని సంప్రదాయపరంగా అన్వయించుకోవచ్చు. ధర్మశాస్త్రం కూడా కుటుంబ సంప్రదాయాన్ని కుల సంప్రదాయాన్ని పాటించమనే చెప్తుంధి. కవిత్వంలోను సంగీతంలోను అంతే. జడుని నోటి కవితను పెల్లు క్రోవితో పోల్చి చెప్పడంలో వాక్కు అగ్నితత్త్వమని, అక్షరాల మాతృకావిజ్ఞానం, తత్త్వాలు, విషామృతాది లక్షణాలు, కృతికర్త కృతి భర్తలకు జ్యోతిష సంబంధమైన పొంతనం వగైరాలు తెలియకుండా చెప్పే కవిత్వం కీడు చేస్తుందనే అభిప్రాయం ఉన్నట్లుకనబడుతుంది. ఈ సంప్రదాయక విజ్ఞానం తెనుగులక్షణ గ్రంథాల్లోను తెనుగు నాట పుట్టిన సంస్కృత లక్షణ గ్రంథాల్లోను విశేషంగా ఉంది. మంత్రోపాసన చేసి దేవతా ప్రసాదం వల్ల చక్కటి ప్రతిభనుపొంది కవిత్వం చెప్పటం గాని గురు శుశ్రూషచేసి పాండిత్యం సంపాదించి కవిత్వం చెప్పటంకాని చిరకాలంగా వస్తున్న సంప్రదాయాలే. ఈ రెండూ కాకుండా స్వయంకృషితో సాధన చేసిన కవిత్వం నోటికి శ్రమ మాత్రమే అవుతుందని తర్వాత పద్యంలో కవి చెప్తున్నారు. దేవతా ప్రసాదం వల్లగాని గుర్వనుగ్రహం వల్లగాని సంప్రదాయం తెలుసుకొన్న వాని రచన వేదమంత్ర సమమంటున్నాదు గ్రంథకర్త. మంత్రం సరహస్యం. సంప్రదాయజ్ఞానమనేది ఆ రహస్య జ్ఞానమన్నమాట. అది తెలిసినవ్వారు రచనకు గొప్ప శక్తి వస్తుందని అభిప్రాయం. వేదాధ్యయనం గురుశిష్య పరంపరాగతమే కాని స్వయంకృషి లభ్యం కాదు. అట్లే ఇక్కడ కూడ. శ్రీ మద్రామాయణ శ్రీమహాభారతాలకు వేద తుల్యత్వం, మార్కండేయ పురాణాంతర్గతమైన దుర్గాసప్తశతికి మంత్రత్వం, శంకరకృత సౌందర్యలహరికి శ్రీ విద్యామంత్రతంత్ర గౌరవం ఈ సందర్భంలో గమనింపదగ్గవి.

1. సంప్రదాయం అన్నపుడు రహస్యంగా చెప్పబడిందని అభిప్రాయం.
2. వేంకటాచలేశు చరణములు- అన్నపుడు 'పాదోऽస్యవిశ్వాభూతాని' అనే పురుష సూక్త శ్రుతిని బట్టి సృష్టిరూపమైన చతుర్దశ భువనాలు, అందలి ప్రాణులు భగవంతుని పాదస్థానీయములని గ్రహించాలి. భగవంతుని చరణాలు తెలుస్తాయి అంటేసృష్టి రహస్యం తెలుస్తుందని అభిప్రాయం.
3. 'మను' అనే సంస్కృత శబ్దానికి మంత్రమని అర్థం. పునశ్చరణం అనేది మంత్ర శాస్త్రంలో మాట. మంత్రజపం చెయ్యటం అని అర్థం. మంత్రసిద్ధికి అక్షరలక్ష అని కాని నియతమైన జపసంఖ్య కావి ఉంటుంది. నియమంగా ఆ జపసంఖ్యను నిర్వహించటం పునశ్చరణ చెయ్యటం అంటారు.

"sarvāgamānām ācāraḥ prathamam parikalpitaḥ
ācāraprabhavō dharmō, dharmasya prabhuracyutaḥ'

Even Dharmaśāstra advises one to follow the tradition of family as well as one's own community So is it in poetry or music. In comparing the poetry in the mouth of a stupid with a pipe-gun or cannon the author seems to have in his mind the following points: Vāk is agnitatva (vāg arcih'-Brhadāraṇyaka upaniṣad 6-2) poetry without the knowledge of mātrkā vijñana, the tattvas of letters, their poisonous or nectar-like effects, the astrological compatibility between the poet and the patron- may become harmful Much of this traditional knowledge may be found in the laksana grantha-s in Telugu as also similar works written in Sanskṛt in the Telugu country Poetic talent through apprenticeship and study under a guru or the grace of a Deity through mantrōpāsana have been the two hoary traditions in India. In contravention of these, if one practices on his own, such poetry, the author says in the next verse, will only be a strain on his vocal chords. Poetry by one who has obtained the knowledge of tradition either through a guru or the grace of a Deity is equal to Vēdamantra, says the author A mantra is esoteric (sarahasya). Saṁpradāya jñāna pertains to this secretive aspect. The idea is that the composition gets great power when the esoteric aspect is known . Vedādhyaya-na has always been through the tradition of Guru and śiṣya only. So is here. One can take note of the fact that Srīmad Rāmāyana and Srī Mahābhārata are treated as Vēda-tulya, the Durgā-sapta-śati found in Mārkandēya Purāṇa, is honoured with its every sloka being treated as a mantra and Soundaryalahari of Srī Śankara is treated as mantra and tantra śāstra

1 Saṁpradāya should be understood as teaching with its esoteric aspect.

2 Vēnkaṭācalēśu Caraṇamulu= Feet of the Lord of Vēnkaṭācala. As per the Vēdamantra 'pādōśya viśvā bhūtāni' of Puruṣa Sūkta, all the fourteen worlds and all the living beings form the part of the Lord's Feet. To say that one realises the Feet of the Lord would mean that one would know the secret of the Lord's creation.

3 The Sānskrt word 'manuḥ' means mantra. Punascaraṇa is a technical term in mantraśāstra. It just means repeating the mantra (japa) If one wants to attain success in a particular mantra he will have to do japa of the mantra a stipulated number of times. Generally, it may be hundred thousand times for each letter of the mantra or a particular fixed number. The japa done in this connection is called punascaraṇa.

కం॥ పదమగును సుప్తిజంతము,
పదమవయవ, మవయవియును బదమనఁబరఁగున్
దుదినీ తెలుంగులన్ని యుఁ
బదకవితా మార్గ సార్వభౌముఁడు దెలిపెన్ 24

వ॥ అందు నవయవ పదం బెట్టిదంటేని

కం॥ విదిత చతుష్పాదంబగు
నది వృత్తం, బదియధాతు, వవయవ సంజ్ఞం
బదియు యని యన్నయార్యుఁడు
పదిలముగా భరతశాస్త్ర పద్ధతిఁబలికెన్ 25

తా॥ సుబంత మనబడే నామవాచక పదమైనా తిజంత మనబడే క్రియాపదమైనా పదమౌతుంది. పదం అవయవము కూడా ఔతుంది. అవయవి కూడాపదమనిపించుకుం టుంది. పదకవిత్వ మార్గానికి సార్వభౌముడైన అన్నమాచార్యుడు ఈ చందాలన్నీ చెప్పి ఉన్నాడు. (24)

ఇంక అవయవ పదం ఎలాంటిదో చెప్పబడుతున్నది. స్పష్టంగా నాల్గు పాదాల్లో ఉండేది వృత్తం. అదే ధాతువు. అవయవమనే పేరుతో పిలువబడేది అదే- అని భరతశాస్త్ర పద్ధతిగా అన్నయార్యుడు చెప్పాడు. (25)

వ్యా॥ ఈ చోటి రెండు పద్యాల్లో తొలి పద్యం 'పద'మనేదాన్ని పరిచయం చేసి గీతిపరంగా అవయవ, అవయవి భేదాన్నిప్రవేశపెడుతున్నది. రెండో పద్యం అవయవ పదాన్నిగూర్చి చెప్తున్నది.

'సుప్తి జంతం పద'మ్మనేది సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధమైన అంశం. 'సుప్పు'లనే నామ విభక్తులచేత నామవాచకాలైన పదాలను సుబంతాలని 'తిజే'లనబడే క్రియావిభక్తులుచేరిక్రియలైన పదాలను తిజంతాలని అంటారు. భాషలోని నామవాచకాలుక్రియలు అయిన వాటిని 'పదం' అంటారని అభిప్రాయం. భాషలో కనబడే ఉపసర్గలు, అవ్యయాలు, తద్ధితాలు అనేవాటికి ఈ వ్యవహారం వర్తించదు. భరతుడు వాచికాభినయ సందర్భంగా కవి నటుల శిక్షకోసం వ్యాకరణచ్ఛందసుల్ని చెప్పినాడు. ధ్రువాగాన సందర్భంగా (32 అధ్యా.) 'యత్కించి దక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్మ'ని పదరచనా పరంగాను చెప్పినాడు. అన్నమయ్య భరత మతాన్ననుసరిస్తూ పద రచనాపరంగా ఈ పద్యాల విషయాలు చెప్పినట్లు గ్రంథకర్త చెప్తున్నాడు. అవయవం అంటే కాలు చేయిలాంటి శరీరభాగం. అవయవాలు కలది అవయవి, అంటే శరీరం అన్నమాట. భరతుడు సప్తగీతక సందర్భంగా సమస్త గీతాలకు (1) వస్తువు (2) అవయవాలు ఉంటాయని చెప్పాడు. అవయవాలకు సంబంధించి 'విదారులు (సంగీత విభాగాలు) చెప్పబడినవి. ఒక విదారి ఉంటే ఏకకం,

రెండుంటే 'వివధం,' మూడు మొదలు ఆరు వరకు విదారులుంటే 'వృత్తం-' అనబడుతాయి. 'వృత్తం అన్నపుడు అందులో అంశం, అపన్యాసం, న్యాసం అనే మూడూ ఉంటాయి. రాగాన్ని లేదా గీతాన్ని ప్రారంభించే స్వరం అంశస్వరం లేదా జీవస్వరం అంటారు. ఇది ఆ రాగాన్ని అభివ్యక్తికి తెస్తుంది.నడుమనడుమ గీతంలో ముగింపు చూపించే స్వరం అపన్యాస స్వరం. గీతాన్ని పాడి ముగించే స్వరం న్యాసస్వరం. వృత్త విషయంగా ఇవి గుర్తుంచుకోవాలి. పదం అవయవం కూడా అవుతుంది అన్నపుడు స్వల్ప భేదంతో రెండు రకాలుగా చెప్పకోవచ్చు. పదం అనేది గీత భాగం అనేది మొదటిది. ఇలా చెప్పకున్నప్పుడు పదమనేది పైన చెప్పిన 'విదారి' అవుతుంది. అంతేకాని భాషాపదాలైన సుబంత తిజంతపదాలు కావు. ప్రబంధ పురుషునికి (1) స్వర (2) బిరుద (3) పద) (4) తేనక (5) పాట (6) తాలాలు అంగాలుగా చెప్పబడినై. వీటిలో పదతేనకాలు కళ్లు, పాట బిరుదాలు చేతులు, స్వరతాలాలు చెవులు. స్వరాలు సరిగమలు. బిరుదం ఓజస్విగా కూర్చబడిన మహోరాష్ట్రాది భాషా బిరుదమే. పదం అర్థాన్ని ప్రకాశింపజేసేది - తేనకం అనేది మంగళస్వరూపమై పరతత్వాన్ని సూచించే 'తేన' అనే సంస్కృత భాషాశబ్దం. తచ్ఛబ్దానికి తృతీయా విభక్తి ఏకవచన రూపం. పాట అనేది మృదంగాది వాద్యాలమీద చేత్తో పుట్టించే వాద్యస్వరాలు. తాలం మనం విన్నదే. ప్రబంధాంగంగా చూచినప్పుడు పదం అర్థ ప్రకాశకమైన మాట అవుతుంది.

అవయవమే కాదు. అవయవి కూడా చివరకు పదమనబడుతుందని చెప్పినపుడు ధాతు మాతువులు రెండూ చేరి సమగ్రంగా ఉంటూ పాడబడే ప్రబంధం మొత్తం 'పదం' అనిపించుకుంటుందని అభిప్రాయం. ప్రబంధ భాగం పదం అనిపించుకుంటుందని సంగీత రత్నాకరం మీద కల్లినాధుని వ్యాఖ్యలోను ఉంది. రూపకాలప్తి సందర్భంగా వ్యాఖ్య వ్రాస్తూ కల్లినాథుడు ఇలా చెప్తున్నాడు:

> "పదవత్ పదాని। యథా వాక్యస్య పదాన్యవయవాః తథా
> ప్రబంధస్యావయవా విదారీభాగాః పదాన్యుచ్యంతే। నతు
> వాచకాని సుబంతాదీని వా భాషా పదాని।"

సంగీ. రత్నా-అధ్యా. 3-201

'Avayava' means a limb like a hand or leg, a protrusion of the body That which possesses the avayava-s is avayavi, the body. Bharata has stated in the context of sapta-gītakạ (the seven types of gītas) that all musical compositions have (1) vastu and (2) avayava-s. Pertaining to these avayava-s or limbs are mentioned what are called 'vidāri-s' (those causing musical sections) If there is one vidāri it is called 'ēkaka'. If two it is 'vivadha' and if there are three to six vidāris it is called 'vrttam'. In a vṛttam of a song the aṁśa, the apanyāsa and the nyāsa are present. The svara or musical note that is used for beginning a raga is called amśasvara or jīvasvara. This is said to expound the rāga. The svara used for intermittent conclusions is callēd apanyāsa.The svara with which a song is concluded is nyāsa svara. These items are to be remembered in the context of a vṛtta also.

When it is said that a padam can be an avayava we can understand it in two ways with a slight difference. The first is padam as a part of the song. When so understood, padam becomes a vidāri cited above. It will not have anything to do with nouns or verbs. Authropomorphically speaking the prabandha-purusa is said to possess the following avayava-s: (1) svara (2) biruda (3) pada (4) tēnaka (5) pāṭa and (6) tāla, Among these pada and tēnaka constitute the eyes; pāta and biruda are the hands; svara and tāla are the ears. Svara-s are the sarigama-s; biruda is a composition of title in vigorous language like Mahārāṣtri Padam is the agent through which meaning is expressed; tēnaka is the auspicious word teṇa which indicates the cosmic spirit or God. It is the singular in instrumental case for the pronoun 'tat'-śabda (taken from the mahāvākya 'tat tvam asi') Pāṭa means the notes engendered on membranophones by the hands of the player. Of course, we are familiar with tāla. As an organ of prabandha, padam is the expressive word, mātu

When padam is considered as avayavi it represents the entire song, both dhātu and mātu put together ,

That a part of prabandha is called a padam is found in Kallināthа's commentary on S.R. in the context of rūpakālapti. He writes thus

> "padavat padāni. yathā vākyasya padānyavayavāḥ tathā prabandhasyāvayavā vidārībhāgāh padānyuccantē. na tu vācakāni subantādini vā bhāsā padāni "

పదాన్ని ప్రబంధావయంగా చెప్పిన తర్వాత అవయవపదం వివరింపబడింది. ఈ అవయవపదం చతుష్పాదమైన వృత్తం అన్నపుడు మామూలు పద్య మనేది పాదబద్ధమైన పదనికురుంబం అనేది వాస్తవమే అయినా పాటకు సంబంధించి ఇది నాలుగు పాదాల్లో యతి ప్రాసలతో కూడి వృత్తబంధంగా ఉండే ప్రబంధభాగం అని గ్రహించాలి. ఈ వృత్తబంధంగా ఉండే గీతి ఖండంలో వెనుక చెప్పిన అంశ, అపన్యాస, న్యాస స్వరాలకు అవకాశం వుంటుందనీ గ్రహించాలి. ఇలాంటిప్రబంధ భాగమే 'ధాతువు' అవుతుంది అన్నప్పుడు అభిప్రాయం ఇది: ధాతువనే మాటకు సంగీత శాస్త్రంలో (1) గేయం (2) అవయవం అని రెండు అర్థాలు ఉన్నాయి. వీటినిబట్టి వృత్తబంధంగా ఉండే ప్రబంధ భాగం ప్రబంధావయవం అవుతుంది. అలాగే సకల ప్రబంధానుగతంగా ఉండె గేయాంశం (పాటలో ఉండే సంగీతం) గాను ఉండి ముందు ముందు చెప్పబోయే ఉద్గ్రాహాది ధాతు ఖండాలుగాను పేర్కొబడతాయి. ఇవే నేడు చరణాలు అనబడుతున్నాయి.

తర్వాతి పద్యంలో శరీర ధాతువులైన వాత పిత్త శ్లేష్మాల సాదృశ్యంతో ఈ 'వృత్తా' లకు ధాతుత్వం చెప్పబడుతోంది గనుక గీత ప్రబంధం లేదా 'పదం' అనేది ప్రధానంగా త్రిధాతు నిర్మితి అనే అభిప్రాయం ఉన్నట్లు చెప్పవచ్చు. అన్నమయ్యగారి కృతుల్లో చాల వాటికి మూడేసి చరణాలు ఉండటం కూడా గమనించవచ్చు.

1. వృత్తమ్. 'వేదే గాయత్ర్యాదౌ వర్తత ఇతి వృత్తమ్' అని ఒక నిర్వచనం. దీన్నిబట్టి ఆయా ఛందస్సుల్లోని గురులఘువుల క్రమాన్ననుసరించి ఏర్పడే సౌష్ఠవయుక్తమైన సూక్ష్మశరీరాన్ని ఊహించుకోవాలి. పాటలో అయితే ఛందస్సువల్ల ఏర్పడే నాదశ రీరాన్ని ఊహించుకోవాలి.

   'ఏవం నానార్థ సంయుక్తైః పాదై ర్వర్ణ విభూషితైః
   చతుర్భిస్తు భవేద్యుక్తం ఛందోవృత్తాభిధానవత్॥'

   (నాట్య శాస్త్రం. అధ్యా. 14-శ్లో 42)

భరతుని ఈ శ్లోకం గణాల గొడవకు పోకుండా నాల్గు పాదాల కూర్పును 'వృత్త'మని చెప్తున్నది. పద్యమని పొరబడకుండా దీన్ని మనం 'వృత్త బంధం' అనవచ్చు.

2. ధాతువు: ఈ శబ్దానికి రెండు అర్థాలు చెప్పుకోవాలి. 'వాఙ్మాతురుచ్యతే, గేయం ధాతురిత్యభిధీయతే' (సంగీ. రత్నా. అధ్యా.3-శ్లో.2) పాటలో అర్థవంతమైన మాటలు 'మాతువు'; దాని గేయాంశం 'ధాతువు'. ఈ ధాతువనేది సకల ప్రబంధానుగ తమైన గేయధర్మం, అంటేపాటలోని సంగీతం. ధాతువుకు మరొక నిర్వచనం 'ప్రబంధావయవో ధాతుః, స చతుర్ధానిరూపితః' (సంగీ. రత్నా. అధ్యా. 4-శ్లో.7) ఇక్కడ ధాతువనేది ప్రబంధం కూర్పులోని ఒక అంగంగా చెప్పబడింది. ఉద్గ్రాహాదులు ఇలాంటి అంగాలు. అప్పుడీ ధాతువు పాటలోనిగేయ ధర్మంలో ఒక భాగం మాత్రమే అవుతుంది.

After designating padam as prabandhāvayava the avayavapadam is explained. When it is said it is a vṛtta in four lines we should not understand it as a stanza in a poem A padya is , of course, a conglomeration of words fitted in four lines but it is not a song. In the context of a song we have to understand it as a composition in four lines with yati and prasa which may be called vṛtta-bandha which is a part of a song. We must remember that there must be room for aṁśa, apanyāsa and nyāsa in this vrtta. Such a part of prabandha can also become dhātu. In Indian classical music dhātu has two meanings 1 gēya, 2.avayava As a result of this a part of prabandha which is in vrtta- bandha can become a prabandha avayava Similarly it can also be the music of the song-that part that is present in all the musical compositions apart from the libretto These dhātu-s udgraha, etc. will be mentioned in the coming verses. Padam as dhātu can be referred to as udgrāha khanda etc. These vṛtta-bandha parts are nothing but the present day carana-s of a krti.

The next verse attributes dhātutva to vṛttas on the analogy of vāta, pitta, ślēsma. This suggests that a padam was considered tridhātuka. One can see only three caraṇa-s in many of Annamayya's compositions which are vṛtta-s, avayava-s, dhātu khanda-s.

1. Vrttam: 'Vēdē gayatryādau vartata iti vṛttam'· that is one of the etymologies available for the word vṛttam. It means that which pervades the metres gayatri etc in Vēda From this we have to guess the subtle body with symmetry that takes shape following the order of the guru-s and laghu-s in different metres. In a song we have to configurate the nāda śarīra resulting from the chandas or prosody

"ēvam nānārthasaṁyuktaiḥ pādairvarnavibhūsitaiḥ

caturbhistu bhavēd yuktam chandō vrttābhidhānavat "

(N.S.- Adhya 14-SL.42)

This ślōka defines vṛttam as a composition in four lines without bothering about gaṇas or metrical feet We may call this vrttabandha so that we may not mistake the vrtta as any stanza in poetry

2 dhātu· We have to understand this word in two ways.

'Vāṅgmāturucyatē; gēyam dhāturityabhidhīyatē'

(S R. Adhya 3-SL.2)

According to this the meaningful word in a song is mātu and music is dhātu. This dhātu or musicality pervades all the songs. That is the music of the song. Another definition for the word dhatu is 'prabandhāvayavo dhātuḥ sa caturdhā nirūpitaḥ' (S R -Adhy 4,-Sl.7) Here dhātu is described as a component in the composition of a prabandha The dhatus, udgrāha etc. are such component parts in a prabandha. Then this dhātu becomes only a part of the music or musicality of the song

వ॥ ఈ వృత్తంబులకు ధాతు సంజ్ఞలెట్లయ్యె నంటేని

॥ వాతముఁ బిత్తముం గఫము వర్ణిత సర్వశరీర ధారణా
హేతువులయ్యెఁ గావున మహింజెలువొందెను ధాతుసంజ్ఞ; నీ
రీతినె వృత్తముల్ పదశరీర సముద్భవ కారణంబులై
ధాతు సమాఖ్యలందె భరత ప్రముఖాఖిల మౌనిసమ్మతిన్. 26

తా॥ వృత్తాలకు ధాతు సంజ్ఞలు వచ్చిన విధం చెప్తాను. వాత, పిత్త, శ్లేష్మాలనేవి దేహధారణ హేతువులు కావడం వల్ల లోకంలో వాటిని ధాతువులంటున్నారు. ఈ రీతిగానే పద శరీరం పుట్టడానికి వృత్తాలు కారణం కావడం వల్ల భరతాది మౌని ప్రముఖుల ఆమోదంతో ఈ వృత్తాలూ ధాతువులనబడుతున్నాయి.

వ్యా॥ వాతం, పిత్తం, శ్లేష్మం అనేవి ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన అంశాలు. వీటిని ధాతువులని, రోగపరంగా దోషాలనికూడా అంటారు. ఆయుర్వేద వైద్యులు 'నాడి' పరీక్ష చేసేటప్పుడు ఈ వాత పిత్తశ్లేష్మ నాడుల్నే కనిపట్టి చూస్తారు. దేహం ఏర్పడ డానికి ఈ మూడు కారణమనేది ఆయుర్వేద సిద్ధాంతం. ఇలాగే పద శరీరం పుట్టడానికి కారణమౌతూ వృత్తాలూ ధాతువులు అనబడ్డాయి. ధాతువుల స్పష్టమైన ప్రస్తావన మరల 38 పద్యం వద్ద వస్తుంది.

ప్రముఖులైన భరతాది మునులు అనడంలో భరతునితోపాటు కోహల దత్తిలులను కూడాగ్రహించాలని కవి అభిప్రాయంగా కనబడుతుంది. కోహలుడు, దత్తిలుడు, తండు, తాండాయని, తాండ్యుడనే వారు భరతపుత్రులుగా పేర్కొనబడ్డారు. కోహలగ్రంథం లేదు కాని ఇతర నాట్య గ్రంథాంశాలు కొన్ని అభినవగుప్తుడు నాట్యశాస్త్రం మీది వ్యాఖ్యానంలో చిత్రాభినయం మీది 25 అధ్యాయం (బొంబాయి, బరోడ ముద్రణలు)లో చెప్పాడు. కోహల శార్దూల సంవాదంగా ఉన్న 'సంగీత మేరువు'లోని అంశాలు ఇతర సంగీత గ్రంథాల్లో కలిసిపో యినై అని పండితుల తలంపు. కల్లినాథుడు తన సంగీత రత్నాకర - వ్యాఖ్యలో (వర్తనలను వివరిస్తూ) 39కోహల కారికలనిచ్చివాడు. కాని తర్వాతివాడైన కీర్తిధరుని పేర్కొన్నందువల్ల ఈ భాగం ప్రక్షిప్తమన్న సందేహం లేకపోలేదు. కోహలుని రచన నేటి నాట్యశాస్త్రంలో కలిసిపోయిందని, కోహలుడే నాట్య శాస్త్రాన్ని సవరించిన వాడని పండితుల అభిప్రాయం. 'దత్తిలం' అనే సంగ్రహ గ్రంథాన్నిగూర్చి ఈవరకే చెప్పబడింది.

ఇంతకూ ఈ పద్యంలో చెప్పబడిన అభిప్రాయం సంగీతరత్నాకరంలోని శ్లోకానికి అను వాదం. ఆ శ్లోకమిది:

వాత పిత్తకఫా దేహధారణాద్ధాతవో యథా
ఏవమేవ ప్రబంధస్య ధాతవో దేహధారణాత్.

(సంగీ. రత్నా. 4అధ్యా- 10/11శ్లో.

verse26:

Tr. The nomentclature of dhātus to vṛttas is being explained. Just as vāta (wind) pitta (bile) and kapha (phlegm) are called dhātus on account of their being the cause for the gross body, these vṛttas also are called dhātus by consent of prominent sages like Bharata and others, on account of their being the cause for the orgnation of the body of padam.

Com. Vāta(wind), pitta (bile) and ślēṣma(phlegm) are called the dhātus or dōsas. This pertains to Ayurvēda popularly called Indian medicine ( and is parallel to the English conception of 4 humours of the body-blood, phlegm, choler and melancholia-the last two being bile and blackbile). when an Ayurvēdic physician feels the pulse of the patient it is these three particular nādị-s that are observed. It is axiomatic in Ayurvēda that these three elements cause the origination of gross-body. Thus vṛttas being considered as cause for origination of the corpus of the song (pada-śarīra) these dhātus are taken up again in verse 38 in specific fashion.

The term 'prominent sages like Bharata and others perhaps includes Kōhala and Dattila too. Kōhala, Dattila, Tandu, Tāndāyani and Tāndya are mentioned as Bharataputras. Some points of Kōhala on dance are mentioned by Abhinavagupta in his commentary on Citrābhinaya under chapter 25 (Bombay & Baroda editions) of N.S. Points of Saṅgīta Mēru, Kōhala's treatise on music in the form of a dialogue between Kōhala and Śārdūla are said to have got merged with other treatises on music. Kallinātha has given some 39 karīkas of Kōhala in his commentary on S.R. But this portion is suspected to be an interpolation as it mentions Kirtidhara who was posterior to Kōhala. Scholars feel that Kōhala's writings got merged with N.S., that he was one of the redactors of N.S. 'Dattilam', a work in the form of a digest of Dattila's work has already been touched upon earlier.

The central idea of this verse is a rendering of the following ślōka from S.R.

'Vāta pitta kaphā dēha dhāraṇaddhātavō yathā

ēvam ēva prabandhasya dhātavō dēhadhāraṇāt'

(S.R. 4 Adhyạ -10/11 sl.)

సంగీత రత్నాకరంలో ధాతు భేదాల్ని చెప్పే సందర్భంలో ఉద్గ్రాహం, ధ్రువ, ఆభోగం అనే ముఖ్య ధాతువుల్నీ మేలాపకం; అంతరం అనే అముఖ్యధాతువుల్నీ చెప్పిన తర్వాత పై శ్లోకం చెప్పబడింది. అక్కడ ఉద్గ్రాహం, ధ్రువ, ఆభోగం అనే మూడు ముఖ్య ధాతువులు ప్రబంధ శరీరానికివాత పిత్త శ్లేష్మ ధాతువుల్లాంటివని అభిప్రాయం. ఇక్కడ చిన తిరుమలాచార్యుడు వృత్తాలకు ధాతుసంజ్ఞలు చెప్తూ వాతపిత్తాది ప్రశంస చేశాడు. ఇక్కడ వృత్తాలు అంటే అక్షరగణచ్ఛందస్సుల్తో కూడిన పద్యాలని గ్రహించకూడదు. ఆ అక్షర గణాలతో కూడిన వృత్త ఛ్ఛందస్సుల్లో వర్తించే సూక్ష్మలక్షణాలని గ్రహించాలి. వేదాల్లోని గాయత్ర్యాది ఛందాల్లో వర్తించేది వృత్తం (గాయత్ర్యాదౌ ఛందసి వర్తతే ఇతి వృత్తమ్) అని వెనుక చెప్పిన వ్యుత్పత్తిని గ్రహించాలి. 38 పద్యం వద్ద ఉద్గ్రాహాది స్పష్ట ధాతువులు నిబద్ధపదానికి అవయవాలైన అవాంతర పదాలకు అనుకూలమైన పల్లవిగా నిరూపింపబడ్డాయి.

This śl̄oka occurs in S.R. in the context of 'dhātu bhēda-s' (enumeration of different dhātus ) and after listing up the three important ones udgrāha, dhrūva, ābhōga and the minor ones mēlāpaka and antara There the idea is that udgrāha, dhrūva and ābhōga to the prabandha śarīra are like vāta, pitta and ślesma dhātus to the human body.In our Telugu text Cina Tirumalācārya is speaking of vāta, pitta and ślēsma in the context of giving the nomenclature of dhātus to the vrtta-s. Here we should not take vrtta-s to mean merely the four-lined stanzas composed in prosody of aksara-ganas. The etymology of vrtta given earlier as that which pervades the prosodies like gāyatri etc. in Vēdas is to be taken (gāyatryādau chandasi vartatē iti vṛttam) The pervasive subtle element of these metres is what is meant here. The author speaks of udgrāha etc. as pallavi suitable for avāntarapadas as limbs of nibaddhapada at verse 38

వ॥ ఇందులకు భాషానియమం బెట్టిదనిన

ఆ॥వె॥ పదము సంస్కృతమునఁ బ్రాకృతమున దేశ
భాష నైనఁ బొసఁగఁ బలుక వలయుఁ
బ్రాసములును యతులుఁ బద్యభంగిని జెల్లు
ననిరి భరత దత్తిలాది మునులు 27

తా॥ పద రచనకు భాషా సంబంధమైన నియమం చెప్తాను. పదాన్ని సంస్కృతంలో కాని ప్రాకృతంలో కాని దేశ భాషలో కాని కూర్చవచ్చునని యతులు ప్రాసలు పద్యానికి చెల్లినట్లే ఇక్కడ కూడా చెల్లాలి- అని భరతుడు దత్తిలుడు మొదలైన మునులు చెప్పారు.

వ్యా॥ భరతుడు వాచికాభినయ సందర్భంగా సంస్కృత ప్రాకృత పాఠ్యాలను గూర్చి చెప్పాడు. సంస్కృత పాఠ్యానికిసంబంధించి నాట్యశాస్త్రం 14 అధ్యాయం (బొంబాయి, బరోడా ముద్రణలు)లో వ్యాకరణం ఛందస్సుల్నీ, 15 అధ్యాయంలో వృత్తాల్నీ, 16 అధ్యాయంలో లక్షణాలంకార గుణ దోషాల్నీ చెప్పి 17 అధ్యాయంలో ప్రాకృత పాఠ్యం, భాషా, సంబుద్ధి, నామ,కాకుస్వర విధానాలు విపులంగా చెప్పాడు. ఈ అధ్యాయం కాశీ ముద్రణంలో 'భాషా విధానం' అనే పేరుతో 18 అధ్యాయంగా ఉంది. సంస్కృతానికి అపభ్రంశరూపాలై ఆయా ప్రాంతాల్లో మాటాడబడే మాగధి, అవంతి, ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లిక, దాక్షిణాత్య అనే ఏడున్ను భాషలనీ శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, వనౌకసీ మొదలైనవి విభాషలని అక్కడ చెప్పబడింది. భాషలనబడిన ప్రాకృతాల్లో తత్సమ, తద్భవ, దేశ్యపదాలు మూడురకాలూ ఉంటాయి. విభాషల్లో తద్భవ దేశ్యాలు మాత్రమే ఉంటాయి. ఇది నాట్యశాస్త్రం నాటి మాట. అనంతర కాలంలో సంగీత రత్నాకరం నాట్యశాస్త్రాన్ని అనుసరించే ప్రబంధాధ్యాయంలో గురులఘు విధానం, మాత్రాగణాలకోసం రెండక్షరాల అత్యుక్తాచ్ఛందంలో వచ్చే 4రతిగణాలు, మూడక్షరాల మధ్యాచ్ఛందస్సులో వచ్చే 8 కామగణాలు, నాల్గక్షరాల ప్రతిష్ఠాచ్ఛందస్సులో వచ్చే 16 బాణగణాలువివరించింది. ఏలా ప్రబంధ భేదాల్లో గద్యైల, మాత్రైల, వర్ణైల అనే వాటిని చెప్పి కర్ణాట, లాట, గౌడ, ఆంధ్ర, ద్రావిడ భాషల్లో దేశైలను వివరించింది. చినతిరుమలాచార్యులు ఈ పద్యంలో సంస్కృత ప్రాకృత భాషలతోపాటు దేశభాషలైన కర్ణాట, ద్రావిడాంధ్ర భాషలు పదరచనకు తగినవే అంటున్నాడు. ఈ పద్యంలో కవి చెప్పిన యతి ప్రాసలు మాత్రం ఆయా భాషల సంప్రదాయాన్ని అనుసరించి అన్వయించుకోవాలి. సంస్కృతంలో పద విచ్ఛేదరూపమైన విశ్రాంతి యతి. ఇది పాదాంతంలో కూడా ఉండి తీరాలి. పాదాది ద్వితీయ వర్ణ రూపమైన ప్రాసము సంస్కృతంలో లేదు. అనుప్రాసం మాత్రం ఉంది. కన్నడంలో యతి సంస్కృతంలో వలె పదవిచ్ఛేద రూపమైన విశ్రాంతి; ప్రాసం మాత్రం తెనుగులోలాగ ద్వితీయాక్షర ప్రాసం ఉంటుంది. తమిళంలో 'మోనై' అనే పేరుతో యతి తెలుగులో లాగ పాదాద్యక్షర సాజాత్యరూపంగా ఉంటుంది, 'యదుగై' అనే పేరుతో ప్రాసం పాదద్వితీయాక్షర రూపంగానే ఉంటుంది. యతిలో అజ్ఝల్లులకు రెంటికీ మైత్రి కూర్చాలి, ప్రాసలో హల్మాత్రము ఆవృత్తి అయితే చాలు. తెనుగులో యతి తమిళంలో లాగే పాదాద్యక్షరమైత్రి. ప్రాస ద్వితీయాక్షరం. పద్యం 4

Verse-27

Tr. We proceed to give the language regulation for pada composition. Sages like Bharata, Dattila etc, have stated that padam may be composed either in Sānskṛt or in Prākṛt or in (any) regional language; yatis (caesuras ) and prāsa-s are to be observed like in a padya.

Com. Bharata has spoken of composition of Sānskṛt text and Prakrt text in the context of vācikabhinaya (verbal interpertation). In the 14th chapter of N S. (Bombay and Benaras editions) grammar and prosody are dealt with; vṛttas are given the 15th chapter; the 16th chapter has lakṣanas ,alaṃkāras,guṇas and dōṣa-s. All these chapters pertain to the Sanskṛt text. The 17th chapter deals with Prākṛt text, language regulation, naming of characters and modes of intonation This last chapter is the 18th in the Benaras edition with the caption ' bhāṣā vidhāna' (laying down the language regulation). Fallen forms of sanskṛt spoken in different regions under the names of Māgadhi, Avanti, Prācya, Śaurasēni, Ardha-māgadhi, Bāhlika and Dākṣiṇātya are the seven that were called bhaṣa-s. Śākāri, Ābhīri, Cāndāli, Śābari,Drāviḍi, Andhri, Vānaukasi etc. are called vibhāṣa-s (further fallen forms of language). In those that are called bhāsā-s will be found tatsama, tadbhava and dēśya words. Vibhāṣā-s have only tadbhavas and dēśyas. This was the position at the time of the composition of N S. In later times, S.R following the footsteps of N.S. explains in its prabandha adhyāya (4 chapter) gurus and laghus, the 4 ratigaṇas coming from the atyuktā chandas with two letters, the 8 kāmaganas coming from the madhyā chandas with three letters and the 16 bāṇaganas coming from the pratisthā chandas with four letters. It describes the different types of ēla-s like gaṇailā, mātrailā, varṇailā and deals with different kinds of dēśaila in different languages like Kannada, Lāta bhāṣa, Gauḍa, Āndhra and Drāvida Cina Tirumalācārya is upholding the compostion of a padam in a regional language like Telugu. The yati and prāsa spoken of by the poet in this verse have to be suitably understood in accordance with each language considered . In Sanskrt yati is in the form of padavicchēda; the word must end at the end of the line also Prāsa in the form of the second letter of the line repeating in all the four lines is not found in Sanskṛt ; only anuprāsa (alliteration) is used In Kannaḍa yati is like in Sanskrt only but prāsa is like in Telugu, with the second letter of each line recurring in all the four lines. In Tamil yati goes under the name of 'mōnai' and is in assonance with the first letter of the line Same is the case in Telugu. Prāsa in Tamil goes under the name of dugai' with the second letter of each line recurring in all the four lines In yati both the vowel and consonant of the syllable must agree with its counterpart In prāsa, it is enough if the consonant repeats itself. Alliteration or anuprāsa is same in all the languages. It is a verbal figure of speach (śabdālamkā-ra) and is optional, ordinarily.

పాదాల్లోను పాదాదిద్వితీయాక్షర హల్లు అదే రావాలి. అనుప్రాస అన్ని భాషల్లోను ఒకే విధమే. ఇది సాధారణంగా శబ్దాలంకారంగా ఐచ్ఛికంగా ఉంటుంది.

కాని ఈ చోట యతి ప్రాసల్ని పద్యపరంగానే కాకుండ పదపరంగా కూడా గ్రహించాలి. పదాల్లో అక్షర సాజాత్యరూపమైన యతులతోపాటు విరామ రూపయతులుకూడా ఉంటాయి; అంటేపాడటంలోవిరామం వస్తుందన్నమాట. ఉదాహరణకు దేశైలకు సంబంధించిన వస్త్యైలలో పాదపాదానికి నాల్గేసి యతులుండాలని నియమం. అలాగే వాద్య సంగీతంలోను లయ ప్రవృత్తి నియమం యతి అనబడుతున్నది. సమయతి, గోపుచ్ఛయతి, స్రోతోవహాయతి అనే ఈ మూడు యతులు సంగీత విద్యార్థులకు పరిచితాలే. వాద్య ప్రబంధాల్లోను 'యతి' అనేది ఉంది. అలాగే ప్రాస అన్నపుడు పద్యంలో పాదద్వితీయాక్షరం ఒకటే కావాలి అనే నియమంతోపాటు అనుప్రాసను కూడా గుర్తుంచుకోవాలి. పదరచనలో అనుప్రాసకు ప్రాధాన్యం ఉంది. ఏలా పద రచనలో పాదాది తొలిపదం అనుప్రాసతో కూడిన ఖండద్వయంగా ఉండాలని సంగీత రత్నాకర లక్షణం. 'అంఘ్రౌ ఖండద్వయం సానుప్రాస మేకేన ధాతునా' (సంగీ. రత్నా. 4 అధ్యా- 33శ్లో.)

1. పద్యంలో కాకపోయినా వ్యాఖ్యానంలో స్పృశింపబడిన సంగీతశాస్త్ర మాత్రాగణాలు వివరింపబడుతున్నై.

(a) రెండక్షరాలుండే అత్యుక్తా ఛందస్సు. తెలుగులో ఇవి ఉపగణాలు. కన్నడంలో వీటినే 'బ్రహ్మ'గణాలంటారు. తమిళంలో వీటిని, 'ఈరశై' అంటారు.

లఘువునకు గుర్తు : I గురువుకు గుర్తు : U

U U = గల
I U = లగ (వ)
U I = గగ
I I = లల

ప్రస్తారంలో తొలిరెండువరసల్ని విడిచిపెట్టడం, మిగిలిన వాటిలో లఘువు మొదట ఉన్న గణాలకు మరొక లఘువు ముందుంచడం తెనుగులో సంప్రదాయం. కన్నడంలో తొలిరెండు వరసలు విడిచేపద్ధతి లేదు. లఘ్వాదికి ముందు మరొక లఘువు చేర్చుట ఉన్నది. తమిళంలో 'నిరై'కి 2 హ్రస్వాలుగాని, హ్రస్వదీర్ఘాలుగాని రావచ్చుగనుక మూడంశలు వచ్చినా 'ఈరశై' అవుతుంది.

సంగీత శాస్త్రంలో UU - IU - UI - II అనే ఈ నాల్గుగణాలను రతిగణాలంటారు. లఘ్వాది గణాలకు ముందు మరొకలఘువుంచటం సంగీత శాస్త్రంలోను చెప్పబడింది. 'కింతు తత్ర లఘ్వాద్యాయే తేష్వాదా వధికోలఘుః' (సంగీ. రత్నా 4-64) 'తత్రాపి లఘుపూర్వేష్వాదా వధికోలఘుః కర్తవ్య ఇత్యర్థః' అని కల్లినాథ వ్యాఖ్య.

But yatı and prāsa mentioned here are to be understood not merely as applying to a stanza but to a musical composition like padam too. In padams yatı-is not merely in the form of assonance (aksara sājātya rūpa) but in the form of respite too; it means there will be respite in singing at certain points For example in vastvailā, a variety of dēśailā, it is enjoined that there should be four yatis in each line Similarly in instrumental music regulation of functioning of laya (laya pravrtti niyama) is called yatı Students of music are familier with sama, gopuccha and srōtōvaha yatis Among vādya prabandhas too there is one called yatı Similarly we have to remember anuprāsa (alliteration ) in the context of prāsa In the composition of padam anuprasa plays an important role. According to S R it is a rule that in the composition of ēlāpadam the first verbal unit should be in two parts embellished by alliteration.

'anghrau khanda dvayam sānuprāsam ēkēna dhātuña'- (S.R.-4-33)

1. Mātrā-gaṇas touched upon in the commentary, though not in the verse, are being explained

a) Gaṇas are metrical syllabic units A gana with two letters belongs to atyuktā chandas in Sānskrt In Telugu these units come under upa-ganas(subsidiary units) In Kannaḍa they are called Brahma ganas; in Tamil they belong to Īrasai A laghu is represented with I,guru with U. If prastāra is done for a two lettered unit in accordance with prosodical rules they will be as follows

| | | |
|---|---|---|
| U U - | ga - ga | These 4 permutations are called |
| I U - | la - ga | Rati ganas in music |
| U I - | ga - la | In Telugu the first two rows of |
| I I - | la - la | permutations are omitted in any prastāra |

Thus here only the last two are accepted Again prefixing a laghu to these units starting with a laghu is also the tradition Thus the units UI, III are called Sūrya ganas in Telugu In Kannada the first two rows of Prastāra are also accepted prefixing a laghu to those starting with a laghu is there Thus the 4 permutations UU,IIU, UI, III are accepted as Brahma ganas In Tamil a'nirai'may be in the form of two short letters or one short letter and a long letter, either by themselves or in conjunction with a consonant These ganas come under'īraśai'eventhough there may be 3 letters in some units In music also the custom of prefixing a laghu to the unit starting with a laghu and accepting it as a gana is followed 'kintu tatra lapūrvā yē tēshvādā vadhiko laghuḥ (S R 4-64) Kallinātha comments' tatrāpi laghupūrvēsu ādāvadhiko laghuh kartavyaḥ'

(b) మూడక్షరాల 'మధ్యా' ఛందస్సు.

U U U = మ
I U U = య

U I U = ర
I I U = స
U U I = త
I U I = జ
U I I = భ
I I I = న

ఈ 8 మూడక్షరాల గణాలు. సంగీత శాస్త్రంలో వీటిని కామగణాలని వ్యవహరిస్తారు. తొలిరెండువరుసలు విడిచి లఘ్వాది గణాలకు ముందు మరొక లఘువు చేర్చితే తెలుగులో ఇంద్రగణాలనబడే గణాలు ఏర్పడతాయి. (ర-నగ-త-నల-భ-నల). కన్నడంలో తొలిరెండు వరుసలు వదలకుండ లఘ్వాదులకు లఘువు ముందు చేర్చితే వచ్చే మ-నగ-ర-నగ-త-నల-భ-నల గణాలను విష్ణుగణాలంటారు. తమిళంలో ఇవి 'మూారశై' క్రిందవస్తాయి.

(c) నాల్గక్షరాల ప్రతిష్ఠా ఛందస్సు

U U U U
I U U U

U I U U
I I U U
U U I U
I U I U
U I I U
I I I U
U U U I
I U U I
U I U I
I I U I
U U I I
I U I I
U I I I
I I I I

**(b) The three lettered unit called madhyā chandas.**

| | | |
|---|---|---|
| U U U | - | ma-gaṇa ! |
| I U U | - | ya-gaṇa - |
| U I U | - | ra-gaṇa ! |
| I I U | - | sa-gaṇa ! |
| U U I | - | ta-gaṇa ! |
| I U I | - | ja-gana ! |
| U I I | - | bha-gana ! |
| I I I | - | na-gaṇa ! |

These 8 permutations are called Kamā-gaṇas in music, of course with prefix of a laghu where a unit starts with laghu. In Telugu the process gives (ra-na ga-ta-sa la-bha-na la) 6 units only, after rejecting the first two rows And these are called Indra gaṇas In Kannaḍa, without, rejecting the first two rows we get (ma-sa ga-ra-na ga-ta-sa la-bha-na la) eight units which are called Viṣṇu gaṇas In Tamil they come under 'mūrasai

c) The four-lettered unit called pratistha chandas

U U U U
I U U U

U I U U
I I U U
U U I U
I U I U
U I I U
I I I U
U U U I
I U U I
U I U I
I I U I
U U I I
I U I I
U I I I
I I I I

These 16 permutations are called Bāṇa gaṇas in music with prefix of a laghu where a unit starts with laghu In Telugu, rejecting the first two rows and prefixing a laghu where a unit starts with laghu we get 14 gaṇas which are called Chandra-ganas In Kannaḍa all the 16 units with a pre-fixture of laghu wherever necessary, gives what are called Rudra-gaṇas. In Tamil these come under 'nālasai'

ఈ 16 నాల్గక్షరాల గణాలు. వీటిని సంగీతశాస్త్రంలో బాణగణాలంటారు. లఘ్వాది గణాలకు ముందు లఘువు చేర్చటం ఇక్కడకూడా అన్వయిస్తుంది. తెలుగులో తొలి రెండువరసల్ని విడిచి లఘ్వాదులకు ముందు లఘువుంచితే చంద్రగణాలు ఏర్పడతాయి. కన్నడంలో తొలిరెండువరసలు కలుపుకొని లఘ్వాదులకు ముందు లఘువుంచితే ఈ ఏర్పడే గణాలను రుద్రగణాలంటారు. తమిళంలో ఇవి 'నాలశై' క్రిందకు వస్తాయి.

ఇట్లే మూడు ఛృందాల్లోను ఏర్పడే మాత్రాగణాల్లో సంగీతంలో

6 మాత్రల గణానికి 'ఛ' గణమని సంకేతం

5 మాత్రల గణానికి 'ప' గణమని పేరు.

4 మాత్రల గణానికి 'చ' గణమని పేరు.

3 మాత్రల గణానికి 'త' గణమని పేరు.

2 మాత్రల గణానికి 'ద' గణమని పేరు.

పంచ, చతుర్, త్రి, ద్వి - అనేవాని ఆది హల్లులతో ఈ పేర్లు పెట్టబడినై.

The mātra-ganas thus derived are given the following symbolic short names in music:

a gaṇa with 6 mātras-'cha'-gaṇa
a gaṇa with 5 mātras-'pa'-gaṇa
a gaṇa with 4 mātras-'ca'-gaṇa
a gaṇa with 3 mātras-'ta'- gaṇa
a gaṇa with 2 mātras-'da'-gaṇa

The first consonants of panca, catur, tri and dvi-indicating the number are taken as symbolic names.

శా॥ కర్ణాట ద్రవిళాంధ్ర లాటవిలసద్గౌడాది భాషాస్థితిం
గర్ణాపూర్ణ సుధా సమాన రుచులంగల్గించు దేశైళ దా
స్వర్ణం బాభరణత్వ మొందు కరణిన్ సంగీత శాస్త్రంబులన్
వర్ణింపం దగు నామజాతి యుతమై వర్తించుఁ బ్రత్యేకమై 28

తా॥ (భాషా నియమాన్నిబట్టి సంస్కృతంలోనో ప్రాకృతంలోనో కాకుండా) కర్ణాట, ద్రావిడ, ఆంధ్ర, లాట, గౌడాది దేశాల్లో మాటాడబడే దేశ భాషల్లో కూర్చిన 'దేశైల' అనే పదం బంగారం వేర్వేరు పేర్లతో నగలై ఆహ్లాదం కల్గించినట్లుగా కన్నడం, తమిళం, తెనుగు, లాటదేశభాష, గౌడ దేశభాషల్లో వేర్వేరు పేర్లతో సంగీత శాస్త్ర గ్రంథాలకెక్కినవై వినేవారి చెవులకు ఆహ్లాదం గొల్పుతుంది.

వ్యా॥ గ్రంథకర్త ఈ పద్యంలో 'దేశైల' అనేది కన్నడం, తమిళం, తెనుగు, లాట దేశభాష, గౌడ దేశభాష మొదలైన దేశ భాషల్లో ఉంటూ సంగీత శాస్త్రానికెక్కిందం టున్నాడు. పద్యంలో కవివాడిన ఆది శబ్దాన్నిబట్టి ఈ ఐదే కాక మరికొన్ని దేశభాషలు కూడా ఉద్దేశింపబడినట్లు అనుకోవాలి. ఈ విషయంలోకొంత అవ్యవస్థ ఉన్నట్లు కనబడు తుంది. సంగీత రత్నాకరం దేశైలనుగూర్చి చెప్తూ దాన్ని పై 5 భాషలకు మాత్రమే పరిమితం చేసి ఇలా చెప్పింది.

'కర్ణాట లాట గౌడాంధ్ర ద్రావిడానాంతు భాషయా
దేశాఖ్యైలా బుధైః పం: ప్రోక్తామంరాది తాలతః'

-(4 అధ్యా- 144 శ్లో)

మన గ్రంథకర్త ఈ శ్లోకాభిప్రాయాన్నే చెప్పినా ఆది శబ్దం ఒకటి చేర్చాడు. ఇతనికి తర్వాత కాలపు పొత్తపి వెంకటరమణకవి (క్రీ.శ. 1700 ప్రా. ) దాదాపు ఇదే శ్లోకం వ్రాసి 'ఏలాస్సప్త విధాజ్ఞేయా' అన్నాడు. నాట్య శాస్త్రంలో భాషలనబడ్డ ప్రాకృతాలు 7 చెప్పబడినై. వాటిలో 'దాక్షిణాత్య' ఒకటి ఉన్నా తమిళాంధ్రాలు అక్కడ విభాషల్లోనే చెప్పబడినై. పదకవులు, లాక్షణికులు ఈ పద్యంలోని ఐదింటికంటే ఎక్కువ దేశభాషల్నే గుర్తిస్తూ వచ్చారని చెప్పాలి. సంగీత రత్నాకరం నాటికంటె అనంతర కాలంలో వచ్చిన మార్పిది.

ముద్ద బంగారం ఇంట్లో ఎంత ఉన్నా ప్రయోజనం లేదు. నగలుగా చేయించి పెట్టుకొంటేనే ఆహ్లాదం. ఈ భావం క్రొత్తదేమీ కాదు. ఈ గ్రంథకర్తకు పూర్వుడైన విన్నకోట పెద్దన (క్రీ.శ. 1402-1407) తన కావ్యాలంకార చూడామణి 9ఉల్లాసంలో వ్యాకరణాన్ని చెప్పబోతూ 'తొడవుగాక పసిడిఁ దొడిగిన నొప్పనే, కనకమింటనెంత కలి గెనేని' (7 పద్యం) అన్నాడు. ఈ కవి కూడా 'స్వర్ణంబా.భరణత్వమొందు కరణిన్' అనడంలో అలాంటి భావమే ఉంది. దేశభాషను బంగారంలాంటి విలువైన వస్తువుగాను, ఆ భాషలోని రచనలనుపదాలను బంగారపు నగలవంటివిగాను భావించడం అనేది ఇక్కడ గమనించదగిన పరమార్థం.

Verse 28

Tr: Just as gold affords us pleasure in the form of ornaments of different types and names, 'dēśaila' composed in any of the indegenous languages spoken in the countries of Karṇāṭa, Drāviḍa, Āndhra, Lāta, Gauda, etc (languages other than Sānskṛt or Prākrt) gets mentioned in musical treatises under different types and names and affords us earfuls of nectar- like pleasure

Com: The author says that Śangīta Śāstra has recognised 'dēśaila' (ēlā in different regional languages) in Kannaḍa, Tamil, Telugu, Lāṭa-bhāṣa, Gauda bhāṣa under different types and names. The use of' ādi' in the verse meaning etcetera should be taken to have been intended to indicate other regional languages too. In this respect there seems to have been some unstable conditions S R. delimits 'dēśaila' to 5 languages saying thus·

'karnāṭa lāṭa gauḍāndhra drāvidānāntu bhāsayā,
dēśākhyailā budhaiḥ panca proktā manthāditālataḥ'

(4-114)

Our author, though he has mentioned the same languages, has added 'ādi' (etcetera). Pottapi Vēnkaṭaramanakavi (c.1700 A D) posterior to our author, mentions the same ślōka but with 'ēlassapta vidhā jñēyā', making the number of languages seven N S. mentions 7 prākṛts undenr the name bhāsa-s Although one among them is called dāksinātya (language of the South) Telugu and Tamil are mentioned only under vibhāṣā-s We have to take it that musical composers and rhetoricians have been recognising more than these 5 regional languages This is the change that has come after the composition of S.R.

An ingot of gold at home does not afford the owner any pleasure until it is made into ornaments This idea is not new Vinnakōṭa Peddana (A D 1402-1407) in the 9th Ullāsa of his work K.A.C (9-7) says how can one adorn himself with gold however much he may possess unless it is made into an ornament. Similar is the idea in our authors's simile 'like gold becoming an ornament'. The main idea to be taken note of here is that indegenous language came to be considered valuable like gold and compositions in such languages were considered similar to gold ornaments.

ఈ గ్రంథం 'సంకీర్తన లక్షణ'మే కాని ప్రబంధలక్షణమో పదలక్షణమో కాదు. భగవత్సంకీర్తనకు అంగంగా మాత్రమే పద రచన స్పృశింపబడుతున్నది. అందుచేత సంగీత శాస్త్రపరమైన కొదవలు తప్పవు. ఏలాప్రబంధం లేదా ఏలాపదంఅనే సంగీత రచన పురాతనమైంది. జగదేకమల్లుని సంగీత చూడామణి (క్రీ.శ. 1134-43)లో ఏలాప్రబంధాన్నిగూర్చి శతాధిక శ్లోకాలు, కర్ణాటైలను గురించి మాత్రం దాదాపు 100 శ్లోకాలు ఉన్నట్లు తెలుస్తుంది. హరిపాల మహీపాలుని (క్రీ. 1175) సంగీత సుధాకరంలో సంగ్రహంగాను, పార్శ్వదేవుని 'సంగీత సమయసారం'లో సంగ్రహంగాను ఏలా ప్రబంధం చెప్పబడింది. శార్ఙ్గ దేవుని సంగీత రత్నాకరం (క్రీ. శ. 1230)లో 356 ఏలా ప్రబంధ భేదాలుచెప్పబడినై. మన గ్రంథకర్త ఏలా సామాన్యాన్ని గురించిచెప్పకుండానే తనకు ప్రసక్తమైనంత వరకు దేశైలను గురించి పలుకుతున్నాడు. 'దేశైల' అనేది ఏలా విశేషం గనుక ఏలా సామాన్య స్వరూపం స్థూలంగానైనా తెలియాలి. అందుచేత ఇక్కడ కొంత, గ్రంథకర్త నిబంధనామ పదాన్ని గురించిపలికిన 34 పద్యం దగ్గర కొంత, వివరింపబడుతుంది.

గానం ధాతువులతోటి ప్రబంధాంగాలతోటి నిబద్ధమైతే నిబద్ధగానం అనిపించుకుంటుంది. ప్రబంధాంగాల సంఖ్యనుబట్టి జాతి నిర్ణయం. ఛందస్సు, తాలం, అంగములు, ధాతువులు, రాగము, రసము, భాష మొదలైన వాటి నియమం వల్ల ప్రబంధాలు నిర్యుక్తాలని అనిర్యుక్తాలని రెండు రకాలు. నియమాలున్నవి నిర్యుక్తాలు. లేనివి అనిర్యుక్తాలు. ఉదాహరణానికి రాగాలాపనకు ఈ నియమాలు ఏవీ ఉండవు కాబట్టి అది అనిర్యుక్తం. ప్రబంధాలు మళ్ళా (1)సూడ ప్రబంధాలు (2) ఆలి ప్రబంధాలు(3) విప్రకీర్ణ ప్రబంధాలు అని మూడు విధాలు. సూడ ప్రబంధాలు గీత విశేషాలు. వెనుక చెప్పిన సూళాది సప్త తాలాల్లో ఒక దానితో పాడేవి. ఇవి మార్గసూడలు. వీనిని సూడస్థాలు అని కూడా అంటారు. ఏలాది సూడప్రబంధాల నడుమ ఏర్పడే వానికే ఆలిప్రబంధాలని పేరు. ఈ రెండు రకాలకు భిన్నమైనవి విప్రకీర్ణాలు. సంగీత రత్నాకరంలో సూడ ప్రబంధాలు 8+ ఆలి ప్రబంధాలు 24+విప్రకీర్ణ ప్రబంధాలు 36- మొత్తం 68 చెప్పబడినై. ఇవికాక సాలగసూడ ప్రబంధాలు .7, రూపక ప్రబంధ భేదాలు ఉన్నవి.

ఏలా పదంలో వస్తువు ఉదాత్తం. త్యాగం, లోకానురాగమనే సౌభాగ్యం, శౌర్యం, ధైర్యం, ధార్మికత్వం మొదలైన గుణాలు ఇందులో వర్ణింపబడతాయి. సంగీత రత్నాకరాన్ని అనుసరించి ఏలకు పద సంఖ్యా నియమం, ప్రతిపదానికి పేరు, అధిదేవత, ప్రాణం అనేవి ఉన్నాయి. అలాగే గానక్రమం ఉంది. ఏలకు తొలి రెండు పాదాల్లో ఐదేసి పదాలు, మూడోపాదంలో రెండు పదాలు, నాల్గోపాదంలో మూడు, ఐదోపాదంలో ఒకటి మొత్తం 16పదాలు. మొదటి 3పాదాల్లోని తొలి పదాలు అనుప్రాసతో కూడిన ఖండద్వయంగా ఉండాలి. ఆ వెంటనే గనుక ప్రయోగం చేయాలి. తొలి రెండు పాదాల్లోని చివరి మూడు పదాలు పల్లవం. నాల్గో పాదంలో పదం వర్ణ్యనామాంకితంగా ఉండాలి. ఐదోపాదంలోని

The present work is conceived as 'Sankīrtana Laksana' and not as either 'Prabandha Laksaṇa' or 'Pada Laksana' Composition of a padam is touched upon here only as an adjunct of hymnody So some difficiencies regarding the science of music are inevitable Ēlā prabandha or ēlā padam is an ancient mode of composition S C of Jagadēkamalla (A D 1134-43) is said to contain more than a hundred ślōkas on 'ēlā prabandha' and 'karnātaila' is said to have been covered roughly in another 100 ślōkas Ēlā is described briefly in S S of Haripāla Mahīpāla (c 1175 A D) and S S S of Pārśvadēva S R of Śārṅgadēva (C 1230A D ) mentions 356 varieties of Ēlā Our present author is speaking of 'dēśaila' in so far as it concerns him-without saying anything on the general charecteristics of ēlā Since 'dēśaila' is just one type of 'ēlā' it is necessary for us to know the concept of ēlā at least in a general way Hence some explanation is offered to the reader here in this regard as also under the verse No 34 where 'nibaddha pada' is dealt with

Music framed in dhātus and prabandha aṅga-s is called nibaddha gāna The jāti of a prabandha is decided by the number of prabandha angas present in it Again prabandha-s are of two kinds, namely niryuktas and aniryuktas Those which are regulated in respect of items like chandas, tāla, aṅgas, dhātus, rāga, rasa, bhāsa etc are niryukta prabnandhas Those that are not regulated in respect of the above points are aniryukta-s. For example rāgālāpana has no regulation regarding any of the aforementioned points, hence it is aniryukta Prabandhas are classified into three groups (1) Sūda (2) āli and (3) viprakīrna Prabandhas Sūda prabandha-s are a particular group of prabandhas sung with one of the seven tālas mentioned as sūlādi tālas earlier These are 'śuddha sūda'-s These are called sūdastha'-s also Those that are located somewhere within the range of these sūda prabandhas like ēlā etc are called 'āli prabandhas' Viprakīrnas are those that are different from these two groups S R describes 8 sūda prabandhas, 24 āli prabandhas and 36 viprakīrna prabandhas- a total of 68. Besides,there are 7 sālaga sūda prabandhas

Ēlāpadam has an exalted theme Munificience (tyāga) popularity (sowbhāgya/lokānurāga), heroism(śaurya) bravery (dhairya) and righteousness (dhārmikatva ) etc are praised in this composition It has a fixed number of padams or units with a name, a life force (prāna) and a presiding deity for each It has its specified procedure of singing(gānakrama) Ēlā has 5 padas or syllabic units in each of the first and second lines, 2 in the third, 3 in the fourth and 1 in the fifth The total number of padams or syllabic units is 16 The first syallabic unit in the first three lines should be of two parts each, with alliterattion Gamaka has to follow the singing of this first syllabic unit The last three syllabic units or padas

పదం వాగ్గేయకారుని ముద్రతో ఉండాలి. ఏలను మంఠ, ద్వితీయ, కంకాల, ప్రతితాల మనే వాటిలో ఏదో ఒక తాళంతో పాడాలని నియమం. సమగ్రహం కాక అతీత అనాగత గ్రహాల్లో ఒకటి పాటించాలి. ఈ 16పదాలను రెండోసారి కూడా పాడి ధ్రువం అన బడే 4 పాదంలోని తొలిపదం వద్ద (13వ పదం) ముగించవలసిందని కల్లినాథుని బోధ. అభోగ మనబడే ధాతువుతో ఐదోపాదం పాడిన పిమ్మట ధ్రువమనే నాల్గోపాదం పాడి ముగించమని సింగభూపాలుని బోధ. పదాల్ని పెట్టెలుగా, పెట్టెల్లో పదాలపేర్లు, క్రింద ప్రాణం, పైన అధిదేవత, ఎడమప్రక్కన ధాతువు, కుడి ప్రక్కన మిగిలిన వివరాలతో ఏల ప్రాణాన్ని ఈ విధంగా చూపవచ్చు పటం చూడండి

వెనుక చూపినట్లుగా అయితే ఏలా ప్రబంధం 1) ఉద్గ్రాహం 2) ధ్రువం 3) అభోగం అనే మూడు ధాతువులతో త్రిధాతుకం ఔతుంది. దీనిని చతుర్ధాతుకంగా చూచే సోమే శ్వరాదులు 11పదాల వరకు ఉద్గ్రాహంతో పాడాలని 12వ పదం 'మేలాపకం' అనే వేరే ధాతువని అన్నారు. పెట్టెల క్రింద చూపబడిన దశ ప్రాణాలకూ లక్షణాలు చెప్పబ డినై. గాన క్రమంలో వీటిని పాటించాలి. తొలి రెండు చరణాల్లో పల్లవమనే చివరి పదత్రయంలో తొలి రెండింటిని విలంబితమానంలోను మూడోదాన్ని ద్రుతమానంలోను పాడాలి. అలాగే నాల్గోపాదంలోని మూడుపదాల్లో తొలి రెండింటిని మధ్యమానంలోను మూడోదాన్ని విలంబిత మానంలోను పాడాలి. ఇది ఏలా సామాన్యలక్షణం. ఈ ఏలాపదం గణైల, మాత్రైల, వర్ణైల, దేశైల అని నాల్గు రకాలు. అందులో గణైల మనకు పరిచి తంగా ఉండే మూడక్షరాలు గణాలతో ఏర్పడేదే. 5 భగణాలమీద ఒక నగణంతో కూర్చేది నాదావతి. 5 రగణాల మీద ఒక సగణంతో కూర్చేది హంసావతి. 5తగణాల మీద ఒక జగణంతో కూర్చేది నందావతి. 5మగణాల మీద ఒక యగణంతో కూర్చేది భద్రావతి. వీటి భగణ రగణాదులను వికృతులుగా చేయటం వల్ల 93 భేదాలు, ప్రకారాంతరవికృతులు 15, మొత్తం ఇది 112 విధాలు ఔతుంది.

మాత్రైల అనేది వెనుక చెప్పిన రతి, కామ, బాణ, మిశ్రగణాలతో క్రమంగా 4రకాలు. రతిగణాలతో 11-11-10 లఘువులుండేది రతి లేఖ, కామగణాలతో 22-22-20 లఘు వులుండేది కామలేఖ. బాణగణాలతో 33-33-30 లఘువులుండేది బాణలేఖ. మిశ్ర గణాలతో 44-44-40 లఘువులుండేది చంద్రలేఖ. (లఘు సంఖ్యలు ఒక్కొక్క పాదానికి చెప్పబడినై. మూడు సంఖ్యలు వరుసగా మూడు పాదాలకు అని గ్రహించాలి.) నందిమ తాన్ననుసరించి 5ఛగణాలు+1 తగణంతో ఇందుమతి; 5 పగణాలు+1చగణం జ్యోతిష్మతి; 1ఛగణం+3చగణాలు +1పగణం +1ఛగణం-నభస్వతి; 1దగణ+1పగణ+4చగణాలు+ 3పగ ణాలు+1ఛగణం+1తగణం-వసుమతి- ఇట్లివి 4రకాలు. అర్జునమతాన్ననుసరించి వెనుక చెప్పిన నాదావత్యాదులే స్వగణ భంగములచేత మాత్రైల లై 4రకాలౌతాయి. ధనంజయ మతాన్ననుసరించి పైరతి లేఖాదుల గణనియమం విడిచి మాత్రా సంఖ్య పాటిస్తే అది 4రకాలౌతుంది. వీటిలో విశేషాలు మరో 4రకాలు. ఇట్లిది మొత్తం 20రకాలు.

of the first two lines constitute the pallava The fourth line should have a syllabic unit or pada mentioning the name of the hero or leader The only pada or syllabic unit in the fifth line should contain the mudra(impress) of the composer (vāggēyakāra) It is enjoined that ēlā should be sung in one of the four tālas called mantha, dvitīya, kaṅkāla and pratitāla Singing should be started with visamagraha i e either atīta graha or anāgata graha but not sama graha Kallinātha's teaching is that having sung these 16 syllabic units for the second time nyāsa should be made at the first unit of the 4th line, called 'dhruva' Singabhūpāla's teaching is that having sung the 5th line called 'ābhōga', dhruva, the 4th line, is sung again and left off Showing the serially numbered syllabic units or padas in boxes, their prāna below and the presiding deity above, dhātu on the left side and other details on the right side the format of ēlā can be represented as in the format given.

As per the format shown ēlā prabandha becomes tridhātuka with (1)udgrāha (2) dhruva and (3) ābhōga Sōmēśwara and others who considered it caturdhātuka said udgrāha shall be the dhātu for the first 11 syllabic units and the 12th unit should be sung with 'mēlāpaka' - different dhātu. There are definitions for the ten prānas indicated below the boxes They have to be followed while singing In the Pallava of the first two lines, the first two units (3 and 4) should be sung in vilambitamāna and the last in drutamāna Similarly the first two units of the 4th line (dhruva) should be sung in madhyamāna and the third unit in vilambitamāna These are the regulations of ēlā in general

Ēlāpadam is of four kinds namely (1) ganaila (2) mātraila (3) varnaila and (4) dēśaila Among these ganaila takes its shape with the three-lettered gana-s familiar to us. Five 'bha' gaṇas plus one 'na'-gana per line makes for nādāvati,, five 'ra' ganas plus one 'sa' gana makes for hamsāvati, five 'ta'-ganas plus one 'ja'-gana makes for nandāvati, five 'ma' -ganas plus one 'ya'-gana makes for bhadrāvati. By modifiying these 'bha','ra','ta', and 'ma' ganas 93 varieties are obtained. Other types of modifications yield another 15 varieties. Thus ganaila has 4+93+15=112 varieties

Mātraila also is of four kinds with (1) rati gaṇas (2) kāma gaṇas (3) bāṇa gaṇas and (4) miśra gaṇas respectively. These gaṇas have already been explained Thus if three lines are composed respectively with 11,11 and 10 laghus consisting of ratiganas, it is rati-lēkha If three lines are composed respectively with 22,22 and 20 laghus with kāma-ganas it is kāmalēkha. If three lines are composed respectively with 33,33 and 30 laghus with bāṇa-ganas it is bānalēkha If three lines are composed respectively with 44,44 and 40 laghus with misra gaṇas it is candralēkha

# ĒLĀ PRABANDHA



According to Nandi school 5 'cha'-gaṇas plus a 'ta' -gana per line makes for Indumati; 5 'pa'-ganas plus a 'ca'-gana per line makes for Jyōtismati; one 'cha'-gana plus 3 'ca' ganas plus 'pa' gana plus 'cha' gaṇa makes for Nabhasvati, one 'da' gana plus 'pa' gana plus 4 'ca'-ganas plus 3 'pa' ganas plus 'cha' -gana plus 'ta' -gana makes for Vasumati Thus these are of 4 kinds.

According to Arjunamata the afore-said Nādāvati and others become 4 kinds by breaking up those gaṇas into mātras.

According to Dhananjaya school if the number of mātras are observed instead of ganas in rati-lēkha etc. spoken above they become four kinds. There are another 4 kinds here Thus Mātraila is of 20 kinds

If merely the regulation of the number of letters (varna-s) as against the regulation of gaṇas or mātras-is observed, it is called varnaila The bifurcated parts of the first syllabic unit in each of the first three lines may have 6,7,8, upto 29 letters. Thus it is of 24 (29-6=23+1) kinds with these lower and upper limits of 6-29 letters

Now, 'dēśaila' Named after the regional language in which the 'ēlā' is composed, it is of 5 kinds namely (1) Karnātaila (2)Lātaila (3) Gaudaila (4) Āndhraila and (5) Drāvidaila.

Karṇātaila· This is the most important of the Dēśaila varieties. S R. devotes 12 ślōkas to this variety and covers the rest in only 4 ślōkas Karnātaila has every one of its three lines embellished by alliteration at the beginning, at the middle and at the end It is sung in one of the tāla-s maṇtha/dvitīya/kaṅkāla/pratitā-la as is the general rule for ēla-s Mostly kāma ganas are used in this and we know they are only the three-lettered ganas familiar to us Nādāvati and others spoken of under gañaila take their form with these three-lettered ganas So these are treated as one kind of Karṇāṭaila Under this category the regulation of gañas is limited to the bifurcated parts of the first unit of the respective lines. Thereafter the composer has full freedom But the rāga and tāla are fixed The followingt are the deatils

a 1.Nādāvati 5 'bha' ganas +1'na' gana- takkārāga, mantha tāla

2.Hamsāvati 5 'ra' ganas +1 'sa' gana - Hindōlarāga, dvitīya tāla

3 Nandāvati 5 'ta' ganas +1 'ja' gana-Mālavakaisikarāga, pratitāla

4 Bhadravati: 5 'ma' ganas+ 1 'ya' gana- Kakubharāga Kankālatāla
(In terms of mātras these are respectively 23,29,29 and 35. These are exactly the mātrailas according to Arjunamata)

(b) సులేఖ: తొలి రెండుపాదాలకు 2 కామగణాలు+1 రతిగణం; పాదాద్యనుప్రాసం. మూడో పాదానికి 4కామగణాలు+1రతి గణం; అది మధ్యానుప్రాసం (ఇదే రతి లేఖ కూడా) మిగిలినది నాదావళికి వలె నియమం ( రాగతాళములు వగైరా).

(c) కామలేఖ: తొలి రెండు పాదాలకు 4 కామగణాల చొప్పున ఉంటాయి. ఆది మధ్యానుప్రాసం. మూడోపాదానికి 8 కామగణాలు. ఆదిమధ్యాంతానుప్రాసం. వెనుకటి హంసావళికి చెప్పిన రాగతాళాలు.

(d) స్వరలేఖ: ప్రతి పాదానికి 4 కామగణాల చొప్పున మూడు పాదాలకు నియమం. ఆది మధ్యల్లో అనుప్రాసం. నందావళికి వలె రాగతాళాలు.

(e) భద్రలేఖ: తొలి రెండు పాదాలకు 6కామగణాలు+1 బాణగణం చొప్పున. మూడో పాదంలో 8 కామగణాలు. మూడు పాదాల్లోను ఆది మధ్యాంతాల్లో అనుప్రాస. రాగతాళాలు భద్రావళికి వలె.

(f) ఛందస్స్వతి: మూడుపాదాల్లోను పాదానికి 5 కామగణాలు+ 1రతిగణం+1 కామగణం ఉండాలి. అప్పుడు సులేఖాది భేదాలే ఛందస్వంతము లనబడతాయి (ఒక కామగణం ఎక్కువ చెయ్యాలి). రెండు పాదాల చివరనో మూడు పాదాల చివరనో మూడో పాదం పరిమాణంగల పదం కూర్చితే అది 'శిఖాపదం' అనిపించుకుంటుది. (ఈ ప్రసక్తి మరల 40, 41 పద్యాల వద్ద వస్తుంది).

<u>లాటగౌడాంధ్ర ద్రావిడైలలు:</u> లాటైలలో పాదాంతానుప్రాసం ఉంటుంది. రసము లనేకాలు. గౌడైలలో గమకానుప్రాసలుండవు; ఒక్కటే రసం ఉంటుంది. ఆంధ్రైలలో పలు విధాలైన గమక విశేషాలు, రాగాంశాలు, రసాలు, భావాలు ఉంటాయి. ద్రావిడైలలో అనుప్రాస ఉండదు కాని రసాలు భావాలు బహూలాలు. ఈ చెప్పిన ఏలలకు మిగిలిన లక్షణాలు కర్ణాటైలతో సమానమే కాని ఛందస్వంతాల్లో మాత్రం నాల్గో పాదం ఒకటి ఎక్కువగా కూర్చబడుతుంది.

రెండు పాదాల్లో అనుప్రాస లేకుండా మూడో పాదంలో అనుప్రాస ఉండి, ధ్రువాభోగాలు అనుప్రాసతో కూడి, పాద పాదానికి ప్రత్యేకంగా పదచ్ఛేద రూపమైన నాల్గేసి యతులుండి వర్ణైలలో లాగ రాగ-రస-రీతి-వృత్తి దేవతాది నియమం ఉండక తక్కిన విషయాల్లో ఆ లక్షణం ఉండేది 'వస్త్వైల' అవుతుంది.

b Sulēkha The first two lines have 2 kāmaganas plus one ratigana each with alliteration at the beginning The third line has 4 kāmaganas plus 1 ratigana with alliteration in the beginning and the middle. This is called ratilēkha too Rāga and tāla are fixed as for nādāvati.

c Kāmalēkha The first two lines have 4 kāmaganas each with alliteration at the beginning and the middle The third line has 8 kāmaganas with alliteration at the beginning, the middle and the end Rāga and tāla are as for Hamsāvati

d Svaralēkha All the three lines have 4 kāma gaṇas each with alliteration at the beginning and the middle Rāga and tāla are as for Nandāvati

e.Bhadralēkha. The first two lines have 6 kāma ganas plus one bāna gana each. The third line has 8 kāmaganas.All the three lines have alliteration at the beginning, at the middle and at the end Rāga and tāla are as for Bhadrāvati

f Chandasvati If all the three lines have 5 kāmaganas plus 1 ratigaṇa, plus 1 kāma gana each, the Sulēkha becomes Chandasvati.Similarly an extra kāmagana in each line makes the other varieties also chandasvanta-s If a unit equal to the third line is added either at the end of the first two lines or three lines, then this extra unit is called 'sikhāpadam' (This concept occurs again under the verses 40 and 41)

Lāṭa, Gauḍa, Āndhra and Drāviḍa ēlās Lāṭaila has alliteration at the end of the line It has many rasa-s. Gauḍaila is devoid of gamaka and anuprāsa It has only one rasa. Āndhraila has various types of gamakas, rāgāṁśa-s, rasas and bhāvas Drāviḍaila does not have alliteration but possesses many rasas and bhāvas. Other regulations are common to these along with Karṇāṭaila But in chandasvantas a fourth line is composed in excess.

If there are four yatis in the form of padaccheda in each line and with alliteration in the third, fourth and fifth lines (the latter two covering dhruva and ābhōga) unregulated in respect of rāga, rasa, rīti, vṛtti, dēvata etc but following varṇaila in other respects, it is called 'vastvaila' (Vastvaila has regulation of rāga, rasa, rīti, etc.)

ఏలా ప్రబంధాలు బహు విధాలుగా ఉంటూ వచ్చినై. సంగీత రత్నాకరం నాటికి వీటిలో ముఖ్యమైన వాటిని సంగ్రహించడం ఏలా సామాన్య లక్షణం ఏర్పరచడం జరిగిందని తలప వచ్చు. సంగీత రత్నాకరానికి పూర్వపుదైన 'సంగీత సుధాకరం'లో ఏల బహువిధమంటూ గద్యైల అయిన నాదావతి మాత్రమే చెప్పబడింది. దీనికి తర్వాతది అనదగిన 'సంగీత సమయసారం'లో నాదావతి అన్న పేరును కూడా చెప్పకుండా గద్యైల చెప్పబడింది. ఈ రెండింటిని అనుసరించి ఏలలో పాదానికి ఆరు గణాలచొప్పున ఉంటాయి. ప్రాస సమన్వితమైన పాదత్రయం ఉద్గ్రాహధాతువు. ప్రతి పాదాంతంలో గమక ప్రయోగం. అటుపై పల్లవి. పల్లవికి గణమాత్రల నియమం లేదు. నాల్గోపాదంతో మేలాపక ధాతువు రావాలి. అటుపై నేతృ నామాంకితమై అనుప్రాసతో కూడిన ధ్రువ ఉంటుంది. అటుపై వాగ్గేయ కార ముద్రతో కూడిన చరణం అభోగధాతువుగా ఉంటుంది. అభోగాన్ని పాడిన పిమ్మట ధ్రువను పాడి న్యాసం చెయ్యాలి అనేది గానక్రమం- (సంగీత సుధాకరం గీత ప్రకరణం, సంగీత సమయసారం 4అధి- 130, 131,132, 133, 134 శ్లో). ఈ గ్రంథాలు ఏలను (1) చతుర్ధాతుకంగా దర్శించడం (2) పాదాంతంలో గమక ప్రయోగం చెప్పడం (3) పల్లవానికి గణ, వర్ణనియమంలేదనటం గమనింపదగిన అంశాలు. సంగీత రత్నాకరం నాటికి ఏలా ప్రబంధం త్రిధాతుకమనే భావం బలకొని వెనుకటి ఆరేసి గణాల రెండు పాదాలే (12 గణాలు) ఖండత్రయంలోని 5+5+2 పదాలుగా వ్యవస్థీకరించడం జరిగింది. ఈపద్ధతిని అనుసరించే కాబోలు అరుణ గిరినాథుడు తన తమిళ 'తిరుప్పుగళ్' కావ్యంలో 12గణాల (సీర్ కళ్) తర్వాత 'తొంగల్' (pendent) అనబడే తూగు పదమొకటి కల 'విరుత్తాలు' వ్రాశాడు. ఇతర 'విరుత్తాల'లోనూ ఇలాంటి తూగుపదాల్ని కూర్చాడు. బహుశః ఇదే శిఖాపదం అనబడి ఉండొచ్చు. ఇప్పటికి ఈ పరిచయం చాలు.

Ēlā-s have been of many kinds We may think these have been collected together and general norms for ēlā establisnea by tne time of S.R. S.S., a work antenor to S.R says ēlā is of many kinds and gives only 'gaṇaila' - nādāvati vaniety. S.S.S. posterior to S S but aterıror to S.R. gives only a gaṇaila without even mentioning the name of the variety. According to these two earlier works each line of an ēlā has 6 gaṇas. The first three lines have udgrāha. There is gamaka at the end of each line. Then comes the pallavi. Pallavi has no regulation of ganas or mātras The fourth line should have 'mēlapaka'. Then comes the 'dhruva' with the hero's name, followed by the last line with vaggēyakāra mudra and ābhōga dhātu. The procedure of singing is that after singing ābhōga, dhruva should be sung and nyāsa made (S.S gita prakarana; S.S.S -4 adh- 130,131,132,133,134,ślōkas) We may note that these works view ēlā as (1) caturdhātuka (2) with gamaka at the end of each line (3) without regulation of gaṇa or varṇa in pallava. By the time S.R. came the view that ēla is tridhātuka seems to have strengthened and the two lines with 6 gaṇas each (2 x6 =12) have been rearranged as khandatraya with 5,5 and 2 ganas respectively. Following this arrangement, perhaps, Arunagirinātha in his Tamil work 'Tiruppu-gazh' composed 'Viruttams' with a pendent called 'tōngal' after every 13 gaṇas or seers In other' viruttams 'also he has introduced this balancing unit Perhaps this must have come to be called a sikhapādam. This introduction is enough for the present.

వ.॥ అట్టి పదం బెన్ని విధంబులం బెలుపొందు ననిన

కం.॥ బంధుర వృత్త పదంబు, ని
బంధ పదము, చూర్ణపదము భరతాగమనం
బంధంబునఁ బద విజ్ఞా
నాంధులకును దాళ్లపాక యన్నయ దెలిపెన్॥ 29

తా॥ సంగీత శాస్త్ర గ్రంథాల్లో 'దేశైల' అనబడ్డ పదమనేది ఎన్ని విధాలుగా ఉంటుందంటే వృత్తపదం, నిబంధపదం, చూర్ణపదం అనే పేర్లతో నాట్యశాస్త్రాన్ననుసరించి ముప్విధంగా ఉంటుందని పద విజ్ఞానం ఏమీ తెలియనివాళ్లకోసం తాళ్లపాక అన్నయ చెప్పారు.

వ్యా॥ వెనుక 24పద్యం వద్ద సుబంతం, తిజంతం పదమని చెప్పబడ్డది. అంటే నామ విభక్తి కాని క్రియావిభక్తికాని ఏదైనాసరే విభక్తి అయితే చాలు, అదిచివర ఉండేది 'పదం.' విభక్తిచేరనిది 'శబ్దం,' ఉదారహణకు 'రామ' అనే ప్రాతిపదికకు సంస్కృత నామవిభక్తి చేరనప్పుడు 'రామశబ్దం' అంటారు. నామవిభక్తిచేరాక 'రామః' అని ఉన్నప్పుడు అది పదమన్పించుకుంటుంది. విభక్త్యంతం పదమని అభిప్రాయం.

ఈ పదాలు రెండు రకాలు. నిబద్ధం. చూర్ణం. నిబద్ధమంటే ఛందోబద్ధం. చూర్ణమనేది గురు లఘు నివేశ నియమం కాని, అక్షరసంఖ్యానియమం కాని లేకుండా వృత్తబద్ధం కాకుండా రసాభివ్యక్తి కోసమైన అక్షరాల కూర్పు ఉండేది.

ఛందోబద్ధమైన అక్షరాల కూర్పు, యతి, అక్షర సంఖ్యా నియమం ఉండేది 'నిబద్ధ పదం'. అనేకార్థాలను స్ఫురింపచేసే అక్షరాల కూర్పుతో అలంకరింపబడ్డ నాల్గు పాదాలతో కూడిన ఛందస్సు 'వృత్తం' అనిపించుకుంటుంది. ఈ ఛందస్సనేది అక్షరసంఖ్యాభేదం చేత 26 విధాలుగా ఛందశ్శాస్త్రంలో చెప్పబడింది. 26 అక్షరాలకు మించి ఉంటే అలాంటి కూర్పులను 'మాలావృత్తాలు' అంటారు. దండక వృత్తం సంస్కృతంలో రెండు నగణాల మీద రగణాలో, యగణాలో, తగణాలో కూర్చుతూ పాదానికి 27 అక్షరాలు మొదలు 999 అక్షరాలు దాకా ఉండేటట్లు కూర్చదగింది.

1. 'బంధుర వృత్త పదంబు' అనేచోట 'బంధురవృత్త'మని భ్రాంతిపడరాదు. (సంస్కృత ఛందంలోను దాన్ని అనుసరించే తెనుగుకన్నడాల్లోను 'బంధురమనే పేరుతో ఒక వృత్తం ఉంది. ఇది 25 ఛందానికి చెందింది. అంటే పాదానికి 25అక్షరాలు ఉంటాయన్నమాట. వరుసగా నాలుగు నగణాలమీద ఒకసగణం ఆపైని మూడు భగణాలు అటుపిమ్మట ఒక్కగురువు ఉంటాయి. (4న+1స+3భ+ 1గ)'; 16 అక్షరం మీద యతి ఉంటుంది) దట్టంగా నాల్గు పాదాల్తో వృత్తంగా కూర్చబడిన పదం అని మాత్రమే అర్థం చేసుకోవాలి.
2. పద రచనలో నిబద్ధం అన్నపుడు అక్షర సంఖ్యా నియమం, ఛందస్సు, యతి అనేవాటి తోపాటు తాలం, పాత అనేవి కూడా ఉంటాయి. తాళం వేస్తూ చప్పడయ్యేటట్లుగా ఒక చేత్తో మరో చేతి మీదకాని రెండు చేతుల్తో సమానంగా కాని దెబ్బ కొట్టడం లేదా చిటిక వేయుటం 'పాత'. 'పాత' అంటే దెబ్బ పడటం. ఇది సశబ్దక్రియ. నియతాక్షర సంఖ్య లేక, పాదనియమం లేక, యతి నియమం లేక కూర్చబడింది అనిబద్ధం. ఇది తాలనియమం లేకుండా వాద్యాల్లో ప్రయోగింపబడుతుంది!

Verse 29

Tr Tāllapāka Annaya made it known for the enlightenment of those who are blind to the knowledge (vijñāna) of padam that the divers kinds of such a padam, (as has been called 'dēśaila' in the treatises of music) as related to Nātya sāstra are the closely knit vṛttapadam, the nibandhapadam and the cūrnapadam

Com It has been stated under verse no.24 that a subanta or tiṅanta is a padam. That means a stem with a nominal case ending or verbal particle indicating person, number and tense as a suffix is a padam That which does not possesss this 'vibhakti' as suffix is a śabda; for instance, the base or stem 'rāma' without the suffix of its vibhaki is called 'rāma śabda' After a nominal case ending is added on and it becomes' Rāmaḥ', it is called a padam. The point is that which ends with a vibhakti is padam

Here musical compositions are called padams These padams are two kinds· nibaddha (framed) and cūrṇa (free lit. granules). That which is prosodically framed in or bound is nibaddha. That which has no regulation of guru and laghu, no regulation in respect of number of letters and not bound in a stanza but composed of letters expressive of a certain sentiment is cūrna

Composition of letters in a prosodical frame with yati and regulation of numbe of letters, makes for 'nibaddhapadam' If it is a stanza of four lines compos d of expressive letters it is called a vritta Prosody or chandas is described in chandas śāstra as 26 kinds based on the difference of number of letters in each line If the number of letters per line execeds 26, such compositions are called mālā vrtta-s Danḍaka vritta in sanskrt can have anywhere between 27-999 letters per line, starting with 2 'na'-ganas and 'ra'-gaṇas or 'ya'-ganas or 'ta'-ganas.

1.The verse starts with the words 'bandhura vṛtta padaṃbu' Here one should not mistakenly comprehend 'bandhura vṛtta' (In sanskṛt prosody and as followers of the same, in Telugu and Kannada, there is a vritta called 'bandhura' This pertains to the 25th chandam which means that it has 25 letters per line Four 'na' -gaṇas serially plus one 'sa'-gaṇa plus three 'bha'gaṇas serially plus one guru make for a line The yati is on the 16th letter ) We have to understand it only to mean a close-knit composition of a stanza in four lines.

2.In pada-compostion nibaddha type includes not merely the regulation in respect of the number of letters, prosody and yati but the tāla and pāta also Tāla is a familar concept, though not its intricacies The saśabda kriya in tāla-namely the noisy stroke with one hand on the other or with both the hands or by snapping of fingers-is pāta. Literally pāta means falling or fall A composition without fixation of the number of letters or yati is anibaddha This one without a tala is used only in vādyas

వ.॥ అందు వృత్తపదం బెట్టిదనిన

కం.॥ అందములై షడ్వింశ
చ్ఛందోగణయుక్త వృత్తజాతుల పదముల్
కుందనమునకుం బరిమళ
మందిన క్రియ వృత్తపదములలరుచు నుండున్ 30

తా॥ వృత్తపదం, నిబంధ పదం, చూర్ణపదం అనే మూడింటిలో వృత్తపదమనేది ఎలాంటిదో చెప్తాను. వృత్తపదాలనేవి ఇరవై యారుఛందాల్లోను అక్షర గణాలతో ఏర్పడే వృత్త పదాలుగాను మాత్రా గణాలతో ఏర్పడే జాతులుగాను బంగారానికితావి అబ్బినట్లుగా అందంగా వికాసం కలిగి ఉంటాయి. (పద్యాలైనవి పాటలు కావటం బంగారానికి తావి అబ్బటం లాంటిది).

వ్యా॥ పాటకు, పద్యానికి ఉండే లక్షణమే ఛందస్సు. 'చది ఆహ్లాదే' అనే ధాత్వర్థాన్ననుసరించి ఆహ్లాద పరిచేది ఛందస్సు అని వ్యుత్పత్తి చెప్పడం ఒక పద్ధతి. 'ఛదిసంవరణే' అనే ధాత్వర్థాన్ననుసరించి చెప్పదల్చుకొన్న విషయాన్ని (అక్షర సంఖ్యా నియమం ఉండే) పద్యపాదాలతో కప్పి ముస్తాబు చేసి నివేదించడం ఛందస్సు అని వ్యుత్పత్తి చెప్పడం రెండో పద్ధతి. ఎలా చెప్పినా ఆహ్లాదమే పరమార్థం. సంగీతపరమైన ఈ గ్రంథంలో కవి 'అందములై' 'అలరుచునుండన్' అనే పదాలతో సౌందర్యాన్ని పుష్ప వికాస సంతోషాలనూ స్మరింపజేస్తూ ఆహ్లాదాన్నే వ్యంజిస్తున్నారు.

సంస్కృతంలో ఋగ్వేద మంత్రాలు వృత్త బద్ధాలు, యజుర్వేదం గద్యాత్మకం. చాలా వరకు ఋగ్వేదమంత్రాలే గాన ప్రధానాలై సామవేదం అయింది. వేదపురుషునికి ఛందస్సుపాదాలని (ఛందః పాదేతు వేదస్య) చెప్పబడింది. అందుచేత ఛందస్సు వేదాంగాల్లో ఒకటి అయింది. సంస్కృతంలో వైదికచ్ఛందస్సు వేరుగా లౌకికచ్ఛందస్సు వేరుగా ఉంది. లౌకికచ్ఛందస్సులో పింగళాచార్యుని ఛందోగ్రంథం ప్రాచీనతమం. బాగా ప్రచారానికి వచ్చిన తర్వాతి గ్రంథం కేదారభట్టు వృత్తరత్నాకరం. తెనుగు కన్నడ భాషలు ఛందో విషయంలో ఈ గ్రంథాన్నే ఎక్కువగా అనుసరించాయని చెప్పవచ్చు.

తెనుగు ఛందస్సులో యతి ప్రాసలు విశేషమైన అంశం. తమిళంలో 'మోనై' 'యదుగై' అనే పేర్లతో క్రమంగా 'యతి' 'ప్రాస' ఉన్నాయి. యతి అక్షర సాజాత్య రూపం. ప్రాసము హల్ మాత్రావృత్తి. తమిళం నుండే వీటిని తెనుగు గ్రహించి ఉండాలి. కన్నడంలో అక్షర సాజాత్య రూపమైన యతి లేదు. సంస్కృతంలోలాగ పదవిచ్ఛేద రూపమైన యతి మాత్రమే ఉంది. హలావృత్తిగల ప్రాస ఉంది.

verse:30

Tr· (Among the vrtta padam, nibandha padam and cūrṇa padam mentioned earlier ) vrttapadam is being explained Vṛttapadams are those that blossom forth beautifully as though gold has acquired fragrance, from the twenty six kinds of metres in the form of vṛttapadams with akṣaragaṇas and jātis with mātrā-gaṇas.

Com. The regulatory principle of a song or a verse is its prosody called chandas. From the root 'cadi āhlādanē', one etymology of the word 'chandas' is 'that which exhilerates'. From the root 'chadi saṁvaranē', another etymology of the word is 'that which dresses up the thought like apparel' Exhileration is the essence in both the cases. Musically oriented as this work is the author suggests only exhileration by speaking of beauty, blossoming etc. through his words' 'andamulai alarucunundu' (Tel andamu=beauty; alaru=a flower, happiness, :(vb) blossoming)

In sanskrt the mantras of Ṛgvēda are vrttabaddha (framed in metrical form). Yajurvēda is in prose form; mostly the Ṛgvēda mantras form the corpus of Sāma vēda attuned for singing. Chandas is called the feet of Vēdapurusa (chandaḥ pādētu Vēdasya). So it has become one of the vēdāngas, a subsidiary subject for the study of Vēda. In Sānskṛt the chandas of the Vēdas and that of the secular literature are different. In laukika chandas, the work of Pingala is the most ancient. The next work that has become very popular is V.R. of Kēdārabhaṭṭa. One can say that Telugu and Kannada have followed this work to a large extent in regard to metrics

In Telugu prosody the yati and the prāsam are the distinguishing features. These are present in Tamil under the name of 'monai' and 'edugai' respectively. yati is caesura in the form of akṣarasājātya (assonance); prāsam is repetition of the consonant in the form of second letter in each line. These should have come to Telugu from Tamil only. Kannaḍa observes padavicchēda as yati like Sanskṛt and there is no akṣarasājātyarūpa yati; but it observes prāsam like Tamil and Telugu.

సంస్కృతచ్ఛందస్సులోను దాన్ని అనుసరించే తెనుగు కన్నడాది భాషల్లోను గురు లఘు స్వరూపం మొదటి అంశం. హ్రస్వాక్షరాలు లఘువులు. దీర్ఘాక్షరాలు, సంయుక్తాక్షరాలకు, బిందువునకు, విసర్గకు ముందున్న అక్షరాలు, పొల్లులతో కూడిన అక్షరాలు గురువులు. తెప్పపాటు కాలానికి మాత్ర అని సంజ్ఞ. (నిమేషోన్మేషాభ్యా మన్యతరేణ తులితః కాలః మాత్రా). ఒక మాత్ర కాలంలో ఉచ్చరింపబడే అక్షరం లఘువు. అంతకంటె ఎక్కువకాలంలో ఉచ్చరింపబడేది గురువు. గురువును రెండు మాత్రలకాలమని సామాన్యంగా చెప్పినా హ్రస్వము పొల్లుతో కూడినపుడు (వనితన్)ఒకటిన్నర మాత్రలు; దీర్ఘాక్షరమైనప్పుడు రెండు మాత్రలు, ప్లుతోచ్చారణంలో మూడు మాత్రలు అవుతుంది. తమిళంలో పద్ధతి వేరు. అక్కడ అంశం 'అశై', గణం 'శీర్' అనబడుతాయి. నేరశై,నిరైయుశై అనే పేర్లతో అక్కడ 'శీర్ల' కూర్పు. ఒక హ్రస్వం కాని దీర్ఘం కాని తానుగాగాని ఒక వ్యంజనం (పొల్లు అక్షరం)తో చేరిగాని 'నేరశై' అవుతుంది. ఒక్క హ్రస్వం గణంలో ఆద్యంశంగా మాత్రం రాదు. 'నిరైయుశై' అనేది రెండు హ్రస్వాలు కాని, లేదా ఒక హ్రస్వం ఒక దీర్ఘం కాని, తాముగాని పొల్లుతో కూడిగాని వస్తుంది. ఈ నేర్, నిరైలు రెండు మూడు నాలుగు అవుతూ 'శీర్లన బడే గణాలవుతాయి.

సంస్కృతంలో లాగే తెనుగు కన్నడాల్లోనూ గురు లఘువులతో కూడి త్రికాలనబడే మూడక్షరాల అక్షరగణాలు, మాత్రల లెక్కతో ఏర్పడే మాత్రాగణాలు ఉన్నాయి. అక్షర గణాలతో ఏర్పడే నాల్గు పాదాల ఛందస్సు కలవానికి 'వృత్తాలు' అని పేరు. మాత్రాగణాలతో ఏర్పడే వానికి 'జాతులు 'అని పేరు. (సంస్కృత ఛందస్సులోనూ, వర్ణచ్ఛందం, మాత్రాచ్ఛందం ఉన్నాయి. 'మాత్రావర్ణ విభేదేన ఛందస్తదిహ కథ్యతే' అని వృత్తరత్నాకరం) సంస్కృతంలో మాత్రా చ్ఛందస్సుతో ఏర్పడే ఆర్యాభేదాలు, గీతి భేదాలు 'జాతులు అనబడుతాయి.

మూడు అక్షరాల చేరిన దాన్ని త్రికమంటారు. ఇలాంటి త్రికగణాలు మూడో ఛందాన్ని ప్రస్తరించటం వల్ల ఏర్పడతాయి. ప్రస్తారం చెయ్యటానికి తొలుత అన్నీ గురువులువ్రాసి, తరువాతి వరుసల్లో తొలి గురువు క్రింద లఘువు వ్రాసి, పూర్వస్థానాన గురువుంచి మిగత భాగాన్ని అలాగే ఉంచుతూ పోవాలి. అన్నీ లఘువులు వచ్చే వరకు ఇలాగే వ్రాయాలి. మూడక్షరాల 'మధ్య'మనే ఛందస్సుకు ప్రస్తారం, గణాలు చూపబడుతున్నాయి.

U U U= మగణం U U I = తగణం
I U U = యగణం I U I = జగణం
U I U= రగణం U I I = భగణం
I I U= సగణం I I I = నగణం

వీటికే అక్షరగణాలని, విసర్గగణాలని పేరు.

In prosody, in Sanskrt as well as Telugu and Kannada that follow it, the concept of guru and laghu is the first item. Short letters are laghus Long letters, letters that come before conjunct consonants, bindu and visarga and those with a mere consonant succeeding them are gurus. The time taken for the batting of an eyelid is designated as mātra. (nimēṣōnmēsābhyām anyatarēna tulitah kālah:) A letter which can be uttered in a mātra is a laghu That which takes more than that is guru. Though a guru is generally equated with two mātras or laghus it can vary. a short letter followed by a mere consonant is only one and a half mātras; when it is a long letter it is two mātras, it will be three mātras when uttered as a pluta. The Tamil system is different. In Tamil a component is asai; a gaṇa or foot is' sīr'. A gaṇa is formed with 'nērasai' and 'niraiasai' A short letter or long letter either by themselves or with a consonant constitute a 'nērasai'; a short letter does not occur as the first item of a' sīr' Two short letters or one short and another long letter, either by themselves or with a consonant, constitute 'niraiasai' These 'asais'-'nēr' and 'nirai'-two or three or four join together and form the 'sīrs

Like in sanskrt there are both the three lettered aksaragaṇas called trikas as well as mātrāganas in Telugu and Kannaḍa. Those with four lines of akṣaragaṇas are called vrttas; those that are formed from mātrāganas are called jātis (sanskrt has varnachandas as well as mātrācchandas ,'matrā varna vibhēdēna chandas tad iha kathyatē-vrttaratnākara) In sanskṛt the different kinds of āryas and gītis that are composed in mātrāchandas are called 'jātis'.

A three lettered unit is called a trika Such trika-ganas are obtained from prastāra of the third chandas which means the chandas which has three constituents of guru-laghus. Prastāra process: write down all the constituents as gurus in the first row Write a laghu under the first guru and keep others as they are in the next row. Again write the laghu under the first guru, make the preceding laghu a guru and keep the other part as it is Continue the process until all the constituents occur as laghus. The third chandas is called 'madhyā' chandas Its prastāra and gaṇas are shown below :

Symbols: guru - U laghu: I

1. U U U - 'ma' gaṇa.
2 I U U - 'ya' gaṇa
3 U I U - 'ra' gaṇa
4. I I U - 'sa' gaṇa
5. U U I - 'ta' gana
6 I U I - 'ja' gana
7. U I I - 'bha' gaṇa
8. I I I - 'na' gaṇa

These are called 'aksaraganas' and 'nisargagaṇas'

ఇక ప్రథమచ్ఛందస్సులో పాదానికి ఒక అక్షరం. ఆ అక్షరం లఘువు కావచ్చు, గురువు కావచ్చు. కనుక 'ఉక్తము' అనబడే ప్రథమచ్ఛందంలో వృత్త సంఖ్య 2. 'అత్యుక్త'మనబడే రెండక్షరాల ద్వితీయచ్ఛందంలో గురుగురు, లఘుగురు, గురులఘు లఘు లఘు- అనే ప్రస్తార క్రమంతో నాల్గు వృత్తాలేర్పడతాయి. మూడక్షరాల 'మధ్యమ' ఛందంలో పైని 8భేదాలు వచ్చినవి కనుక వృత్త సంఖ్య ఎనిమిది. ఇలాగ క్రమంగా ఆయా ఛందాల్లో వృత్త సంఖ్య రెట్టింపుగా పెరుగుతూ పోతుంది. ఇరవై ఆరు ఛందాల్లో ఏర్పడే వృత్తాల మొత్తం సంఖ్య 13, 42, 17, 726.

ఇన్ని వృత్తాలు ఉన్నా ఛందః కర్తలు చెప్పినవి 500మించవు. వీనిలో గ్రంథాల్లో వాడబడేవి సుమారు 30. సంస్కృతచ్ఛందాల పేర్లివి:

1. ఉక్తము, 2. అత్యుక్తము 3. మధ్యము 4. ప్రతిష్ఠ 5. సుప్రతిష్ఠ 6. గాయత్రి 7. ఉష్ణిక్కు 8. అనుష్టుప్, 9. బృహతి 10. పంక్తి 11. త్రిష్టుప్ 12. జగతి 13. అతిజగతి 14. శక్వరి 15. అతిశక్వరి 16. అష్టి 17. అత్యష్టి 18. ధృతి 19. అతిధృతి 20. కృతి 21. ప్రకృతి 22. ఆకృతి 23. వికృతి 24. సంకృతి 25. అభికృతి 26. ఉత్కృతి.

నాట్య శ స్త్రంలోని వృత్తాధ్యాయం (15 అధ్యా.)లో 53 వృత్తాలు చూపబడినవి.

సంస్కృతంలో మాత్రాగణబద్ధాలైన కూర్పులు జాతులు. ఇవి కూడా పద్యాలే. నాల్గు పాదాలుంటాయి. సంస్కృతంలో ఆర్యాభేదాలు, గీతిభేదాలు ఈ కోవకు వస్తాయి. ఆర్య 4 మాత్రల గణాలతో కూర్చబడేది. భ-జ-స-నల-గగ అనే గణాలు నాల్గేసి మాత్రలు గలవి. తొలి సగంలో ఏడుగణాల మీద ఒక్క గురువుంటుంది. బేసి స్థానంలో జగణం ఉండరాదు. ఆఖోగణం జగణమో నలమో ఉండాలి: ఇక్కడ తొలి లఘువు తర్వాత యతి. ఉత్తరార్థంలో ఆఖోగణం ఒక్క లఘువు మాత్రం ఉంటుంది. మిగిలిన లక్షణం పూర్వార్థంలాగే. ఈ లక్షణం కలది 'పథ్యార్య'. పథ్యార్యలోని ఒకటవపాదం రెండో పాదంలోకి, మూడో పాదం నాల్గోపాదంలోకి చొచ్చినట్లయితే అప్పడది 'విపులార్య' అవుతుంది. పథ్యార్యలో 2, 4 పాదాల తొలిగణం జగణమైతే అప్పడది 'చపలార్య' అనిపించుకుంటుంది. తొలి సగంలో 'చపలార్యా'లక్షణం, మలి సగంలో 'పథ్యార్యా' లక్షణం ఉంటే 'ముఖచపలార్య' అవుతుంది. తొలి సగంలో 'పథ్యార్యా' లక్షణం మలి సగంలో 'చపలార్యా'లక్షణం ఉంటే 'జఘన చపలార్య' అవుతుంది. ఇట్లు ఆర్య 5 రకాలు. ఆర్యలోని మాత్రా సంఖ్యను ఇలా చూపవచ్చు.

4+4+4
4+4+1 - 3+4+2
4+4+4
4+4+1 - +4+2

అడ్డగీత ఉన్నచోట పదచ్ఛేద రూపమైన యతి ఉండాలి.

In the first chandas, a line will have only one letter. That letter may be a laghu or guru So in the first chandas called 'uktam' the number of vrttas possible is 2 In the second chandas called 'atyuktam' with two letters per line the number of possibilities according to prastāra are guru guru, laghu guru, guru laghu and laghu laghu-four. In the third chandas called 'madhyā' with three letters per line, we have seen above that the number of possibilities is eight and hence 8 vrttas. Thus the number of vṛittas goes on doubling in each of the next higher numbered chandas. The total number of vrttas possible in all the 26 kinds of chandas are 13,42,17,726 But writers on prosody have mentioned not more than 500. Among these only some 30 vrttas are in use
The names of sànskrt 'chandāmsi' are as follows;

| | | |
|---|---|---|
| 1. uktam | 10. pankti | 19 atidhrti |
| 2. atyuktam | 11. tristup | 20 krti |
| 3. madhyam | 12. jagati | 21. prakṛti |
| 4. pratisthā | 13. atijagati | 22 ākrti |
| 5. supratiṣṭhā | 14. śakvari | 23 vikṛti |
| 6. gāyatri | 15. atiśakvari | 24. sānskrti |
| 7. usṇik | 16. asti | 25 abhikrti |
| 8. anuṣṭup | 17 atyasti | 26. utkṛti |
| 9. bṛhati | 18. dhrti | |

The vrttādhyāya (15 ch) of N S. has shown 53 vṛttas

In Sanskrt, compositions in mātrāganas are called Jātis. These are also stanzas with four lines Varieties of ārya and gīti come under this head. Ārya is composed with ganas of 4 mātras each. The ganas bha-ja sa-nala-gaga have 4 mātras each The first half contains seven such ganas and a guru at the end Ja-gana should not be placed as an odd-numbered gana (1-3-5-7). The sixth gana should be either a 'ja-gana' or 'nala' Here in this sixth gana yati occurs after the first laghu In the second half the sixth gana is made up of only one laghu For the rest it is like the first half Such a composition is called pathyāryā. If the first and third lines of this verse continue into the second and foruth lines respectively without break then it is called vipulāryā. If the pathyāryā has a ja-gana as the first one of the second and fourth lines then it is called 'capalāryā' If the first half has capalāryā regulation and the second half pathyāryā, then it is called 'mukha-capalāryā'. If it is pathyāryā in the first half and capalāryā in the second half, it is called 'jaghana-capalāryā' Thus it is of five kinds. The units of mātra-gaṇas in ārya can be shown as below

| | |
|---|---|
| 4+4+4 | The place of yati (caesura) is |
| 4+4+1-3+4+2 | shown with a dash |
| 4+4+4 | |
| 4+4+1-+4+2 | |

| తెనుగు పేరు | కన్నడం పేరు | గణాలు | గణ సంఖ్య | తెనుగులో యతిస్థానం |
|---|---|---|---|---|
| 1. మహాక్కర | పిరియక్కరె | 1సూ+5ఇం.+1చం. | 7 | 4గణాలమీద |
| 2. మధ్యాక్కర | దొరయక్కరె | 2ఇం+1సూ+2ఇం.+1సూ. | 6 | 3గణాల మీద |
| 3. మధురాక్కర | నడువణక్కరె | 1సూ+3ఇం.+1చం. | 5 | 3గణాలమీద |
| 4. అంతరాక్కర | ఎడెయక్కరె | 1సూ+2ఇం.+1చం. | 4 | 3గణంచివరివర్ణం |
| 5. అల్పాక్కర | కిరియక్కరె | 2ఇం+1చం | 3 | 2గణాలమీద |

కన్నడంలో యతి ఉండదు. ప్రాసమాత్రం ఉంటుంది.

ఉత్సాహం: ప్రతిపాదంలోను సూర్యగణాలనబడే హగణ (UI) నగణం (III)లు ఏడింటి మీద 1గురువుండును. ఐదోగణం మొదటి అక్షరం యతి స్థానం. పాదపాదంలోను హగ ణనగణాల మిశ్రమం మాత్రం ఉండాలి. వీనికి క్రమ నియమం మాత్రం లేదు. (నాల్గు పాదాలు హగణంతో కూర్చితే సుగంధి వృత్తం ఔతుంది; అన్నీ నగణాలైతే విచికిలిత (తరళం) ఔతుంది.)

ద్విపద: మూడింద్రగణాల మీద ఒక్క సూర్యగణంతో తృతీయ గణాద్యక్షరం యతిగా రెండు పాదాలు ప్రాసనియమంతో కూర్చితే ద్విపద అవుతుంది. ద్విపద పాదాలు-ఒకదానిలోనికొకటి ప్రాకరాదు. విడిగా ఉండాలి. ప్రాసయతి-అనగా పాదద్వితీయాక్షరం గురుపూర్వమో లఘు పూర్వమో మరల అట్లే యతిస్థానం ప్రక్కన వచ్చుట- కూడదు. ఈ లక్షణానికికట్టుపడనివాడు పాల్కురికి సోమనాథుడు. తెనుగులో ద్విపదకు ప్రాచుర్యం ఎక్కువే. ద్విపదలో ప్రాస లేకుంటే మంజరీ ద్విపద ఔతుంది. దీనికి కొందరు ప్రాస యతిని అంగీకరిస్తారు.

త్రిపద: దీనికి తెనుగులో వాడుక లేదు. కన్నడభాషలో ప్రాచుర్యమెక్కువ.

చతుష్పద: దీనికే చౌపద, చౌపది అని కూడా పేరు. నాల్గు పాదాలుంటాయి. నాల్గు మాత్రల భ-స-నల-గగ అనే గణాలతో 16 మాత్రలతో కూర్చాలని భీమన అనే ఛందఃకర్త, మూడు చతుర్మాత్రాక గణాల మీద ఒక సూర్యగణమని అనంతుడు, చిత్రకవి పెద్దన అనే ఛందఃకర్తలు చెప్పారు. దీనికి అంతానుప్రాస ఉండాలి. 8మాత్రల మీద యతి. 2సూర్యగణాల మీద 9మాత్రలు కూర్చి (6+9=15) 8 మాత్రల మీద యతి వేస్తే వితాళ చతుష్పద అని అప్పకవి. 2 సూర్యగణాల మీద 4మాత్రల గణాలు రెండు ఆ మీద 1లఘువు కూర్చితే వితాళ చతుష్పద అని అనంతుడు, చిత్రకవి పెద్దన. ఇట్లైనా పాదానికి 15 మాత్రలే. అప్పకవి మతం గుర్వంతం; అనంతుడు చిత్ర కవి పెద్దన లఘ్వంత మతం కలవారు. వీరు అంతానుప్రాస పాటించారు. అప్పకవి పాటించలేదు.

S=Sūrya In=Indra C=candra

| Name in Telugu | Name in Kannada | Gaṇas in Telugu | Total | Place of Yati |
|---|---|---|---|---|
| 1.Mahākkara | Piriyakkare | 1S+5In+IC | 7 | after 4 gaṇas |
| 2.Madhyākkara | Doreyakkare | 2In+1S+2In+1S | 6 | after 3 gaṇas |
| 3.Madhurākkara | Naḍuvankkare | 1S+3In+1C | 5 | after 3 ganas |
| 4.Antarākkara | Edeyakkare | 1S+2In+1C | 4 | after 3 gaṇas |
| 5.Alpākkara | Kiriyakkare | 2In+1C | 3 | after 2 ganas |

In Kannaḍa there is no yati as in Telugu; but prāsam is common in both the languages

Utsāham: Each line consists of seven sūrya-ganas (ha-gaṇa-VI, na-gana-III) plus one guru. The first letter of the 5th gaṇa is the place for yati All the four lines must have an admixture of hagaṇas and nagaṇas; but there is no fixed order for them (If all the four lines are composed with ha-ganas only then it becomes sugandhi vṛtta; if composed with na-gaṇas only it becomes Vicikilita or Tarala)

Dvipada: Three Indraganas followed by a sūryagaṇa make for a line The first letter of the third gana is the place for yati. Two such lines with prāsam make a dvipada The lines should be separate and one line should not run into the next Prāsa yati-the second letter in the line repeating next to the yati place-is prohibited Pālakuriki Sōmanātha is an exception in this respect. Dvipada has been popular in Telugu If prāsam is not observed in dvipada it becomes manjarī dvipada Some scholars approve of prāsa yati in this variety

Tripada: This is not generally used in Telugu, but popular in Kannada

Catuspada This is also called caupada/caupadi. It has four lines Bhīmana, a prosodist, says that it should be composed with 16 mātras per line making use of caturmātrā ganas like bha-sa-nala-gaga (UII-IIU-IIII-UU) Other prosodists like Ananta and Citrakavi Peddana say that it should be composed with 3 caturmātrāga-nas followed by one sūryagana It must be embellished with antyānuprāsa (alliteration at the end of the line) Yati is after 8 mātras Composing 2 sūrya gaṇas followed by 9 mātras and with yati after 8 mātras makes it vitāla Catuspada, says Appakavi Ananta and Citrakavi Peddana put it differently saying that composing

పాదానికి 5మాత్రల గణాలు మూడింటి మీద ఒక్క సూర్యగణం కూర్చి (5+5+5+3= 18) 8 మాత్రలమీద యతి, అద్యంత ప్రాసలు కూర్చితే 'కర్ణాట చతుష్పద' అవుతుంది. తెనుగులో నగ- సల-త-ర అనేవి 5 మాత్రల గణాలు. మూడింద్రగణాలమీద 1 సూర్యగణం వస్తే అది ద్విపద అని వెనుక చెప్పబడింది. అప్పుడిది ద్విపద అవుతుంది కాని, యతిస్థానంలో మాత్రం కొంచెం మార్పు వస్తుంది. వెల్లటూరి లింగన మంత్రి తన 'సరసాంధ్రవృత్తరత్నాకరం (అముద్రితం)లో దీన్నే స్మర లఘువులు 5 ఉండే మూడు గణాల మీద ఒక సూర్యగణం (5x3 =15+3=18) అంటూ పదలక్షణంగా చెప్పాడు. మూడోగణం తొలి అక్షరం యతి, అద్యంత ప్రాసలుండాలి.

<u>షట్పది:</u> తెనుగులో దీనికి ప్రాచుర్యం లేదు. కన్నడంలో ప్రాచుర్యమెక్కువ.

<u>తరువోజ:</u> దీనికి నాల్గు పాదాలుంటాయి. ద్విపదచ్ఛందమైన 3ఇం+1సూ. అనేదాన్ని రెండుసార్లు కూర్చితే తరువోజ ఒక పాదం ఔతుంది. 3-5-7 గణాల తొలి అక్షరంలో మూడు చోట్ల యతి ఉండాలి. ప్రాస ఉండాలి.

<u>గీతులు:</u> తెనుగు ఉపజాతుల్లో ఆటవెలది తేటగీతులున్నవి. గీతమనేది వీనికి సామాన్యమైన పేరు. దేశిగీతాల్లో ఈ రెండూ సమగీతులు. వీటికి నాలుగు పాదాలుంటాయి. ప్రాసలేదు. ప్రాసయతి చెల్లుతుంది. ప్రతిపాదంలోను 1సూ +2 ఇం+2సూ ఉండి నాల్గో గణం ఆద్యక్షరం యతి కూర్చితే అది తేటగీతి అవుతుంది. బేసిపాదాల్లో 3 సూ + 2ఇం ప్రకారమున్ను, సరిపాదాల్లో 5సూ. గణాలున్ను ఉంటూ నాల్గోగణం ఆద్యక్షరంలో యతికూర్చితే అది ఆటవెలది అనిపించుకుంటుంది. సీసపద్యం వ్రాస్తే ఈ రెండింటిలో ఒకదాన్ని చేర్చి చెప్పాలి; అప్పుడీ గీతి సీసభాగంగానే పరిగణింపబడుతుంది. ఆటవెలది తేటగీతుల్ని విడిగా స్వతంత్రంగా వ్రాయవచ్చుననేది తెలిసిన సంగతే.

ఎత్తుగీతి, మేలనగీతి(కమలనగీతి), పవడగీతి అనేవి విషమగీతులు. ప్రతిపాదానికి 1ఇం+ 2సూ. గణాలు ఉంటూ, మూడోగణం ఆద్యక్షరం యతిస్థానంగా ఉంటూ, నాల్గుపాదాలుండేది ఎత్తుగీతి. ప్రతిపాదంలోను ఏడూ సూర్యగణాలుంటూ ఐదోగణం మొదటి అక్షరం యతిస్థానంగా ఉంటూ నాల్గుపాదాలు నడిచేది మేలనగీతి. దీనిని అప్పకవి కమలనగీతి అని వ్యవహరించాడు. ఆటవెలదియే నాల్గుపాదాల్లోప్రాసతో పవడగీతి అనిపించుకుంటుంది.

2 . ūryaganas followed by 2 caturmātrāganas plus one laghu gives vitāla catuaspada This also gives only 15 matras per line Appakavi prefers a guru at the end of the line Ananta and Citrakavi Peddana prefer a laghu at the end of each line. While these latter writers observed antyānuprāsa, Appakavi had not The 3 gaṇas of 5 mātras each followed by one sūryagana (5x3+3=18) with yati after 8 mātras and ādi and antaprāsa make it Karnāta catuspada In Telugu, gaṇas with 5 matras each are naga-sala-ta-ra (IIIIU-IIUI-UUI-UIU) which come under Indra ganas It has been said earlier that 3 Indragaṇas followed by one sūryagana make for dvipada Thus karñata catuspada can not be different from divpada except regarding the place of yati. Vellatūri Lingana in his S A.V.R (unpublished) gave this as padalakṣana saying three kāmaganas of 5 laghus each followed by one sūryagana (5 x 3 + 3 18) with ādi and antaprāsa and yati on the first letter of the third gana (11th laghu ) make it a padam

Satpadi: This is very popular in Kannada but not used in Telugu.

Taruvōja: This has four lines. The dvipada chandas of 3 Indraganas followed by one sūryagana if done consecutively twice becomes one line of Taruvōja. Yati is observed on the first letter of 3rd, 5th and 7th ganas. Prāsa is observed.

Gītam: The Telugu upajātis are āṭaveladi and tētagīti.The common name for both is gītam . Among the indegenous gītams these two are samagītams These have four lines but without prāsa. Prāsayati is allowed One sūryagana followed by two Indragaṇas again followed by two sūryaganas in each line, with yati on the first letter of the fourth gaṇa is called 'tētagīti'. It is āṭaveladi if the first and third lines have three sūryagaṇas followed by two Indraganas and the second and fourth lines have sūrya gaṇas for all the five, with of clourse, yati on the first letter of the 4th gana in all the four lines Either of these two has necssarily to be attached to a sīsapadyam when the latter is composed, in which case the attached gītam will be treated as a part of that It is obvious that ātaveladi and tēṭagīti can be written and used independently and separately

Ettugīti, mēlanagīti (Kamalanagīti) and pavaḍa gīti are visama gītams in Telugu. One Indragaṇa followed by two sūryagaṇas, with yati on the first letter of the third gana makes for a line of ettugīti and it has four such lines Mēlanagīti has four lines, with each line having seven sūryagaṇas and yati on the first letter of the fifth gana. Appakavi has called it kamalanagīti. Āṭaveladi with prāsa in all the four lines is called pavaḍagīti.

ఆ॥వె॥ వృత్తజాతి యెల్ల విషమంబు సమమును
నర్ధసమమునాఁగ నతిశయిల్లు
నందులోన విషమ మనునది నాలుగు
పాదములను వేఱె భంగిఁ జెల్లు 31

కం॥ నాలుగు పాదంబులు నొక
చాలున వర్తించునదియు సమవృత్తం బా
లీలన్ సమపదమును దా
ళాలంకృత సామ్యపాదమై చెన్నొందున్ 32

తే॥గీ॥ విషమ పాదంబులొక రీతి వెలయుచుండ
సమ చరణములు వేఱొక్క చందమైన
నర్ధసమ వృత్తమనఁ జెల్లు; నట్టి పదము
అర్ధసమపద మని యన్నయార్యుఁడనియె. 33

తా॥ వృత్తజాతి అంతాకూడా (1) సమవృత్తాలు (2) విషమవృత్తాలు (3) అర్ధ సమ వృత్తాలు అని మూడు తెగలుగా ఉంటాయి. అందులో విషమ వృత్తం అనేది నాలుగు పాదాల్లో ఒక్కొక్క పాదమూ ఒక్కొక్క విధంగా ఉంటుంది. (31)

నాలుగు పాదాలూ ఒకే విధంగా నడిచేది సమవృత్తం. సమపదమనేది కూడా తాళంతో కూడి నాల్గుపాదాలూ ఒకే విధంగా నడుస్తుంది. (32)

బేసి సంఖ్యతో చెప్పదగిన ఒకటోపాదం మూడోపాదం అనేవి ఒక విధంగా ఉంటుండగా సరిసంఖ్యతో చెప్పదగిన రెండోపాదం నాల్గో పాదం అనేవి వేఱొక విధంగా ఉన్నట్లైతే అప్పడది అర్ధసమవృత్తమనిపించుకుంటుంది. ఆలాగ ఉన్నపదం కూడా అర్ధసమపదమని అన్నయార్యుడు చెప్పాడు. (33)

వ్యా॥ పద్యం పదం కావటమనేది బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంటుందని వెనుకటి పద్యంలో చెప్పిన గ్రంథకర్త ఈ మూడు పద్యాల్లో పద్యాల స్వరూప భేదాన్నాశ్రయించిన తెగలను, చెప్పి ఆ లక్షణాలనే పదాలకూ అన్వయించి చెప్తున్నాడు.

సమానంగా ఉండేది సమం, సమంకానిది విషమం (వి+సమ - విషమ) అర్ధం, అంటే సగపాలు, సమానంగా ఉంటేది అర్ధసమం.

నాల్గుపాదాల కూర్పు ఉండటమే వృత్తానికి ముఖ్యలక్షణం. కనుక ఈ సమత్వం, విషమత్వం, అర్ధసమత్వం అనేవి నాల్గుపాదాల పరంగా అన్వయించుకోవాలి. అందుచేతనే నాలుగు పాదాలూ నాలుగు రకాలుగా (ఒక్కోపాదం ఒక్కోరకంగా) ఉండటం విషమ వృత్తలక్షణంగా చెప్పబడింది.

Verse 31-33

Tr.The entire vṛttajāti comes under the catagories of (1) sama vṛttas (2) viṣama vṛttas and (3) ardhasama vṛttas. Among these the viṣama variety has each of its four lines differently. (31)

That is sama vṛtta where all the four lines run in uniformly identical way. Similar is samapada whose four lines are uniformly identical but embellished with tāla (32)

While the odd numbered (1,3) lines are composed in one way as the even numbered (2,4) lines are composed differently then it is called ardhasama vṛtta. Annayārya has stated that a similar padam is called ardhasama padam (33).

Com: The author who extolled in the previous verse padya (stanza) becoming a padam (song) with the hyperbole of gold getting fragrance states the three categories of vṛttas and applies the same classification to padams also in these three verses.

That which is even or uniform is sama. That which is not even or uniform is viṣama (vi+sama). That which is half even is ardhasama.

Since the main characteristic of vṛtta is its being in four lines, this evenness,unevenness or half-evenness has to be understood in terms of the four lines. It is because of this that each of the four lines being different in structure or composition is described as a mark of viṣama vṛtta.

ఇక్కడ వృత్తాలకు చెప్పిన ఈ మాటలు నాలుగు పాదాలుగా కూర్చబడే జాతులకూ ఉపజాతులకు కూడా అనువర్తిస్తాయి. 'వృత్త జాతియెల్ల' అనే పదబంధం ఏక వచనాంతమై వృత్తసమూహాన్ని మాత్రమే చెప్తున్నా అందులో ఉన్న 'జాతి' పదం పద్యాల్లోని జాతులకూ ఉపజాతులకు జ్ఞాపకంగా వాడబడింది.

నాల్గు పాదాలూ సమంగా లేని వృత్తాలకు 'గౌణ వృత్తా' లనిపేరు. అప్పుడు అర్ధసమవృత్తాలు, విషమవృత్తాలూ గౌణ వృత్తాల కోవకే వస్తాయి. ఛందస్సంఖ్య పాదంలో ఉండే అక్షరాల సంఖ్యకు గుర్తు. ఇరవైయో ఛందం అన్నప్పుడు పాదానికి ఇరవై చొప్పున అక్షరాలుంటాయని అర్థం. అక్షరాలైతే ఇరవై ఉండవచ్చునుగాని గురులఘువుల క్రమం, గణాలు ఒక్కోపాదంలో మారవచ్చు. అలాగు గనుక తొలిపాదంలో ఉండే అక్షర సంఖ్యకు కట్టుబడి ఉంటూ మిగత పాదాల్లో గురులఘు క్రమమో గణాలో మారితే అప్పుడా విషమత్వం తొలిపాదానికి చెందిన ఛందఃస్థానానికే సంబంధించి ఉంటుంది. అప్పుడది 'స్వస్థాన విషమ వృత్తం' అనిపించుకుంటుంది. గురులఘువుల లేదా గణాల క్రమంతో పాటు అక్షరసంఖ్యకూడా మారితే 'పరస్థాన విషమ వృత్తం' అనిపించుకుంటుంది. నాల్గుపాదాల్లోను అక్షర సంఖ్య, గురులఘు క్రమం లేదా గణక్రమం ఏపాదానికాపాదంలో మారిపోతే అప్పుడది 'సర్వపరస్థాన విషమవృత్తం'. ఇదేవిధంగా అక్షర సంఖ్యమారకుండా ఒకసగం - అంటే రెండు పాదాల్లో ఉండే గురులఘుక్రమంగాని గణక్రమం గాని రెండోసగంలో మారితే అప్పుడది 'స్వస్థాన అర్ధ సమవృత్తం'. ఒకసగానికీ రెండోసగానికి అక్షర సంఖ్య కూడా మారితే అప్పుడది 'పరస్థాన అర్ధసమ వృత్తం' అనిపించుకుంటుంది.

ఉదాహరణకు 11వ ఛందానికి చెందిన (1) ఇంద్రవజ్ర (2) ఉపేంద్రవజ్ర (3) *కాంతి (4) వాతోర్మి అనే నాల్గు భిన్న వృత్తపాదాలతో 'వారాంగి' అనే స్వస్థాన విషమ వృత్తం ఏర్పడుతున్నది : దాని వివరాలివి.

<u>వారాంగి :-</u>

1 పాదం : ఇంద్ర వజ్ర - త-త-జ-గా గణాలు : 11 అక్షరాలు

2 పాదం : ఉపేంద్ర వజ్ర - జ-త-జ-గా గణాలు : 11 అక్షరాలు

3 పాదం : కాంతి - త-జ-జ-గా గణాలు : 11 అక్షరాలు

4 పాదం : వాతోర్మి - మ-భ-త-వ గణాలు : 11 అక్షరాలు

ఇలాగే 'అరిగ జాస్త్రం', 'నదీప్రఘోషం' అనేవి స్వస్థాన విషమవృత్తాలు.

These remarks apply to jātis and upajātis also which are composed in four line stanzas. Although the phrase vrttajāti is in singular and denotes only vṛattas, the component jāti is used in a mnemonic sense as a reminder of jāti and upajāti verses. Vrttas whose four lines are dissimiliar are called 'gauṇa vṛttas' So ardhasama vrttas and viṣama vṛttas come under gauṇa vrttas.The serial number of the chandas indicates the number of letters in a line. Thus 20th chandas means that a line of this chandas has 20 letters While the number of letters may be 20 per line there is room for the order of gurus and laghus or gaṇas changing in each line. So if the number of letters in the first line is maintained in the other lines but with a different order of gurus and laghus then the unevenness pertains to the chandas of the first line only. Then it is called svasthāna viṣama vrttam. If the number of letters also changes along with the order of gurus and laghus or gaṇas it is then called parasthāna visama vṛttam. If each one of the four lines have different number of letters, order of gurus, laghus or gaṇas then it becomes sarva parasthāna viṣama vṛttam.

In the same way, if the number of letters remains constant in all the four lines but two of the lines are having different order of gurus and laghus or gaṇas from the remaining two then it becomes svasthāna ardhasama vrttam If one half differs from the other half even in the number of letters then it is called parasthāna ardhasama vrttam.

For example a svasthāna visama vrtta called 'Vārāngi' is formed from four differnt types of verses called (1) Indravajra (2) upēndra vajra (3) kānti and (4) vātōrmi. All the four belong to the 11th chandas The following are the details of its formations.

Vārāngi: 1. Line -ta-ta-ja-gaa - (11 letters) -Indravajra
2 Line-ja-ta-ja-gaa (11 letters)-upēndravajra
3. Line-ta-ja-ja-gaa (11 letters)-kānti
4. Line-ma-bha-ta-va (11 letters)-vātōrmi.

'Angajāstra and 'Nadīpraghōṣa' are two other 'svasthāna visama vṛttas

10వ ఛందములోని భ-మ-స-గ (10 అక్షరాలు) అనే రుగ్మవతి తొలిపాదంగాను 11వ ఛందంలోని భ-భ-భ-గ-గ (11 అక్షరాలు) అనే దోధక పాదాలు 2,3,4 పాదాలు గాను చేరి 'శ్రీ రమణము' అనే పరస్థాన విషమవృత్తం ఏర్పడుతుంది.

వీణారచనము, ఉద్ధత, మధుర, మణిదీపిక అనేవి సర్వపరస్థాన విషమ వృత్తాలుగా తెనుగులో చెప్పబడినవి.

ఇంక ఒక్క ఛందంలో పుట్టిన ఒక్కవృత్తమే సమమైన గురులఘుక్రమ విన్యాసంతో నాల్గుపాదాల్లోను సమానంగా ఉండేది సమవృత్తం. దీనికి ఉదాహరణలు అనవసరం. మనం చదివే వృత్తాలు తరచుగా సమవృత్తాలే. గ్రంథకర్త ఈ సమవృత్త లక్షణాన్నే పదా నికీ అన్వయించి 'సమపదం' అంటున్నాడు. అయితే ఇక్కడ గమనించవలసిన అంశాలు ఒకటిరెండు ఉన్నాయి. వృత్తం అన్నప్పుడు పద్యమోశ్లోకమో అనే భావం మరచి పోయి నాల్గుపాదాల కూర్పు అని గుర్తుంచుకోవాలి. ఎందుకంటే పదాలు వృత్తబంధాలుగా ఉంటాయి, నాల్గుపాదాల కూర్పు ఉంటుంది. తర్వాతి అంశం ఈ పదాల పాదాలు తాళాలంకృతాలుగా ఉంటాయని గ్రంథకర్త చెప్తున్నాడు. తాళాన్ని గురించి కవి 36,37 పద్యాల వద్ద ప్రసంగించబోతున్నా ఇక్కడ గమనించవలసిన అంశాలు ఒకటి రెండు చెప్పాలి.

పదానికి లేదా పాటకు ఉండే రాగతాళాల్లో రాగం కంటే తాళం ముఖ్యమైంది. ఒకరాగానికి కూర్చిన పదాన్ని లేదా పాటను వేఱొక రాగంతో పాడటం సులభమే కాని ఒకతాళానికి కూర్చిన పాటను మరొకతాళానికి మార్చటం సులభమైన పనికాదు. తాళంకోసం అక్షరాల కూర్పు అమర్చబడి ఉంటుంది కనుక ఆకూర్పు మరొకతాళా నికి ఒదిగిరాదు. సమపదం అన్నపుడు పదంలోని నాల్గుపాదాలూ సమంగా ఉండడమే కాదు తాళగతి కూడా సమంగానే అమరిరావాలి. అంటే లయసరిగాకుదరాలి. వేగంగా పాడితే ద్రుతమానం. మధ్యరకంగా పాడితే మధ్యమానం. నిదానంగా పాడితే విలంబిత మానం. విలంబితానికి రెట్టింపు వేగం మధ్యమానంలోను, దానికి రెట్టింపు వేగం ద్రుత మానంలోను ఉంటాయి. ఈగాన గమనకాల ప్రమాణం 'లయ'. ఈ లయప్రవర్తనను బట్టి 'యతి' అనేది ఏర్పడుతుంది. వాటిలో 'సమయతి' అనేది ఒకటి. తాళంలో సమమైన కాలప్రమాణంకల ఒకేరకపు అంగాలు ఉంటే అది 'సమయతి' ఔతుంది. మామూలుగా నాలుగు అక్షరాల కాలం ఒకలఘువు అంటారు. నాల్గేసి అక్షరాలకు తాళం పడుతూపోతే అది ఏకతాళం అవుతుంది. తాళాలకు అక్షరసంఖ్య ఉంటుంది కనుక రచనలో జాగ్రత్త అవసరం. సమానకాలాలు ఉండే స్వరసమూహావృలయ 'సమయతి' అని తెలుసుకుంటేచాలు. సమపదాల కూర్పులో ఛందస్సుతో పాటు అలాంటి తాళలక్షణం ఉండాలంటున్నాడు గ్రంథకర్త.

With 'Rugmavati ' having bha-ma-sa-ga-ganas (10 letters) of 10th chandas as the first line and Dōdhaka lines with bha-bha-bha-gaga ganas (11 letters) of 11th chandas for 2nd,3rd, and 4th lines a parasthāna viṣama vrtta called 'srīramanam' is formed

Vīnāracana, Uddhata, Madhura and Manidīpika are given as sarva parasthāna vrttas in Telugu

A vṛtta born in a particular chandas running uniformly in all the four lines with its order of ganas and laghus and gurus unchanged, makes for a samavritta. There is no need for examples here. The vrttas we generlly read are, more often than not, are sama vrittas. The author has applied these regulations to a padam to define a samapadam. But there are one or two points to be noted here While thinking of a vrtta we have to forget the padya or ślōka and rember that it is a composition of four lines Padams are vritta bandhas in four lines but they are not padyas or ślōkas. The author says that these lines of padams are embellished by tāla. Though the author is going to speak about tāla in verse 36 and 37 some points need to be stated here

Between the rāga and tāla of a padam or song, the latter is more important than the former. A padam or song composed in a particular rāga can be easily sung in another rāga It is not so easy to change the tāla in which it is composed. The letters or syllables of the text are arranged in such a way as to suit the tāla that the composition does not fit in with a different tāla A samapada has not merely its four lines in a uniform fashion but its tāla too runs uniformly That means the laya has to be adhered to Singing fast is drutamāna; singing with medium speed is madhyamāna; and singing slow is vilambitamāna. The tempo gets doubled in madhyamāna which gets further doubled in drutamāna The standard of this tempo measure is called 'laya'. Based on the behaviour of this 'laya' what is called 'Yati' occurs 'Samayati' is one of the classical three or modern six 'yati's. If the tāla has the same type of components having uniform time-units (kālaprama-ṇa) then it is called samayati. Generally the time taken to utter four short letters is called a laghu. If tāla occurs after every group of four letters it is called ēkatāla Since tāla is known by the number of letters that it may comprehend , care in composition is neccessary. It is enough if we understand that the laya of a group of musical notes with uniform time-units has samayati. The author is saying that the composition of samapadams has not merely its prosody but also this tāla lakṣaṇa.

ఇంక అర్ధసమవృత్తం. వృత్తం నాలుగు పాదాలకూర్పు అయినప్పుడు అర్ధసమవృత్తంలో రెండుపాదాలు ఒకవిధంగాను మిగిలిన రెండుపాదాలు మరొకరకంగాను ఉంటాయని స్ఫురిస్తుంది. అయితే ఏరెండు పాదాలు అన్నది కూడా ఇక్కడ ఒక అంశమే. తొలిరెండుపాదాలు (1,2) ఒకసగం. మలిరెండుపాదాలు (3,4) మరొక సగం. ఇది ఒకపద్ధతి. బేసిపాదాలు (1,3) ఒకసగం; సరిపాదాలు (2,4) మరొక సగం. ఇది మరొకపద్ధతి. ఈ రెండుపద్ధతులు గ్రహింపవచ్చు. వీటితోపాటు లాక్షణికులు ఒకపాదం ఒకరకంగాను మిగిలిన మూడుపాదాలు మరొకరకంగాను ఉన్నప్పుడుకూడ అర్ధసమమనే అన్నారు. వీటిలోను మరల స్వస్థాన అర్ధసమాలు, పరస్థాన అర్ధసమాలు అనే భేదం ఉంటుంది.

స్వస్థాన అర్ధసమాల్లో 11వ ఛందానికి చెందిన ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర అనేవాటి మిశ్రణం ఉండే 'ఉపజాతి' ఒక్కటే తెనుగు గ్రంథాల్లో కనబడుతుంది. ఇంద్రవజ్రకు త,త,జ,గగ - గణాలు (9+2= 11 అక్షరాలు) ఉపేంద్రవజ్రకు జ,త,జ,గగ - గణాలు (9+2= 11 అక్షరాలు) రెండింటికి 8యతిస్థానం. ఈరెండింటి మిశ్రణం చేత 14 రకాలు ఉపజాతి పద్యాలు ఏర్పడతాయి.

'ఏకత్రపాదే, చరణద్వయేవా, పాదత్రయే వాన్యతరస్థితశ్చేత్

తయోరిహాన్యత్ర తదోహనీయా చతుర్దశోక్తా ఉపజాతిభేదాః'

అనే లక్షణాన్ని అనుసరించి ఆభేదాలు క్రింద చూపబడుతున్నవి.

ఇ - ఇంద్రవజ్రపాదం, ఉ- ఉపేంద్ర వజ్రపాదం అని సంకేతం. నాలుగు అక్షరాలు వరుసగా 1-2-3-4 పాదాలకు గుర్తులు.

| | |
|---|---|
| 1. ఇ-ఉ-ఉ-ఉ | 8. ఇ-ఇ-ఇ-ఉ |
| 2. ఉ-ఇ-ఉ-ఉ | 9. ఇ-ఇ-ఉ-ఉ |
| 3. ఉ-ఉ-ఇ-ఉ | 10. ఇ-ఉ-ఇ-ఉ |
| 4. ఉ-ఉ-ఉ-ఇ | 11. ఉ-ఇ-ఇ-ఉ |
| 5. ఉ-ఇ-ఇ-ఇ | 12. ఉ-ఉ-ఇ-ఇ |
| 6. ఇ-ఉ-ఇ-ఇ | 13. ఉ-ఇ-ఉ-ఇ |
| 7. ఇ-ఇ-ఉ-ఇ | 14. ఇ-ఉ-ఉ-ఇ. |

మన గ్రంథకర్త బేసి (1,3) పాదాలు ఒకరకంగా సరి (2,4) పాదాలు ఒకరకంగా ఉండటం అర్ధసమలక్షణమని చెప్పటాన్ని ఉపలక్షణంగా మాత్రమే తీసుకోవాలి. 12వఛందానికి చెందిన 'ప్రమితాక్షరం' (స,జ,స,స) అనేది బేసిపాదాల్లోను, ప్రియంవద (న-భ-జ-ర) అనేది సరిపాదాల్లోను వస్తే 'అజిత ప్రతాపం' అనే అర్ధసమవృత్తం అవుతుంది.అలాగే 13వ ఛంధానికి చెందిన ప్రహర్షిణి (మ-న-జ-ర-గ) బేసి పాదాల్లోను రుచిర (జ-భ-స-జ-గ) అనేది సరిపాదాల్లోను వస్తే 'రతిప్రియ' మనే అర్ధసమవృత్తం అవుతుంది. ఇవి స్వస్థానార్ధసమాలు.

Now, the ardhasama vrtta. A vrtta being a composition of four lines ardhasama vrtta suggests that one half or two lines being one way and the other half or other two lines being different . But which two lines? The first and second lines constitute one half and the third and fourth lines constitute the other This is one way of looking at it. The odd numbered lines, the first and third, constituting one half and the even numbered lines, the second and fourth, constituting the other half is another way of looking at it. Both these can be accepted. But the prosodists have called it ardhasama even when one line is in one way and the other three in a different way. Again the classification of svasthāna ardhasamas and parasthāna ardhasamas is there.

Among the svasthāna ardhasamas, the 'upajāti' verse composed by an admixture of 'indravajra' and 'upēndravajra' metres, both belonging to the 11th chandas, alone is seen in Telugu works. 'Indravajra' has ta-ta-ja-gaga (VVI-VVI-IVI-VV) gaṇas (9+2=11 letters). 'upēndravajra' has ja-ta-ja-gaga ( IVI-VVI-IVI-VV) gaṇas (9+2 = 11 letters). Yati is on the 8th letter in both cases. By mixing up these two metres 14 types of upajatis are formed. These varieties are shown below in accordance with the ślōka: 'ēkatra padē caraṇa dvayēvā, padatrayēvānyatarasthitascēt, tayōrihānyatra tadōhanīyā, caturdaśōktā upajātibhe-dāḥ. I= indravajara . U= upēndravajra. The four letters represent the metres in the serial lines of 1-2-3-4.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | I | U | U | U | 8. | I | I | I | U |
| 2 | U | I | U | U | 9 | I | I | U | U |
| 3. | U | U | I | U | 10 | I | U | I | U |
| 4. | U | U | U | I | 11 | U | I | I | U |
| 5. | U | I | I | U | 12 | U | U | I | I |
| 6 | I | U | I | I | 13 | U | I | U | I |
| 7 | I | I | U | I | 14 | I | U | U | I |

The fact that our author has indicated the odd numbered lines (1,3) being composed one way and the even numbered (2,4) lines being composed in a different way as ardhasama should be taken only as a symptomatic statement ' Pramitākṣaram' with sa-ja-sa-sa gaṇas in the odd lines and 'priyaṃvada' with na-bha-ja-ra gaṇas in the even lines both belonging to the 12th chandas, give an ardhasama vṛtta called 'Ajitapratāpam' Similarly 'praharṣiṇi' with ma-na-ja-ra-ga gaṇas in odd lines and 'rucira' with ja-bha-sa-ja-ga gaṇas in even lines (both of 13th chandas ) give another ardhasama vṛtta called 'ratipriya' These are svasthāna ardhasamas.

10వ ఛందానికి చెందిన సుముఖి (స-స-జ-గ) బేసి పాదాల్లోను 11వ ఛందానికి చెందిన వనమాల(స-భ-ర-ల-గ) సరిపాదాల్లోను వస్తే 'వియోగిని' అనే పరస్థాన అర్ధసమవృత్తం అవుతుంది. అట్లే 11వ ఛందానికి చెందిన కలితాంతము (త-జ-జ-వ) బేసి పాదాల్లోను 12వ ఛందానికి చెందిన తోటకము (స-స-స-స) సరిపాదాల్లోను వస్తే 'మనోహరం' అనే పరస్థాన అర్ధసమవృత్తం అవుతుంది. ఇలాంటివి ఇంకా ఉన్నాయి. మనకివి చాలు.

ఇలాంటి అర్ధసమలక్షణంతో కూడిన పదాలు అర్ధసమపదాలు అనిపించుకుంటాయని అన్నమాచార్యులు చెప్పినట్లుగా చినతిరుమలాచార్యులు లక్షణనిర్దేశం చేస్తున్నారు.

సమపదాలకు చెప్పినట్లుగా విషమపదాలకు అర్ధసమపదాలకు తాళసంబంధమైన నిర్దేశం ఏదిలేకపోవడం గమనించాలి.

ఉండే అవకాశాలను అన్నింటిని అవలోడిస్తుంది శాస్త్రం. అంతమాత్రంచేత అన్నింటికీ లక్ష్యాలు ఉన్నాయనికాని అన్నింటిని అనుసరించాలనికాని అభిప్రాయంకాదు. పథ్యమూ ఆహ్లాదకరమూ అయిన దాన్నే గ్రహించాలి.

1. 32 పద్యంలోకవి సమపదం 'తాళాలంకృత సామ్యపాదం' అన్నాడు. ఇక్కడ తాళముచేత అలంకరించబడిన సామ్యపాదం అని అర్థం. నాల్గుపాదాలు తాళానికి చక్కగా ఒదిగిరావాలి అని అభిప్రాయం. అంతేకాని తాళాలంకారం ఉండాలి అని భ్రాంతిపడకూడదు. దేశితాళాలనబడే 35 తాళాలకు పురందరదాసు స్వరాలతోకూర్చిన తాళాలంకారాలు ఉన్నమాటనిజమే అయినా ఆయన అన్నమయ్యకంటే చాల చిన్నవాడైన సమకాలీనుడు. పురందరదాసు తిరుపతికి వచ్చినప్పుడు అన్నమయ్యను దర్శించినట్లు అన్నమాచార్య చరిత్ర చెప్తున్నది. కాబట్టి పురందరదాసు స్వరసంచారంతో కూర్చిన తాళాలంకారాలు అన్నమయ్య చెప్పిన లక్షణంలోకిగాని దాన్ని అనుసరించే ఈ తెనుగు లక్షణంలోకికాని ప్రవేశించడం సంభావ్యంగా ఉండదు.

'Sumukhı' (sa-sa-ja-ga) from the 10th chandas in odd lines and vanamālı (sa-bha-ra-laga) from the 11th chandas in even lines give a parasthāna ardhasama vṛtta called 'viyōgini' . Similarly' kalıtāntam' (ta-ja-ja-va) of 11th chandas in odd lines and totakam (sa-sa-sa-sa) of 12th chandas in even lines give 'manōharam' another parasthāna ardhasama vrtta. There are more like these. Enough for our purpose.

That padams having this ardhasama laksana are called ardhasamapadas was enunciated by Annamācārya, says our author Cina Tırumalācārya.

We may note here that tāla is not referred to in the case of vışamapadams and ardhasamapadams.

A Śāstra explores all the possibilities That does not mean that examples can be provided for all or that one should follow all the possibilities One has to make a healthy and pleasant selection

In verse 32 the author qualifies samapadam as tālālaṁkrta sāmyapadam It just means uniformly lined verse embellished by tāla All the four lines must fit into the tāla uniformly well One should not mistake it to mean that tāla alaṁkāra should be there For all the 35 dēśītālas there are, no doubt, alaṁkāras said to have been composed by Purandaradāsa, with their svarasancāras But he was only a younger contemporary to Annamayya Annamācārya caritra speaks of Purandaradāsa meeting Annamācārya when he visited Tirupati So it is not probable that tāla-alaṁkāras with svarasancāra composed by Purandara dāsa should get into Annamayya's work on sankīrtan in Sānskrt or into this Telugu work

వ॥ మఱి నిబంధనామపదం బెట్టిదనిన

మ॥ యతులుం బ్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసం
గతులుం గల్గి నిబంధనామపద మాఖ్యాతార్థ సంయుక్త స
త్కృతియై తాళులపాక యన్నయగురూక్తిన్ లోకవిఖ్యాతమై
జితమాధ్వీక సితాసుధారస రుచిస్ఫీతంబునై చెన్నగున్ 34.

తా॥ ఇంక నిబంధపదం అనేది ఎలాంటిదో చెప్తాను. దీనికి యతులు, ప్రాసలు, మాత్రాగణాలననుసరించే పదాలు, తాళాల సంగతి ఉంటాయి. పదంలో చెప్పదలచిన అర్థం ఏదైనా ఉంటుంది. నేర్పైన కూర్పుగాను ఉంటుంది. ఇప్పపూలకల్లును, నిర్మలమైన అమృతాన్ని కూడా గెల్చిన రుచితో అందంగా ఉంటుంది. తాళ్ళపాక అన్నయగురుడు చెప్పడం చేత ఇదిలోకంలో ప్రసిద్ధికెక్కింది.

వ్యా॥ పదరచనకు తాళ్లపాక అన్నమాచార్యులు గురుడని ప్రస్తుతింపబడుతున్నాడు. 'పద నిర్యుక్త' మనే పేరుతో భరతుడు నామమాత్రంగా చెప్పిన దేవస్తుత్యాత్మకమైన పదానికి మొదటిసారిగా సంస్కృతంలో లక్షణం ప్రతిపాదించిన వాడు అన్నమయ్య. ఆయన రచించినన్ని పదాలు తెనుగులోనే కాదు మరే భారతీయ భాషలోను ఎవరూ రచించలేదు. రచనలో పద్యకవులెవరూ ఆయన చాయలకైన రాలేరు. భాష ఆయన చేతిలో మైనపు ముద్ద. భావన మధురాతి మధురం. ఇన్నికారణాలచేత పదరచనాగురుత్వం ఆయనకు తగి ఉంది.

నిబంధ, నిబద్ధ శబ్దాలు సమానార్థకాలే. ఉద్గ్రాహాది ధాతువులచేత ప్రబంధాంగాలైన స్వర,బిరుధ, పద, తేనక,పాట, తాలాలనే వాటిచేత దేశిరాగాల్లో వాగ్గేయకారుడు జనరంజకంగా కూర్చిన గానం నిబద్ధం. అదే నిబంధపద మనబడుతున్నది.

28 పద్యం క్రింద వ్యాఖ్యలో ప్రాచీనులు చెప్పిన ఏలా పదలక్షణం అందలి భేదాలు విపులంగా ఉల్లేఖింబడినై. ఇక్కడ తెనుగులాక్షణికులు చెప్పిన పదలక్షణాలు ఒకటిరెండు స్పృశింపబడుతున్నాయి.

వెల్లటూరి లింగన మంత్రి తన 'సరసాంధ్ర వృత్త రత్నాకరం' (1550-1600 A. D) (దీనికే మాల్యాద్రి నృసింహచ్ఛందమని కూడ పేరు) లో పదలక్షణాన్ని ఇలా చెప్పాడు.

'స్వర లఘువులెదుగల త్రిగణ రవిగణము
సరస గణ యుగముపై జత యతిక్రమము
వర పదాంతము నందు వలెఁ బ్రాస సమము
వరఁగ నరసింహ నాపదము గైకొనుము'

Verse:34

Tr. Now nibandha padam is being explained. It possesses yatis, prāsa, words following mātrā-gaṇas; association of a tāla; it carries a certain meaning intended to express; it will be a skilled composition. It will be a beautiful one, its sweetness surpassing that of the wine prepared from the flowers of Bassia latifolia or even nectar. It has become famous in the world on account of Tāḷḷapāka Annaya, the preceptor, composing them.

Com: Tāḷḷapāka Annamācārya is extolled as the preceptor of padam composition. It was Annamayya who propounded the regulations of padam-composition nominally enumerated by Bharata as 'pada-niryukta' which is simple hymnodic composition . No one seems to have composed as many padams as he has, not merely in Telugu but in any Indian language. The excellence of his compositions is such that other padya-kavis can never hope to come anywhere near him. Language behaves like a ball of wax in his hands with maximum plasticity. His imagination is sweeter than the sweetest. For all these reasons and more, preceptorship of pada-composition is justified in his case.

The words nibandha and nibaddha mean the same thing, 'framing in' or 'framed-in'. Music (gāna ) composed for popular taste in dēśi-rāgas by a vāggēyakāra framing it in with dhātus like udgrāha etc. and prabandha components called svara, biruda, pada, tēnaka, pāṭa and tāla is called nibaddha gāna. Such a padam, is nibandha-padam.

In the commentary under verse 28 the regulations of ēlā-padam and their varieties as enunciated by the ancients have been extensively described. Here one or two instances of pada-lakṣaṇa as enunciated by the Telugu prosodists are touched upon. Vellaṭūri Linganamantri (1550-1600 A.D.) in his 'S A.V R.' otherwise known as 'Mālayādri Nṛsimhacchandam' has stated pada-lakṣaṇa to this effect:

'Three smara-gaṇas comprising five laghus each succeeded by one sūrya-gana (for each line) with yati after two gaṇas (in each line) and prāsa both in the beginning as well as at the end of each line, make for padam'

ఈ గ్రంథకర్త మన గ్రంథకర్తకు కొంచెం తర్వాతివాడు. వెనుకచెప్పిన కామగణాలే స్మరగణాలు. మూడో ఛందంలో పుట్టిన గణాలే ఇవి. కాగా త్ర్యక్షర గణాలే కామగణాలు ఔతాయి. వాటిలో లఘ్వాదిగణాలకు ముందు మరొక లఘువు ఉంచితే కామగణా లన్నీ ఏర్పడతాయి. ఐదుమాత్రలకు ఐదులఘువులుండే గణాలు మూడుకూర్చి మరొక్క సూర్యగణాన్నికలపాలి. సూర్యగణానికి నగణమైనా (III) హగణ (UI) మైనా మూడు మాత్రలు. మొత్తం పాదానికి 5 X 3 = 15 + 3 = 18మాత్రలు. రెండుగణాల పైనయతి చెల్లాలి. ద్వితీయాక్షరప్రాసతోపాటు పాదాంతంలోను ప్రాస ఉండాలి. ఈలక్షణపద్యం దీనికి లక్ష్యం ఔతుంది. ఇక్కడ విశేషమేమంటే ఇది సరిగా కర్ణాటచౌపద లక్షణం. కన్నడంలో నాగవర్మ ఛందోంబుధిలో ఇదే లక్షణం 8 మాత్రల మీద యతితో రఘటా లక్షణం క్రింద చెప్పబడింది. ఇది తెనుగులోని 'ద్విపద' కూడ అవుతుంది.

పై లక్షణకర్తకు తరువాతి వాడైన వార్తాకవి రఘునాథయ్య (1660-1680 A.D.) తన 'లక్షణ దీపిక'లో పదలక్షణాన్ని ఇలా చెప్పాడు.

క॥ 'పాదము ప్రాసము వడియును
శోధించి పదాఱు కళల మాత్రం బరయన్
నాదాంగ రాగలీలల౯
బాదంబాలించి చెప్పఁ బదమై యొప్పు౯.

గీ॥ ధన్యతకుఁ బల్లవికి విరోధంబు లేక
క్రియ ఫలింపఁ గ నియమంబు గీలుకొలిపి
ప్రాస యతులును సమయతుల్ భాసురముగ
తాళ పద్ధతి రచియింపఁ దగుఁ బదంబు

ఇందుకు తాత్పర్యము. కళలనంగా లఘువులకు సంజ్ఞ. చరణం 1కి 16 లఘువులు నియమం. ధన్యత అనగా నుపపల్లవికి పేరుగనుక పల్లవికి యుపపల్లవికి క్రియచేర్పుగా చెప్ప వలెను. లయప్రధానంగా రాగవరున ప్రాసవడి వర్గవళ్లును చెప్పవలెను.' (707,708,709)

ఇతని లక్షణంలో పాదానికి 16 మాత్రలే చెప్పబడినై. ఉపపల్లవి క్రొత్తగా వినబడు తున్నది. రాగతాళాలు చెప్పబడినై.

ఇంక 18 శతాబ్దినాటి పొత్తపి వెంకటరమణకవి తన 'లక్షణ శిరోమణి' వృత్తాధికా రంలో 'అర్జున భరతాన్ని' 'సంగీత రత్నాకరాన్ని' స్మరించి పదాన్నిగుర్చి ఇలా చెప్పాడు.

'కావున నీదేశ భాషల పదములు చెప్పవచ్చుననిన్ని, ఏళలనగా పదములనిన్ని మూడు చరణములకు ఖండికాత్రయము అని పేరుగలదనిన్ని, పల్లవము ఉపపల్లవము అనిన్ని యివి మాత్రానమక నిబద్ధములైన పగణాదులతోఁగూర్చవలెననిన్ని సూళాదుల (క)ను గు(ణ) ముగా నుండవలెననిన్ని' సంగీత రత్నాకరము మొదలైన గ్రంథము(లు) అర్జునభరతాది ఏళా ప్రకారంబున పగణాదుల రాగతాళమ్ముల సంగీత రీతిని తేటపడి యుండుగాన నీసాహిత్య మార్గంబున లక్షణంబున కొరవవి యుట్లుండె.' (3-427)

The author of this work was a little posterior to our present author, Cina Tirumalācārya Smara-ganas are kāma-ganas explained earlier They are born in the third chandas and tryaksara-ganas themselves can become kāma-ganas We have to prefix one laghu to those beginning with a laghu We have to suffix a sūryagana-either 'na' gana(III) or 'ha-gana'(UI) to a succession of three ganas of five matras each in line Thus the total number of mātras for a line is 5x3+3=18. Caesura (yati) has to be observed after the first two gaṇas i e. at the beginning of the third gaṇa. Prāsa pertaining to the second and last letters of the lines has to be observed The verse which gives this laksana is itself an example for the regulation. The note-worthy point is that this regulation is nothing but that of karnāṭa-caupada. Nāgavarma the Kannaḍa prosodist of yore, has given this regualtion under the category of raghaṭa with yati after 8 mātras. In Telugu, this composition can be taken as dvipada variety too.

Vārtākavi Raghunāthaiah, (1660-1680 A D) another prosodist posterior to the above one, gives padalaksaṇa, in his L.D to this effect:

"That shines as padam if each line is composed with sixteeen kalas observing yati and prāsa fitting with a rāga and tāla. The pallavi and dhanyata should not fall apart; the verb should be fruitful; prāsayatis and sama-yatis can be used and the composition should be in accordance with tāla"

The purport is this. The word 'kalās' signifies 'laghus' The regulation is 16 laghus for each line 'Dhanyata' is another name for 'upapallavi' The verb should be such that it comprehends both the pallavi and upapallavi The composition with prāsayatis and varga-yatis should fit in with a rāga and a tāla, being laya-pradhāna (Laksaṇadīpika. 707,708, and 709)

In this regulation only 16 mātras per line is advocated We hear about 'upapallavi' for the first time. Rāga and tāla are mentioned

Again, Pottapi Vēnkataramaṇakavi (18c) in the Vṛttādhikāra of his L S. mentioned A.B and S.R and spoke about padam to this effect: "So padams can be composed in indegenous language and ēlās mean padams; three caranas go by the name of 'khandikātraya' (and there are) pallava and upapallava and (all) these are composed by 'pa' -gaṇas of equal number of matras each; these should be in accordance with sūḷādis, these are clearly given in Sangīta Ratnākara etc. and in accordance with ēlā-lakṣana given in Arjuna Bharata comprising of pa-gaṇas, rāga and tāla in the way of music; and so these do not come under the domain of literary regulations and let it be so (L S. 3-427)

దీనిలో పాదానికిన్ని మాత్రలని నిర్దేశం లేదు. పంచమాత్రాకాలైన గణాలు ఉండాలని మాత్రమే చెప్పబడింది. మూడు చరణాలనటంలో త్రిధాతుకత్వం సూచింపబడింది. పల్లవి అనుపల్లవి చెప్పబడ్డవి. ఈ ఏలాపదం సూళాదులకనుగుణంగా ఉండాలని రాగ తాళాలుంటాయని చెప్పబడింది. ఇతనికాలానికి పదరచన కేవలం సంగీత సంబంధిగాతోచి సాహిత్యాన్నుండి వేఱుపడ్డది. పాదానికి ఆఱని, ఐదని ప్రాచీనులు చెప్పిన పదనియమం పోయి గణసంఖ్యా నియమం రావటం అదికూడ పోయి పాదానికి 16 మాత్రలనడం. చివరకు మాత్రాసమకాలైన పగణాలతో కూర్చాలనటం - క్రమంగా వచ్చిన మార్పు. తాళ్లపాక వారి సంకీర్తనల్లో పల్లవితో పాటు మూడేసి చరణాలు ఉండటం మామూలు. ప్రతి చరణం నాల్గుపాదాల వృత్తబంధంగా ఉంటుంది. చరణాలసంఖ్యకు అపవాదాలు లేక పోలేదు.

పదరచనలో పాదానికి ఇన్ని అనే గణసంఖ్యా నియమంకాని మాత్రా సంఖ్యనియమం కాని లేదని నాలుగు, ఐదు, ఆఱు మాత్రల గణాలు వాడుకోవచ్చునని రాగతాళాలకు అనుగుణంగా వీటిని నియమించుకోవచ్చునని యతులు, ప్రాసలు ఉంటాయని పల్లవి చరణ త్రయం ముఖ్యమని సారాంశం.

ఈ సందర్భంలో నాట్యశాస్త్రం చెప్పిన సలహాగమనింపవచ్చు. ఆర్యావృత్తాల్లో నాల్గేసి మాత్రాలకే గణాలు చూచుకోవాలని, గీతకాల్లో ఐదేసి మాత్రల గణాలు చూచుకోవాలని, తాళప్రధానాలు కనుక వైతాళీయాల్లో (రగడలు వగైరా) ఆఱేసి మాత్రల గణాలు చూడాలని 14 అధ్యాయం (బరోడా ప్రతి)లో చెప్పబడింది.

1 'నిబద్ధ మనిబద్ధం తద్ ద్వేధా నిగదితం బుధైః॥
బద్ధం ధాతుభిరంగైశ్చ నిబద్ధమభిధీయతే
ఆలప్తిర్బంధ హీనత్వాదనిబద్ధ మితీరితా॥

(సంగీ. రత్నా. 4-4/5)

రాగాలాపన అనిబద్ధం.

2. 'మాత్రానీకముల్' అనేది పదాలు, తాళసంగతులు అనేవాని నడుమ వేయబడింది. మాత్రలసమూహాలు అనే ఆ అభిప్రాయం ఇటు పదాలపరంగా మాత్రాగణాలుగా నోమాత్రల సంఖ్యగానో అన్వయానికి వస్తుంది, అటు తాళపరంగా కూడా అన్వయానికి వస్తుంది. 36 పద్య వివరణం చూడండి.

3. అఖ్యాతం అంటే చెప్పబడింది అని శబ్దార్థం. భాషాపరంగా ఆఖ్యాతం అనేది క్రియాశబ్దం. ధాతువుకు భూతభవిష్యద్వర్తమానాది కాలసూచకాలైన తిఙ్లు చేరింది ఆఖ్యాతం; దీనికి కర్తృపదమైన నామశబ్దానికి ఉండే వచనపురుషలు ఉంటాయి. వ్యక్తం చేయబడిన ఏదైనా ఒక అర్థంతో కూడింది అని గ్రహిస్తేచాలు.

This regulation does not fix the number of mātras per line It only speaks of ganas of five mātras each. The three caranas referred to as khandikātraya indicates 'tridhātukatva ' of pada 'Pallavi' and 'anupallavi' are mentioned. Ēlāpadam is enjoined to be in accordance with 'sūḷādis' with rāga and tāla By the time of this author composition of padams was considered to belong only to music and got divorced from literature The number of words or units per line fixed by the ancients as six (S S S ) and five (S.R) lapsed. Regulation of the number of ganas per line came and even that lapsed Then came number of mātras per line (16) and finally composition with pa-ganas of 5 mātras each was advocated This is the gradual change that came over the composition of padam The sankīrtans of Tāllapāka poets contain generally three caranas with pallavi Each carana is a vṛttabandha in four lines There are exceptions to this rule of three caranas.

The sum and substance of all this is that there is no fixed number of either ganas or mātras per line in pada composition and that one can use units of four or five or six matras as suited to a rāga and tāla, observing yati and prāsa. Three caranas with pallavi is the more important part

In this context one can note the advice of N S. In āryā-vrttas the ganas are to be scanned for four matras each; in gītakas scanning is for five mātras each gana or unit and since tāla is important, in vaitālīyas (raghata.etc ) it is for six mātras each unit (Baroda N S 14 ch)

1. nibaddham anibaddham tad dvēdhā nigaditam budhaiḥ
   baddham dhātubhirangaisca nibaddham abhidhīyatē
   alaptir bandhahīnatavād anibaddaham itīrītam

(S 4-4/5)

rāga ālāpa is anibaddha

2 the compound 'mātrānīkamul'is incorporated in between 'padambulunu and tālasangatulun'

The groups of mātras referred to relates itself to padams/ words in terms of mātra -gaṇas or number of mātras on one hand and on the other, it relates itself to tāla also. (vide commentary under verse 36)

3 'ākhyāta' means that which has been said Applied to language 'ākhyāta' is verb The verbal root with the tense particles of past, present and future, called 'tin-s is called ākhyāta Its number and person will be in accordance with the subject noun. Here it is enough if it is understood as " with a certain meaning expressed "

వ॥ అట్టి నిబంధనామ పదంబునకు దదంగంబులైన యతిప్రాసాదులవిధం బెట్టిదనిన

క॥ పాదముల నాలుగింటికి
నాదుల నడుముల సవర్ణమగునవి యతు లా
పాద ద్వితీయ వర్ణము
పాదుగ నొక్కటియె చెల్లఁ బ్రాసం బనఁగన్ 35

తా॥ నిబంధపదమనే దానికి అంగాలైన యతి, ప్రాస మొదలైనవి చెప్పబడుతున్నై. నాలుగు పాదాల మొదళ్లలోను మధ్యభాగాల్లోను సజాతీయవర్ణం ఉండటం యతులు అనిపించుకుంటాయి. నాల్గు పాదాల్లోను పాదద్వితీయాక్షరం ఒకటిగానే రావటం ప్రాస అనిపించుకుంటుంది.

వ్యా. అంగాలంటే అవయవాలు. నిబంధపదం సావయవం. పదం శరీరంలాంటిదైతే యతులు, ప్రాసలు, మొదలైనవి సౌష్ఠవం (symmetry) తోకూడిన కాళ్లు చేతుల్లాంటి అవయవాలు.

ఈనిబంధపదం వృత్తబంధంగా ఉంటుంది. అంటే నాలుగు పాదాలుగా ఉంటుంది. ఈనాలుగు పాదాల్లోను పాదాదిలో ఉండే అక్షరంతో సజాతీయమైన అక్షరం పాదమధ్యంలో రావటం యతి. నాలుగు పాదాల్లోను నాలుగు యతులు ఉంటాయి. ఏపాదం యతి ఆపాదానిదే. కాని సజాతీయాక్షరం వచ్చే యతిస్థానం మాత్రం నాల్గు పాదాల్లోను ఒకేచోట వస్తుంది. పాదమధ్యంలో రావటంఅనేది సామాన్యసూత్రం. ఒకపాదానికి 16 మాత్రలుంటే సగానికి 8 మాత్రలు ఔతాయి. అప్పుడు పాదంతొలి అక్షరం 9 వమాత్ర ఉండే అక్షరము సజాతీయంగా ఉండాలి. గణాలసంఖ్యనుబట్టికూడా ఇట్లే చూచుకోవాలి. కొన్నిచోట్ల పాదమధ్యాన్నిదాటి యతి ఉండటం, ఒకటికంటె ఎక్కువ యతిస్థానాలు ఉండటం కూడా ఉండవచ్చు.

యతి అనేది చదివేవాని నాల్కకు విశ్రాంతి స్థానం. సంస్కృతభాషలోను కన్నడం లోను యతి విచ్ఛేదరూపం. యతిస్థానంలో పదమధ్యం రాకూడదు. సంస్కృతంలో పాదం చివరకూడ పదం ముగిసిపోవాలి. దీన్ని పాదాంతయతి అంటారు. 'యతిః సర్వత్ర పాదాంతే, శ్లోకార్ధేతు విశేషతః' అని పింగళచ్ఛందము.

తెనుగులో యతిస్వరూపంవేఱు. యతిస్థానంలో పదచ్ఛేదం ఉన్నా లేకపోయినా పాదం తొలి అక్షరంతో మైత్రిగల అక్షరం ఆచోట వచ్చితీరాలి. ఉదాహరణకు శార్దూలవృత్తానికి 12 యతి స్థానం. అనగా 12 అక్షరం ఉన్నచోట పదచ్ఛేదం జరగాలి. తెలుగులో 12 అక్షరం దగ్గర పదచ్ఛేదం జరిగినా జరుగకపోయినా 1 వ అక్షరంతో మైత్రిగల అక్షరం 13 వ అక్షరంగా వస్తుంది. ఇలాగ నాల్గు పాదాల్లోను యతి ఉండాలి. పదరచనలోను ఇట్లే పాదమధ్యంలో ఒకచోటగాని, ఒకటికంటె ఎక్కువచోట్లగాని యతిని నిర్వహించవచ్చు. యతి అక్షరమైత్రిచేత శ్రావ్యతకు దోహదం చేస్తుంది.

verse 35

Tr.The components of a nibandhapadam, yati, prāsa etc., are being given. Assonant letters at the beginning and middle points of all the four lines are yatis (caesura) The second letter (of all the four lines) being the same is called prāsa.

Com: The components of a nibandhapadam are like its limbs. If the text of the padam is its body yatis, prāsas are like its limbs that contribute to its fullness, symmetry and beauty.

Nibandhapada is composed in vṛtta bandha, i.e. in four lines. A letter, assonant with the first letter of each line should occur at the prescribed midpoint of the line. This is called yati. Thus these are found in all the four lines. Yati, in each line is seperate depending on the first letter of that line. But the point of yati is the same in all the four lines. Middle of the line for yati is a general rule. If there are 18 mātras for a line, 8 mātras give half its length or quantity. Then the first letter of the line and the 9th mātra or letter of the line should possess assonance In case the number of ganas is taken, similar is the procedure. In some places yati may be found a letter after the midpoint or in more than one place.

'Yati' is the resting point for the readers' tongue. In Sanskṛt and Kannaḍa, yati is in the form of just a break (caesura) with the word ending there and another starting at the next point.In Sanskrt there is pādāntayati too; a word has to end at the end of a line and cannot flow into the next line. Pingalacchandas says 'yatiḥ sarvatra pādāntē ślōkārdhētu viśēṣatah'.

The concept of yati is different in Telugu. A break at the yati point is not so important as a letter assonant with the first letter of the line occuring there. For example 12th letter is the yati-point for śārdūlavikrīdita vṛtta That means any word commenced earlier should end at this point and another word start at the next point. In Telugu whether a word ends or not at the 12th letter, a letter having assonance with the first letter of the line occurs as 13th. Thus it will be observed in all the four lines. Even in the composition of a padam yati has to be observed at the middle of the line. It can also be observed in more places than one if so desired. Yati helps the sonorousness of the song by its assonance.

పాదం రెండో అక్షరం ప్రాస. ఇదికూడ నాల్గుపాదాల్లో ఉంటుంది. 'ప్రకృష్టో వర్ణవి న్యాసః ప్రాసః' అని వ్యుత్పత్తి. ఇది రసస్ఫోరకమని సౌందర్యహేతువని చెప్తారు. తొలిపాదంలో రెండోఅక్షరంగా వచ్చిన అక్షరమే రెండవమూడవ నాల్గవ పాదాల్లోని రెండో అక్షరంగా రావాలి. కాబట్టి ప్రాస నాల్గుపాదాలకూ ఒక్కటిగానే ఉంటుంది. సంస్కృతంలో ఇలాంటి ఆవృత్తి శబ్దాలంకారం క్రిందికి వస్తుంది. అనుప్రాస అంటారు. కన్నడంలోను తెనుగులోను ప్రాస ఒకేవిధంగా ద్వితీయాక్షరావృత్తిగా ఉంటుంది.

యతికి ప్రాసకు ఒక్క భేదం ఉంది. యతిలో అక్షరమైత్రి అజ్ఝల్లులకు రెండింటికి ఉండాలి. ప్రాసలో వ్యంజనం ప్రధానం. అనగా, హల్లు మాత్రం వస్తేచాలు; వేర్వేరు అచ్చు లతోకూడి ఉండవచ్చు. ఉదాహరణానికి ర-రి-రు-రె లు ప్రాసాక్షరాలుగా రావచ్చు. యతి ర-రా-రై-రౌ లకు, రి-రీ-రృ-రె-రే లకు, రు-రూ-రొ-రో లకు మాత్రమే చెల్లుతుంది.

పదరచనలో పాదాంత ప్రాసకూడ ఉంటుంది. ప్రతిరెండు పాదాలకు చివర అనుప్రాస నిర్వహించటం ఒకపద్ధతి. నాల్గుపాదాలకూ నిర్వహించవచ్చు.

1. అజాది పదాలు వాడేటప్పుడు ఈక్రింది అచ్చులకు పరస్పరం యతిమైత్రి ఉంటుంది.

(a) అ-ఆ-ఐ-ఔ (b) ఇ-ఈ-ఋ-ౠ-ఎ-ఏ (c) ఉ-ఊ-ఒ-ఓ (d) అచ్చులలోని అకారానికి హల్లుల్లోని య-హ లతో యతిమైత్రి, ఋకారానికి రి తో యతిమైత్రి. (e) హల్లులలో పరస్పరం యతి మైత్రి ఈక్రింది విధంగా ఉంటుంది.

క-ఖ-గ-ఘ-క్ష

చ-ఛ-జ-ఝ-శ-ష-స-క్ష

ట-ఠ-డ-ఢ  ఇవి వాడుకగా ఉండేవి. విశేషాలు చాలా ఉన్నై.

త-థ-ద-ధ

ప-ఫ-బ-భ-వ

ంప-ంఫ-ంబ-ంభ-మ

పు-ఫు-బు-భు-ము

య-హ

ర-ఱ

ల-ళ

న-ణ

జ్ఞ-న

The second letter of the lne is called prāsa This also is observed in all the four lines. 'prakriṣta varna vinyāsaḥ prāsaḥ' is the etymology given.It helps beauty and rasa The second letter in the first line must recur as the second letter in the second, third and fourth lines also. So prāsa is one and the same in all the four lines In Sanskrt such recurrence comes under śabdālaṃkāra. It is called anuprāsa. Prāsa is the same both in Kannaḍa and Telugu- recurrence of the second letter.

But there is one difference between yati and prasa In yati the akṣara maitri comprehends both the vowels and consonants In prāsa only the consonant is important. That means recurrence of consonant alone is enough though it may be conjoined with different vowels. For example, ra-ri-ru-re can occur as prāsa letters. Yati is possible within the groups of letters shown though the consonant is the same in all: ra-rā-rai-rau; ri-rī-ṛ-re-rē; ru-rū-ro-rō.

In pada composition pādānta prāsa (end of the lne prāsa) also will be there. One way is to observe it at the end of two consecutive lines. It can be observed in all the four lines also.

1 When words beginning with vowels are used the following groups of vowels are said to have maitri (friendliness, assonance or rhyming):

a) a-ā-ai-au
b) i-ī-ṛ-ṛ-e-ē
c) u-ū-o-ō
d) a and ā among vowels have assonance with consonants 'ya' and 'ha';vowel ṛ has assonace with consonant ri
Assonance among consonants is within the groups shown:
ka-kha-ga-gha-ksa
ca-cha-ja-jha-śa-ṣa-sa-kṣa
ṭa-ṭha-ḍa-ḍha
ta-tha-da-dha
pa-pha-ba-bha-va
mpa-mpha-mba-mbha-ma
pu-phu-bu-bhu-mu
ya-ha
ra-rra(śakaṭa rēpha written as ಱ
la-ḷa
na-ṇa
jña-na

These are commonly used But there are many special types.

2. ప్రాసలో హల్లు ఆవృత్తి అయితే చాలునని చెప్పబడినా కొన్ని విశేషాలున్నై.

(a) వట్రువసుడి ఉన్నహల్లుకు వట్రువసుడిలేని హల్లుతో ప్రాసచెల్లుతుంది. సుకృత-సకియ

(b) క్రావడి ఉన్నహల్లుకు క్రావడిలేని హల్లుకు ప్రాసచెల్లుతుంది.

(c) స-ష, స-శ, న-ణ, ద-ధ, థ-ధ, ఋ-ర, ల-ళ-డ లకు పరస్పరం ప్రాసచెల్లుతుంది.

ఇక్కడకూడా విశేషాలు చాలాఉన్నై. పరిచయమాత్రంగా ఇక్కడ చూపబడినై.

2.Though it is said that the recurrence of consonant is enough for prāsa there are some special points·

a) a consonant with vowel ṛ is in prāsa with the same consonant without vowel ṛ. ex:-sukṛta-sakiya

b) a consonant conjoined with rēpha is in prāsa with the same consonant without rēpha.

c) prāsa is said to exist between the following pairs and groups:

sa - sa;
sa - śa;
na - ṇa;
da - dha;
ṛ - ra;
ḷa - la - da

There are many special points here also. The above are given by way of a brief introduction only.

క॥ మాత్రయొకటి లఘువనఁదగు
మాత్రా ద్వయమైన గురుసమాహ్వయమయ్యెన్
మాత్రా త్రయము ప్లుతంబగు
మాత్రార్ధము ద్రుతము భరత మతమునఁ జెలఁగున్ 36

తే॥గీ॥ పూని తాళక్రియాలసన్మాన మునకుఁ
దాళశబ్దంబు వర్తించు ధరణినదియు
దేశి యును మార్గమును నాఁగఁ దేజరిల్లు
ధన్య భరతాది బహుసంప్రదాయ లీల. 37

తా॥ ఒక్క మాత్రకు లఘువనిపేరు. రెండు మాత్రలు గురువు. మూడు మాత్రలు ప్లుతం. అర్ధమాత్ర ద్రుతం. భరతమతంలో ఇలాగచెల్లుతుంది. (36)

పనిబడి తాళక్రియతో కొలవటానికే తాళం అనిపేరు. లోకంలో ఆతాళం భరతాదుల సంప్రదాయాలను అనుసరిస్తూ 'మార్గ' అని 'దేశి' అని రెండు రకాలుగా ప్రకాశిస్తున్నది. (37).

వ్యా॥ ఈ రెండు పద్యాలు తాళాన్ని గురించి పలుకుతున్నాయి. 34 పద్యంలో మాత్రా నీకాలు చెప్పి తాళసంగతులు చెప్పబడినై. ఇక్కడ మరలా మాత్రలను గూర్చి తాళాన్ని గూర్చి ప్రసంగింపబడుతున్నది.

మాత్రలను గురులఘువులను గూర్చి చెప్పే పద్యం ఛందస్సుకు సంబంధించిందని ఎందుకనుకోరాదు? ఛందస్సులో గురులఘువులతోడి గణాలుండవచ్చు, మాత్రాగణాలుండ వచ్చు. కాని ద్రుత ప్లుతాలకు అందులో తావులేదు. కనుక రెండు పద్యాలు తాళపరాలే అనిగ్రహించాలి.

'తల ప్రతిష్ఠాయాం' అనే ధాతువు వలన 'తాల' శబ్దం వచ్చింది. గీత నృత్తవాద్యాలు దీనిలో ప్రతిపాదింపబడుతాయి కనుక 'తాల' మనిపేరు. లఘ్వాదులచేత సశబ్దనిశ్శబ్ద క్రియలచేత గీత వాద్యనృత్తాదుల కాలం కొలువబడుతుంది. కనుక 'తాల' మనేది ప్రధానంగా కాలసంబంధమైంది. తాలానికి (1) కాలం (2) మార్గం (3) క్రియ (4) అంగం (5) గ్రహం (6) జాతి (7) కల (8) లయ (9) యతి (10) ప్రస్తారం అని పది ప్రాణతుల్యమైన అంశాలు చెప్పబడినై. వీటిలో మొదటి 5 ముఖ్యప్రాణాలు రెండో 5 అముఖ్యప్రాణాలు. ఇక్కడ తొలిపద్యం కాలానికి సంబంధించింది.

సంగీతంలో కొలతకు వచ్చేకాలానికి లోకంలో మనం చెప్పుకొనేకాలానికి వ్యత్యాసం ఉంది. సంగీతంలో (1) సూక్ష్మకాలం (2) స్థూలకాలం అని కాలం రెండురకాలు. నూఱు తామరరేకులను ఒకదానిమీద ఒకటి పేర్చి సూదితో గ్రుచ్చితే ఒకరేకు తెగటానికి పట్టేకాలం క్షణం. అలాంటి క్షణాలతో ఈక్రింది సూక్ష్మకాలాలు ఏర్పడుతున్నై.

verse 36-37

TR: One mātra is called laghu; two mātras go under the name of guru; three become pluta; half a mātra is druta. This is according to Bharata's school (36).

Measuring the time with tāla kriya is called tāla. That tāla is of two kinds: 'mārga' and 'dēśi', following the traditions of Bharata and others (37).

Com: These two verses speak about tāla. In verse 34 tāla is mentioned after mentioning mātras Here again mātras and tāla are taken up for mention as componets of nibaddhapadam.

Can't we consider this verse which speaks of gurus and laghus as related to prosody? No. There may be gurus and laghus or mātrā-gaṇas in prosody; but druta and plúta have no real place there. So both the verses are to be considered related to tāla.

The word 'tāla' is derived from the root 'tala pratiṣṭhāyām'. Because gīta, nṛtta and vādya are enunciated in this it is called tāla It pertains to time factor as the time intervals in gīta, vādya and nṛtta are measured by laghu etc. as also by the saśabda and niśśabda kriyas. Ten vital factors, called prāṇas, of tāla are enumerated: (1) kāla (2) mārga (3) kriyá (4) anga (5) graha (6) jāti (7) kalā (8) laya (9) yati and (10) prastāra. They pertain to the various modes of operation related to tāla. The first five are said to be primary and the second five secondary just as in the case of prāṇas. Here the first verse relates to kāla (time factor).

The time we usally recon in our daily life and the time that comes for measurement in music are not the same.In music it is of two kinds (1) sūkṣma (subte) and sthūla (gross). The time taken by a sharp needle to pierce a lotus petal in a pile of hundred such is called a kṣaṇa. The following are the units of subtle time made up of such kṣanas.

8 క్షణాలు = 1 లవం

8 లవాలు = 1 కాష్ట

8 కాష్టలు = 1 నిమిషం

8 నిమిషాలు = 1 కళ

2 కళలు = 1 చతుర్భాగం

2 చతుర్భాగాలు = 1 అనుద్రుతం

ఇటుమీద చెప్పేవి స్థూలకాలాలు:

2 అనుద్రుతాలు = 1 ద్రుతం

2 ద్రుతాలు = 1 లఘువు

2 లఘువులు = 1 గురువు

3 లఘువులు = 1 ప్లుతం

4 లఘువులు = 1 కాకపాదం

పద్యంలో ద్రుతం అనేది అర్ధమాత్ర అనిచెప్పబడింది కనుక రెండు ద్రుతాలు 1 మాత్ర అవుతుంది. అదే లఘువని చెప్పబడింది. అలాగే 2 లఘువులు, మాత్రాద్వయం, గురువనబడింది. మూడులఘువులు ప్లుతమనబడింది. పైవాటిలో (1) అనుద్రుతం (2) ద్రుతం (3) లఘువు (4) గురువు (5) ప్లుతం (6) కాకపాదం అనే ఆఱున్నూ తాళానికి నాలుగో ప్రాణమైన షడంగాలు. ఈనాడు గురు, ప్లుత, కాకపాదాలు వచ్చే తాళాలు ఏవీ వాడుకలోలేవు. ఇప్పుడు వాడుకలో ఉండే తాళాల్లో అనుద్రుతం, ద్రుతం, లఘువు అనే మూడు అంగాలు మాత్రమే వస్తాయి. వీటికి హ్రస్వాక్షరాలకాలం, గుర్తులు ఇలా ఉంటాయి.

| <u>అంగం</u> | <u>హ్రస్వాక్షరసంఖ్య</u> | <u>గుర్తు</u> |
|---|---|---|
| అనుద్రుతం | 1 | U |
| ద్రుతం | 2 | O |
| లఘువు | 4 | I |

అనుద్రుతం నుండి కాకపాదం దాక ప్రస్తారం చేస్తే 16 అంగాలు వస్తాయి. వాటిలో మూడు మాత్రమేపైన చూపబడినై. ద్రుతవిరామమనే అంగానికి 3 హ్రస్వాక్షరాలు. గుర్తు UO. తాళంలో వచ్చే లఘువు సాధారణంగా నాల్గు హ్రస్వాక్షరాలను ఉచ్చరించడానికి పట్టేకాలం (ఛందస్సులో లాగ 1 హ్రస్వాక్షరోచ్చారణ కాలం కాదు).

| | |
|---|---|
| 8 ksaṇas | - 1 lava. |
| 8 lavas | - 1 kāsta |
| 8 kāṣtas | - 1 nimiṣa |
| 8 nimiṣas | - 1 kalā |
| 2 kalās | - 1 caturbhāga |
| 2 caturbhāgas | - 1 anudruta |

The following are the sthūla kāla (gross) units.

2 anudrutas - 1 druta
2 drutas -1 laghu
2 laghus -1 guru
3 laghus -1 pluta
4 laghus -1 kākapāda

---

Since the verse says half a mātra is druta, two drutas make one mātra which is called laghu, similarly two laghus make a guru, three laghus a pluta Among the above units (1) anudruta (2) druta (3) laghu (4) guru (5) pluta and (6) kākapāda are the six that are called ṣadaṅgas as the fourth vital element of tāla ·-'aṅga'. Now , tālas where guru, pluta and kākapāda are used are no longer in use; the tālas in use today have only three aṅgas namely anudruta, druta and laghu The following are the durations of utterance of short letters and their symbols

| anga | No of shortletters | symbol |
|---|---|---|
| anudruta | 1 | U |
| druta | 2 | O |
| laghu | 4 | I |

It prastāra is done from anudruta to kākapāda it yields 16 angas Only three of them are shown above with symbols Drutavirāma takes three short letters Its symbol is U O The laghu that occurs in a tāla generally signifies now the time taken to utter four short letters (It is not the time taken to utter one short letter as we find it in prosody)

తాళమనేది గీత వాద్యనృత్తాల్లో కాలాన్ని కొలచటం అని చెప్పబడింది. ఈకొలిచే పద్ధతికే 'క్రియ' అనిపేరు. ఇది తాళదశప్రాణాల్లో మూడోదిగా చెప్పబడింది. 37 వ పద్యంలో తాళక్రియతో కాలాన్ని కొలచటానికే 'తాళ' శబ్దం వర్తిస్తుందని చెప్పబడింది. ఈ 'క్రియ' (కొలవడం) అనేది సశబ్దక్రియని నిశ్శబ్దక్రియఅని రెండు రకాలు. చేతిమీద చేతితో చప్పుడయ్యేటట్లుగా దెబ్బవెయ్యటం సశబ్దక్రియ. దీన్నే 'ఘాత' అంటారు. వ్రేళ్లతో చిటిక వెయ్యటం కూడా సశబ్దక్రియే. దీన్ని 'ధ్రువం' అంటారు. చేయి విసరటం లాంటిది నిశ్శబ్దక్రియ.

ఈతాళాలు మార్గతాళాలనీ దేశ్యతాళాలని రెండురకాలు. నాట్యశాస్త్రంలో (1) చచ్చత్పుట (2) చాచపుట (3) షట్పితాపుత్రక (4) సంపద్వేష్టాక (5) ఉద్ఘట్టక - అనే 5 తాళాలు చెప్పబడినై. నారదుని 'సంగీత మకరందం' లోను పార్శ్వదేవుని 'సంగీతసమయసారం' లోను 101 తాళాలు చెప్పబడినై. సంగీతరత్నాకరంలో 120 దేశ్యతాళాలు చెప్పబడినై. వీటిలో రత్నాకరకర్త శార్ఙ్గదేవుడు చెప్పినవి రెండు చేరినై. ఈతాళాలకు గురులఘువులతోడి గణాలతో లేదా సంకేతాక్షరాలతో అంగాలు చెప్పబడినై. తెనుగు సాహిత్యంలో పాల కురికి సోమనాథుడు తన కాలంలో ఉండిన 108 తాళాల పేర్లు చెప్పినాడు. ప్రాచీనులు చెప్పిన పేర్లకు ఇతడిచ్చిన పేర్లకు కొన్ని తేడాలు కనిపిస్తున్నై. సోమనాథుడు చెప్పిన తాళాల పేర్లివి : (1) చంచుపుట (2) జాచపుట (3) షడ్గీత (4) ఉత్పుట (5) మోచిత (6) సమతాళ (7) సత్రచ్ఛేద (8) ఎగ (9) బొంబడ (10) ఎడ (11) హడ (12) గారు (13) హడక (14) బంధకరణ (15) బాడకరణ (16) క్రౌంచపద (17) సరకరణ (18) ఆస్థానమండప (19) ఫల (20) చక్రవాక (21) కలహంస (22) ఆర్య (23) లలిత (24) సరళ (25) విరళ (26) ఉమామందిర (27) మత్తమాతంగ (28) రథ్య (29) మర్థి (30) ముదవ (31) బంధమర్థి (32) రూపక (33) ఏక (34) మడ (35) ఖండితతర (36) అఖండ (37) కంకాళ (38) ఖండిత చండకి (39) ఖండవర్ణ (40) అవిఘూర్ణిత (41) కుటిలఘూర్ణిత (42) గోష్ఠి (43) అర్ణ (44) కచ్చస (45) అణ (46) ఆదిమాతృక (47) తరక్షణపుత్రి (48) ఉద్వీక్షణ (49) ఉచ్చవటి యుక్షోళిక (50) చటిక (51) యుష్టిక (52) పూర్వకంకాళ (53) మణిమిశ్ర కంకాళ (54) ఖండ కంకాళ(55) కావ్యకంకాళ (56) పంచాళి (57) భిన్నక (58) కోకిల ప్రియ (59) నిరవద్య (60) రన్న (61) కుంజర (62) ఫణి రాజ (63) చతురశ్రధార (64) కృత్యచ్ఛ (65) విద్యాధర (66) రక్తధార (67) ఉత్తమమేరు (68) తాంబూలియాణ (69) మలపు (70) ఉత్ఫుల్లిక (71) మాతంగ (72) అర్ధకళిక (73) సరస్వతి (74) కంఠాభరణ (75) మిశ్ర (76) సమ్మిశ్రవాద (77) సింహవిక్రీడిత (78) సింహనాద (79) సింహనంద (80) లక్ష్మీస్తన (81) ముక్త (82) పంచబ్రహ్మ (83) దశరుద్ధ (84) పంచ (85) చాయణ (86) పరి

Earlier it has been stated that tāla is measurement of time in gīta, vādya and nṛtta. The mode of measurement is called 'kriya'. This is enumerated as the third vital element of tāla among the ten. The 37th verse says the term tāla applies to measurement of time by tālakriya. This 'kriya ' (operation of measurement) is of two kinds: (1) saśabda kriya and (2) niśśabda kriya. Beating of time by beat of one hand on the other so as to give out a sound is sasabda kriya It is called 'ghāta' or 'the stroke'. Snapping one's fingers is also 'sa śabda kriya'; It is called 'dhruvam'. A mere waving of the hand one way or the other is 'niśśabda kriya'.

Tālas are of two varieties: 'mārga' and 'dēśi' . 'Nātya sāstra' mentions five mārga tālas only: (1) caccatpuṭa (2) cācapuṭa (3) ṣatpitāputraka (4) saṁpadveṣṭāka and (5)udghaṭṭaka. Sangīta Makaranda of Nārada; Sangīta Samaya Sāra' of Pārśvadēva enumerate 101 tālas. Sangīta Rantnākara gives 120 dēśya tālas including two created by Sārngadēva himself. The angas for these tālas are given by symbolic letters or gaṇas comprising gurus and laghus. In Telugu literature Pālakuriki Sōmanātha (13c) has enumerated the names of 108 tālas prevalent in his time; but some names are different from those given by ancients The names of tālas given by Sōmanātha are :

1.cancupuṭa. 2.Jācapuṭa (3) sadgīta (4) utpuṭa (5) mōcita (6) sama (7) sattracchēda (8) ega (9) bombaḍa (10) eda (11) haḍa (12) gāru (13)hadaka (14) bandhakarana (15) bādakaraṇa (16) krauncapada (17) sarakaraṇa (18) āsthānamanḍapa(19)phala (20)cakravāka(21)kalahaṃsa (22)ārya (23) lalita (24) sarala(25)virala (26)umā-mandira (27)mattamātaṇga (28)rathya (29)maṭṭhe (30) mudava (31) bandhamaṭhe (32)rūpaka (33)ēka (34)maḍa (35) khanditatara (36)avakhanda (37)kankāla (38)khandita candaki (39)khanda varṇa (40) avighūrṇita (41) kutilaghūrnita (42)gosṭhi (43)arna (44) kaccana (45)āna (46)ādimātṛka (47)taraksnaputri(48)udvīksaṇa(49)uccāvati yaksōlika (50) caṭika (51)yaṣṭika (52) pūrva kaṃkāḷa(53)manimiśrakankāḷa (54) khandakankāla (55) kāvya kankāla(56)pancāli (57)bhinnaka (58)kōkilapriya (59)niravadya (60)ranna (61)kunjara (62)phaṇirāja (63)caturaśradhāra (64)kṛtyaccha (65)vidyādhara (66)raktadhāra (67)uttamamēru (68)tāmbūliyāṇa (69)malapu (70)utphullika (71)mātaṅga (72)ardhakaḷika (73)saraswati (74)kanṭhābharaṇa (75)miśra (76)sammiśra vāda (77)simhavikrīdita (78) simhanada (79)simhananda (80)lakṣmīstana (81)mukta (82)panca brahma (83)daśaruddha (84) panca (85)cāyaṇa (86) pari (87)prasakta (88)khura (89)visarakhura (90)uttara

(87) ప్రసక్త (88) ఖుర (89) పౌసరఖుర (90) ఉత్తర (91) పంచబాణ (92) హరిణ (93) మాయాఖణ (94) ఆదికంకాణ (95) ఖంజర (96) చతురశ్ర ఖంజర (97) కృష్ణఖంజర (98) అసమాన ఖంజర (99) లక్ష్మవతి (100) ధ్రువ (101) లయ (102) తనుభద్ర (103) లక్ష్మణయాణ (104) విళంబిత (105) ఆదిమర్ధి (106) వళి (107) ధ్రువమర్ధి (108) జంపెమర్ధి (పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణం)

పేర్లు తెలిసినా ఈ తాళాల స్వరూపం తెలియరాదు. ప్రాచీనులు చెప్పిన తాళాలతో సంవదించే వాటి అంగాలు తెలుసుకోవచ్చు.

దక్షిణ భారతీయ గానంలో నేడు ప్రచారంలో ఉన్న తాళాలు ఏడు. వాటి పేర్లు, అంగాలు క్రింద చూపబడుతున్నై.

| <u>తాళం పేరు</u> | <u>అంగాలు</u> |
|---|---|
| (1) ధ్రువతాళం | I0II |
| (2) మఠ్య | I0I |
| (3) రూపక | 0I |
| (4) జంపె | IU0 |
| (5) త్రిపుట | I00 |
| (6) అట | II00 |
| (7) ఏక | I |

తాళాలు త్ర్యశ్ర, చతురశ్ర భేదంతో రెండు రకాలు. ఈ రెండూకలపితే మిశ్రమనే భేదం వస్తుంది. మిశ్ర త్ర్యశ్రలను కలిపి రెండుగా ఖండిస్తే ఖండజాతి వస్తుంది. ఖండ చతురశ్రాలను కలిపితే సంకీర్ణ జాతి వస్తుంది. లఘువుకు ఈవిధంగా విలువను మార్చ టంతో అది 5 రకాలైనై 7 తాళాలు 7 X 5 = 35 రకాలు అయినై. పంచలఘువుల వివరాలివి.

| <u>లఘువు</u> పేరు | విలువ | మాత్రలు | గుర్తు | గణనం |
|---|---|---|---|---|
| త్ర్యశ్ర లఘువు | 3 అక్షరాలు | 3/4 | $1^3$ | ఘాతవేసి 2వ్రేళ్లు ఎంచాలి |
| చతురశ్ర లఘువు | 4 అక్షరాలు | 1 | $1^4$ | ఘాతవేసి 3వ్రేళ్లు ఎంచాలి |
| మిశ్ర లఘువు | (3+4) = 7 అక్షరాలు | 1 3/4 | $1^7$ | ఘాతవేసి 6వ్రేళ్లు ఎంచాలి |
| ఖండ లఘువు | $\frac{7+3}{2}$ = 5 అక్షరాలు | 1 1/4 | $1^5$ | ఘాతవేసి 4వ్రేళ్లు ఎంచాలి |
| సంకీర్ణ లఘువు | (5+4) = 9 అక్షరాలు | 2 1/4 | $1^9$ | ఘాతవేసి 8వ్రేళ్లు ఎంచాలి |

(91)pancabāna (92)hariṇa (93)māyākhaṇa (94)ādıkaṅkāna (95)khanjara (96)caturaśra khanjara (97)kṛṣṇakhanjara (98)asamāna khanjara (99)lakkhavatı (100) dhruva (101) laya (102)tanubhadra (103)lakkhanayāṇa (104)vilambita (105)ādimatthe (106) vaḷi (107) dhruvamaṭṭhe (108) jampe maṭṭhe .(Panditārādhaya caritra-parvata prakaraṇa).

Though the names are known their forms are not known The angas of those that correspond with the more ancient ones can perhaps be known .

In south Indian music there are seven tālas in use today Their names and aṇgas are given below

| Name of tāla | aṅgas |
|---|---|
| 1.Dhruva | 1011 |
| 2.Mathya | 101 |
| 3.Rūpaka | 01 |
| 4.Jampe | 1U0 |
| 5.Triputa | 100 |
| 6.Āta | 1100 |
| 7.Ēka | 1 |

Tālas are generally of. two kjinds depending on the value given to laghu. If the value is 3 short letters it is tryaśra. If the value is 4 short letters it is caturaśra. Other varieties arise out of these two. If tryaśra and caturaśra are mixed we have a miśra jāti laghu whose value is 7 short letters If tryaśra is added on to this miśra and cut into two (7+3=10/2=5) we get a khanda jātı laghu with the value of 5 short letters. If a caturaśra laghu is added on to the khanda laghu we get what is called a sankīrṇa laghu with 5+4=9 short letters. By changing the value of laghu thus the above shown seven tālas multiply themselves into 7x5=35 varieties. The details of the type of laghus are given below.

| Name of laghu | Value in no letters (short) | matras | symbol | counting |
|---|---|---|---|---|
| 1. trya'śra laghu | 3 | 3/4 | $1^3$ | 1 beat and count 2 fingers |
| 2.caturaśra laghu | 4 | 1 | $1^4$ | 1 beat count 3 fingers |
| 3.miśra laghu (3+4) | 7 | $1^3/_4$ | $1^7$ | 1 beat and count 6 fingers |
| 4. Khaṇḍa laghu (7+3/2) | 5 | $1^1/_4$ | $1^5$ | 1 beat and count 4 fingers |
| 5. sankīrṇa laghu (5+4) | 9 | $2^1/_4$ | $1^9$ | 1 beat and count 8 fingers |

తాళం వెయ్యటంలో వచ్చే సశబ్ద నిశ్శబ్ద క్రియలు కూడా మార్గదేశి భేదంతో రెండు రకాలు. దేశ్యక్రియలు మాత్రం ఇక్కడ చెప్పబడుతున్నై.

<u>సశబ్దక్రియ:</u> ధ్రువకం. చప్పుడయ్యేటట్లుగా కుడిచేత్తో దెబ్బవెయ్యటం లేదా వ్రేళ్లతో చిటిక వెయ్యటం.

<u>నిశబ్దక్రియలు:</u>

(1) సర్పిణి : చేతిని ఎడమవైపునకు విసరటం

(2) కృష్య : ఎడమకు ఉన్న చేతిని కుడివైపునకు విసరటం

(3) పద్మిని : అరచేయి క్రిందకు మళ్లించి చేయిచాచుట

(4) విసర్జితం : అధోముఖ హస్తాన్ని వెలుపలికి విసరటం

(5) విక్షిప్తం : అలా విసరినచేతి వ్రేళ్లను ముడుచుట

(6) పతాక : చేతిని పైకి విసరుట

(7) పతిత : పైకి విసరిన చేతిని క్రిందికి తెచ్చుట

అనుద్రుతానికి ధ్రువకమనే సశబ్దక్రియ వాడాలి. ద్రుతానికి ధ్రువకమనే సశబ్దక్రియ, విసర్జిత అనే నిశ్శబ్దక్రియ వాడాలి. అంటే ఘాతవేసి పిమ్మట చేతిని వెనక్కి విసరాలి. ఇది రెండక్షరాల కాలం అవుతుంది. ఇంక లఘువుకు ధ్రువకమనే సశబ్దక్రియ, విక్షిప్త అనే నిశ్శబ్దక్రియ వాడాలి. ముందు ఘాతవేసి ఆపిమ్మట చిటికెన వ్రేలు మొదలుగా ఆ లఘుజాతికి తగినట్లు వ్రేళ్ళు లెక్కించాలి.

పురందరదాసు ఈ దేశ్యతాళాలు 35కి స్వరసంచారంతో అలంకారాలు కూర్చినాడు. వీటిసాధన వల్ల స్వరజ్ఞానం తాళజ్ఞానం కలుగుతాయి. ఉదాహరణకు ధ్రువతాళానికి 1011 (లఘువు, ద్రుతము లఘువు లఘువు) అంగాలు. దీంట్లోని లఘువు చతురశ్రజాతి లఘువు అనుకొంటే అప్పుడు దానికి 10 ఆవర్తాలతో

సరిగమ / గరి / సరిగరి / సరిగమ.

(లఘువు) (ద్రుతం) (లఘువు) (లఘువు)

అనే స్వరసంచారంతో ప్రారంభం ఉంటుంది. తొలిఖండంలో 5 ఆవర్తాలు మలిఖండంలో 5 ఆవర్తాలు ఉంటాయి. తొలిఖండంలో మధ్యస్థాయి షడ్జస్వరంతో ప్రారంభం. మలిఖండంలో తారస్థాయి షడ్జస్వరం. తొలిఖండం చివరి ఆవర్తంలో చివర తార షడ్జం ఉంటుంది. మలిఖండం చివరి ఆవర్తం చివర మధ్యషడ్జం ఉంటుంది. తొలిఖండపు స్వరప్రస్తారాలు ఆరోహణ క్రమంలోను మలిఖండపు స్వరప్రస్తారాలు అవరోహణ క్రమంలోను ఉంటాయి. ఒక్కొక్క తాళాక్షరానికి ఒక్కొక్క స్వరం చొప్పున ఉంటుంది.

The saśabda and niśśabda kriyas in tāla also are of two kinds: mārga kriyas and dēśyakriyas Only dēśya kriyas are described below.

Saśabda kriya: It is called dhruvaka: A beat with the right palm on the left causing sound or snapping one's fingers similarly

niśśabda kriyas:

1 sarpini: waving the palm to the left
2. krsya: waving the palm in the left to the right
3. padmini: turning the palm downwards and stretching the hand
4 visarjita: palm facing downwards is waved outwards
5 viksipta:bending the fingers of the hand so waved
6.patāka . waving the hand upwards.
7 patita: bringing the hand downwards so waved

In tāla, an anudruta is counted by the saśabdakriya called dhruvaka; for a druta it is a saśabda kriya dhruvaka and niśśabda kriya called visarjita It means a beat and then waving the palm backwards It is equal to a duration of 2 short letters . For a laghu, saśabda kriya dhruvaka and niśśabda kriya viksipta are used That means a beat first and then counting the fingers starting with the small finger and one less than the value of laghu ( The beat itself counts for one letter)

Purandaradasa is said to have composed alamkāras for all the 35 varieties of tālas with svara sancāra. Practising these is said give svarajñana and tālajñāna to the student For example dhruva tāla has the aṇgas 1011 (laghu, druta,laghu and laghu). Suppose the laghu belongs to caturaśrajāti then the alamkāra will start with

sa ri ga ma / ga ri/ sa ri ga ri/sa ri ga ma
(laghu) (druta) (laghu) (laghu)

and will have 10 rounds or āvartas.

The entire svarasancāra can be written down based on the following principles: The first half and second half will have equal number of āvartas i.e 5 and 5 in the present case The first half starts with madhyasthāyi sadjasvara and the second half starts with tārasthāyai sadjasvara. The last round of the first half will have tārasadja; similarly the last round of the second half will have madhyaṣadja. The svaraprastāra in the first half will be in ascending note (arōhana ) and that of the second half will be in descending note (avarōhana krama) Each tāla letter will be represented by one svara

1. తెనుగులో పాలూరి గోవిందకవి ఈక్రింది గ్రంథాలు రచించాడు.

(a) తాళదశ ప్రాణప్రదీపిక - తంజావూర్ సరస్వతీమహల్ లైబ్రరీవారి ప్రచురణ (13)(1950)

(b) రాగాతాళచింతామణి - గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాసు సీరీస్ L xxxx1 - (1952)

2. అనుద్రుతానికే విరామం, వ్యంజనం, అవ్యక్తం, అనునాసికం అనే పేర్లుకాడా ఉన్నె. ద్రుతానికి వలయం, బిందుకం, వ్యోమం, అర్ధమాత్ర అనిపేర్లు. లఘువుకు కళ, హ్రస్వం, మాత్ర అని పేర్లు.

3. లఘువు జాతి (త్ర్యశ్ర, చతురశ్రాది) ననుసరించి తాళం భేదిస్తుంది. పద్యాల త్ర్యశ్ర, చతురశ్రాది గతులననుసరించి కొన్ని వృత్తాలు ఆయాగతులకు బాగుంటాయని తలచటం సహజమే. ఏగతిలో ఏయే వృత్తాలు నడుస్తాయో కొన్ని ఉదాహరణలు సూచింపబడుతున్నవి.

(1) త్ర్యశ్ర గతి (3 మాత్రల గణాలు) - సుగంధి, విచికిలత, పంచచామరం వగైరా.

(2) చతురశ్ర గతి (4 మాత్రల గణాలు) - తోదకం, తోటకం, ప్రహరణ కలిత, మణిగణనికరం, విద్యున్మాల, మానిని, సరసిజం, క్రౌంచపదం, కవిరాజవిరాజితం వగైరా.

(3) ఖండగతి (5 మాత్రల గణాలు) - స్రగ్విణి, త్వరితగతి, వనమయూరం, భుజంగ ప్రయాతం, పద్మనాభం, లయగ్రాహి, లయవిభాతి, లయహారి, మంగళమహాశ్రీ, దండకం వగైరాలు

(4) మిశ్రగతి (7 మాత్రల గణాలు) - తరల, మత్తకోకిల వగైరా

రగడ భేదాలు యక్షగానాల్లో వాడబడుతాయి. ఆభేదాలు వాటికి సంబంధించిన తాళాలు 50 పద్యం క్రింద ఇయ్యబడును.

1 In Telugu, Pōlūri Gōvindakavi has written the following two treatises on tāla.

(a)Tāla Daśa Prāna Pradīpika-published by Tanjore Saraswati Mahal Library S.No.13 (1950)
(b)Rāga Tāla Cintamāni published by Government Oriental Mss. Library, Madras-5. Series Lxxxx1 (1952)

2 a anudruta is also variously called virāma, vyañjana, avyakta and anunāsika.
b.druta is also variously called valayam, binduka, vyōma and ardhamātra.
c. laghu is also variously called kala, hrasva, sarala and mātra

3.Depending on the jati of laghu the tāla varies considerably It is natural that certain vṛttas are considered suitable for tryaśra, caturaśra etc gati-s Some examples are given below.

1 tryaśra gati (gaṇas with 3 mātras) Sugandhi, Vicikilita, Pancacāmaram etc

2. caturaśra gati (gaṇas with 4 mātras) Tōdaka, Tōṭaka, Praharanakalita, Maniganānikara, Vidyunmāla, Ma-nini, Sarasija, Krauncapada, Kavirājavirājita etc ;

3. khandagati (ganas with 5 mātras) Sragvini, Tvaritagati, Vanamayūra, Bhujaṃgaprayāta, Padmanābha, Layagrāhi, Layavibhati, Layahāri, Mangalamahāsri Daṇḍaka etc.,

4. miśragati (gaṇas with 7 mātras) Tarala, Mattakōkila etc.

Different kinds of ragaḍas are used in yakṣagānas... Those varieties and their tālas will be given under verse 50

వ॥ ముందు జెప్పిన నిబంధనామ పదంబునకు నవయవంబులైన యవాంతరపదంబులకు
నామంబు లెయ్యవి యనిన

క॥ మొదలుద్గ్రాహము, రెండవ
యది మేళాపము, తృతీయమగు ధ్రువ, మటపై
గదిసిన యది యంతర, మా
తుది నాభోగంబు ముద్రతోఁ జెలువొందున్ 38

తా॥ ముందు చెప్పిన నిబంధ పదమనే దానికి అవయవాలైన విడిపదాలకు పేర్లువివంటే పదం ఎత్తుకోగానే వచ్చేది ఉద్గ్రాహం, రెండోదశలో వచ్చేది మేళాపం, మూడోది ధ్రువం, ఆమీదట వచ్చేది అంతరం, అటుపై చివరగా వచ్చేది ముద్రతోకూడి ఆభోగం అనేపేరుతో అందంగా ఉంటుంది.

వ్యా॥ నిబద్ధపదానికి అంగాలైన యతిప్రాసలను తాళాన్ని గూర్చివలికి పదానికి అవయవాలైన భాగాలకు పొసగే పేర్లను గూర్చి ఇక్కడ చెప్తున్నాడు. 26 పద్యంలో కూర్చినపదాన్ని శరీరంగా దర్శించి ఆకూర్పునకు ఆధారంగా నిల్చిన వృత్తబంధాల్ని (ఛందస్సుల్ని) ధాతువులుగా చెప్పాడు. అక్కడ పాట రూపంగా ఉండే శరీరానికి ధాతువులను చెప్తే ఇక్కడ ఆపాటలోని భాగాలకు పేర్లను చెప్తున్నాడు.

ఇక్కడ ఒక అంశం గమనించాలి. పదశరీరానికి వృత్తబంధం అనేది (ఛందస్సు) ఒక్కటేకదా అందుచేత ధాతువుకూడా ఒక్కటే అనుకోరాదు. శరీరానికి కారణాలైన వాతపిత్త శ్లేష్మాలనే మూడు ధాతువులు చెప్పబడినై. అవివేర్వేరైనా ధాతుత్వం అనే లక్షణం వాటిలో సామాన్యం. అలాగే వృత్తబంధం అనబడిన ఛందస్సు అక్కడ సామాన్యం అని అదేఛందస్సులో పదశరీరమై భిన్నధాతుకాలైన మూడు చరణాలైనా ఉంటాయని గ్రహించాలి. శరీరం త్రిధాతుకమైనట్లుగానే పదము త్రిధాతుకమనేభావం దీనికాధారం.

సంగీతశాస్త్ర గ్రంథాల్లో ధాతువులని చెప్పబడ్డ ఉద్గ్రాహాదుల్నే మనగ్రంథకర్త ఇక్కడ చెప్తున్నాడు.

గ్రంథకర్త పదంలోని అవాంతరపదాలకు (విడిభాగాలకు) చెప్పినవి. (1) ఉద్గ్రాహం (2) మేళాపం ( 3) ధ్రువం (4) అంతర (5) ఆభోగం. సంగీత రత్నాకరం వీటిని ధాతువులుగా చెప్పి వివరించిన శ్లోకాలివి:

"ప్రబంధావయవో ధాతుః స చతుర్ధానిరూపితః
ఉద్గ్రాహః ప్రథమ స్తత్ర తతో మేలాపక ధ్రువౌ ॥
ఆభోగశ్చేతి తేషాంచ క్రమాల్లక్ష్మాభిదధ్మహే
ఉద్గ్రాహః ప్రథమో భాగ స్తతో మేలాపకః స్మృతః ॥
ధ్రువత్వాచ్చ ధ్రువః పశ్చాదాభోగస్త్వన్తిమో మతః
ధ్రువాభోగాంతరే జాతో ధాతురన్యో న్తరాభిధః ॥
సతు సాలగసూడస్థ రూపకేష్వేవ దృశ్యతే
వాతపిత్తకఫా దేహ ధారణా ద్ధాతవోయథా ॥
ఏవమేతే ప్రబంధస్య ధాతవోదేహధారణాత్
తత్ర మేలాపకా భోగా నభవేతాం క్వచిత్ క్వచిత్"॥

(సంగీ. రత్నా. 4-7/11)

సంగీతరత్నాకరాన్ననుసరించి కూడ ఉద్గ్రాహం మొదటిది, తర్వాతివి మేలాపక ధ్రువలు; ఆభోగం చివరిది. ధ్రువాభోగాల మధ్యనిర్మింపబడేది అంతర. వీటిలో ఉద్గ్రాహం అనేది అన్వర్థసంజ్ఞ. పదాన్ని 'ఎత్తుకోవడం' అనేది ఉంటుంది. కనుకనే దీన్ని 'ఉద్గ్రాహం' అన్నారు. నేడుమనం దీన్ని 'ఎత్తుగడ' గా పలుకవచ్చు. ఉద్గ్రాహ ధ్రువలను మేలనం (కలపడం) చేస్తుంది గనుక రెండోది మేలాపకం అయింది. ధ్రువత్వం - అనగా నిలకడ వలన ధ్రువ. 'ఆభోగః పరిపూర్ణతా' అనే అభిధానంవలన పదానికి నిండుదనం (పూర్తి కావడం) దీంతో వస్తుంది గనుక ఇది ఆభోగం. ముగింపు అని అభిప్రాయం. వీటిలో అంతర, మేలాపకాలు అప్రధానాలనే చెప్పాలి. 'అంతర' అనేది సాలగసూడ ప్రబంధాలని చెప్పబడే ధ్రువ, మంఠ, ప్రతిమంఠ, నిస్సారుక, అంకతాల, రాసక, ఏకతాలీ ప్రబంధాలకే పరిమితంగాను, 'దృశ్యతే' అని దృశగ్రహణం చేయటంచేత ధ్రువాది ప్రబంధాల్లోకూడ ప్రాచీనులు ఎక్కడ 'అంతర' ను నిర్మించారో అక్కడ మాత్రమే నిర్మించవచ్చునని, దీన్నిబట్టి మంఠాదుల్లో అంతర కనబడుతోందిగనుక మంఠాదుల్లో చేయవచ్చునని, ధ్రువాప్రబంధంలో కనబడటంలేదు గనుక అక్కడ చేయరాదని తెలుసుకోవాలంటూ కల్లినాథుని వ్యాఖ్య.

సంగీతశాస్త్ర గ్రంథాల్లో 'పల్లవము' అనబడ్డదే ఈగ్రంథంలో 'పల్లవి' అనబడింది. నేడుమనంకూడ 'పల్లవి' అనే అంటున్నాము. అయితే శాస్త్రగ్రంథాల్లో ప్రాక్ప్రసిద్ధ దేశీ రాగాల్లోను విభాషారాగంగాను చెప్పబడిన 'పల్లవీ' అనే రాగంకూడా ఒకటిఉంది. దానికీ దీనికీ సంబంధంలేదు.

'Prabandhāvavavō dhātuh sa caturdhanırupitaḥ
udgrāhah prathamastatra talō mēlāpakadhruvau
ābhōgascētı tesām ca kramāllaksmābhidadhmahē
udgrāhaḥ prathamōbhāga statō mēlāpakaḥ smrtah
dhruvatvācca dhruvaḥ pascādābhōgastvantimō mataḥ
dhruvābhōgantarē jāto dhāturanyō ntarābhidhaḥ
sa tu sālaga sūdastha rūpakēsvēva drŝyatē
vātapıtta kaphā dēha dhāranāddhātavō yadhā
evam ētē prabandhasya dhātavō dēhadhāraṇāt
tatra mēlāpakābhōgau na bhavētām kvacıt kvacıt.

(S R 4-7/11)

Accordıng to S R too udgrāha ıs the fırst, next come the two, mēlāpaka and dhruva; ābhōga ıs the last, that whıch ıs woven between dhruva and ābhōga ıs antara Among these, udgrāha ıs a meaningful name Baecause there ıs takıng up of the padam (startıng /commencıng) ıt ıs called 'udgrāha' Because 'udgrāha and dhruva are made to joın together the second ıs termed mēlāpaka The thırd ıs called dhruva because of its stabılıty Sınce ābhōga means completeness, the last part whıch concludes the song called ābhōga Among these mēlāpaka and antara are not so ımportant The fourth called antara occurs only ın sālaga sūdaprabandhas-namely dhruva, manṭha, pratımantha,nıssāruka,ankatāla, rāsaka and ekatālī prabandhas As the text says 'dṛŝyatē'(ıs seen),commentator Kallınātha says that even among these antara can be woven only where ancıents have done ıt. He clınches the ıssue sayıng sınce ıt ıs seen ın mantha etc. ıt can be done ın them and sınce ıt ıs not seen ın dhrūva prabandha ıt should not be done there.

What ıs called pallavam (tender leaf) ın musıcal treatıses ıs called pallavı ın thıs work; of course we are also callıng ıt pallavı today But there ıs also a rāga called 'pallavī' among the dēŝı-rāgas well known ın olden days (a vıbhāsā rāga ) Thıs has nothıng to do wıth the 'pallavi' we are dealıng wıth

పదం లేదా పాటలోని విడివిడి భాగాలకు చెప్పిన ఈధాతువులు అనేవి ప్రధానంగా స్వరసంబంధులు. ఏలాది గీత ప్రబంధాలకు చెప్పబడినట్లే తంత్రీవాద్యమైన వీణకు దీన్ని ననుసరించి సుషిరవాద్యమైన వంశవాద్యానికి (పిల్లనగ్రోవి), అట్లే వాద్యప్రబంధాలకు ధాతు విచారం ఉంది. ఇవి వరుసగా సమానాలు కావుకాని అపారిభాషిక పదాలు ఇలా ఉంటాయి.

| గీత ప్రబంధాలు | వీణ-వేణువు | వాద్యప్రబంధం |
|---|---|---|
| 1. ఉద్గ్రాహం | 1. విస్తారజ (14) | 1. లహరి |
| 2. మేళాపకం | 2. కరణ (5) | 2. మెరుపు |
| 3. ధ్రువ | 3. ఆవిద్ధ (5) | 3. అంతర |
| 4. అంతర | 4. వ్యంజన (10) | 4. ఉపాంతర |
| 5. ఆభోగం | | 5. ముక్తాయి |

(మధ్యవరుసలో కుండలీకరించిన అంకెలు ఆయావాని అంతర భాగాలను సూచిస్తాయి.)

గీతప్రబంధంలో ధాతువులు గేయాంశానికి చెందిన సరిగమలనబడే స్వరాలు. వీణవంటి తంత్రీవాద్యల్లో ఇవి ఘాత (ప్రహారం) వల్ల పుట్టేస్వరాలు. వీణలో లాగే వేణువాద్యం లోను ధాతువులను కల్పించాలని శాస్త్రంచెప్తున్నది. ఈనాడు ఈధాతువులను గూర్చిన ప్రసంగం సాధారణంగా వినబడదు. పాటను సరిగమలలో స్వరపరచడమే ధాతుకల్పనం అని చెప్పవచ్చు. ఇది పాడగలవారందరు చేయగలపనికాదు. శాస్త్రం చక్కగా తెలిసి అనుభవరసికులైన ఏకొందరికో సాధ్యంగా ఉండేపని. ఉదాహరణకు తాళ్లపాకవారి సంకీర్తనలు రాగరేకులమీద లభ్యమౌతున్నా 'మాతు' దొరికినట్లేకాని 'ధాతువు' దొరికినట్లుకాదు. ఆపాటలకు రాగనిర్దేశం మాత్రమే ఉంది; ఒక్కటిరెండుచోట్ల తప్ప తాళనిర్దేశంకూడా లేదు. రాగాలపేర్లు తెలిసినా ఆయారాగాలను అనాడు ఎలా పాడేవారో స్పష్టంగా తెలియదు. కనుక వాటిని ఒకతాళానికి యోజించి స్వరం వెయ్యటం సులభంకాదు. అందుచేతనే తిరుమల తిరుపతి దేవస్థానము వారు సంగీతసాహిత్యాల్లో ఆరితేరిన వారిచేత ఏకొన్నింటికో అపని నిర్వహింపచేశారు. వాగ్గేయకారునికి ధాతు మాతువులు రెండుకూర్చడంలో నేర్పుఉండాలి. వాక్కైన 'మాతు', గేయమైన 'ధాతువు' రెండూ కూర్చగలవాడైనందుచేతనే అతడు 'ఉభయకార' శబ్దంతో చెప్పబడ్డాడు. అపదబంధమే 'బయకార'గా మారింది. 'రాయబయకార' అనేది కొందరకు రాజాస్థానంలో వాగ్గేయకారులుగా ఉండిన కారణాన బిరుదం కూడ అయింది.

సాహిత్య రచనలాగే సంగీత రచనకూడ గొప్పశిల్పం. సాహిత్యంలోలాగే ఇక్కడా జ్ఞాతశిల్పులు కొందరు; యదృచ్ఛాశిల్పులు కొందరు. పదరచనలో చివర వాగ్గేయకారుని

The dhātus that are mentioned as appropriate 'pallavi' for the individual words of the padam pertain to the svaras or musical notes Just as they are enjoined in the case of gītaprabandhas they are enjoined to the stringed instrument vīna and following it, to the wind-instrument flute, as also the vādya-prabandhas The following are the names of dhatus in various branches (These should not be taken to be one to one equivalents Merely the technical terms are presented )

| gītaprabandhas | vīna/vēnu | Vādyaprabandhas |
|---|---|---|
| 1 udgrāha | 1 vistāraja(14) | 1 laharī |
| 2 mēlāpaka | 2 karaṇa(5) | 2 yeduppu |
| 3 dhruva | 3 āviddha(5) | 3 antara |
| 4.antara | 4 vyañjana(10) | 4 upāntara |
| 5 ābhōga | | 5 muktāyi |

Numbers in the middle row indicate subdivisions under each general head

In a gītaprabandha these dhātus are the musical notes, sa, ri, ga,ma,pa, ,dha,ni pertaining to the musical element In a stringed instrument like vīna these are the svaras born from twanging or plucking the strings Sangīta śāstra says that dhātus should be created on flute also as is done on vīna

Today we do not generally hear about these dhātus It is the writing down of the notation in terms of musical notes that may be called dhātu kalpana Not all those that sing can do it It is something that can be done only by a few who are well-versed in musicology and talented For example though the sankīrtan compositions of Tāllapāka poets are a available on the copper plates it is only the mātu (libretto ) that is available and not the dhātu (music ) Those copper plates contain only the names of the rāgas, even tāla is not given except in one or two places Though the names of the rāgās are known, we do not know how those rāgās were sung those days So it is not an easy thing to set them to a tāla and the given raga It is because of this kind of difficulty that the T T Dēvasthānam authorities got only some of them set to music by scholars in music and literature A vāggēyakāra (music composer ) must be skilled in composing both the dhātu and mātu Becuase he is able to compose the words of text that is mātu and the music that is dhātu he is called 'ubhayakāra' (one who does both) This compound has degenerated into 'bayakāra' For those who were appointed in royal courts as music composers 'rāya-bayakāra' became a title

Like literature, composition of music is a great art of sculptural beauty Again as in literature, here also some are conscious artists, some unconscious

ముద్ర ఉండాలనేది నియమం. త్యాగరాజకృతుల్లో 'త్యాగరాజనుత' అనేది చివర వినబడటం మనమెరిగిందే. కాని దీనికి అపవాదాలు లేకపోలేదు. తాళ్లపాక వారి సంకీర్తనలలో ముద్రలేదు. ముద్ర ఉండేవాట్లో అది ఇష్టదేవతాముద్ర, ఆచార్యముద్ర, క్షేత్రముద్ర, ప్రభుముద్ర వగైరాల్లో ఏదైనా ఒకటి ఉంటుంది. అలాగే పదంలో రాగతాళాలు రెండు చెప్తే రాగతాళముద్ర, రాగం మాత్రం చెప్తే రాగముద్ర. దీనివల్ల ప్రయోజనమేమంటే ఆరాగతాళాలు ప్రసిద్ధంగా వాడుకలో ఉండేవైతే వాటి స్వరూపం సులభంగా తెలుస్తుంది.

కర్ణాటక సంగీతంలో త్రిమూర్తులనిపించుకున్నవారిలో ముత్తుస్వామి దీక్షితర్ సంగీత రచనాశిల్పంలో జ్ఞాతశిల్పులు; ఆయన రచనల్లో రాగముద్రలేనివి అరుదు. శ్యామశాస్త్రి, త్యాగరాజు యదృచ్ఛాశిల్పులు. దీక్షితర్ హంసధ్వని రాగం, ఆదితాళంలో కూర్చిన 'వాతాపిగణపతింభజే . . .' అనే ప్రసిద్ధకృతిలో చివర '<u>హంసధ్వనిభూషిత హేరంబం</u>' అనిరాగముద్ర ఉంది. శ్యామశాస్త్రి కల్యాణిరాగం రూపకతాళంలోకూర్చిన 'హిమాద్రిసుతే పాహిమాం వరదేవతే' అనేకృతిలో చివరిచరణంలో 'కరిముఖ కుమారజనని కాత్యాయని <u>కల్యాణి</u>' అనిరాగముద్ర. త్యాగయ్యవారి '<u>మోహనరామ</u>' అనేకృతి మోహనరాగంలోనే ఉంది. హరికథారచయితలు కొందరు తాళముద్ర, రాగతాళముద్రలు రెండుకూడ కూర్చిన వారున్నారు. ఈపద్ధతి రాగతాళాల పేర్లు చెప్పటంవరకే పరిమితం. వివరాలు తెచ్చుకోవాలి. ఇలాకాకుండా పదం కూర్చడంలోనే స్వరాక్షరాలైన సరిగమలను కూర్చేపద్ధతి కూడా ఒకటి ఉంది.

పదాలు, కృతులు, కీర్తనలు, సంకీర్తనలు ధాతుమాతు సమాహారాలు. మాతువు మాటలకూర్పు. ధాతువు స్వరాల కూర్పు. అంటే స-రి-గ-మ-ప-ధ-ని అనే సప్తస్వరాలకే పరిమితంగా ఉంటుంది. ధాతుమాతువులకు అభేదంగా స్వరాక్షరాలు వచ్చేటట్లు కూర్చితే దాన్ని 'స్వరాక్షరం' అంటారు. ఇలాగ ధాతుమాతువులకు అభేదంగా కూర్చిన సంగీతరచనను 'స్వరార్థ' ప్రబంధమని 'స్వరాక్షర ప్రబంధ'మని శాస్త్రకారులు అంటారు. సంగీతరత్నాకరంలో దీని లక్షణం ఇలా చెప్పబడింది.

'యత్రస్వరాక్షరై రేవ వాంఛితోऽర్థోऽభిధీయతే

సస్వరార్థో ద్విధా శుద్ధో మిశ్ర స్తైః శుద్ధమిశ్రితైః'

(సంగీ. రత్నా. 4-222)

సాహిత్యంలో ఇలాంటి రచనకు 'సరిగమ పధనులు' అనిపేరు. తెనుగులో విన్నకోట పెద్దన (క్రీ.శ. 1402-1407) రచించిన 'కావ్యాలంకార చూడామణిలో' 'సరిగమపధనులు' అనేశీర్షికతో ఈక్రింది పద్యముంది.

artists. It is a general rule that the composition of a padam should contain the 'mudra' of the composer at the end We know that the lines of krtis of Tyāgarāja have the insignia, 'tyāgarājanuta' But exceptions are not wanting to this rule. The sankīrtans of Tāllapāka poets have no 'mudra' of their names In a composition where there is mudra it can be any one of istadēvatā mudra, ācāryamudra, ksētra mudra, prabhumudra etc Similarly if the names of the rāga and tāla are incorporated in the text of the song it is rāga-tāla mudra; if only rāga's name is incorporated it is rāga mudra The utility of this is that if the rāga and tāla are those that are in use and wellknown, they can be known easily

Among the trinity of karnatic music, Muthuswamy Dīksitar is a conscious artist; among his compositions those without mudra are rare Śyāmaśāstry and Tyāgarāja are unconscious artists In the well-known krti of Dīksitar 'vātāpiganapatim bhajē' composed in Hamsadhvani rāga and Āditāla the rāga-mudra is found at the end as 'hamsadhvani bhūṣita herambam' In Śyāmaśāstry's krti 'himādrisutē pātumām paradēvatē' composed in kalyāni rāga and Rūpaka tāla the rāga mudra 'karimukhakumārajanani kātyāyani kalyāni' is there in the last line Tyāgarāja's krti 'mōhanarāma' is in mōhana-rāga Among the Harikathā composers there are some who have given rāgamudra and some others who have given rāga-tāla mudra This method is limited to giving the names of either rāga or tāla or both The other details are to be brought from elsewhere. In contradistinction to this, there is also the method of incorporating the muscial notes themselves like sa , ri, ga, ma in the compostion of the padam

Padams ,krtis , kīrtan s and sankīrtanas are conglomerations of dhātu and mātu Mātu is the compostion of meaningul words, dhātu is the compostion of svaras which means it is limited to the seven musical notes , sa-ri-ga-ma-pa--dha-ni If these svara letters are made to be common to both the compositions of dhātu and mātu then they are called svarāksara-s Such a musical compostion is called 'svarārtha prabandha or 'svarāksara prabandha' in classical treatises on music S. R gives its laksana thus

> "yatra svarāksarairēva vānchitō 'rthō' bhidhīyatē
> sa svarārthō dvidhā śuddhō miśrastaihssuddhamisritaiḥ"

(S R 4-222 sl)

In literature it is given the caption 'sarigamapadhanisalu'
In Telugu, Vinnakōta Peddana in his K A C (written between 1402 AD and 1407 AD ) gives the following verse under the caption cited above

కం॥ నీసరిపని నీసరి ధని
నీసరి మాధారి గరిమ నీసరిగారీ
నీసరిగా నిగమాగమ
గోసారులునుం జలుక్యకుల విశ్వేశా॥

దీంట్లో తొలిమూడుపాదాలు స్వరాక్షరాలు. అయినా ఆమాటలకు అర్థం ఉంది.

ఇలాంటి స్వరాక్షరసంపుటి పాటల్లో పదాల్లో శుద్ధరూపంగాను సూచితరూపంగాను ఉండవచ్చు. 'సరిగమపధని' అనే అక్షరాలే, పై పద్యం మూడుపాదాల్లోలాగ - వస్తే అది శుద్ధ స్వరాక్షరసంపుటి అవుతుంది. స్థూలంగా హల్మాత్రసామ్యం ఉంటే సూచిత స్వరాక్షర రచన అవుతుంది. స్వరాక్షరాలకు సూచకాక్షరాలు ఇలాఉంటాయి. సూచకాలు ఏ అచ్చుతోకూడినా, ద్విరుక్తమైనా ఇబ్బందిలేదు.

స - చ,ఛ,జ,ఝ,శ,ష,స

రి - ర,ఱ

గ - క,ఖ,గ,ఘ

మ - మ

ప - వ,ఫ,బ,భ

ధ - త,థ,ద,ధ

ని - న,ణ

స్వాతితిరుణాళ్, రామస్వామిశివన్, సుబ్బరామదీక్షితుల తండ్రి అయిన రామస్వామి దీక్షితులు, స్వరాక్షర సంపుటికి ప్రసిద్ధులు. ఆధునికుల్లో బాలమురళీకృష్ణగారి 'నీగరిమగని' అన్న స్వరాక్షరసంపుటి చెప్పదగింది. త్యాగరాజు, శ్యామశాస్త్రుల రచనల్లో స్వరాక్షరరచన సూచిత పద్ధతిగానే ఉన్నట్లు చెప్పవచ్చు. త్యాగయ్య అమృతవాహిని రాగం - ఆదితాళంలో కూర్చిన 'శ్రీరామపాదమా నీకృప చాలునే' అనేకీర్తనతో

ప దనీ ద మ పా, ద మా గా రి స రీ మ పా

శ్రీ రా మ పా ద మా నీ కృ ప చా లు నే

nī sari pani nī sari dhani
nī sari mādhāri garima nī sangārī
nī sari gā nigamāgama
gō sārulunun jalukya kula viśvēśā"

The first three lines of the verse have svarāksaras; they are meaningful

Such groups of svarākṣaras can be present in padams or songs both in their pure form as well as an indicative form If sa ri ga ma pa dha ni occur as they are with the same vowel combination they make for śuddha svarāksara samputi If there is only rough indication of the consonant alone it is 'sūcitasvarākṣara' compostiion The indications for svaras are given below Either the duplication of the consonant or its combination with any other vowel does not matter

sa-ca,cha, ja, jha, śa, ṣa, sa
ri-ra, ra (with trill)
ga,ka,.kha, ga,gha
ma,ma
pa,pa, pha, ba, bha
dha,ta, tha,da,dha
ni,na,ṇa

Swāti Tirunal, Ramaswamy Śivan, Ramaswamy Dīkṣitar (father of Subbarāma Dikṣita) are well known for their svarāksara sampuṭi-s. Among the moderners Bālamuralikrsṇa's 'nī garima gani'a svarāksarasāmputi composition is worth mentioning One can say the svarāksara composition in Tyāgarāja's and Śyāmaśāstry's krtis is only in the indicative mode. In Tyāgarāja's kṛti 'srīrāmapādamā nī kṛpa cālunē' composed in Amṛtavāhini rāga-Ādi tāla the following svarākṣra composition can be seen:

pa da ni da ma pā, da mā gāri sarī mapā
srī rā ma pā, da mā nī kṛpa cālunē

'పాదమా' అనేది స్వరసాహిత్యాలు రెండింటిలోను కనబడుతుంది. అయినా ధన్యాసిరాగం - ఆదితాళంలో కూర్చిన 'సంగీతజ్ఞానము భక్తివినా' అనేకృతిలో

సా సా మా(గ)రీ

భృంగినటో శ స మీ ర జ అనే సూచిత శుద్ధస్వరాక్షరాలు రెండు కనబడతాయి. శ్యామశాస్త్రి రచనల్లో ఎక్కడైనా ఒకచోట స్వరాక్షర సంపుటి కన్పిస్తుంది. తోడిరాగం - ఆదితాళంలో కూర్చిన 'రావే హిమగిరి కుమారి' (స్వరజతి) లో

గా మ పా మదనీ

కా మ పా . లి నీ

మ ద నీ ద ని స దా ద ని ద గ రి

మ ది లో ని ను స దా త ల చు కొ ని

వంటి స్వరాక్షరకల్పన ఉంది. దీక్షితర్ రచనల్లో ఈశిల్పం ఎక్కువ. ధాతుమాతువులకు ఏకరూపంగా ఉండే స్వరాక్షరాల కూర్పే క్రమంగా 'స్వరార్థప్రబంధ' రచనగా పరిణమించిందనేది స్పష్టమే.

ఈచెప్పిందంతా గీతప్రబంధాలకు సంబంధించిన విషయం. వాద్యప్రబంధాల్లో ఉద్గ్రాహాది ధాతుకల్పనకు విస్తరమైన శాస్త్రపద్ధతి ఉంది. ధాతుస్వరూపాన్ని గూర్చి ఒక అభిప్రాయం కలగటానికి ఇంతదూరం చెప్పడం జరిగింది.

'pādamā' is common to svara and sāhitya One can see both śuddha and súcita sva. ksaras in the krti 'sangīta jñānamu bhaktivinā in Dhanyāsi rāga-Āditāla·

sā sā mā (ga) rī
'bhrngi naṭē śa sa mi ra ja'

One can see svarāksara samputi occasionally in Śyāmasāstry's compostion In his 'rāvē himagirikumāri' (svarajati) in Tōdi rāga and Āditāla, the following can be seen:

gā ma pā ma da nī
kā ma pā li ni
ma da nī da ni sa dā da ni da ga.ri
ma di lō ni nu sa dā ta la cu koni

Dīkṣitar's compostions have more of this kind of art. It is obvious composition of svaras as common to dhātu and mātu has led to the composition of 'svarārthaprabandha'

All this pertains to gītaprabndabhas only . There is a prescribed method for dhātukalpana in vādyaprabandhas. All this is shown just to give an idea of the concept of dhātu howsoever inadequate it may be.

వ॥శే॥ యవయవ పదంబులకు ననుకూలంబైన పల్లవియెట్టిదనిన

కం॥ పదముల యర్థముఁ బల్లవి
పదలక యన్నిఁటికి నేక వాక్యతఁ జేయున్
గుది గ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మఱియు మఱియుఁ బల్లవియలరున్ 39

తా॥ పదానికి అవయవాలైన చరణాలకు పొసగింపుగా ఉండే పల్లవి వివరింపబడుతున్నది. పదంలోని చరణాల అర్థానికి దూరం కాకుండా, వాటన్నింటికీ తగులుకొని ఉంటూ అభిప్రాయాన్ని ఒక కొలికికితెస్తూ మాటిమాటికి ఆవర్తింపబడుతూ పదం చివర ఉండేది పల్లవి.

వ్యా॥ 24వ పద్యంలో పదం అవయవమనీ, అవయవి అనీకూడా చెప్పబడింది. అవయవం అంటే కాలు చెయ్యిలాంటి శరీరభాగం. అవయవపదం అన్నప్పుడు చరణమని గ్రహించాలి. అవయవాలు కలది అవయవి. అవయవి పదం అంటే చరణాలన్నీ చేరిన మొత్తం పదం అని గ్రహించాలి. వెనుకటి పద్యంలో నిబద్ధపదానికి అవయవాలైన అవాంతరపదాలకు అనుకూలమైన పల్లవి చెప్పాడు. అదిస్వరసంబంధి. అక్కడకూడా చరణాన్ని అవాంతర పదంగా గ్రహిస్తే ఉద్గ్రాహఖండం, ధ్రువఖండం, ఆభోగఖండం ఇత్యాదిగా ఏర్పడతాయి. కాని అక్కడ మాటల అర్థాల ప్రమేయం ఏమి ఉండదని గ్రహించాలి. ఇక్కడ అర్థం ప్రమేయాంశంగా గ్రహింబడుతోంది. ఇది మొత్తం పదానికంతటికీ సంబంధించిన అర్థము కావచ్చు; ఒక చరణంలో ఉంటూ ఆచరణం చివరన ఒకకొలిక్కి వచ్చే అర్థమూకావచ్చు. పాటఅంతా మహావాక్యం లాంటిదైతే చరణం అవాంతరవాక్యం లాంటిదన్నమాట. ఈప ద్యంలో అవయవపదం అన్నప్పుడు నాలుగుపాదాలుగా వృత్తబంధంలో కూర్చిన 'చరణం' అని ఒకసారీ, మొత్తం పదం ఒకసారి గ్రహించాలి. సార్థకమైన మాటలతో కూర్చిన పాట గేయానికి అవయవమని భావిస్తే అప్పుడే మొత్తం పదం అవయవపదం అవుతుంది. పల్లవి అనేది ప్రతిచరణంలోని మాటల అర్థాలకు చరణాంతంలో ఏకవాక్యత కూరుస్తుంది. అలాగే పదంలోని అన్నిచరణాల అర్థాలకు కూడ ఏకవాక్యత కూరుస్తుంది. అందువల్లనే ప్రతి చరణాంతంలోను, పదాంతంలోను పల్లవి పాడబడుతుంది.

Verse 39:

Tr: Pallavi (or refrain) convenient to the avayava padas of the song is being explained. That is Pallavi which, for purposes of correlating the meaning of padas into a single theme, stands linked up with all of them and is repeated again and again at the end of the padams.

Com: In verse 24 a padam is designated as both an avayavi and avayava (a limb or component part). Avayava means a limb like a hand or leg. Avayava padam should be understood here as carana of the song. That which has limbs or component parts is avayavi. It is necessary to understand avayavi padam as the total song comprising all the caraṇas. In the previous verse the author has given pallavi convenient to the individual words constituting the limbs of a nibaddha padam. That pallavi pertains to the svaras or musical notes. Even there if the caraṇa is treated as avāntarapadam divisions like udgrāha khanda, dhruvā khanda, ābhōga khanda etc., take shape. But we have to note that meanings of words will not come under the perview of consideration there. Here it is taken as a predicate of meanings. This predication may pertain to the meaning or theme of the entire song or it may pertain to the meaning of each caraṇa coming to a thematic terminal at its end. If the whole song is treated as a mahāvākya each caraṇa will be like an avāntara vākya. In the present verse the phrase avayavapada should be alternately understood as meaning the carana composed in vrttabandha in four lines as also the total composition of padam (caranas individually once and collectively once)

If the meaningful text (libretto) is treated as the limb (external protrusion) of the 'gēya' (or 'song') then the corpus of the text becomes an avayavapadam. Pallavi correlates the meanings of the individual words in each caraṇa into a thematic whole; similarly does it correlate all the caranas of the padam into a thematic whole. That is why pallavi is sung at the end of each carana and of the total song too

ఉదాహరణానికి అన్నమయ్యగారి ఈసరళమైన పదం చూడండి.

కాంభోజరాగం - త్ర్యశ్రత్రిపుటతాళం

ఏల రాఁడమ్మా - ఇంతిరో వాఁ
డేల రాఁడమ్మా న - న్నేలిన వాఁడు ॥పల్లవి॥
పచ్చని పులుగుల - బండిమీఁదనుండు
పచ్చవింటి పిన్న - బాలుని తండ్రి
పచ్చనిచాయలఁ- బాయని బంగారు
పచ్చడము గట్టిన - బాగైన వాఁడు॥ఏల॥ 1.

తెల్లని పులుగుపై - తిరుగమరిగినట్టి
తెల్లనిసతి పాలి - దేవరతండ్రి
తెల్లని పఱపుపై - తేలి పొరలువెట్టు
తెల్లని కన్నులఁ దెలివైన వాఁడు ॥ ఏల॥ 2.

కొండవింటి వాని - గుత్త గొనిన యట్టి
కొండుక ప్రాయపుఁ- గూతురు తండ్రి
కొండలరాయఁడు - కోనేటి తిమ్మయ్య
కొండతలనెత్తి - గుఱుతైనవాఁడు ॥ఏల॥ 3.

ఈపదంలో తొలిరెండు పాదాలు పల్లవి. ఆతర్వాత మూడు చరణాలపాట ఉంది. భక్తుడు నాయిక. భగవంతుడు నాయకుడు. ఇది మధురభక్తి. నాయిక ఉత్కంఠతో నాయకునికై ప్రతీక్షిస్తూ తహతహగా చెలితో పలుకటం సందర్భం. నాయిక తహతహ ప్రధా నాంశం. తొలిచరణంలో రాచిల్కల తేరెక్కి పచ్చని చెరకు వింటితో తిరిగే మన్మధుని తండ్రి బంగారపు రంగు వలువగట్టిన సుందరాంగుడు - నన్ను ప్రియంగా చేపట్టిన నాథుడు ఏలరాడని పల్లవి అన్వయానికి తెస్తుంది. రెండో చరణంలో హంసవాహన అయిన సర స్వతిని పాలించే బ్రహ్మకు తండ్రి, శేషశయనంమీద తేలి జ్ఞానస్వరూపుడై పొరలే వాడనే భావంతో అన్వయం. మూడో చరణంలో ఈశ్వరుణ్ణి స్వాధీనపరచుకొన్న గంగకు తండ్రి, గోవర్ధన గిరినెత్తిన యశస్వి, స్వామిపుష్కరిణి ప్రక్కన వెలసిన వేంకటేశ్వరుడనే భావంతో అన్వయం. భగవంతుని ఐశ్వర్య వీర్య యశస్సులు శ్రీ జ్ఞానవైరాగ్యాలు అనే షాడ్గుణ్యంతో ఇక్కడ నాయకుని సర్వాతిశాయిత్వం చెప్పబడింది. పల్లవికి విడిచరణాలతోను మొత్తం పదం తోను పొసగింపు ఉంది. ఇష్టమైతే ప్రతిచరణంలోని రెండేసి పాదాలకు కూడా పల్లవి పొసగివస్తుందని ఇక్కడ గమనించవచ్చు.

For example let us consider a song of Annamayya composed in Kāmbhōji rāga-miśra triputa tāla

ēla rādammā-intirō vā
dēla rādammā nan-nēlinavādu '(Pallavi).

Paccani pulugula-bandimīdanundu
Paccavinti pinna-bāluni tandri
Paccani cāyala-bāyani bangāru
Paccadamugattina-bāgainavādu - ēla 1

tellani pulugu pai-tiruga mariginattu
tellani sati pati-dēvara tandri
tellani parapu pai-tēli poraluvettu
tellani kannula-telivaina vādu ''ēla 2

kondavinti vāni-guttagoninayatti
kondukaprāyapu-gūturutandri
kondala rāyadu-kōnēti timmaya
konda talanetti-gurutainavādu !'ēla'! 3

The meaning of pallavi and the three caraṇas of the song are to this effect

"Why my deane! Why does'nt he come, he who has taken me up"
-pallavi

He, the father of the boy that holds the sugarcane bow and rides the chariot drawn by the green parrots (Manmatha) and my beau that wears the unfading golden yellow garment" Why . (1)

"He, the father of the Lord of the white Lady that roams about on a white bird (saraswati rides a swan), he, who turns to this side and that lying down floating on a white bed with his white eyes shining (punḍarīkākśa reclining on Ādi-śēsa in yōganidrā as pure caitanya or consciousness) "Why my deane . . ."(2)

"He the father of the young girl who has won over completely the Lord that used the mountain as his bow (father of Ganga who has won over Īsvara) and he the Lord of Hills residing by the pond (puskarini) and who had become famous by lifting a hill (Gōvardhana)"
-"Why my deane. . " (3)

ఈపల్లవి పుట్టు పూర్వోత్తరాలు సంగీతవిద్యాంసులకే తీరని సమస్యగా ఉన్నాయంటారు. తాళ్లపాక అన్నమయ్యగారి సంకీర్తనల్లో పల్లవి ఉంది. కొన్నింటిలో 'అనుపల్లవి' కూడా ఉంది. రామక్రియ రాగం (రూపకతాళం) లో కూర్చిన 'భక్తికొలది వాఁడే పరమాత్ముఁడు' అనే సంకీర్తనలో ఈమాటలే పల్లవి. భుక్తి ముక్తి తానెయిచ్చు - భువిపరమాత్ముఁడు' అనేది 'అనుపల్లవి'. అంటే అన్నమయ్య నాటికి పల్లవి పాదుకొన్నది, 'అనుపల్లవి' పాదుకొంటున్నదని ఊహించవచ్చు. నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణిలో పల్లవి, అనుపల్లవి రెండూ ఉన్నవి. (త్యాగయ్యకు నూరేండ్లైనా ముందు).

ఆలోచిస్తే ఈ 'పల్లవి'కి ఆధారభూతమైన ఆవృత్తి అనేది మొదట లఘుగురువుల పాదాంతా వృత్తిగాను అటుపై పదాల ఆవృత్తిగాను నడిచినట్లు గ్రహించవచ్చు. వైదిక ఛందస్సుల్లో ప్రసిద్ధమైన నాల్గుఛందస్సుల్ని చూద్దాం: గాయత్రి, అనుష్టుభ్, త్రిష్టుభ్, జగతి.

(క) గాయత్రిలో పాదానికి 8 అక్షరాల చొప్పున మూడు పాదాలు ఉంటాయి. ప్రతిపాదంలోని 8 అక్షరాలను నాల్గేసి అక్షరాల రెండుగణాలుగా ఛేదించవచ్చు.

U I U U I U I U

అ గ్ని మీ ళే | పు రో హి తం

U U I U I U I U

య జ్ఞ స్య దే | వ మృ త్వి జం

U U U U I U I U

హో తా రం ర | త్న ధా త మ మ్॥

మూడు పాదాల్లోను లఘుగురువుల ఆవృత్తి పాదద్వితీయార్ధంలో ఒకేవిధంగా ఉండటం గమనించవచ్చు.

In the original song in Talugu the part given above as pallavi is in two lines After that there are three carṇas with four lines for each in the song. Here the devotee is nāyika (lady-love). God is nāyaka (the Lover). This is madhura-bhakti. The context is that of a lady, being in love and unable to bear the delay of her lover's coming expresses her eagerness and anxiety to her close friend The first, the second and the third caraṇa-s relate themselves with the pallavi expressing the apprahensions of the lady concerning the non-arrival of her lover. The song suggests the six qualities of supramacy nemely (1) aiśvarya,(2) vīrya (3) yaśas (4) śrī (5) jñāna and (6) vairāgya. Pallavi has correlation both with the individual caraṇa-s as well as the whole padam. If one wishes it can conveniently relatee itself with every two lines in each caraṇa.

It is said that the origin and development of pallavi in music is an unsolved problem. Tāḷḷapāka Annmācārya's sankīrtanas have pallavi; some have anupallavi too . In the saṅkīrtana composed in rāmakriya rāga (rūpaka tāla) 'bhaktikoladivāḍē 'paramātmuḍu' constitutes pallavi; 'bhuktimukti tānēyiccu-bhuviparamatmuḍu' is given as anupallavi. That means by the time Annamayya came on the scene pallavi had established itself and anupallavi was in the process of stabilising. One can find pallavi and anupallavi in Krṣnalīlā taraṅgiṇi of Nārāyana Tīrtha, at least a hundred years before Tyāgarāja.

On reflection, one can see that the repetition basis of pallavi occurred first as repetition of laghus and gurus in prosody at the end of each line and later on became the repetition of words. We can examine four of the metres in Vedic prosody- gāyatri, anusṭubh, trisṭubh, and jagati

(a) In gāyatri metre each line has 8 letters with three such lines in a verse. The 8 letters in each line can be divided into 2 units of 4 letters each.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| U | I | U | U | / | I | U | I | U |
| a | gni | mī | lē | / | pu | rō | hi | tam |
| U | U | I | U | / | I | U | I | U |
| ya | jña | sya | dē | / | va | mṛ | tvi | jam |
| U | U | U | U | / | | U | 1 | U |
| hō | tā | ram | ra | / | tna | dhā | ta | mam |

Mark the repetition of the pattern of laghu-gurus in the second half of each line.

(b) అనుష్టుప్ఛందంలో 8 అక్షరాల పాదాలు నాలుగు ఉంటాయి. వైదికమైన ఈఛందం లౌకిక సాహిత్యంలో అనుష్టుప్ శ్లోకం అయింది.

I U I U

(1) హిరణ్మయే/ న పాత్రేణ/ సత్యస్యాపి/ హి తం ము ఖం

I U I U

తత్త్వం పూషు/ న్నపావృణు/ సత్యధర్మా/ య దృ ష్ట యే

I U I U

(2) సత్యం మాతా/ పితా జ్ఞానం/ ధర్మోభ్రాతా/ ద యా స ఖా

I U I U

శాంతిః పత్నీః/ క్షమా పుత్రః/ షడే తేమ/ మ బాం ధ వాః

వీటిలో మొదటిది వైదికం. రెండోది లౌకికమైన శ్లోకం. వీటిలోను రెండవ, నాల్గవ పాదాల చివర లఘుగురువుల ఆవృత్తి ఒకేవిధంగా ఉండటం గమనించవచ్చు.

(c) ఇంక త్రిష్టుప్ఛందంలో పాదానికి 11 అక్షరాలుండే 4 పాదాలుంటాయి. పాదానికి మూడేసి గణాలు. చివరిగణం IVV ఈక్రింది ఉపనిషన్మంత్రం చూడండి..

I U U

నా య మా త్మా / ప్రవచనే / న ల భ్యో

I U U

న మే ధ యా / న బ హు నా / శ్రు తే న

I U U

య మే వై ష / వృ ణు తే తే / న ల భ్యో

I U U

త స్యై ష ఆ / త్మా వృ ణు తే / త నూం స్వా మ్

(సంస్కృతంలో పాదాంత లఘువు గురువుగా మారవచ్చు)

(b) An Anustubh verse has 4 lines of 8 letters each. In secular Sanskṛt it has become anustup-ślōka.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | hi | ra | nma | yē | / | na | pā | trē | na |
| | | | | | | I | U | I | U |
| | sa | tya | syā | pi | / | hi | tam | mu | kham |
| | tat | tvam | pū | sā | / | nna | pā | vṛ | ṇu |
| | | | | | | I | U | I | U |
| | sa | tya | dha | rmā | / | ya | dṛ | ṣṭa | yē |
| 2 | sa | tyam | mātā | | / | pitā | jñā | nam | |
| | | | | | | I | U | I | U |
| | dha | rmō | bhrā | tā | / | da | yā | sa | khā |
| | śā | ntiḥ | patnih | | / | kṣamāputraḥ | | | |
| | | | | | | I | U | I | U |
| | sadē | tē | ma | | / | ma | bān | dha | vāḥ |

Between the above two, the first is a Vedic verse; the second a secular ślōka in two lines. One can see the repetition of pattern of laghu-gurus at the end of the second and fourth lines

c) A verse in tristubh metre has four lines with 11 letters each Each line has 3 gaṇa-s. The last gana or unit is IUU We can peruse the following upaniṣadic mantra.

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | I | U | U |
| nā | ya | mā | tmā | / | pra | va | ca | nē | / | na | la | bhyō |
| | | | | | | | | | | I | U | U |
| na | mē | dha | yā | / | na | ba | hu | nā | / | śṛ | tē | na |
| | | | | | | | | | | I | U | U |
| ya | mē | vai | ṣa | / | vṛ | ṇu | tē | tē | / | na | la | bhyaḥ |
| | | | | | | | | | | I | U | U |
| ta | syai | ṣa | ā | / | tmā | vṛ | ṇu | tē | / | ta | nūmsvām | |

(In sanskṛt a laghu at the end of the line can be treated as a guru)

(ఎ) జగతీ ఛందస్సులో పాదానికి 12 అక్షరాల చొప్పున 4 పాదాలుంటాయి. పాదానికి మూడేసి గణాలు.

I U I U

తు వ మ గ్నే / ప్ర థ మో అం / గి రా ఋ షిః

I U I U

దే వో దే వా / నా మ భ వః / శి వః స ఖా

I U I U

త వ వ్ర తే / క వ యో వి / ద్మ నా ప సో

I U I U

అ జా యం త / మ రు తో భ్రా / జ దృ ష్ట యః

గాయత్రి అనుష్టుభ్‌లలో లాగే ఇక్కడ కూడా పాదాంతంలో లఘుగురులఘుగురు ఆవృత్తి చూడవచ్చు. ఇది గణావృత్తి అనుకొందాము.

(ఐ) ఎనిమిదక్షరాల పాదాలు, 12 అక్షరాల పాదాలు కలిపి, నాల్గుపాదాల్ని ఏడు పాదాలుగా పెంచి కూర్చిన 'ప్రగాథ' లో గణావృత్తితోపాటు పదావృత్తి తొంగిచూస్తుంది.

I U I U

యు వాం స్తో మే / భిర్ దేవ యం / త అ శ్వి నా

I U I U

ఆ శ్రా వ యం / త ఇ వ శ్లో / క మా య వః

I U I U

యు వాం హ వ్యా / భి అ యు వః

I U I U

యు వో ర్ వి శ్వా / అ ధి శ్రి యః

d) A verse in jagati metre has four lines of 12 letters each .Each line has 3 ganas or units.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | I | U | I | U |
| tu | va | ma | gnē / | pra | tha | mo | ān ⁻/ | | gi | rā | ṛ | siḥ |
| | | | | | | | | | I | U | I | U |
| de | vō | dē | vā / | nā | ma | bha | vaḥ / | | si | vah | sa | khā |
| | | | | | | | | | 1 | U | 1 | U |
| ta | va | vra | tē / | ka | va | yō | vi / | | dmanā | | pa | sō |
| | | | | | | | | | I | U | I | U |
| a | jā | yan | ta / | ma | ru | tō | bhrā/ | | ja | dṛ | sta | yaḥ |

One can find repetition of laghu-gurus at the end of lines as in the case of gāyatri and anuṣṭubh verses. This we may call gaṇāvṛtti.

e) Pragātha has seven lines with some made up of 12 letters and some 8 letters In the following verse we can see not merely the repetition of ganas at the end of each line but padāvṛtti also.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | I | U | I | U |
| yu | vām | sto | me / | bhir | dē | va | yan / | ta | a | svi | nā |
| | | | | | | | | I | U | I | U |
| ā | śrā | va | yan / | ta | iva | ślō | / | ka | mā | ya | vaḥ |
| | | | | I | U | I | U | | | | |
| yu | vām | ha | vyā / | bhi | a | ya | vaḥ , | | | | |
| | | | | I | U | I | U | | | | |
| yu | vōr | vi | svā / | a | dhi | śri | yah | | | | |

I U I U

వృ క్ష శ్చ వి / శ్వ వే ద సా

I U I U

ప్రు షా యం తే / వాం వ వ యో / హి ర ణ్య యే

I U I U

ర థే ద ప్రా / హి ర ణ్య యే

ఇక్కడ 'హిరణ్యయే' పల్లవ పదాలుగా ఆవృత్తి చూడవచ్చు.

సంగీత రత్నాకరం ఎలా చెప్పినా చాళుక్య జగదేకమల్లుని (క్రీ.శ. 1134-43) సంగీత చూడామణిలోని శ్లోకాలే ఈసందర్భంలో పార్శ్వదేవుని సంగీత సమయసారం (క్రీ.శ. 1300 ప్రాం.) లో కనబడటాన్నిచూస్తే ఏలాప్రబంధవిషయంలో రెండు ప్రస్థానాలున్నట్లు గ్రహించవచ్చు. మైసూరు వరలక్ష్మి సంగీత అకాడమీవారి దగ్గరుండే 'సంగీత చూడామణి' ప్రతి ఆకు నెం.46 A. ఏలా ప్రబంధం పాదానికి ఆరుగణాలని చెప్పి అటుతర్వాత ఇలా అంటున్నది.

"పాదస్యాంతే ప్రయోగస్యాత్పల్ల వాస్యం పదం తతః

పల్లవాక్యే పదేనాపి నియమో గణ వర్ణయోః

అనేనైన ప్రకారేణ ద్వితీయాంఘ్రిః ప్రకల్పనా

గీత్వా తతస్తుతి యాంఘ్రి గీత్వామేలావకోభవేత్"

తప్పుల తడకగా ఉన్న ఈశ్లోకాలే పార్శ్వదేవుని సంగీత సమయసారంలో ఇలా ఉద్ధరింపబడి ఉన్నవి.

"ఉద్గ్రాహేంఘ్రి ద్వయం ప్రాసైః ప్రతి పాదం గణాశ్చ షట్॥

పాదస్యాంతే ప్రయోగః స్యాత్ పల్లవాఖ్యం పదం తతః

పల్లవాఖే పదే నాస్తి నియమో గణ వర్ణయోః॥

అనేనైః. ప్రకారేణ ద్వితీయాంఘ్రేః ప్రకల్పనా

గీత్వాతతస్తృతీయాంఘ్రి గేయే మేలావకో భవేత్॥

I U I U
vṛ ksa sca vı / śva vē da sā

I U I U
pru sā yan tē / vampa va yō / hi ra ṇya yē

I U I U
ra thē da srā / hı ra nya yē

Mark the repetitıon of 'hiranyayē' lıke pallava padas

Whatever may be the stand of S.R.regardıng ēlā prabandha, the fact that some ślokas ın thıs regard of Jagadēkamalla's S.C.(1134-43A D.) are found in Pārśvadēva's S.S S (cırca 1300 A D) clearly suggests that there have been two schools of thought Leaf 46 A of S C.(available at Varalaksmı Sangīta Akademy, Mysore) after sayıng that each lıne of ēlāprabandha has sıx ganas has the followıng ślōkas:

"pādasyāntē prayōga syat pallavā khyam ca dam tatah
pallavākhyē padē nā pı nıyamō gana varnayōh
anēnaiva prakā rēna dvīītyāngrech prakalpanā
gītvā tata stutī yānghrı gītvā mēlāpaka bhavēt"

The above ślōkas are full of mıstakes These very ślōka-s occur ın S S S of Pārśvadēva as gıven below.

'udgrāhēnghrı dvayam prāsaıḥ pratipādam ganāsca ṣat
pādasyāntē prayōgasyāt pallavākhyam padam tataḥ
pallavākhyē padē nāstı nıyamō gana varnayōḥ
anēnaıva prakārena dvıtīyānghrēh prakalpanā
gītva tata stṛtī yānghri geyē mēlāpakō bhavēt

(తథా) పాదత్రయమే గీత మేక మేవ విధీయతే

న ప్రాసోఽథ ధ్రువోగేయో వర్ణ్యనామ్నా సమన్వితః॥

ఆభోగశ్చ తతో గేయో గాతు ర్నామ్నా విరాజితః

ధ్రువం గీత్వాతతో న్యాసః సర్వైలాసు ప్రశస్యతే॥

(4 అధికరణం శ్లో. 130-134)

హరిపాలుని సంగీత సుధాకర (క్రీ.శ. 1175) మతంకూడా ఇదే. ఇక్కడ గమ నింపదగిన ముఖ్యాంశాలు ఏలాప్రబంధంలో పాదానికి ఆరేసి గణాలుండే రెండు పాదాలు మాత్రమే ఉద్గ్రాహ ఖండం అనీ, పాదాంతంలో గమక ప్రయోగంచేసి పల్లవం పాడాలనీ, ఈపల్లవానికి గణవర్ణ నియమంలేదని, తొలిపాదంలాగే మలిపాదమూ అనడంతో పల్లవం అనేది ఆరుగణాల పాదాలు ముగిసిన తర్వాత వస్తుందనీ స్పష్టం. ఈ రెండుపాదాల 12 గణాలే సంగీత రత్నాకరంలోని ఏలా ప్రబంధలక్షణంలో 5+5+2 గానసర్దుబాటు చేయ బడినవని తొలిరెండుపాదాల్లో వచ్చే ఐదేసి పదాల్లోను చివరి మూడేసిపదాలు పల్లవ పదాలనబడినవని స్పష్టంగా తెలుస్తుంది. సంగీత రత్నాకరం చెప్పిన ఏలాపద ప్రథమ ద్వితీయ పాదాంత పదత్రయం 'పల్లవి' గా మారిందని నమ్మజాలని వారు సంగీత చూడామణి, సంగీత సమయసారాలు ఏల ప్రథమ ద్వితీయ పాదాల గణషట్కం తర్వాత చెప్పిన పల్లవాఖ్య పదాలే నేడు మనకు తెలిసిన 'పల్లవి' గా మారినవని గ్రహించడంలో శ్రమ ఉండదు. మనకు తెలిసిన పల్లవి వృత్తబంధంగా నాల్గుపాదాల్లో ఉండే చరణానికి బాహ్యమైన కూర్పు. సంగీత చూడామణి సంగీత సమయసారాల ప్రస్థానం పల్లవిగా పరిణమించిందని, సంగీతరత్నాకర ప్రస్థానం లోపించి పోయిందని చెప్పవచ్చు.

ఏలా ప్రబంధ విషయంలో రెండుప్రస్థానాలుండిన వనటానికి ఆధారమేమి? శాస్త్ర గ్రంథాలైన సంగీత చూడామణి, సంగీతసమయసారాలు ఏలా పాదానికి ఆఱుగణాలని చెప్తుండగా సంగీత రత్నాకరం ఐదుపదాలని చెప్పడం, ఆగ్రంథాలు పాదానికి వెలుపల పల్లవి గణవర్ణనియమం లేకుండా చెప్తుండగా సంగీత రత్నాకరం గణవర్ణనియమాలతో కూడిన పాదంలోని చివరి మూడు పదాలనే పల్లవపదాలుగా చెప్పడం, స్పష్టంగా కనబడే విష యాలు. ఈభిన్నదృష్టులకు కారణం ఏలా ప్రబంధాన్ని త్రిధాతుకంగా సంగీత రత్నాకరం దర్శిస్తే సోమేశ్వర, జగదేకమల్ల, పార్శ్వదేవాదులు చతుర్ధాతుకంగా దర్శించటం. ఈప్ర స్థాన భేదాన్ని సంగీత రత్నాకరానికి కల్లినాధుడు వ్రాసిన వ్యాఖ్య చెప్తున్నది. ఏలా ప్రబంధానికి త్రిధాతుకత్వాన్ని కోరేవారు ఉద్గ్రాహానికి 12 పదాలనూ చెప్తారనీ, చతు ర్ధాతుకత్వాన్ని కోరే సోమేశ్వరాదులు 11 పదాలకు మాత్రమే ఉద్గ్రాహం చెప్పి 12 వ పదం మేలాపకం అంటారంటూ ఇలా వ్రాశాడు.

(tathā)pādatrayē gītam ēkamēva vidhīyatē
sa prāsō tha dhruvō gēyō varṇya nāmnā samanvitaḥ
ābhōgas ca tātō gēyō gātur nāmnā virājitaḥ
dhruvam gītvā tātō nyāsaḥ sarvailāsu praśasyatē
(adhikarana4-ślōkas 130,131,132,133,and134)

Haripāla's S.S (1175 A.D) is also of the same view

From the above we have to note the following points In ēlā prabandha udgrāha khanda is said to consist of two lines with six ganas each. At the end of the line gamaka prayōga is enjoined After that pallava is to be sung This pallava has no regulation of gana-s and varṇa-s Similarly the composition of the second line too. It is clear that pallava occurs after the completion of six feet lines and gamaka. It can be clearly seen that the 12 ganas of these two lines are found adjusted as 5+5+2 padas in S.R ; the pallava that comes outside the regular lines is pushed into the lines themselves designating the last three pada-s of the first two lines as pallava. Those who find it difficult to believe that the pallava padatraya of S R fame have developed into the well known pallavi may not find it so difficult to believe that the pallava padas without restriction and outside the six foot lines mentioned by S.C and S S.S. have developed into the well known pallavī The pallavī as we know it is the composition outside the carana composed in vṛttabandha in four lines. One can say that while the school of thought advocated by S.R has lapsed, the one advocated by S C and S.S.S has developed into pallavi

What is the basis to argue that there have been two schools of thought regarding ēlāprabandha? Apart from the obviously different regulation cited above the important point that caused the different thinking was some people regarding ēlā as tridhātuka and others as caturdhātuka. S R. viewed elā as tridhātuka Cāḷukya Śomēṣvara, Jagadēkamalla and Pārṣvadēva belonged to the other school, treating it as caturdhātuka. This difference of opinion is recorded by Kallināth in his commentary on S. R. (Ch 4-36S1). He wrote thus ·

"ఏలా ప్రబంధస్యత్రిధాతుకత్వ మభ్యుపగచ్ఛతా మేతాని ద్వాదశ

పదాన్య ద్గ్రాహ్ భవంతీతి మతమ్. చతుర్ధాతుకత్వ మభ్యుపగచ్ఛంతః

సోమేశ్వరాదయస్త్వేకాదశానా మేవోద్గ్రాహత్వముక్త్వా ద్వాదశపదం మేలాపక మాహు రిత్యాహ"

మూడోపాదంలో రెండుపదాలే ఉంటాయని అక్కడ పల్లవపదం ఉండదని రెండవ పదం దగ్గర గమక ప్రయోగమని అది మేలాపకమని సోమేశ్వరాదులు అంటారని రత్నాకరకర్త వ్రాసిన శ్లోకానికి (4-3) వ్రాసిన వ్యాఖ్యలో ఈ అంశం ఉంది.

పాదాంతప్రయోగానికి పిమ్మట నియమరహితంగా చెప్పబడిన పల్లవి క్రమంగా నియమంతో నేడు మనకు తెలిసిన పల్లవిగా స్థిరపడిందనటం సారాంశం.

'ēlā prabandhasya tridhātukatvam abhyupagacchatām ētāni dvādaśapadānyudgrāhō bhavantī iti matam. caturdhātukatvam abhyupagacchantaḥ sōmēśvarādayastvēkādaśānāmevōdgrāhatvam uktvā dvādaśa padam mēlāpakam āhu rityāha'.

It means those who wish to treat ēlāpadam as tridhātuka consider all the twelve words or units as udgraha. Those who wish to treat it as caturdhātuka, namely Sōmēśvara and others consider only eleven units as udgrāha, calling the twelfth mēlāpaka. He is commenting on the ślōka (ch 4-36) that says that in the third line there are only two padas and that there is no pallava (of 3 units) that at the second word gamakprayōga is to be sung and that it as called as mēlāpaka by Sōmēśvara and others.

The sum and substance of all the discussion is that the Pallavi enjoined without regulatory restrictions after the gamaka prayōga at the end of the first two lines has developed into the pallavi as we know it today, acquiring some regulation in the process